# మను, వసు చరిత్రల తులనాత్మక పరిశీలనము

రచయిత్రి

డా. ముదిగంటి సుజాతారెడ్డి, ఎం. ఏ. పిహెచ్. డి.

హైదరాబాదు
1981

*
ప్రథమ ముద్రణ – 1000 ప్రతులు
జనవరి – 81

*
మూల్యం **50/-** రూపాయలు

*
ముద్రణ :
శ్రీవిజయ ప్రింటర్స్
హైదరాబాదు.
ఫోన్ : 5 3 6 1 3

*
ప్రతులకు :—
2-2-1105/21 రోహణమ్,
తిలక్‌నగర్, హైదరాబాదు-500044.

చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లిచే
సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంస కుసుమంబు నందున్న యెలదేఁటి
రుతికించిదంచిత శ్రుతులనీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ
దుంబీఫలంబు తుందుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరకట్టు
లింగిలీకపు వింత రంగులీన
నుపనిషత్తులు బోటులై యోలగింపఁ
బుండరీకాసనమున గూర్చుండి మదికి
సించువేడుక వీణ వాయించు చెలువ
నలువరాణి మదాత్మలో వెలయుగాత !

మ.చ. 1-5

మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్, గుండలీంద్రుండు ద
న్మహనీయ స్థితిమూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్, సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తి మయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

వ చ. 1-10.

# ప్రాక్కథనము

మను, వసుచరిత్రలు తులనాత్మకదృష్టితో కొంతవరకు శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారి "వసుచరిత్ర విమర్శనము"న మరియు శ్రీ తెన్నేటి రామచంద్రరావుగారి "మనువసు చరిత్రల రచనా విమర్శనము"న పరిశీలింపబడినవి. అందు మొదటి గ్రంథము ఉపలభ్యము. రెండవది శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున శిథిలావస్థలో చూచినాను. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి "మనువసుప్రకాశికా విమర్శన" మను గ్రంథము కలదట కాని అది నాకు లభ్యము కాలేదు మను,వసుచరిత్రలలో నేది యుత్తమమైన ప్రబంధమను విషయమున అనేక విమర్శనాగ్రంథములు వెలువడినవి. మరియు అటనట వ్యాసములందును ఈ విషయము స్పృశింపబడకపోలేదు. కాని సంపూర్ణముగా, నిష్పాక్షికముగా విషయావలోకన మెచ్చటను కావింపబడలేదు. నా యీ సిద్ధాంతవ్యాసమున మను, వసుచరిత్రల తులనాత్మకాధ్యయనము వివిధవిషయ దృక్కోణములతో జరిగినది. పెద్దన, రామరాజభూషణులలో నెవరైన ఒక్కరిపై పక్షపాతముతో గాక ఏ విషయమున ఎవరు మించినారో విమర్శనాదృష్టితో పరిశీలించినాను.

సంస్కృతసాహిత్యమున మాఘునకు భారవి యెడల ఎట్టి కవితావిజిగీష కలదో అట్టి కవితావిజిగీష తోడనే రామరాజభూషణుడు రచనాస్పర్ధవహించి పెద్దనను మించవలయునను ప్రయత్నముతో వసుచరిత్రను రచించినాడు. అట్టి రామరాజభూషణుని కవితావిజిగీష ఎంతవరకు సఫలమైనదో యీసిద్ధాంతవ్యాసమున పరిశీలింపబడినది. అట్టి కవితావిజిగీష ప్రబంధపరిణతికి విశేషదోహదకారి అయినది, తెలుగుకావ్యరచనను ఉన్నతపరిపూర్ణకవిత్వకళాశిఖరానికి చేర్చినది.

సిద్ధాంతవ్యాసమునకై యీవిషయమును సూచించడమేగాక తమ ఆశీర్వచనములను వ్రాసియిచ్చిన ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధాని గారికి నా కృతజ్ఞతాభివందనములు.

నాయీ సిద్ధాంతవ్యాసమునకు రథసారథ్యము వహించిన శ్రీ డా॥ పల్లా దుర్గయ్యగారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ సిద్ధాంతగ్రంథప్రచురణకు అనుమతినిచ్చిన ఉస్మానియావిశ్వవిద్యాలయాధికారులకు నా ధన్యవాదములు.

ఈ గ్రంథమును సాధ్యమైనంతవరకు నిర్దుష్టముగా అచ్చొత్తియిచ్చిన శ్రీ విజయప్రింటర్స్ అధినేతలకు నా ధన్యవాదములు.

ఈ సిద్ధాంతగ్రంథ ప్రచురణకై 5000/-రూప్యములను ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖవారికి నా ధన్యవాదములు.

డా॥ ముదిగంటి సుజాతారెడ్డి



# ఆశీస్సులు

దివాకర్ల వేంకటావధాని ఎం.ఏ (ఆనర్స్) పిహెచ్.డి.

శ్రీమతి డా॥ వ. దిగంటి సుజాతారెడ్డిగారు ఉస్మానియావిశ్వవిద్యాలయము నందే ఎం.ఏ. పఠించియుండుటచే మాకు శిష్యురాలగుట సంభవించెను. చదువుకొను సమయము నుండియు నామె శాంతసాత్త్వికస్వభావములకు నిలయమైయుండుట గమనించి నేనెంతో ఆనందించెడివాడను. విద్యాభ్యాసమైన పిమ్మట నామె ఉపన్యాసకురాలై తరువాత పిహెచ్.డి. పట్టమునకై సిద్ధాంతవ్యాసము రచించి ఆ పట్టమును బడయజాలిరి. ఆమె గ్రహించిన విషయము సుపరిచితమేయైనను చాల క్లిష్టమైనది. పెద్దనయు రామరాజభూషణుడును ప్రబంధకర్తలకెల్లరకు నొజ్జబంతులగుటయేగాక మహాపండితులు. వారి ప్రబంధములుచూచి తరువాతి కవులెందరో పిల్లమనుచరిత్రలను,పిల్లవసుచరిత్రలను రచించియుండిరి. కాలమున పెద్దన రామరాజభూషణునికంటె పూర్వుడు. అతని కవిత్వమున శ్రీనాథునియు, పినవీరభద్రునియు ప్రభావమెంతో కనబడును. అట్లే రామరాజభూషణుని కవిత్వమున పూర్వకవుల రచనల ప్రభావముతోపాటు పెద్దన మనుచరిత్ర ప్రభావముకూడ కనిపించును. వారిరువురును కొంచెమించుమించుగా సమకాలికులు; సమానపాండితీమండితులు. "ప్రాయఃసమానవిద్యాః పరస్పరయశఃపురోభాగాః" అను నానుడి చొప్పున రామరాజభూషణుడు పెక్కు విషయముల పెద్దన ననుకరించుచునే అతని మించుటకు యత్నించెను. కథాకల్పనలో, సన్నివేశసంవిధానములో వర్ణనలలో, రసపోషణలో భావములలో నాతడు కావించిన ఆ ప్రయత్నము పెక్కు సందర్భములందు కన్పించును. రామరాజభూషణుడు పలువురుసంస్కృత మహాకవులను శ్రీనాథాద్యాంధ్రకవులను కూడ ననుకరించెను. కాని ప్రతిభావంతుడగుటచే నతడనుకరించినట్లు కనబడదు. అతడు అద్వితీయమైన పాండిత్యమును, రసాలంకారధ్వని విలాసమును, శైలీపార్థక్యమును ప్రకటించి వసుచరిత్ర నాంధ్రవాఙ్మయమున నాదర్శప్రబంధముగను, ఆంధ్రసరస్వతి కపూర్వాలంకారముగను సంతరించెను.

శ్రీమతి సుజాతారెడ్డిగారు పెద్దన రామరాజభూషణుల ప్రబంధరత్నములను తారతమ్యదృష్టితో పరిశీలించి వాని కాంతిశోభలందలి సామ్యవైషమ్యములను చక్కగా ప్రదర్శించియున్నారు. దానికెంతో సునిశితపరిశీలనము కావలయును. ఆ మహాకవు లిరువురి వివిధశాస్త్రపాండిత్యములను ప్రదర్శించు నధ్యాయమున నామెకుగల బహువిషయపరిజ్ఞానముకూడ తేటతెల్లమగును. వారి శైలులలో కొంతభేదమున్నది. భట్టుమూర్తికున్నంత శబ్దాలంకారప్రీతి పెద్దనకులేదు. భట్టుమూర్తి వసుచరిత్రలో చూపినది శ్లేషయా? [illegible] వా? అను విషయమును వారు విమర్శనదృష్టితో పరిశీలించినతీరు ప్రశంసాపాత్రముగా నున్నది. వారారెండు మహాప్రబంధములను లెస్సగా పఠించి ఆ రెండింటియందలి నిగ్గుతేల్చియున్నారు. వారి శైలి సులభమై, విశదమై, నిర్దుష్టమై అత్యంత హృద్యముగానున్నది. వారింకను బహుగ్రంథములు రచించి ఆంధ్రసరస్వతి కపూర్వాలంకృతులు సంతరించి గురువులమగు మాకు గురువరమైన యశస్సును సంపాదించి పెట్టుదురని ఆశించుచున్నాను.

హైదరాబాదు
1-1-81.



విషయసూచిక

# 1. కథాసంవిధానము

—)*(—

## మను, వసు చరిత్రల విశిష్టత

శ్రీకృష్ణదేవరాయల ఆదేశముననుసరించి రచింపబడిన మనుచరిత్రయే ప్రప్రథమ ప్రబంధముగా పరిగణింపబడుచున్నది. పారిజాతాపహరణ కావ్యము మనుచరిత్రకన్న ముందు రచింపబడినదని దాని పీఠికలోని రాయల విజయ వర్ణనలనుబట్టి తెలియుచున్నది. కాని ఈ రెండింటిలో విశేష గౌరవాదరములను పొందినది మనుచరిత్రయే యని చెప్పవలయును.

మార్కండేయ పురాణములో అంతగా ప్రసిద్ధముకాని స్వారోచిష మనుసంభవ వృత్తాంతమును గ్రహించి పెద్దనామాత్యుడు షడాశ్వాసములు గల ప్రబంధముగా రచించినాడు. కథాసంవిధానము నాతడు మార్కండేయ పురాణమున నున్నది యున్నట్లుగా గ్రహించినను పాత్రల చరిత్రచిత్రణ, రసపోషణ, సంభాషణాదుల విషయమున పెద్దన స్వాంతమధికము. ఆతడు ఔచిత్యము కొరకు చేసిన సూక్ష్మ కల్పనలును ప్రబంధకథలో కలవు. రాయలకాలమునాడు భోగవైరాగ్యములకుగల ఘర్షణను వరూథినీప్రవర సంవాదమున ప్రదర్శించియు, వివిధ వర్ణనలను స్వతంత్ర భావములతో అలంకరించియు, ఆయాచోట్ల సమకాలిక జీవనమును ప్రతిబింబింపజేసియు అప్రతిమాన శైలిలో మనుచరిత్రను రచించి పెద్దన, కవులలో పెద్దయనిపించుకొనినాడు, ఆంధ్రకవితా పితామహుడైనాడు.

పెద్దన వ్రాసిన ప్రబంధమార్గమున నడచినవాడు రాజరాజభూషణుడు. ఒకవేపు పెద్దనను మించవలయునను అభిలాష తొందరించుచున్నను ఆతని

కవితామార్గమనిన గౌరవాదరములుకలవాడు. అట్టి యాతడు—

భావంబెక్కడలేక వృత్తనియమాపాయంబుఁ జింతింపకెం
దేవర్తించి, పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవిప్రణీతకృతి సామాన్యాకృతింబూని పై
పై వన్నెల్ పచరింపదానిఁ బలకింపబోరు ధీరోత్తముల్

వ. చ. 1—11.

అను పద్యమున పెద్దన కవిత్వమును విమర్శించెనని యందురు. ఇట దుష్కవుల కవిత్వము పై పై వన్నెలు పచరించు వేశ్యవంటిదని అట్టిదానిని ధీరోత్తములాదరింపరని కవి శ్లేషమూలకముగా సాదృశ్యమును సాధించినాడు. దుష్కవుల కవిత్వము వ్యంగ్యార్థములు లేక శార్దూలాది వృత్తనియమములను పాటింపక, పరార్థచౌర్యములచేకూడి పామరజనస్తోత్రపాత్రయై, చిత్తము ఎవ్వని యందులేక నియమాదులులేక విచ్చలవిడిగా తిరుగుచు పరద్రవ్యహరణమే నియతి గావించుకొని మూర్ఖులగు చెలికత్తియలు మెచ్చగా తిరుగు వేశ్యవంటిది. అట్టివేశ్యను ధీరులైనవారు మెచ్చనట్లుగానే పండితోత్తములట్టి కవితను మెచ్చరు. ఇందు చెప్పబడిన దుష్కవితా లక్షణములేవియు పెద్దనలో లేనపుడు రామరాజభూషణుడు పెద్దననిందు నిందించినాడనుట అసమంజసము. కవినియమము ననుసరించి అతడిట కుకవి నింద చేసినాడేగాని యెవరినైన దృష్టిలో పెట్టుకొని మాత్రముకాదు. కాని యిట సామాన్యయైన వేశ్య ధీరోత్తముల నాకర్షించ దనుటలో వసుచరిత్రకారుడు పరయాధినీప్రవర వృత్తాంతమును దృష్టిలో పెట్టుకొని చెప్పినాడేమో!

రామరాజభూషణుడు కథ విషయమున పెద్దన కంటెనెక్కువ స్వాతంత్ర్యమును నెరపినాడు. పూర్తిగా కల్పిత కథంపై పాఠకలోకమున కాదరణ లేదని యాతడు కథాపూర్వోదయమునుచూచి గ్రహించియుండును. కావుననే పూర్తిగా కల్పితముగాక మహాభారతమున నామమాత్రముగా నున్న వసురాజు యొక్క కథను గ్రహించి స్వకల్పనల నధికముగాచేర్చి షడాశ్వాసములు గల వసుచరిత్ర ప్రబంధముగా రచించినాడు. ఈ రచించుటలో కొన్ని సన్నివేశ

ముల కూర్పు, ప్రబంధ వర్ణనల విషయమునను వసుచరిత్రకారుడు ప్రథమ ప్రబంధమైన మనుచరిత్ర నాధారముగ గ్రహించినాడు శైలి విషయమున రామరాజభూషణుడు పూర్తిగా స్వతంత్రుడు. అనిదంపూర్వమైన చమత్కార ములను కవి తన పద్యములలో సాధించినాడు ప్రౌఢమైన భావ, శైల్యాదులను కూర్చినాడు. ప్రసన్న మాధుర్య గుణములుగల కాళిదాసుని కవితతో ఆరంభమైన మహాకావ్యము హర్షుని నైషధమున ప్రౌఢవిలాసమును సంతరించుకొనినది. అట్లే తెలుగున ప్రసన్నమాధుర్యగుణభరితమైన మనుచరిత్రతోడ ప్రబంధారంభము జరిగి రామరాజభూషణుని వసుచరిత్రలో ప్రబంధ కావ్యకళ మేరుశిఖరాగ్రముల నందుకొనినది.

అనంతర కవులకు మను, వసుచరిత్ర ప్రబంధములే ఒజ్జబంతులైనవి కవి కర్ణరసాయనము, రాధామాధవమువంటి కావ్యములు విశేష ప్రచారమునందలేదు. భాష, శైలి, వర్ణనలు, సన్నివేశకల్పనలు, ప్రతిపద్య చమత్కృతులు, భావప్రౌఢిమ, పద్యముల పోకడలు మొదలగు అనేక విషయములందు తరువాతి ప్రబంధకవులకు మను, వసు చరిత్రలే ఆదర్శములైనవి. ఇట్టి మను, వసు చరిత్రలు ప్రబంధాకాశమున వెలసిన ప్రాతర్మధ్యాహ్న సూర్యులతో సమానమై వెలుగొందుచు తరువాత ప్రబంధకవులకు మార్గమును చూపినవి. ఆంధ్ర సాహిత్యమున ప్రబంధ ప్రక్రియలోను మరియు సమస్తాంధ్రకావ్య జగత్తులోను విశిష్టస్థానమును సంపాదించుకొన్నట్టి ప్రబంధరాజములీ మను, వసు చరిత్రలు.



# పెద్దన మూలకథలో చేసిన మార్పులు

పెదనామాత్యుడు మార్కండేయ పురాణములోని కథా సంవిధానమును గ్రహించినాడనుట స్పష్టము. సంస్కృత మార్కండేయ పురాణమున నీ స్వారోచిషమను వృత్తాంతము 250 శ్లోకములలో చెప్పబడినది. దీనిని మారన 144 పద్య గద్యములలోనికనువదించెను. ఇట్టి యీ కథను పెద్దన షడాశ్వాసముల ప్రబంధముగా రచించినాడు. కృత్యాదిలోని పీఠికా పద్యములను ఆశ్వాసాది ఆశ్వాసాంత పద్యములను విడిచిన మనువు యొక్క వృత్తాంతమును 581 పద్యగద్యములతో విస్తరింపజేసి పెద్దన రచించినాడు. ఇంతగా కథ విస్తరించుటకు ప్రబంధోచితమైన సంధర్భానుసారముగా కూర్చబడిన సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయ, విప్రలంభ శృంగార, వివాహ, శైల, వసంతర్తు, యుద్ధ మృగయా, వన విహారాది వర్ణనలు సహకార హేతువులైనవి అంతేగాక ప్రవర సిద్ధ సంవాదమును, వరూథినీ ప్రవర సంవాదమును, మనోరమ, ఇందీవరాక్ష, కళావతుల వృత్తాంతములను మూలములో కన్న పెంచి పెద్దన తన చతురవచోనిధిత్వమునకు తార్కాణములుగా రచించెను పురాణ కథలో పోషింపబడని శృంగార, వీర, శాంత రసములు ప్రస్ఫుటములై ప్రబంధోచితముగా పోషింపబడినవి. పెద్దన మనుచరిత్రలోని కథా సంవిధానమునంతటిని మార్కండేయ పురాణము నుండియే గ్రహించినను కథాకథన, పాత్రచిత్రణ, రసపోషణలకై కొన్ని మార్పులను గావించినాడు. ఈ మార్పులెట్టివో పరిశీలింతము—

1) ప్రవరుని పాత్ర చిత్రణకు మెరుగులు దిద్దు కల్పనలను పెద్దన మనుచరిత్రలో కావించినాడు. సంస్కృత మార్కండేయ పురాణమున ప్రవరుని పేరు చెప్పబడలేదు "కశ్చిద్ద్విజాతిప్రవరః" అని మాత్రమే చెప్పబడినది. మారన తన అనువాదమున ఆ బ్రాహ్మణునకు ప్రవరుడని నామకరణము

చేసెను. "ద్విజాతి ప్రవరః" లోని "ప్రవరః" శబ్దమునే మారన పేరుగా భ్రమపడినాడనుటకు వీలులేదు. కథలో ముఖ్యమైన పాత్రకు పేరు లేకున్న ఉచితము కాదని తలంచి మారన "ప్రవరః" శబ్దమును గ్రహించి, "కలడొక్క ధరణీసురవరుడు....అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుడు" అని నామకరణ మొనర్చినాడు. ఈ నామమునే పెద్దన గ్రహించెను. మారన ఆ బ్రాహ్మణునకు నామకరణము చేసిన వేళావిశేషమెట్టిదో గాని ఆ ప్రవరుడు పెద్దన చేతి పోషణలో ఆంధ్రుల మనోఫలకమున చిరస్థాయిగా నిలిచిపోవుట జరిగెను. పెద్దన పాత్ర చిత్రణా వైభవమందుకు విశేషముగా దోహదముచేసినది. ఒక్కొక్క మారు ప్రవరుని ప్రవరాఖ్యుడనియు పేర్కొనుట కలదు. వాడుకలోను "ప్రవరాఖ్యుని వలె ఉన్నాడురా వాడు" అని వినబడుచున్నది. మారన "అతి సుకుమారమూర్తి ప్రవరాఖ్యుడు" అని అన్నాడు. పెద్దనయు 'ప్రవరాఖ్యుడలేఖ్య తనూ విలాసుడై' అనియు "భూసురుడ నే ప్రవరాఖ్యుడ" ననియు పేర్కొని నాడు. ఇట "ఆఖ్యుడ" నగా పేరు గలవాడని యర్థము కాని అర్థవిచారణ లేకుండ ప్రవరాఖ్యుడనియు అప్పుడప్పుడు చెల్లుబడియగుచున్నది. వేమూరి శ్రీనివాసరావు గారు కూర్చిన "పూర్వగాథాలహరి" యను పౌరాణిక కథలను తెలుపు గ్రంథమున "ప్రవరాఖ్యుడ"నియే పేర్కొనబడినది.

మృదు స్వభావః సద్వృత్తో వేద వేదాంగ పారగః
సదాతిథి ప్రియో రాత్రా వాగతానాం సమాశ్రయః

మా. పు. 54–6.

అని సంస్కృత మార్కండేయ పురాణమున ప్రవరుని గూర్చి చెప్పబడిన గుణ విశేషములనే మారన గ్రహించి వర్ణించినాడు. పెద్దన యీ గుణములనే దృష్టిలో నుంచుకొని యేడు పద్యములలో ప్రవరుని గుణవిస్తరణ గావించెను. మూలమునలేని ఏకపత్నీత్వము, తలిదండ్రులపై ప్రేమ, తరుగని పాడిపంటలు వివిధాధ్వర నిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రతలను పెద్దన కల్పించి ప్రవరుని చరిత్రకు తద్ద్వారా ప్రబంధమునకు మెరుగులు దిద్దినాడు. మరియు ప్రవరుని కాలకృత్యములను, దానాపరిగ్రహత్వమును, సచ్ఛాత్రుల కలిమి మొదలగు వర్ణనలను పరిశీలించినచో పెద్దనార్యుడు తన కాలము నాటి సద్గృహస్థునొకని వర్ణించినట్లుగా గోచరించును.

"వాని చక్కదనము వైరాగ్యమునఁజేసి" అను పద్యము భావికథా సూచకము. ఇందు కావ్య కథా బీజము నిక్షిప్తమైనది మార్కండేయ పురాణమున ప్రవరుడు "అతి రమ్య వనోద్యానముల చేత నానా నగరములచేత శోభించు వసుంధర" ను దర్శించు అభిలాషగలవాడు. పెద్దన దీనిని మార్చి "అనుదినము తీర్థసందర్శనాభిలాషమాత్మనుప్పొంగ" నున్నవాడని చెప్పి పాత్రౌచిత్యమును పాటించినాడు.

2) సంస్కృత మార్కండేయ పురాణమున ప్రవరునింటికి వచ్చిన అతిథి పండితుడైన బ్రాహ్మణుడనియు, మంత్రౌషధ ప్రభావము చేత అప్రతి హత గమనము గలవాడనియు చెప్పబడినది. మారన ఆతనిని బ్రాహ్మణునిగా మొదట పేర్కొని ఆ తరువాత ఔషధ సిద్ధుడనియు చెప్పెను. పెద్దన వచ్చిన అతిథిని ఔషధ సిద్ధునిగా, మునిగా పేర్కొని పండిత బ్రాహ్మణుడనుటను విడిచి పుచ్చెను. ఇది పరమోచితమైన చిన్నమార్పు.

3) మార్కండేయ పురాణమున లేని రీతిగా సిద్ధుడు "కుతపకాలమున" న ప్రవరునింటికి వచ్చెనను కల్పనను పెద్దన గావించినాడు "కుతపకాలము"ను గూర్చి చాల చర్చలు జరిగినవి. కొందరు విమర్శకులు పెద్దన యిట అనౌచిత్యమును గావించెననిరి. మరికొందరు పెద్దనను సమర్థించుటకు పూనుకొనిరి. డా॥ పల్లా దుర్గయ్యగారు కుతపకాలమనిన పెద్దన ఉద్దేశమున గ్రీష్మకాలమని తమ అభి ప్రాయమును వెలిబుచ్చినారు. [1]గ్రీష్మమునకు "గ్రీష్మ ఊష్మకః నిదాఘ ఉష్ణో పగమః ఉష్ణః ఊష్మాగమస్తపః" అని అమరములో ఏడు పేర్లు యీయబడినవి. అందు "తపః" అనునదొకటి. తపతీతి తపః అనగా తపింప జేయునది గావున "తపః" అని అర్థము. "కుతపః"కు వ్యుత్పత్త్యర్థము అమరమున "సూర్యోస్మిన్ కుం భువం తపతీతి కుతపః" అని యీయబడినది. అనగా ఏ కాలమందు సూర్యుడు భూమిని తపింప జేయును కాన కుతపకాలమని యర్థము. ఈ వ్యుత్పత్త్యర్థమును గ్రహించియే తపఃకాలమునకు మారుగా కుతపకాలమని గ్రీష్మకాల పరముగాను చెప్పవచ్చును. పెద్దన "వినుమొకనాడు కుతపకాల మందున్" అని "వేళ" యని గాని "సమయ" మని గాని యుపయోగింపక

---

1 ప్రబంధ వాఙ్మయ వికాసము. మనుచరిత్రము—రెండు ఆక్షేపణలు.

'కాల' శబ్దమును వాడుటచేత గ్రీష్మ కాలమని గ్రహించుట కవకాశము కలుగు చున్నది "ఒకనాడు కుతపకాల"మని "కుతపకాల"ము ఒకనాడు•నకు పరమందు ప్రయోగింప బడుటచేత 'కాల' శబ్దము 'వేళా' సూచకమని యందురు. కాని 'ఒకనాడు కుతపకాలమందున్' అనిన గ్రీష్మకాలమందలి ఒకానొక దినమనియే అర్థమును గ్రహింపవలయును.

ప్రవరుడు హిమాలయమునకు పోయి అచ్చట గల వింతలుచూచి "నళినీ బాంధవ భానుతప్త రవికాంత స్యందినీ హారకందళ చూత్కార పరంపరల్ పయి పయిన్మధ్యాహ్నముందెల్పెడిన్" అని అనుకొంటాడు. సూర్యకిరణముల యొక్క వేడిచేత మంచు కరగి నీరుగామారి ఆ సూర్య శిలలపై చుక్కలుగా పడి చూత్కారధ్వనులను చేయుచున్నదనిన అట్టి ఎండ తీవ్రత హిమాలయము లందు గ్రీష్మకాలమునదప్ప వేరు కాలమందు సంభవించుట అసాధ్యము. కావున ఈ సూచనను బట్టియు కుతపకాలమనిన గ్రీష్మకాలమను అర్థమును గ్రహించుట యే సమంజసమగును.

4) సిద్ధునిరాక, సిద్ధప్రవరుల సంభాషణ, ప్రవరుడు హిమాలయములకు పోవుట యీ వృత్తాంతము నంతటిని మారన ఐదు పద్యగద్యములలో వర్ణించినాడు; పెద్దన ఇరువదియొక్క పద్యగద్యములతో విస్తరింపజేసి రచించెను. ఈ సందర్భమున సిద్ధుడు సందర్శించిన శైలాదుల వర్ణన విస్తారమై పరమాద్భుతమై యున్నది (1—72). ఇట్టి వర్ణన ప్రవరుని తీర్థ యాత్రాభిలాషాసక్తిని అధికము గావింప సమర్థమై యున్నది.

సిద్ధుడు ప్రవరుని పాదములకు పసరుపూసిన తరువాత యేమైనాడో మార్కండేయ పురాణమున చెప్పబడలేదు. అతడేమయ్యెనో పాఠకులకు తెలియదు. "ఆ మందడి యతడరగిన" అని సిద్ధుని నిష్క్రమణమును పెద్దన మరుపకుండ చెప్పుట సమంజసముగా నున్నది

5) ప్రవరుడు తనపాదములకు గల పసరు కడిగివేయబడగా స్వగృహమునకు పోలేక కుందుటను పెద్దన ఇరు పద్యములలో సహజముగా వర్ణించినాడు. అంతకుముందుగల పది పద్యములలో హిమాలయ ప్రాంత వర్ణనయు పెద్దన స్వంతమే. మారన మార్కండేయ పురాణముననది యంతయు ఒక్క

సీసపద్యమున మాత్రమే గలదు. మరియు ప్రవరుడు పాదలేపనము కడిగివేయ బడి తిరుగుచు తాంబూలపు సువాసన యొక్క జాడను పట్టుకొనిపోయి తరుణ సహకారమూలవితర్ది మీద కూర్చొనియున్న వరూథినిని గాంచును. మూలమున వరూథినియే ప్రవరుని మొదట చూచినట్లుగా చెప్పబడినది. సహాయ్యమునకై వెదకుచున్న ప్రవరుడే క్రుమ్మరుచుపోయి వరూథినిని మొదట చూచెనను పెద్దన కల్పన సమంజసము. ప్రవరుడు కోనను గాంచుట, కోన వర్ణన, కోనలోకి పోవు మార్గము, వరూథిని భవన వర్ణనలు పెద్దన అపూర్వ కల్పనలు.

6) వరూథిని తనను గూర్చి "మౌనేయాఽహం మహా భాగా నామ్నా ఖ్యాతా వరూథినీ" అని సంస్కృత పురాణమునను "మునితనయ! విను, వరూథిని యను నచ్చర లేమ"నని చెప్పుకొన్నట్లు మారన మార్కండేయ పురాణమున గలదు. పెద్దన వరూథినిచే "పాల సముద్రమునఁబుట్టిన లక్ష్మి తోఁబుట్టువు" నని చెప్పించి ఆమె ఆభిజాత్య మునకు మెరుగులుదిద్దినాడు. మరియు ఆమె సురగరుడ గంధర్వాదులను ఎవ్వరిని మెచ్చక హిమాలయమును చేరిన దనుటయు ఆమె చరిత్రకు వన్నెలు దిద్దినట్లయినది. పెద్దన ప్రవరుని నిష్ఠగల బ్రాహ్మణునిగానే పేర్కొనినాడుగాని మారన వలె "మునితన" యునిగా ఎచ్చటను పేర్కొనలేదు దీనివలన ఆ పాత్రకు గౌరవము పెరిగినది

7) వరూథినీ ప్రవరుల సంవాదము మారన అనువాదమున పదు నారు పద్యగద్యములలో చెప్పబడినది. దానిని పెద్దన ముప్పది ఐదు పద్య గద్యములలోనికి విస్తరింపజేసెను. అతడీ ఘట్టమున ప్రదర్శించిన సంభాషణ కల్పనా చమత్కారము, పాత్రౌచిత్యము, ప్రతిభాపాటవము లపూర్వమైనవి.

8) వరూథిని మోహావేశము నాపుకొనలేక ప్రవరుని కౌగిలించు కొనినట్లు మార్కండేయ పురాణమున గలదు. ప్రవరుడు "అంటకంటకు నన్ను మృగాక్షి" అని యనును. పెద్దన వరూథిని "ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁబైయంచుల్ యాపగఁగౌగిలించి" ప్రవరుని అధ రమునాసించినది. అపుడు ప్రవరుడు "హా! శ్రీహరీ!" అనుచు ఓర మోమిడుకొని వరూథిని యంసద్వయంబంటి పొమ్మనుచు త్రోసివేసినాడు. మూలమున లేని యీ కల్పన ఎంతో రమ్యమైనది. హా! శ్రీహరీ! యని వేదకర్మనిష్ఠుడైన ప్రవరునిచేత అనిపించుట పెద్దన వైష్ణవమున కుదాహరణ. మార్కండేయపురాణమున వరూథిని ప్రవరుని కౌగిలించుకొనినతరువాత వారిద్దర

నడుమ సంభాషణ కొంతమట్టుకు నడుచును. పెద్దన ప్రవరవరూథినీ సంవాదమును మొదటనే సొంతముగా కూర్చినాడు. ప్రవరుడెన్ని తీరుల మాట్లాడినను వరూథినికి లొంగడాయెను. ప్రవరుడట్లు తన్ను నిరాకరింపగా వరూథిని యిక తమకము పట్టలేక ఆతనిని కౌగిలించుకొనినది. ప్రవరుడామెను త్రోసివేసినాడు. అపుడు వరూథిని అవమానము, సిగ్గు, కోపము మున్నైన వానితో నేమియు చేయలేక ఏడ్చినది. ప్రవరుని దయావిహీనుడని నిందించినది. పరాశర విశ్వామిత్రాదులను పేర్కొని, వారికంటె నీవు మహాఘనుడవా యని ప్రశ్నించినది. దేనికి ప్రవరుడు సమాధానమీయక నోరువిప్పకుండ అటనుండి వెడలిపోయినాడు. మూలాతిరక్తముగా పెద్దన కావించిన ఈ సన్నివేశములోని మార్పు ప్రవర పాత్రపోషణకు తోడ్పడుచు రమ్యముగా నున్నది. వరూథిని కౌగిలించుకొనిన పిదపకూడ అతడచటనే నిలిచి ఆమెతో వాదించుట ఆ పాత్ర గౌరవమును క్రిందు పరచును.

9) గంధర్వ పాత్రను పెద్దన కడు చమత్కారముగా ప్రవేశపెట్టినాడు. మార్కండేయ పురాణమున గంధర్వునకు 'కలి' యను నామధేయము కలదు. పెద్దన యా పేరును గ్రహింపలేదు. కథలో అతని ప్రాధాన్యము లేదని సూచించుటకై కాబోలు పెద్దన యిట్లుజ్జగించినాడు. గంధర్వుడు ప్రవరుని వేషమును ధరించి, వరూథిని విహరించు ఉద్యాన వనమున సంచరించుచుండును, పూలు కోయుచున్న మాయాప్రవరుని వరూథిని చూచి నిజమైన ప్రవరుడనియే తలంచినది. ఈ సందర్భమున పెద్దన చక్కని నాటకీయతను ప్రదర్శించినాడు. జట చెప్పుకొనుచు పూలు కోయుచున్న మాయాప్రవరుని చూచి అతడెచట పారిపోవునో అన్నట్లుగా వరూథిని వెనుకపాటుగా పోయి అతని యుత్తరీయమును పట్టుకొనెను. అట్లు అతనిని చూచినపుడు, డాసి ఉత్తరీయమును పట్టుకొనినపుడు ఆమెలో గలిగిన సాత్త్వక భావములను, వరూథినీ మాయాప్రవరుల సంభాషణను పెద్దన పదునెనిమిది పద్యగద్యములలో వర్ణించెను. మారన యీ వృత్తాంతమును ఐదుపద్య గద్యములలో రచించియుండెను. ఇది పెద్దన చతురవచోనిధిత్వమును ప్రదర్శించు మరొక ఘట్టము.

10) మారన మార్కండేయ పురాణమున వరూథినిని "ప్రియవచనంబులఁనూఱడించి యాపె యనుప విప్రరూప గంధర్వుడు నిజేచ్ఛనరిగెనంత"

అని ఒక్క వాక్యములో నున్న వృత్తాంతమును పెద్దన మాయాప్రవరుని కల్లి బొల్లి మాటలను చమత్కారముగా రచించి పదియేడు పద్యగద్యములలో విస్తరింపజేసినాడు. ఈఘట్టము పెద్దన చతురసంభాషణరచనాశిల్పమునకు మరొక ఉదాహరణ.

11) స్వరోచి మందరపర్వతతటప్రాంతమున విశ్వకర్మ నిర్మించి యిచ్చిన నగరమును రాజధానిగా చేసికొని ఆటవికులకు రాజయ్యెననుట పెద్దన కల్పనయే.

12) స్వరోచి ఆటవికుని ఆహ్వానముపై వేటకు వెళ్ళినట్లుగా మూల మునలేని కల్పనజేసి పెద్దన స్వరోచిమనోరమల సమాగమమును కావించిన తీరు సన్నివేశౌచిత్యము కలిగి ప్రబంధోచితమై నాటకీయపద్ధతిలో నున్నది. దీనివలన పెద్దనకు ప్రత్యక్ష పరిచయము, అభిరుచిగల ప్రబంధోచితమైన వేటవర్ణనను చేయుట కవకాశముకూడ లభ్యమైనది.

మనోరమ వృత్తాంతమును మారన తొమ్మిది పద్యగద్యములలో చెప్పగా పెద్దన దానిని ఇరువది తొమ్మిది పద్య గద్యములలో విస్తరింపజేసెను. మూలమున మనోరమ మునిని జూచి నవ్వినంత మాత్రముననే అతడు శపించె నని కలదు. మనోరమ దూదిరాశిగానున్న మునియొక్క ముఖమేది, ముక్కేది అని పట్టిచూచినట్లుగా కల్పించి శాపమిప్పించుటయే గాక ముని నాగబెత్తమును గొని పసరమును గొట్టినట్లు మనోరమను కొట్టెనని పెద్దన కల్పన గావించి మనోరమ ముగ్ధాత్వమును, అమాయకత్వమును, నిరపరాధత్వమును ప్రస్ఫుట మొనరించెను. ఇది పాత్రపోషణ కొరకును "పాటుండు సుగుణిగామి" చూపుటకై చేసిన మార్పులే.

13) మారన మార్కండేయ పురాణమున పది పద్యగద్యములలో ఇందీవరాక్షుని వృత్తాంతమును చెప్పగా పెద్దన ఇరువదిఏడు పద్యగద్యములలో రచించెను. ఈకథలో కొన్ని చిన్నమార్పులను పెద్దన చేసెను. "సప్తరాత్రంబుల రాక్షసుండవై యుండుమ"ని ముని ఇందీవరాక్షుని శపించినట్లు మార్కండేయ పురాణమునగలదు. ఏడు రోజుల కొరకు రాక్షసుడవై యుండుమనుటలో స్వరోచి ప్రమేయము లేకయే శాపవిమోచనము జరుగ గలదు. కావున నింపు సారస్యము

లేదని పెద్దన సప్తరాత్రంబులని పేర్కొనుటను విడిచి పుచ్చెను. ఇందీవరాక్షుడు రాక్షసుడుగా మారుట, ప్రజలనాతడు బాధించుట, ఆ వృత్తాంతమును తెలిసి ఆతని ఆలు బిడ్డలను పుట్టింటివారు "ఉత్సవాలోకన వ్యాజమున" తీసికొని పోయిరనట పెద్దనచేసిన సహజమైన రమ్యమైన కల్పనలు. అత్తవారింటిలో ఏదైన ఆపద సంభవించినప్పుడు ఆడుకూతురును పుట్టింటివారేదో మిషతో తమ యింటికి తీసికొనిపోవుట లోకమున జరుగు సంఘటన. ఈ కల్పన పెద్దన లౌకికమును ప్రదర్శించుచున్నది.

ఇందీవరాక్షునకు స్వరోచి మేనల్లుడని మూలమునలేని మేనరికమును తెచ్చిపెట్టి పెద్దన తన ఆంధ్రాచారప్రీతిని ప్రకటించినాడు. ఇదేవిధముగా తిక్కనకవి మహాభారతమున ఉత్తరుని పాండవులకు మేనల్లుడని మూలభారతమున లేని చుట్టరికమును తెచ్చిపెట్టి ఆంధ్రత్వముద్రనువేసియుండెను[1].

ఇందీవరాక్షుడు తన వృత్తాంతము నంతయు చెప్పిన తరువాత తొల్లిటి దివ్యరూపమును ధరించెనని మార్కండేయ పురాణమున చెప్పబడినది. స్వరోచి పావకాస్త్రమును ప్రయోగింపగా నే రాక్షసునకు శాపవిమోచనమై దివ్య గంధర్వ రూపముతో నిలిచెనని ఆ తరువాత నిజవృతాంతమెరిగించెనని పెద్దన మార్చెను.

14 మార్కండేయ పురాణమున శాపవిమోచనము చెందిన ఇందీవరాక్షుడు తన ఆయుర్వేదముతో సహ మనోరమను స్వరోచి కిచ్చి పెండ్లిగావించుటకు సమకట్టెను. అపుడు మనోరమ స్వరోచి యెదుటనే తండ్రితోడ తన సఖు లు తాను కారణముగా రోగపీడితలై యుండగా తానెట్లు భోగముల ననుభవింపగలననిపలుకును. అపుడు స్వరోచి "ఆయుర్వేదముతోడ నీ సఖుల నారోగ్య

---

1 ఉత్తరుడు బృహన్నలతో అన్నమాటలు—

ఏ నమ్మహాను భావుల  
మేనల్లుడ వారలార్య మిత్రులు శత్రు  
క్ష్మానాయక గర్వతమో  
భానులు బంధుహిత కార్య పరతంత్రాత్ముల్ వి. ప. 4—128

వతులను గావించెదను, విచారముడుపు"మని చెప్పను. ఇందీవరాక్షుడు వారిద్దరకు వివాహము గావించి గంధర్వ పురమునకేగెను. వివాహాత్పూర్వమే మనోరమ ఆస్లపలుకుట ప్రౌఢస్త్రీ లక్షణమని, ముందే వివాహము గావించి, పెద్దన వివాహానంతరము ప్రథమ సమాగమవేళ మనోరమ తన హృదయ బాధను స్వరోచికి తెలిపెనని మార్చెను ముగ్ధనాయిక యగు మనోరమ పాత్రపోషణకు ఈ మార్పు తోడ్పడినది. అంతేగాక వివాహానంతరము తన మనోబాధను భర్తతో చెప్పుకొనుట ఉచితముగా నున్నది కామోత్కంఠతోడ వచ్చిన భర్త వలన అభీష్టములను తీర్చుకొనుట వెలయాలి లక్షణమని పెద్దన మార్పును కొందరు విమర్శించిరి. కాని లోకమున స్త్రీలు పడుకటింటిలో భర్తలచేత తమ కార్యములను సాధించు కొందరను దాని ననుసరించి పెద్దన ఈ మార్పును చేసి యుండును.

స్వరోచి మనోరమను వివాహము చేసుకున్న తరువాత విభావసి, కళావతులను వివాహమాడెనని చెప్పుట బాగున్నది వివాహాత్పూర్వము మనోరమ తన సఖులను గూర్చి చెప్పినట్లయిన స్వరోచి వెంటనే వారి రోగమును నయము గావించుట సమంజసము. అట్లు గావించిన ముగ్గురికి నొకేమారు వివాహము చేసుకొనవలసివచ్చును. ఇట్లు మనోరమ పాత్ర ప్రాధాన్యము కొరకును, స్వరోచి గుణ పోషణకై పెద్దన మొదట వివాహమును గావించి ఆ తరువాత విభావసి కళావతుల క్షయరోగమును స్వరోచి అపనయించినట్లుగా చెప్పెను. ఈ మార్పుచేత పెద్దనకు ప్రబంధవర్ణనలలో నొకటి యగు వివాహవర్ణనను ఔచితీపోషకముగా చేయు అవకాశము లభించినది.

15 కళావతి వృత్తాంతమును మారన తొమ్మిది పద్యగద్యములలో చెప్పెను. దీనిని పెద్దన ముప్పదియెనిమిది పద్యగద్యములలో పెంచి రచించినాడు. ఈ వృత్తాంతము శృంగారశాకుంతలములోని మేనకావిశ్వామిత్రుల వృత్తాంతమును కొంతవరకు పోలియుండుటచేతను, ఇందు ఋతు వర్ణన కవకాశముండుటచేతను పెద్దన దీనిని పెంచి రమ్యముగా రచించినాడు. దేవాపి యొక్క వేష వర్ణనము కళావతిని వాడడుగ వచ్చి నిరాకరింపబడుటయు మిక్కిలి సహజముగా నుండి ప్రబంధము చివర నున్నను పాఠకుల నాకర్షించుచున్నవి.

16) స్వరోచి ముగ్గురు భార్యల తోడ భోగముల ననుభవించుచు సుఖముగా జీవించుచు ఒకమారు హంసీచక్రవాకంగనల యొక్కయు మరొక

మారు కృష్ణమృగము యొక్క యీ మాటలను విని వైరాగ్యమును వహించిన వాడయ్యు భోగముల మీద యాశ విడువకుండ నుండెనని మూలానుసారముగ పెద్దన చెప్పినాడు. మార్కండేయ పురాణమున మూడవమారు హంసమిథునము యొక్క సంభాషణమును విని స్వరోచి వెంటనే బోగములను విడిచి ఘోరముగా తపస్సు గావించి స్వర్గలోకమునకు పోయినట్లు చెప్పబడినది. మను చరిత్రలో నాయకులలో నొకడగు స్వరోచి యొక్క స్వర్గప్రాప్తి ని చెప్పుట తగదని కాబోలు పెద్దన దానిని విడిచి పుచ్చినాడు.

17) వనదేవతా వృత్తాంతమును మార్కండేయ పురాణముననుస రించి చెప్పుచు పెద్దన హరిణీ రూపమునుండి వనదేవతగా మారుటనుఅద్భుతముగా వర్ణించినాడు. (6–96)

18) ప్రబంధమును స్వారోచిషుని జన్మము తోడ ముగించక అతని తపస్సును గూడ పెద్దన వర్ణించినాడు. ఈ కల్పన అంగిరసమైన శాంతరస మునకు పోషకముగా నున్నది.

19) మార్కండేయ పురాణమున లేని సఖులను పెద్దన వరూథినికి కల్పించినాడు. ప్రవరునితోడ సంభాషించువేళ వరూథిని "అంతంతంబాలయు చెలులందఱుచూపక యుండం ద త్తరంబునంజేసి బొమముడిపాటుతో మగిడీ మగిడీ చూచుచుఁ జిడిముడిపాటు చూపులనంకురించు జంకెనల" (2–61, చేత చెలు లను వారించినట్లుగాను చెప్పెను. మరియు వనవిహార జలకేళి సందర్భములోను మాయాప్రవరునితోడ సంభాషించు వేళను వరూథినిసఖులను పెద్దన ప్రవేశ పెట్టినాడు. వరూథిని విరహతాపమునకు గురియై ఆత్మహత్యా పాపమునకై యొడిగట్టినపుడీ సఖులామెనెంతగానో ఊరడించి, సాంత్వనము నొసంగిరి. కాళిదాసు తన శాకుంతల నాటకమున శకుంతలకు అనసూయా ప్రియంవదలను సఖులుగా సృష్టించెను. అదేవిధముగా పెద్దన సృష్టియు నాటకీయతనను సరించుచు ప్రబంధమునకు రమ్యతను చేకూర్చినది.

20) పెద్దన మార్కండేయ పురాణములోని పేర్లను కొన్నింటిని మార్చినాడు—

మార్కండేయుడు "క్రోష్టుకి" అను శిష్యునకు పురాణమును విని పించినట్లుగా మార్కండేయ పురాణమున కలదు. "క్రోష్టుకి" ని పెద్దన "క్రోష్టి" గా పేర్కొనినాడు.

పెద్దన అరుణాస్పదపురము ప్రక్కన "వరుణా" నదికి బదులుగా "వరణా" నదిని పేర్కొనినాడని ఒక ఆక్షేపణ కలదు. కాని 'వరణా' యనుటయే సరియగును. "వరణ" యు "అసి" యనను నదులు కలియు చోటు ననే "వారణాసి" నగరము గలదు, ఆ "వరణా" నదీ తీరముననే అరుణా స్పదము గలదు. ఇప్పటికిని ఆ నదిని హిందీ భాషలో "బర్నా" అని అనుటయే గలదు కావున "వరణా" రూపమే సరియైనది.

మనోరమ చెలికత్తెలలో నొకతె యగు విభావరి నామమును పెద్దన విభావసిగా మార్చినాడు. కళావతిని వివాహమాడనిచ్ఛగించిన గంధర్వునిపేరు దేవారి యని యుండగా పెద్దన దానిని దేవాపిగా చెప్పినాడు. మనోరమ మాతా మహుడు మరుధన్వుడని యుండగా మరుదశ్వుడని చెప్పెను. కళావతి తల్లియగు అప్సరస పేరు కొన్ని సంస్కృత మార్కండేయ పురాణములందు "పుంజస్తన" అనియు కనపించుచున్నది. దానిని పెద్దన పుంజకస్థలగా చెప్పెను. పెద్దనకు లభించిన పురాణమున అప్సరసనామము పుంజకస్థలగా ఉండి యుండవచ్చును.

స్వరోచి "మనోరమ యందు విజయుండును, విభావరి యందు మేరు నందుండును, గళావతియందుఁ బ్రభాసుండునను పుత్త్రులఁ బడసి పద్మినీ విద్యా ప్రభావంబున నుత్తరంబున మేరునందునికి నందవతినగరంబును, దక్షిణంబునఁ బ్రభాసునికిఁ దాళంబను పట్టణంబును నిర్మించి యందు వారల నునిచి" యని మారన సంస్కృతమార్కండేయ పురాణము ననుసరించి చెప్పినాడు. మేరు నందుడను పేరును మేరునందనునిగాను, ప్రభాసుని విభావసుడనియు, నందవతిని గంధవతిగాను, తాళమును ధారానగరముగాను పెద్దన మార్చినాడు.

స్వరోచికిని వనదేవతకును జన్మించిన కుమారునకు "తనుద్యుతి కత్యద్భుత మంది మదిస్స్వారోచి ద్యుతిమన్నామంబతనికి నొనరించె" నని మారన సంస్కృత మార్కండేయ పురాణానుసారముగా చెప్పినాడు. పెద్దన ద్యుతిమంతుడను పేరునే మనుచరిత్రలో పేర్కొనలేదు. ఇంకను స్వారోచిష

మనువు కాలమున వెలసిన ఋషులును, రాజులును, ఇంద్రుడును ఎవరైనదియు పెద్దన పేర్కొనలేదు.

పెద్దన సంస్కృతాంధ్ర మార్కండేయ పురాణముల రెంటిని పరిశీలించినను ఆంధ్రమార్కండేయ పురాణమునే యెక్కుడు ఆదర్శముగా గ్రహించినట్లు కొన్ని పద్యానుకరణలను బట్టియు, సంస్కృతమున చెప్పబడక మారన చెప్పినట్టివాని ననుసరించుటనుబట్టియు తెలియుచున్నది.

ఈ విధముగా పెద్దన సన్నివేశములను విస్తరింపజేసి, ప్రబంధ వర్ణనలకొరకునై ,పాత్రపోషణ, రసపోషణ దృష్టితోడను కథలోకొన్ని మార్పులను చేసినను ప్రధానమైన కథాసంవిధానము నంతటిని మార్కండేయ పురాణములో నుండియే గ్రహించినాడని చెప్పవలయును.



# రామరాజభూషణుడు మూలకథలో చేసిన మార్పులు

రామరాజ భూషణుని ప్రబంధ కథకు మూలము మహాభారతములోని కథ అనుట స్పష్టము. కాని నామమాత్రముగా నున్న కథను రామరాజభూషణుడు ప్రబంధమునకుచితమగు నితివృత్తముగా మలచుకొనెను. అతనికి రసపోషణకై, పాత్ర చిత్రణకై వర్ణనలకొరకై అనేక కల్పనలను గావించుకొనుట అవసరమయ్యెను. మహాభారతమునుండి గ్రహించిన కథ కన్నను కవి కల్పిత కథాసంఘటనలే కావ్యమున పెక్కు గోచరించును. అంతేగాక రామరాజభూషణుడు మూలకథ నుండి గ్రహించిన విషయములలోను ప్రబంధౌచితి కొరకై కొన్నిమార్పులను గావించియున్నాడు. అట్టి మార్పులను పరిశీలింతము.

1) వసుచరిత్రలో వసురాజు నాయకుడు. ప్రబంధానుగుణముగా నాయకుని తీర్చిదిద్దుటకై మహాభారత కథలోని వసురాజు వ్యక్తిత్వమును రామరాజభూషణుడు పూర్తిగా మార్చివేసినాడని చెప్పవలయును. శృంగారరస ప్రధానమైన కావ్యమున నాయకుడు రాజర్షి యనియు, తపస్సు గావించెననియు, చెప్పుట రసభంజకమగునని కవి వానిని విడిచి పుచ్చెను.[1] మూలమున వసురాజు మృగయాసక్తుడని చెప్పబడినను రామరాజభూషణుడు వసురాజు వేటను గూర్చి చెప్పలేదు. వసురాజును వేటకు పంపి అట గిరికతో సమావేశము కలిగించుట కవకాశముండెను. కాని అట్లు శృంగారశాకుంతలము మనుచరిత్రలలో నుండుటచే నూతనత్వమునకవకాశము లేదని కాబోలు రామరాజభూషణుడు వసురాజును వన విహారమునకు పంపి అట గిరికతోడ సమావేశమును కల్పించినాడు. మూలమున వసురాజునకైదుగురు కుమారులున్నట్లును, వారు ఐదు రాజ్యములను స్థాపించినట్లును గలదు. రామరాజభూషణుడు దానిని విడిచి పెట్టినాడు వసురాజునకిట

1. వసు చరిత్ర పీఠికలో రామరాజభూషణుడు వసురాజును (1–12) రాజర్షిగా పేర్కొనినను కథలో మాత్రమెచ్చటను దాని ప్రసక్తి తేలేదు.

భార్యలున్నట్లును అతడు చెప్పలేదు. శుక్తిమతికోలాహలవృత్తాంతములో వసు రాజు యొక్క శౌర్యమును, తత్కారణముగా ఇంద్రుడాతనితో స్నేహమును పాటించుటను, రెంటిని ముడిపెట్టి కవి చక్కని కథా సంవిధానమును ప్రదర్శించి నాడు.

ఈ విధముగా వసురాజును ఉత్తమనాయకునిగా తరుణ వయస్కునిగా, సుందరునిగా, పరాక్రమవంతునిగా రామరాజభూషణుడు తీర్చిదిద్ది తన ప్రబంధనాయకునిగా చేసికొనెను.

2) మహాభారతమున కాలితో కోలాహలుని వసురాజు తన్నినట్లుగా కలదు.[1] రామరాజభూషణుడు పాదనఖాగ్రమాత్రముననే వసురాజు కోలాహలు నెగమీటినట్లుగా చెప్పి ఆతని పరాక్రమాతిశయమును పెంచినాడు.

3) మూలమున వసురాజు తపస్సు చేయగా ఇంద్రుడు వచ్చి అతనికి విమానమును, ఇంద్రమాలను, వేణుయష్టిని యిచ్చినట్లు కలదు. రామ రాజభూషణుడు దానిని మార్చి వసురాజు కోలాహలుని శిక్షించగా ఇంద్రుడు సంతసించి వచ్చి స్నేహము పాటించి అమరపురికి వచ్చుచుపోవుచుండుమని చెప్పి ఒక దివ్యవిమానము నొసగినట్లుగాను, వసురాజును పెండ్లికొడుకుగా నలంక రించినప్పుడు ఇంద్రమాలను, వివాహసందర్భమున వేణుయష్టిని యిచ్చినట్లుగాను మార్చెను సంస్కృత మహాభారతమున వసురాజు తన తపస్సుద్వారా ఇంద్ర పదవిని పొందునేమో యని భయముతో ఇంద్రుడువచ్చి వసురాజునకు విమానము నొసంగి ఆతనిని తపస్సునుండి మరల్చెను. ఈవిషయమును నన్నయ చెప్పక విడిచెను. ఇట నన్నయ ఇంద్రుడు వసురాజుయొక్క తపస్సునకు, పరిపాలన మునకు మెచ్చి తన తోడ చెలిమిని పాటింపుమని అతనికి దివ్యవిమానాదుల నిచ్చి నట్లుగా చెప్పియున్నాడు. సంస్కృత మహాభారతమున ఇంద్రుడు వసురాజుతో "నీవు భూమండలమును, నేను స్వర్గమున పరిపాలింతము. ఇప్పటి నుండి నీవు నాకు మిత్రుడవైతివని' యేదో సంధివచనరూపమున మాట్లాడును. వసురాజు యొక్క ఆర్తత్రాణపరాయణతకు, పరాక్రమమునకు మెచ్చి ఇంద్రుడు స్నేహ

---

1. "గిరిమ్ కోలాహలంతు పదా వసురతాడయత్" మహాభారతము ఆది పర్వము 63 అధ్యా-36 శ్లోకము.

మాశించుచున్నట్లుగా మార్చి రామరాజభూషణుడు కొంత మట్టుకు నన్నయ ననుసరించెను.

4) రామరాజభూషణుడు వసురాజును ఇంద్రునంతటి వానిగా చేసి వర్ణించి యాతని గుణాతిశయమును ప్రకటించెను. సంస్కృతమున నిట్లు లేకున్నను నన్నయ వసురాజునకు కథ ఎత్తుగడలోనే "వాసవ ప్రతిమం"డని విశేషణమును వేసెను.[1] ఇది రామరాజభూషణుని వర్ణన కాధారమైయుండును.

5) సంస్కృత మహాభారతమున రెండు శ్లోకములలోను[2] నన్నయ మహాభారతమున ఒక్క వాక్యముననుౕ[3] గల శుక్తిమతికోలాహలుల వృత్తాంతము రామరాజభూషణుడు ఏబదియైదు పద్యగద్యములలో విస్తరింపజేసి కడు చమత్కారముగా రచించినాడు (2.102- 156). ఈ వృత్తాంతమును ప్రబంధారంభమున చెప్పుటకు వీలున్నను కథలో నడుమ మంజువాణి నోటితో చెప్పించి రామరాజభూషణుడు చక్కని శిల్పమును ప్రదర్శించినాడు. ఈ వృత్తాంతమును మంజువాణి, మాయామునిగా వచ్చిన విదూషకునకు చెప్పుచుండగా వసురాజు లతలమాటున నుండి విను సన్నివేశకల్పన నాటకములోవలె నుండి ప్రబంధమున అద్భుతముగా నొప్పుచున్నది.

6) కోలాహలుని హిమవంతుని కుమారునిగా చెప్పి రామరాజభూషణుడాతని కాభిజాత్యము కల్పించెను. మూలమహాభారతముననిట్టి సంబంధము చెప్పబడలేదు. ఈ కల్పన ద్వారా కోలాహలుని పుత్రిక యగు నాయిక గిరిక కూడ ఉన్నత కులోద్భవయైనది.

---

1. మహాభారతము. 3. ఆశ్వా 23 పద్యము
2. పురోప వాహినీమ్ తస్యనదీం శుక్తిమతీం గిరిః
   అరౌత్సీచ్చేతనా యుక్తః కామాత్ కోలాహలః కిల
   గిరిమ్ కోలాహలం తు పదా వసురతాడయత్
   నిశ్చకారామ తతస్తేన ప్రహార వివరేణ సా
   మహాభారతము ఆదిపర్వము 63వ అధ్యా. 35-36 శ్లోకములు.
3. "శుక్తిమతి యను మహానదిం గోలాహలంబను పర్వతంబు కామించి యడ్డంబు పడిన దాని తన పదంబునంజేసి తలగం ద్రోచిన...."
   ఆ. ప. 3-26.

7) సంస్కృత మహాభారతమున శక్తిమతికి కూతురుతోపాటు కుమారుడు కలిగినని చెప్పబడినది. కాని ఆతనిపేరు పేర్కొనబడలేదు. నన్నయ వానికి వసుపదుడని నామకరణముచేసినాడు. ఆ పేరునే రామరాజ భూషణుడును గ్రహించినాడు

8) మూలమహాభారతమునలేని వసురాజుయొక్క వనవిహారము కోలాహల పర్వతమును నర్మసఖునితో చేరుట, గానమును వినుట, నర్మసఖుని ద్వారా గిరిక జాడను తెలిసికొని వసురాజు పోవుట, విదూషకుడు మాయాయతి వేషమున గిరికామలలను చేరుట, మంజువాణిచేత గిరికా జన్మవృత్తాంతము చెప్ప బడుట, గిరికా వసురాజుల పరస్పర దర్శనము, వారి ప్రేమ, విరహము, మంజువాణి దౌత్యము, ఇంద్రాదులు పోయి కోలాహలుని వసురాజుకొరకై గిరిక నడుగుట, మొదలగు సన్నివేశములను రామరాజభూషణుడు అద్భుతముగా కల్పించి తన కల్పనా చాతుర్యమును ప్రదర్శించినాడు. రామరాజభూషణుడు మూలంలోలేని సఖులను గిరికకు కూర్చినాడు వసురాజునకు నాటకములో వలె నర్మసఖుని సృష్టించినాడు. మూలమున శక్తిమతి భక్తిమతియై తనకు జనించిన గిరికావసుపదులను తెచ్చి వసురాజునకు కానుకగా నీయగా నాతడు వసుపదుని తన సేనాపతిగాను, గిరికను ధర్మపత్నిగాను కావించుకొనెనని యుండగా రామరాజభూషణుడు గిరికావసురాజులకు ప్రేమను కల్పించి యుచిత రీతిని వివాహము జరిగినట్లుగా కల్పన గావించెను. ఆ తరువాత వసుపదుని యాతడు సేనాపతిగా కావించుకొనెను.

9) ఇంద్రుడు వసురాజునకు అనుంగు చెలికాడు. వసురాజొకనాడు అమరపురికి రాకపోవుసరికి ఇంద్రుడు బాధపడినాడు. చెలికానికేమైనదో యని కలత చెందినాడు. తరువాత చెలికాని ప్రేమ వృత్తాంతమును తెలుసుకొని వెంటనే ఆ కార్యభారమంతయు తనపైవేసుకొని వివాహమును జరిపించినాడు. ఇదంతయు రామరాజభూషణుని కల్పనయే.

ఒక విధముగా చెప్పవలయుననిన వసుచరిత్రప్రబంధములోని కథలో రామరాజభూషణుడు మహాభారతమునుండి గ్రహించినది తక్కువ, స్వకపోల కల్పనలే యెక్కువని చెప్పవలయును. వసురాజు, ఇంద్రుడు, శక్తి

మతి, కోలాహలుడు, గిరిక ఈ పాత్రలనాతడు మహాభారతకథనుండియే గ్రహించినను వ్యక్తిత్వము నేర్పరిచి, ఒక స్వరూపము నొసంగి వానిచుట్టును అనేక సన్నివేశములను అల్లి ఒక వినూత్న సృష్టిని కావించినాడు.

10) రామరాజభూషణుడు భారతమునగల ఉపరిచరవసువృత్తాంతము నంతయు గ్రహింపక గిరికతోడి వివాహము వరకే గ్రహించినాడు వివాహానంతరము వసురాజు పితృదేవతలు ఋతుమతియైన గిరికకు మృగమాంసమును పెట్టుమని ఆజ్ఞాపింపగా దానిని నెఱవేర్చుటకై వసురాజు వేటకు పోవుట, ఆట భార్యను తలంచుకొనగా వసురాజునకు రేతస్ఖలనమగుట, దానిని ఒక డేగద్వారా పర్ణపుటమున భార్యకు పంపుట, త్రోవలో మరొ డేగతో పోట్లాడుట, ఆ పోట్లాటలో వీర్యము సముద్రములోబడుట సముద్రమందు అద్రిక యను అప్సరస చేప రూపమున నున్నది ఆ వీర్యమును మింగుట. అది జాలరులకు పట్టుబడుట, వారు దాని గర్భమును చీల్చగా అందుండి ఒక్క కొడుకు ఒక్క కూతురును జన్మించుట మొదలగు వృత్తాంతములన రామరాజభూషణుడు ప్రబంధోచితములుగావని విడిచిపెట్టి యుండవలయును. "ఈ కథయెల్లను స్వీకరింపకపోవుటలో కవియొక్క పరమౌచిత్యభాసురమైన చిత్తవృత్తి విశేషము ప్రస్ఫుటమగుచున్న" దని డా॥ కోవెల సుప్రసన్నాచార్యులగారనిరి[1].

ఈవిధముగా రామరాజభూషణుడు నామమాత్రముగా ప్రబంధేతివృత్తమును మహాభారతమునుండి గ్రహించి యనేక ఔచితీపోషకములైన కల్పనలను చేసినాడు.



1. రామరాజభూషణుని కృతులు (వాఙ్మత్రవలి) పుట. 111.

# పెద్దన రామరాజభూషణులు కథలో చేసిన మార్పులలోని ఔచిత్యము

పెద్దన రామరాజభూషణులిరువురి కావ్యకథాసంవిధానములు తీవ్రమైన విమర్శలకు గురియైనవి. ఆ కథలో అనౌచితీపోషకములగు సన్నివేశములు, రసాభాసములతో కూడిన ఘట్టములు కలవందురు. ఇరువురు కవులును తమ కథలో మార్పులను చేసి యుండిరి.

"పెద్దన పురాణములలో రససంచితమగు కథయేదియని వెతకుకొని యట్టిదానిని గ్రహించినాడు. కథాకల్పనమునందు పెద్దన తగు నేర్పుజూపలేదు. మూలమునందున్న కథనైనను సందర్భశుద్ధిగా తెల్పలేకపోయె"నని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారభిప్రాయపడిరి.[1] కాని సూక్ష్మపరిశీలన చేసినయెడల ఈ యభిప్రాయము సరిగాదని చెప్పవచ్చును—

పెద్దన కావ్యారంభమున గావించిన ప్రవరుని శీలవర్ణన ఆతని పాత్రచిత్రణకు మెరుగులు దిద్దినది. ఈ గుణవర్ణనవలన వరూథిని యెడల ఆతని ప్రవర్తన సుస్పష్టమగుచున్నది. అందు "వాని చక్కదనము వైరాగ్యమునం జేసి...." (1-52) అను ప్రవరుని గుణవర్ణన భావికథాసూచకము. ఆతని ధర్మకర్మదీక్ష, సత్యనిష్ఠ, తేజస్సు, ఏకపత్నీవ్రతము, పాండిత్యాది గుణముల విస్తార వర్ణన అంగిరసమగు శాంతరసపోషకములై, ఆ తరువాత వరూథిని నిరంతర స్మరణ వలన తద్గుణములు స్వరోచికిని, స్వరోచినుండి స్వారోచిషుని లోను ప్రవేశించి యాతడు మనుస్థానమును పొందుటకు తోడ్పడినవి. మను జన్మకారకుడైన ప్రవరుని శీలమును ప్రబంధాదినే విస్తారముగా వర్ణించి ఔచిత్యమును పాటించినాడు. వరూథిని ఆభిజాత్యము, గుణాధిక్యతలకై మార్కండేయ

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 10 సంచిక 1

పురాణాతిరిక్తముగా కావించిన మార్పులు, చేర్పులు ఔచితీస్ఫోరకములు. మార్కండేయ పురాణమున స్వరోచి పాత్ర అంతగాలేదు. వేట, యుద్ధసమయమున ఆతడు ప్రదర్శించిన శౌర్యసాహసములను కన్నులకు గట్టునట్లు పెద్దన వర్ణించి స్వరోచి నొక వీరునిగా చిత్రించెను. స్వరోచిమనోరమల సమావేశ కల్పన మూలాతిరిక్తమై యుచితముగా నున్నది. మనోరమను ముగ్ధనాయికగా చిత్రించుటకై పెద్దన చేసిన మార్పులు ఉచితములు. స్వారోచిషుని తపస్సును గూర్చి చెప్పుట అంగిరసపోషకమైనది

ప్రవరవరూథినీసంవాద ఘట్టమున రసాభాసము గలదని విమర్శ కలదు కాని రసాభాసమును పండితజగన్నాథరాయలవంటి ఆలంకారికులు నిషేధమని చెప్పలేదు అంతేగాక శృంగారశాంతములకు, భోగవైరాగ్యములకు సంఘర్షణను చూపించి వైరాగ్యమే జయించినదని చెప్పుటచే నచట ప్రబంధమున అంగిరసమగు శాంతరసపోషకమగుచున్నదేగాని వేరుకాదు. (శృంగారరసాభాసము కాదనుట, రసప్రకరణమున నిరూపించడమైనది )

"మొత్తమునకు పెద్దన ఉభయపురాణాతిరిక్తముగా కల్పించిన కల్పనలు, మార్పులు ప్రబంధరామణీయకత్వమునకాస్పదములై కవిప్రతిభావ్యుత్పత్తులను వేనోళ్ళ చాటుచున్న" వని[1] డా॥ జి వి. సుబ్రహ్మణ్యముగారు పొగడినట్లుగా పెద్దన ప్రబంధకథ ఔచితీపోషకమైనదని చెప్పనగును.

రామరాజభూషణుడు మహాభారతమునుండి "ఉపరిచరవసువను రాజు కలడు, శుక్తిమతి నడ్డగించిన కోలాహలు నాతడు కాలితో నెగమీటినాడు, గిరికను వివాహమాడినా" డను మూడుముక్కల కథను గ్రహించి నూతన సన్నివేశములను కల్పించి, ఉన్న మూలకథలో రసపోషకములగు, ప్రబంధోచితములగు మార్పులనుజేసి వర్ణనలనుజేర్చి అపూర్వ కావ్యసృష్టిని చేసినాడు. ఇట్టి రామరాజభూషణుని కావ్యము కథావిషయకముగా ననేక విమర్శలకు గురియైనది. రామరాజభూషణుని "కథాసంవిధానమందుచుబస కానరాద" ని శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిగారనిరి.[2] అట్లే శేషాద్రిరమణకవులు "వసుచరిత్రమును రసికులు సారస్వత పరిచయమునకుంబఠింతురుగాని కథాపఠన

1. ప్రథమాంధ్ర మహాపురాణము, పుట 488.
2. వసుచరిత్ర విమర్శనము, పుట 8.

మునకు పఠింపకున్నా" రనియు "కథాసౌష్ఠవమును పాటింపకపోవుట యొక గొప్ప కొఱంత" అని మరియు కవి "సాహిత్యపీఠమును పాలించు భారతికి రత్నసమూహము నొసంగెనేకాని కథాసూత్రమున నందచందంబుగ గ్రుచ్చి యొసంగఁజాలక పోయె" ననియు అభిప్రాయపడిరి[1].

రామరాజభూషణుడు మహాభారతపు పుటల పొరలలో మరుగుపడి యున్న నీరసమైన కథను గ్రహించి సరసము గావించినాడు వసురాజు గిరిక లంతగా వెలుగులోలేని పాత్రలు అట్టిపాత్రలను గ్రహించి వారిచుట్టు ప్రేమ కథను అల్లినాడు. వసురాజునకు ఇంద్రునంతటివాని ననుంగుచెలికానిగా కావించి యింకను కథలో పసగొనితెచ్చినాడు. సంస్కృత సాహిత్యమున కాళిదాసు మహాభారతమునుండి శకుంతలాదుష్యంతుల కథను గ్రహించి నాటకముగా అమరసృష్టిని గావించినాడు. అదేవిధముగా రామరాజభూషణుడు మహాభారతమునగల గిరికావసురాజుల వృత్తాంతమును గ్రహించి ఆంధ్ర సాహిత్యమున అజరామరమైన కావ్యసృష్టిని గావించినాడు. రామరాజభూషణుడు వసురాజును ధీరోదాత్తునిగా, గిరికను ముగ్ధనాయికగా, శుక్తిమతిని సాత్త్విక స్వభావురాలుగా, కోలాహలుని ఉద్ధతప్రకృతి గలవానిగా మహాభారతమున లేని రూపకల్పనలను గావించెను. పెద్దన తన అపూర్వచతురవచోనైపుణ్యముచే వరూథినీప్రవరులను ఆంధ్రుల మనఃఫలకములపై చెరుగని విధముగా చిత్రించినాడు. రామరాజభూషణుడును అపూర్వకల్పనాచాతుర్యమున శుక్తిమతీకోలాహలుల వృత్తాంతమును అనితర సులభమగు రచనాకౌశలముతో వర్ణించి చెప్పి ఆంధ్రుల హృదయములందధిష్ఠించినాడు. ఈ శుక్తిమతీకోలాహల ఘట్టముగ శృంగారరసాభాసము కలదనియు, అంగిరసము శృంగారమై యుండగా నిట్టి రసాభాసమును వర్ణించుట ఔచితీపోషకము కాదనియు అందురు. కాని శుక్తిమతీకోలాహలుల కథ ప్రబంధమున ప్రధానకథ కాదు. మరియు అది శాకుంతలములో వలె నాయికాజన్మవృత్తాంతమును తెల్పు ఘట్టము. అంతేగాక నాయకుడు వసురాజుయొక్క పరాక్రమాతిశయమును ముఖ్యముగా సూచించుచు నాయకునియందు నాయిక పూర్వానురాగము కలదనియు చెప్పుచున్నట్టిది. కావున రామరాజభూషణుడీ ఘట్టముననిన్ని విషయములను దృష్టిలో నుంచుకొని

---

1. వసుచరిత్ర పీఠిక పుట x.

తీర్చిదిద్ది కథకు ప్రధానాంగమైన వృత్తాంతముగా చెప్పి తనకథాకల్పనాచాతురిని ప్రదర్శించినాడు.

"పురాణములో పది పంక్తులలో వ్రాయబడియున్న యొక చిన్న కథను దీసికొని రామరాజభూషణుడు కడు రసవంతముఁజేసియున్నాఁ" డను శ్రీ బ్రహ్మయ్య శాస్త్రిగారి యభిప్రాయము గమనింపదగినది[1].

మనుచరిత్రతో పోల్చినప్పుడు వసుచరిత్రలో కథాబాహుళ్యము తక్కువ. సంస్కృత మహాకావ్యములగు నైషధాదులందు కథాసంవిధానముకన్న వర్ణనావైచిత్రికి భావచమత్కారమునకు ప్రాధాన్యమెక్కువ. ఈ మర్యాద ననుసరించుచు రామరాజభూషణుడు వర్ణనా చమత్కృతికి భావనా వైచిత్రికి ప్రాధాన్యమెక్కువ యొసగినాడని చెప్పవచ్చును. శ్రీహర్షుడు తన నైషధమహాకావ్యమున గల కథాసంవిధానము నంతటిని మహాభారతములోని నలోపాఖ్యానము నుండియే గ్రహించినాడు. అతని కథాసృష్టి తక్కువ. కాని రామరాజభూషణునకు తన ప్రబంధములోని కథాసంవిధానమునంతటిని తానే సృష్టించుకొనవలసి యుండెను. ఆ కార్యభారము నాతడు చక్కని నైపుణ్యముతో నిర్వహించినాడు. ఇచట బాలాంత్రపు నళినీకాంతరావుగారి మాటలు స్మరింపదగినవి—"కావ్యములో రసపుష్టిముఖ్యము. కథాప్రాధాన్యము ఇతిహాసములో సాహిత్యరసపోషణుడు ఐతిహాసిక కథను కవితారసానురూపముగా మార్చి, పెంచి, తగ్గించి దానికి మెరుగులు పెట్టినాడు''.[2]

మను వసుచరిత్రలందలి కథాసన్నివేశములను తరువాత కవులెందరో యనుకరించిరనిన వాని కథాసంవిధానప్రాశస్త్యము ప్రకటమగుచున్నది. మనుచరిత్రలోని- ప్రవరుడు కోనను గాంచుట, ప్రవరవరూథినుల సంవాదము, స్వరోచి వేటకు పోవుట, మనోరమతోడి సమాగమము, రాక్షసునితో యుద్ధము మొదలగు సన్నివేశములను, మరియు వసుచరిత్రలోని వసురాజు వనవిహారము మరియు గిరికా గానముచే నాకర్షింపబడుట, ఆమెను వెదకుచు విదూషకుడు పోవుట, గిరికావసురాజుల సమావేశము, మంజువాణి దౌత్యము మొదలగు

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటము 10, సంచిక 1.
2. వసుచరిత్ర ఎమెస్కో ప్రచురణ, పుట 126.

ఘట్టములను తదనంతర కవులు ప్రీతితో ననుకరించిరి. ఇవి సుందరకల్పనలు కావుననే వారు వాని ననుకరించిరి. పెద్దన రామరాజభూషణులిరువురును తమ కావ్యములలో కథాసంవిధానమున రామణీయకతను, ఔచిత్యమును చూపెట్టి యున్నారు.

పెద్దన కావించినమార్పులు అతడు గ్రహించిన కథలో తక్కువయే. మార్కండేయ పురాణములోని కథనే గ్రహించి యుచితములైన చిన్న మార్పులతో పెద్ద మనుచరిత్రప్రబంధ రచన కావించినాడు. కాని వసుచరిత్రలోని కథనంతటిని రామరాజభూషణుడే స్వయముగా నిర్మించుకొనినాడు. వసుచరిత్ర లోని కథ చిన్నదేయైనా మూలమహాభారతములోని కథతో పోల్చినట్లయిన అతడు కావించిన కథాసంవిధానకల్పన అనల్పమైనది. వసుచరిత్రలోని పతి చిన్న సన్నివేశము రామరాజభూషణుని కల్పనాసృష్టియే ఇట్టి కథాకల్పనలో పసలేదనుట సమంజసముగా లేదు. కథలోని ప్రతి సంఘటనయు నాటకములోని సంఘటన వలె నొప్పుచున్నది. సంధిసంధ్యంగములతో కూడినదై కథ నాయకుని ఫల ప్రాప్త్యున్ముఖియై శృంగారరసపోషకమై సాగినది.

ఈ విధముగా రామరాజభూషణుడు కథాకల్పనాప్రతిభను విశేషముగా ప్రదర్శించి, మూలకథను విశేషముగా అనుసరించుచు మనుచరిత్రను మించిన కావ్యమును రచించినాడని చెప్పవలయును. "సత్కవి కల్పనా విభూషాపహ పూర్వకథలు సానఁబెట్టిన జాతిరత్నము"[1] (1–19) లను యుక్తి ననుసరించుచు రామరాజభూషణుడు తన కథాకల్పనాచమత్కారముచేత వసుచరిత్ర నలంకరించినాడు. పురాణ కథననుసరించు పెద్దనమనుచరిత్రను రామరాజభూషణుడు "ఆద్యసత్కథల్ వావిరి పుట్టు రత్నము"[2] (1–19 లని విమర్శించెనని యందురు. అందుచేతనే తన కావ్యమును పుట్టురత్నముగాకుండ సానలు దీరిన రత్నముగా తీర్చిదిద్దుటకు పూనుకొనెను. అనగా పుట్టు రత్నము వంటిదగు మనుచరిత్రను మించునట్టి, సానబెట్టిన రత్నమువంటి వసుచరిత్రను సృష్టించదలచుకొనెనని చెప్పనగును. మనుచరిత్రనిట్లు మించవలయునను రామరాజభూషణుని వాంఛ కథాకల్పనా దృష్టితో పరిశీలించిన ఫలించనిదనియే చెప్పవలయును.

**

1 మరియు 2. వసుచరిత్ర 2–19.

# వసుచరిత్రలోని కథాంతరములు

వసుచరిత్రలో వసురాజు శుక్తిమతీనదిని రక్షించుటకై కోలాహలపర్వతము నెగమీటు వృత్తాంతమున కవి యొక కథాంతరమును దర్శించినాడు. ఇంద్రుడు వృత్రాసురునియొక్క పర్వతదుర్గమును తన వజ్రాయుధముచే భేదించి నీటిని విడుదల గావించుట ఋగ్వేద ప్రసిద్ధమైన కథ. మరియు ఇంద్రుడు తన వజ్రాయుధముచేత నగములను భేదించి వాని గర్వభంజనము గావించిన వృత్తాంతము ఋగ్వేద, పురాణ ప్రసిద్ధమైనది. ఈ రెండు వృత్తాంతములను మనమునందుంచుకొనియే రామరాజభూషణుడు వసురాజు, కోలాహల పర్వతభంజనమును గావించు వృత్తాంతమును మూలముకన్న పెద్దగాచేసి చెప్పినాడు. కావ్యారంభమున ప్రథమాశ్వాసము 148 వ వచనమున వసురాజునందు శ్లేష సహాయమున ఇంద్రత్వారోపణ గావించినాడు. మరియు చాలాచోట్ల వసురాజునకు ఇంద్రత్వారోపణము చేయుటచేత, వసురాజు పర్వతము నెగమీటినపుడు ఇంద్రుని పర్వతభంజన వృత్తాంతమప్రయత్నముగ స్ఫురించి వసురాజు ఇంద్రుని వంటి పరాక్రమవంతుడనుట తేటతెల్లమగుచున్నది. కాని వసుచరిత్రకారుడు వసురాజు కాలికొనగోటితో పర్వతమును మీటుటను ఇంద్రుడు వజ్రాయుధముచే పర్వతభంజనము గావించుటకన్న నధికముగా గణించినాడు— "లేగవ్వ మీటిన నూటిన్ బోటవ్రేలిగోట నెగమీటెం గుంతితాహార్యశాసనగర్వాగ్రహుడై బలారి తనతో సఖ్యంబు పాటింపగాన్" (1-119) అని కవి వర్ణించినాడు. కథలో ఇంద్రుడు కూడ స్వయముగా దీని నంగీకరించినాడు—

> "ప్రబలబలగోత్ర హృతికి నీపద నఖంబె
> చాలు శతకోటి సాధనంబేల మాకు" (వ. చ. 3-8) మరియు

స్వయముగా నాతనిని "వసుక్ష్మామండలాఖండలు" డని (3-6) అంగీకరించినాడు. వసురాజు పరాక్రమము ముందు తన పరాక్రమమెంతటిదని ఇంద్రుడు సిగ్గిల్లినని యీ క్రింది పద్యమున చెప్పబడినది—

"ఘనుడత డేగుదెంచి సరిగద్దియనుండ నగారిశైలఖం
డన కథ చారణాళి పొగడన్ నిజసన్నుతి కోసరించు నే
ర్పునఁ దలవంచి పీఠతట రూఢమణిన్ బొటనవ్రేలమీటు న
య్యనఘుడు కొండమీటిన మహాద్భుత కృత్యము దెల్పుకైవడిన్"
వ.చ. 1–222.

ఇంద్రుడు రాక్షసశిక్షణాసమర్థులైన భూమండలాధిపతులతో సఖ్యము పాటించుట పురాణకథలందు కనుపించును. సంస్కృత నాటకములలో కాళిదాసుయొక్క విక్రమోర్వశీయమున పురూరవుడు, ఇంద్రునికి సహాయముగా పోయి దుష్టశిక్షణ గావించుట చెప్పబడినది. ఇట రామరాజభూషణుడు అట్టి వృత్తాంతముల నాధారముగాగొని మూలమునలేని ఇంద్రవసురాజుల సఖ్యమును కల్పించినాడు. అట్టిచో ఇంద్రుడు, వసురాజును తనకన్న నెక్కుడు పరాక్రమవంతునిగా తలంచునట్టి, యెక్కడకానరాని అద్భుతకల్పనను వసుచరిత్రకారుడు చేసినాడు.

ఋగ్వేదమున పేర్కొనబడిన వృత్రాసురుని రామరాజభూషణుడు 4 ఆశ్వా. 12వ పద్యమున స్మరించుటచే నాతనికా వృత్తాంతపరిచితిస్ఫురణ కలదని స్పష్టమగుచున్నది. ఋగ్వేదమున చెప్పబడిన ఇంద్రవృత్రాసుర వృత్తాంతమున రూపకాలంకారములో వర్షాకాలీన మేఘవర్ణన చేయబడినదనియు అట వృత్రుడనగా మేఘమనియు నిరుక్తకారులమతము. ఈ వృత్రుడను మేఘము, పణులు గోవులను బిలములో దాచిపెట్టినట్లుగా, జలమును బంధించెను. జలభరితమగు నల్లని మేఘము, అన్ని దిశలను ఆచ్ఛాదించి అంధకారమును వ్యాపింపజేసెను. (ఈ అంధకార వ్యాప్తిని గురించియే రామరాజభూషణుడు 4 ఆశ్వా. 12వ పద్యమున ప్రసంగించియున్నాడు.) అపుడు ఇంద్రుడు విద్యుత్ ప్రహారములతో వృత్రరూప మేఘమును భేదించి జలములకు ముక్తినొసంగెను. జలవిద్యుత్తుల మేళనమున వృష్టికురియుట సంభవించును.[1] అంతేగాక వృత్రుడను మేఘమావరించినపుడు చీకటి వ్యాపించును. సూర్యతేజస్సు కానరాదు. ఇంద్రుదపుడు మరుత్తుల సహాయమున మేఘమును చెదరగొట్టి భూమికి వెలుగు

1. ఋగ్వేదము 1 మండలము 32 సూక్తము 10, 11 ఋక్కులు.

నొసంగును.[1] ఇట్టి ప్రాకృతిక సంఘటనలను వేద ఋషులు, ఇంద్రాసురులకు జరిగిన యుద్ధముతో ముడిపెట్టి వర్ణించి రంజకత్వము కావించిరి. వసుచరిత్ర కథలో కోలాహలుడు వృత్రరూపుడు. ఆతడు శుక్తిమతీ జలమును నడ్డగించెను. అప్పుడు లోకమున జలప్రళయరూపమగు అంధకారము వ్యాపించెను. ఇంద్ర రూపుడగు వసురాజు తనపాదనఖాంచలరూప విద్యుత్‌రేఖాసహాయమున వృత్ర రూప కోలాహలుని భంజించి శుక్తిమతీజలములకు విముక్తి నొసంగెను అనగా శుక్తిమతినదీజలములు నిరాటంకముగా ప్రవహించునట్లు చేసెను. ప్రజా సుఖ రూప సూర్యతేజస్సును వ్యాపింపజేసెను. ఈ విధముగా ఋగ్వేదకథను వసు చరిత్రకారుడు తన కావ్యమున అంతర్గర్భితమొనర్చి ప్రకృతకథలో కథాంతరము నుద్యోపింపజేసినాడు. వృత్ర సంహారగాథను వసుచరిత్రలోని కథకు సమన్వ యించుకొనుట వలన దీనియందు "తేజోగాథ, జలగాథయు నేకకాలమందు సంప్రాప్తమగుచున్న" వని శ్రీ సుప్రసన్నాచార్యులగారి యభిప్రాయము.[2]

ఋగ్వేదమున సూర్యుడు రసరూపజలములను గ్రహించువాడని చెప్పబడినది.[3] వసురాజుయొక్క పాద (కాలు అని కిరణమని రెండర్థములు) ప్రసారముచే శుక్తిమతి నదీజలములు తీసిపోయెనని 2 ఆశ్వా. 154 పద్యమున వర్ణించి కవి పై ఋగ్వేద వృత్తాంతమును వ్యంగ్యమొనర్చినాడు. దీనిచే వసు రాజు ఇంద్రరూపునిగనేగాక సూర్యరూపునిగను ప్రత్యక్షమగుచున్నాడు.

వేదపురాణములందు సత్యకథలను, చారిత్రకసంఘటనలను ప్రతీక రూపమున ( symbolic ) చెప్పుటయు సంభవించుచుండును. భాగవత పురాణమున పృథుమహారాజు కథ యిట్లు చెప్పబడినది- పృథురాజ్యములో గొప్ప కరవేర్పడినది. ప్రజలు కరవుతో బాధపడుచుండగా భూదేవియాజ్ఞానుసారము పృథువు గోరూపమునన్నున్న భూదేవికి మనువును వత్సముగాచేసి భూమినుండి సకలౌషధములను పితికెననియు, పర్వతముల నన్నింటిని భేదించి పుడమిని

1. ఋగ్వేదము 2 మండలము 11 సూక్తము 29 ఋక్కు.
2. రామరాజభూషణుని కృతులు, వ్రాతప్రతి పుట 198.
3. "ఆదత్తే రసాన్, ఆదత్తే భాసమ్ జ్యోతిషామ్, ఆదిప్తో భాసేతి వా అదితేః పుత్ర ఇతి వా"- నిరుక్తము. 2 అధ్యా. 4 పాదము.

సమముగా జేసెననియు చెప్పబడినది. అనగా అప్పుడిట మనము పృథుమహారాజు అరణ్యభూములను మట్టమొనర్చి సాగుచేయించి సమస్త సస్యములను పండించి ప్రజల ఆహారబాధను నివారించెనని చెప్పకొనవచ్చును ఇదియె చారిత్రక సత్యమైయుండును. ఇట్టి పృథుమహారాజుకథ రామరాజభూషణునకు పరిచితము. దానిని ఇంద్రుని ముఖమున నిట్లు స్మరింపజేసినాడుకూడ—

> "నరయ నఖాపసారిత రసాధర! యీ ధరణీంద్ర కోటిలో
> నరయుదుఁ బెద్దగాఁ బృథునరాధిపుఁగొంత తదీయశక్తి నీ
> చరణ నఖాంచలంబునకు సాటియే.... వ.చ. ౩-7

పృథుమహారాజును కొంత గొప్పగా ఇంద్రుడెంచువాడట. ఇప్పుడా తడు వసురాజుయొక్క నఖాంచలమునకును సాటిరాడట! ఏవిషయమున వారిద్దరకు ఇంద్రుని నోట కవి పోలికను చెప్పినాడు? వారిద్దరికేవిషయమున సంబంధసామ్యము కలదు? పృథుమహారాజు గావించినట్టి ప్రజాహిత కార్యమును వసురాజేమైన సాధించెనా? పరిశీలింతము- వసురాజు రాజ్యములోనికి శుక్తిమతీ నది ప్రవహింపకుండ కోలాహలపర్వతము అడ్డముగా నుండెననియు (దానినే కవి "కొలాహలాఖ్య నగాధీశుడు ప్రాలి శుక్తిమతినాగన్" (1-119 అనియు, కోలాహలుడు శుక్తిమతి సౌందర్యముచే మోహితుడై బలాత్కరించెననియు, వర్ణించియున్నాడు) ఆ రాజ్యములోని ప్రజలు నీటి సౌకర్యము లేకపోవుటచే సస్యాదులు పండక బాధపడుటచే "నదీబంధనిపుణు" డైన వసురాజు కోలాహల పర్వతమును పగులగొట్టించి మార్గమేర్పరచి శుక్తిమతినదీజలమును తన రాజ్యములోనికి తెప్పించెననియు, గిరికయను పేరుగల కాలువనొకదానిని త్రవ్వె ననియు, కాలువ గిరిముఖముగా వసురాజ్యమున ప్రవేశించుటచే దానికి గిరిక యను పేరు తగినదనియు, ఆ కాలువ వసురాజుచేత త్రవ్వబడి, వసురాజ్య మున ప్రవహించుటచేత దానికి వసురాజు అధిపతిగా పేర్కొనబడుట సమంజస మనియు చెప్పవీలగుచున్నది. రామరాజభూషణుడు గిరికను కాలువగా కాకున్నను ఒక సెలయేరుగా శ్లేషలోసూచించియున్నాడు-

> ఆ కోలాహల శైలసంభవ రసవ్యాకృద్ధసాళి ప్రేయ
> త్నైక ప్రస్థితయై ప్రతిక్షణ సభంగాదాళ సంచారయై

వ్యాకీర్ణాంబరఫేనయై పిహిత వక్త్రాబ్జస్ఫురద్వేణియై
శ్రీకళ్యాణగుణార్ణవుం డలర వచ్చె న్నూత్న దాగంబునన్.

వ.చ. ౬-75.

ఈ శుక్తిమతీజలముచే సస్యసమృద్ధిని పొందినవారై ప్రజలు సుఖజీవనమును గడిపియుందురు. ఆ కారణముచేతనే కవి యిటు పృథుచక్రవర్తిని స్మరించి, వసురాజు గావించిన ప్రజాహితకార్యమును పాఠకులకు వ్యంగ్యమొనర్చినాడు.

ఈ విధముగా వసురాజుయొక్క పర్వత భంజన వృత్తాంతము వేద, పురాణ కథలను వ్యంగ్యరూపమున పాఠకుల హృదయపటలమున ప్రతిబింబింపజేయుచు "పరమాద్భుత కలనావినివేశము" (2-157) ను కలిగింప సమర్థమై యున్నది. ఇట్టిసామర్థ్యముచే వసుచరిత్రలోని కథ మనుచరిత్రలోని కథను మించి యొప్పుచున్నదని చెప్పవలయును.



## కథాసంవిధానమున పూర్వకవుల ప్రభావము

పెద్దన రామరాజభూషణులు తాము స్వయముగా కల్పించిన కథా సన్నివేశము లందు పూర్వకవుల కథాచ్ఛాయలు కనుపించుచున్నవి. పూర్వకవుల ననుకరించుట పెద్ద దోషము కాదు "కవి రనుహరతిచ్ఛాయామ్" అని రాజశేఖరుడు కవులకు ఇతరకవుల ననుసరించు స్వేచ్ఛను ప్రసాదించినాడు.

ఒక కావ్యమున గల కథాసంవిధానమును, సన్నివేశముల ననుకరించుట సంస్కృత నాటకములందు విరివిగా కనబడును. భాసుని నాటకచ్ఛాయలు కాళిదాసుపైనను, కాళిదాసుయొక్క నాటకచ్ఛాయలు భవభూతి, హర్షదేవాది కవులలోను కనుపించుచున్నవి. అభిజ్ఞానశాకుంతలమున దుష్యంతుడు చెట్టుచాటున నుండి శకుంతలాదుల సంభాషణలను వినుట వంటి సన్నివేశము భాసుని స్వప్నవాసవదత్తమున పద్మావతి చేటి, వాసవదత్తలతో కూడినద్రా కుంజమున దాగుకొని ఉదయన, విదూషకుల సంభాషణలను వినుట కనుకరణ యని యనబడుచున్నది. తరువాత అనేక నాటకకారులీ అభిజ్ఞానశాకుంతలము నందలి సన్నివేశమును తమ కృతులందనేక రీతులుగా అనుకరించినారు. విక్రమోర్వశీయము మరియు మాళవికాగ్నిమిత్రమున నాయకులగు పురూరవాగ్నిమిత్రులు తమ నూతన ప్రేమను ప్రథమ భార్యకు తెలియకుండ జాగ్రత్తపడుట తరువాత అనేక నాటకములందు గోచరించును.

ఈవిధముగా నాటకములందేకాక కావ్యములందును కథాసంవిధానానుకరణలు కానవచ్చుచున్నవి. భారవిమాఘులు దీనికి మంచి యుదాహరణలు. భారవి కిరాతార్జునీయములోని కథాక్రమము ననుసరించుచు మాఘుడు శిశుపాలవధలోని కథాక్రమమును కూర్చెననుట సువిదితమే.

ఆంధ్ర సాహిత్యమునను కథాసంవిధాన సన్నివేశానుకరణలు కనబడుచున్నవి. ప్రబంధయుగమునకు పూర్వము ఆంధ్రసాహిత్యమున కవులు

అనువాదములను చేపట్టిరి. కావున వానిలో నిద్దీ అనుకరణల కవకాశములేదు. స్వతంత్ర కావ్యములను రచించుటతో నిట్టి అనుకరణ కవకాశమధికమయ్యెను. స్వతంత్ర కావ్య రచనలు గావించిన ప్రబంధకవులు పూర్వకవుల కావ్యముల ప్రభావమునకు లోనై కొన్ని సన్నివేశ కల్పనలను గావించినారు.

పెద్దన మనుచరిత్ర కథాసంవిధానమును చాలమట్టుకు మార్కండేయ పురాణము నుండి యే గ్రహించినాడు. అయినను పెద్దన గావించిన కొన్ని సూక్ష్మ కథాకల్పనలలో పూర్వకవుల ప్రభావము గోచరించుచున్నది—

1) పెద్దన మనుచరిత్రలో రెండు సంవాదములు కలవు. ఒకటి ప్రవరసిద్ధ సంవాదము. రెండవది ప్రవర—వరూథినీ సంవాదము. ఈ రెండును మూల కథలో నున్న ఘట్టములే. కాని పెద్దన ఈ ఘట్టములందు నూతన సంభాషణాచమత్కారమును ప్రకటించి కథను చాల బిగిగా నడిపినాడు. ఈ సంభాషణలలో చక్కని నాటకీయతనుగూడ ప్రదర్శించినాడు. మాత్లాడు పాత్రల హావభావాదులను వర్ణించి ఆయాపాత్రలను పాఠకుల కనులముందు నిల్పినాడు. ఇవి యాతని ప్రతిభకు తార్కాణములు. ప్రసిద్ధసంవాదములు సంస్కృత కావ్యములందనేకములు కలవు. ఉదాహరణకు కాళిదాసు రఘువంశము లోని రఘు—ఇంద్రుల సంవాదము, కౌత్స—రఘుల సంవాదము, సింహ—దిలీపుల సంవాదము మరియు కుమారసంభవమున పార్వతీ—మాయావటుల సంవాదము — ఇవి కొన్నిమాత్రమే. ఈ కావ్యములను పెద్దన చదివినాడు. ఈసంవాద సన్నివేశముల నాకళింపుచేసికొనినాడు. కిరాతార్జునీయములో వ్యాసుడు పాండవుల యొద్దకు వచ్చుట, వ్యాసునిచేత ప్రేరితుడై అర్జునుడు హిమాలయమునకేగు సన్నివేశముల యొక్క ప్రభావము మనుచరిత్రలోని ప్రవర సిద్ధుల సంవాదము, ప్రవరుని హిమాలయసందర్శనాకాంక్ష లందు కనబడును. కిరాతార్జునీయ, మనుచరిత్రలందలి కథలలో సామ్యము లేకున్నను వీనియందలి సన్నివేశములలో పైనజెప్పినట్లుగా కొన్ని సామ్యములు కనుపించుచున్నవి. అందుచేత డా॥ పల్లా దుర్గయ్యగారు "ప్రథమాంధ్ర ప్రబంధనిర్మాత యగు పెద్దనామాత్యుడు ప్రథమ సంస్కృతమహాకావ్య నిర్మాతయగు భారవి మహాకవి కిరాతార్జునీయము నాదర్శముగా గ్రహించె" నని అభిప్రాయపడినారు.[1]

1. ప్రబంధ వాఙ్మయ వికాసము పుట 297 సంపుటము 1.

2) కాళిదాసు శాకుంతలములో దుష్యంతుని వేట, ఆతడు శకుంతలను తుమ్మెద బారినుండి రక్షింపబూనుకొను ఘట్టములు కలవు. కాళిదాసు మహాభారతముననుసరించి దుష్యంతుడు వేటాడినట్లు చిత్రించెను. దీనినే పినవీరన గ్రహించి శృంగార శాకుంతలమున దుష్యంతుని వేటను విస్తారముగా వర్ణించినాడు. ఆతడు వేటాడుచుపోయి ఆశ్రమ ప్రాంతమున ప్రవేశించినపుడు శుభ సూచకమగు శకునము కలిగెను. తరువాత శకుంతలను జూచి ఆమెను తుమ్మెద బారినుండి రక్షింప బూనుకొనెను. ఈ సన్నివేశముల ననుసరించి పెద్దన మార్కండేయ పురాణమున లేకున్నను స్వరోచిని వేటకు పంపినాడు. ఆ వేటను పినవీరనాదుల ననుసరించి విస్తారముగా వర్ణించినాడు. వేట తరువాత శుభ సూచకములగు కొన్ని శకునములు గోచరించినవి. ఇంతలో ఒకానొక స్త్రీ యార్త నాదము వినబడెను. ఆ స్త్రీని రక్షించుటకై స్వరోచి పోవును. ఆ స్త్రీ పేరు మనోరమ. స్వరోచి పోయి రాక్షసునిబారినుండి ఆమెను రక్షించుటకుపూనుకొనెను. ఈ విధముగా శాకుంతలమును మనసులోనుంచుకొని పెద్దన స్వరోచి మనోరమల సమాగమమును కల్పించినాదనిపించును.

3) మను చరిత్రలో ముని మనోరమను శపించి నాగబెత్తమును గొని బాదుచుండగా ఆమె సఖులు విభావసీ కళావతులు "శాపనిమిత్తమై తపమా? శాంతిపరులు నీ చరిత్రకిక నేమనువారు. వార్ధక్యమున కోపము మానని ముని మునియా ? బ్రాహ్మణుడవగుటచేత బ్రతికిపోతి"వని కోపముతో కఠినముగా మునిని మందలించిరి. మారనను కొంత అనుకరించినను పెద్దన విభావసీకళావతుల కోపమును కొంచెమెక్కుడుగానే వర్ణించినాడు. పినవీరన శాకుంతలమున నిట్టి సన్నివేశమొకటి కనుపించుచున్నది దుర్వాసుడు శకుంతలను శపించగా అనసూయా ప్రియంవదలు ఆతనితో పలికిన మాటలు కాళిదాసు రచనలకు భిన్నముగా కఠినముగా కన్పట్టును. "అనుకంపకుఁగాక కినుక కిది లక్ష్యంబే", "ఇంతయలుక వహింపగ నేమి గలదు", "అనటి పండొల్వ నేటికినినుపగోరు" లనియు "కిన్కమీరాక పట్టు నన్నదిలించినం, జాలదేకట! తోటకూర కుఁజంద్రహాసముఁదెత్తురే" అని కొంత కినుకతో పలికిరి. (శృం.శా 4 ఆశ్వా 46-48) దీనిని దృష్టిలో నుంచుకొని విభావసీ కళావతులకు మనోరమపైగల ప్రేమను ప్రకటించుటకును, ముని వారలకు శాప

మీయగల అవకాశము కల్పించుటకును పెద్దన, వారు కఠినముగా మాట్లాడినట్లు రచించినాడు.

4) అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు హస్తినానగరికి తిరిగి పోవుచు శకుంతల యొద్ద సెలవు గైకొనుట సూచనగా కలదు. పినవీరన కొన్ని పద్యములలో దుష్యంతుడు శకుంతల నూరడించిపోవుటను వర్ణించినాడు. (శృం.శా. 3 ఆశ్వా 242–246). పెద్దన దీని నాదర్శముగా గ్రహించి మాయాప్రవరుడు వరూథిని నూరడించి యామెచేత ననిపించుకొని పోయెననీ మార్కండేయపురాణమున నొక్క వాక్యమున గల విషయమును విస్తరించి రచించినాడు.

ఈ విధముగా పెద్దన మనుచరిత్ర కథా సంవిధానమున కాళిదాసు భారవ్యాదుల యొక్కయు, పినవీరన శాకుంతలము యొక్కయు ఛాయలు కన బడుచున్నవి.

రామరాజభూషణుడు మహాభారతము నుండి గ్రహించిన కథా సంవిధానము చాలా తక్కువ. అతడు ప్రబంధములోని సన్నివేశముల నన్నిటిని స్వయముగానే కల్పించుకొనినాడు. ఈ సన్నివేశ కల్పనలందు పూర్వ కవుల ప్రభావము ప్రస్ఫుటముగా కనిపించుచున్నది.

1) అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు ఆశ్రమ ప్రాంతమున ప్రవేశించి, శకుంతల, అనసూయ ప్రియంవదల మధురాలాపముల చేత నాకర్షింపబడి చెట్టుచాటున చేరి వారి సంభాషణములను వినును. తుమ్మెద శకుంతలను బాధింపగా ఆమెను రక్షించు నెపముతో వారి ముందుకు పోవును. ఆ స్త్రీలత నిని గాంచి సంభ్రమము నొందుదురు. తరువాత వారాతనిని సత్కరింతురు. అపుడు దుష్యంతుడు అనసూయాప్రియంవదల ముఖమున శకుంతల జన్మ వృత్తాంతమును తెలిసికొనును. ఇంతలో అరణ్యగజము చెలరేగి ఆశ్రమ ప్రాంతము సమీపించుట చేత శకుంతలాదులు దుష్యంతుని యొద్ద సెలవు తీసుకొని నిష్క్రమింతురు. శకుంతల యేదో యొక మిషచే వెనుకకు తిరిగి దుష్యంతుని చూచుచు నేగును.

వసు చరిత్రలో రామరాజభూషణుడీ అభిజ్ఞాన శాకుంతలము నందలి ప్రథమాంక ఘట్టము ననుకరించుచు చక్కని సన్నివేశమును కల్పించినాడు. వసురాజు వేటకు పోయినట్లుగా కాక నర్మసఖునితో వన విహారమునకు పోయి నట్లుగా చెప్పెను. అట కిన్నెర పక్షుల జంట ఆసన్న శుభమును సూచించును. కోలాహల పర్వతప్రాంతమున తిరుగు వసురాజు మధురగానము చేత నాకర్షింప బడును. ఎవరుపాడుచున్నారో కనుగొనిరమ్మని నర్మసఖుని పంపును. నర్మసఖుడు వీణ వాయించుచున్న గిరికాదులను చూచివచ్చి వసురాజునచటికి తీసుకొని పోవును విదూషకుడు యోగి వేషమున యాస్త్రీల ముందుకేగి వారి సత్కారము నందుకొని వారి సఖి గిరిక వృత్తాంతము నడుగును. అప్పుడు గిరిక యొక్క సఖి మంజువాణి గిరికా జన్మవృత్తాంతమును వర్ణించి చెప్పుచుండగా తీవెలమాటున నున్న వసురాజు వినును. విదూషకుడు 'మజ్జా' యని అరవగా వసురాజా స్త్రీల ముందు కేగుట కిదే మంచియదనని వారి సమక్షమునకు పోవును. దీనినంతయు శాకుం తలములోని నాయికానాయక సమావేశము ననుసరించి రామరాజభూషణుడు కల్పన గావించినాడని చెప్పవలెను. అట వారికి అరణ్యగజము ఎడబాటును కలి గించగా నిట వసుచరిత్రలో కలహంసి వచ్చి గిరికను తోడ్కొని తీసుకొని పోవును అపుడు శకుంతల మాదిరిగానే గిరికయు అనురాగవతియై, నివర్తి మించుచు ఏదో మిషతో వసురాజును చూచుచు పోవును.

2) వసుచరి తలో మధురగానము చేత నాయకుడాకర్షింపబడును. ఆ మధురగానము నాయకుని హృదయమున నొక యనురాగభరమును పెంచును. హర్షుని నాగానంద నాటకమున ప్రథమాంకమున నిట్టి ఘట్టము కలదు. అందు నాయకుడగు జీమూతవాహనుడు, విదూషకునితో కూడిన వాడై సమిధ, కందమూల ఫలబాహుళ్యము గల మలయ పర్వతమునకు పోయి యచట మలయవతి వీణాగానమును వినును ఆ అద్భుత గానమాధుర్యముచేత నాక ర్షింపబడి ఆతడాగానము వినబడు దిశగా పోయి దేవాలయమున సఖీ పరివేష్టి తయై వీణ వాయించుచున్న నాయిక మలయవతిని గాంచును. "నను హృదయ స్థితో వరో దేవ్యాదత్తః" అను చేటి మాటలను మిషగా గ్రహించి నాయకుడు, విదూషకుడును ఆ స్త్రీల ముందుకు ప్రవేశింతురు. సంగీతప్రియుడగు రామరాజ భూషణుని ఈ ఘట్టము ఆకర్షించి యుండును. కావున వసుచరిత్రలో నట్లే గానము ద్వారా నాయికానాయక సమావేషమును కల్పించినాడు.

3 వసుచరిత్ర చతుర్థాశ్వాసములోని మంజువాణి ఆకాశమార్గమున అధిష్ఠానపురమేగి తిరస్కరిణీ విద్య సహాయమున అదృశ్యమై యుండి రాజభవనమున ప్రవేశించి దౌత్యము నడుపు ఘట్టము నైషధములో నలుడు తిరస్కరిణీ విద్యా ప్రభావమున దమయంతియంతఃపుర ప్రవేశము గావించుటను తలపించుచున్నది. దమయంతి వినోదము కొరకు నల వేషము ధరించిన సఖుల నడుమ నలుడు నిలచి ఇంద్రాదుల యొక్క దూతలకు దమయంతి సమాధాన మొసంగుటను విని, తద్ద్వారా ఆమె తనయందు గాఢానురాగము కలదను విషయ మును తెలిసికొనును. మంజువాణి వసురాజు పడుకొనిన మంచపు రత్నపాలిక లలో నొక పాంచాలికగా నిలచి, గిరిక ఆనవాలుగా ఇచ్చిన రత్నహారమును వసురాజుపైకి విసిరివేయును. ఆ మణిహారమును వసురాజు గిరికదగా గుర్తించి దానిని ప్రియురాలి క్షేమమడిగి, తన అనురాగమును ప్రకటించి విరహమును చెందును. గిరికపై వసురాజునకు గల అనురాగమెట్టిదో మంజువాణి గ్రహించును. శ్రీహర్షుని నైషధములోని నలుని రాయబార ఘట్టము ననుసరించుచు రామరాజ భూషణుడీ మంజువాణి దౌత్య సన్నివేశమును అత్యద్భుతముగా కల్పన గావించి నాడు. శ్రీనాథుడు తన శృంగారనైషధమున అనువదించక విడిచిన కొన్ని శ్రీహర్షుని కవిత్వములోని విశేషములను రామరాజభూషణుడు తన హరిశ్చంద్ర నలోపాఖ్యానమున ననువదించుటకు పూనుకొనినాడని విమర్శకులు తలంచిరి[1]. శ్రీహర్షుని కవితా ప్రౌఢత్వమును గూడ రామరాజభూషణుడు తన కవితలో రుచి చూపించినాడు. అదే విధముగా శ్రీహర్షుని మీద గల అభిమానముతో ఈ ఘట్టము ననుకరించుచు వసుచరిత్రలో రామరాజభూషణుడట్టి ఘట్టమునే కల్పించి కల్పనా చాతుర్యమును కొంత జోడించి అద్భుత సృష్టి గావించినాడు.

4) వసుచరిత్రలో పంచమాశ్వాసమున ఇంద్రాదులు గిరిక నడుగు గుటకై కోలాహలుని యొద్ద కేగు కథా కల్పనలో కాళిదాసుని కుమారసంభ వములో సప్తఋషులు గిరిజను శంకరునకడుగుటకై హిమవంతుని కడ కేగు సన్నివేశమను రామరాజభూషణుడనుకరించి నాడని చెప్పవలెను. కుమార సంభవమున అరుంధతి పెద్ద ముత్తైదువగా సప్తఋషుల వెంట పోయినది. రామరాజభూషణుడు ఇంద్రాదుల వెంట గంగాదేవిని పంపినాడు. నదియగు

1. వసుచరిత్ర విమర్శనము. పుట 95.

శుక్తిమతి యొక్క పుత్రికై నడుగుటకై నదీమతల్లి వెళ్ళినట్లుగా చెప్పి చక్కని ఔచిత్యమును పాటించినాడు.

5) అభిజ్ఞాన శాకుంతలమున చతుర్థాంకమున శకుంతల అత్త వారింటి కేగుచుండగా ఆమె పెంపుడు తండ్రి కణ్వుడు అత్తవారింటిలో నెట్లు మసలుకోవలెనో బుద్ధులు చెప్పను. మరియు ఆమె ఎడబాటునకు సామాన్య గృహస్థువలె దుఃఖించును. దీని ననుసరించియే రామరాజభూషణుడు గిరికను అత్తవారింటికి పంపుచు ఆమె తండ్రి కోలాహలుడు బుద్ధులు చెప్పినట్లు గాను తల్లియగు శక్తిమతి ఆమె ఎడబాటునకు స్త్రీ సహజమైన హృదయముతో దుఃఖించునట్లుగాను రచించినాడు.

6) అభిజ్ఞాన శాకుంతలమున గల అనసూయాప్రియంవదల పాత్రలను దృష్టిలో నిడికొని రామరాజభూషణుడు వారిద్దరిలోని చాతుర్యమును కలియబోసుకొనిన మంజువాణి పాత్రను సృష్టించినాడు. కాళిదాసు శకుంతలా జన్మవృత్తాంతమును అనసూయా ప్రియంవదల ముఖమున వినిపించునట్లుగానే రామరాజభూషణుడును మంజువాణీ ముఖమున గిరికా జన్మవృత్తాంతమును చెప్పించినాడు.

7) నైషధ కథననుసరించియే రామరాజభూషణుడు వసురాజు నుద్యానవన విహారమునకు పంపినాడు ఉద్యానవనమున వృక్షలతాదులు వసురాజునకు స్వాగతమొసంగుట, అచటి రామణీయకమునకానందపడుట మొదలగు రామరాజభూషణుని కల్పనలోని ప్రౌఢత్వము, చమత్కృతి నైషధమును స్మరింపజేయును.

ఈ విధముగా రామరాజభూషణుని వసుచరిత్ర ప్రబంధములోని కథాసంవిధాన, సన్నివేశ కల్పనలందు సంస్కృత శాకుంతల, కుమార సంభవ నైషధ నాగానందముల యొక్క ప్రభావము గోచరించుచున్నది. ఇక తెలుగు కావ్యములలోని కథాసంవిధాన, సన్నివేశ కల్పనల యొక్క ప్రభావము వసు చరిత్రలో లేదని చెప్పవలెను. రామరాజభూషణునిపై ఇతర పూర్వాంధ్ర కావ్యముల ప్రభావ మీ విషయమున గోచరము కాకున్నను, ఆంధ్రకవితాపితామహుడు పెద్దనామాత్యుని మనుచరిత్రలోని కథాసంవిధాన, సన్నివేశముల యొక్క ప్రభావము మాత్రమత్యధికముగా కనబడుచున్నది.

**

# కథాసంవిధానమున వసుచరిత్రపై మనుచరిత్ర ప్రభావము

"ఆద్య సత్కవిధక్ వావిరి పుట్టు రత్నము"లని రామరాజభూషణుడు పెద్దన మనుచరిత్రను విమర్శించెనని ఐతిహ్యమున్నను, రామరాజభూషణుడు మనుచరిత్రలోని కథాసంవిధానమును, సన్నివేశముల ననుకరించి వసుచరిత్రను రచించిన తీరు గమనించిన, అతడు పెద్దన కావ్యము చేత నెంత ప్రభావితు డైనాడో తెలుసుకోవచ్చును.

మనుచరిత్ర వసుచరిత్రలలోని కథలకు నెచ్చటపొత్తులేదు. మనుచరిత్ర కథాబాహుళ్యము గలది. వసుచరిత్ర వర్ణనాబాహుళ్యము గలది. రామరాజభూషణుడు మహాభారతమునుండి గ్రహించిన కథ తక్కువ, స్వకల్పనలు యొక్కువ. అట్లు తాను కల్పించుకొనిన కథా సంవిధాన సన్నివేశములందు మను చరిత్రలోని కథాసంవిధాన సన్నివేశములచేత ప్రభావితుడై రామరాజభూషణుడు వసుచరిత్రను రచించినాడు పొతుకుదురని కథలోగూడ సామ్యముండుటను బట్టియే రామరాజభూషణునకు పెద్దన ననుకరింపవలయునను ప్రగాఢమైన కోరిక కలదనుట స్పష్టమగు చున్నది. ఇట్టి అనుకరణ, ఈర్ష్య గలిగిన వాడు చేయుపని కాదు. పెద్దన కల్పనలు తన కతిరమణీయములనిగోచరించుట చేతనే రామరాజభూషణుడు గ్రహించి తన శైలితో మెరుగులు దిద్దినాడని చెప్పవలెను.

మనుచరిత్రలోని ద్వితీయాశ్వాసమున గల వరూధినీ ప్రవరుల సంవాద ఘట్టము సమకాలీన కాలముననే సహృదయ ప్రశంసితమై మన్ననలను పొందియుండును. ఈ నాటికిని మనుచరిత్రలో నా ఘట్టము మధురమైన రస గుళికగా చెప్పబడుచున్నది, రామరాజభూషణుడీ ఘట్టముచేత మిక్కిలి యాక ర్షింపబడి యుండును. అందుచేతనే మూలమున నొక్క వాక్యమున చెప్పబడిన శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతమును వరూథినీప్రవర సంవాద ఘట్టము నను కరించుచు తీర్చిదిద్దినాడు. కోలాహలుడు శుక్తిమతి నడ్డగించినాడనుట మాత్రము మూలమున చెప్పబడగా శృంగార వైరాగ్యములకు ఘర్షణను కల్పించి

వరూథినీ ప్రవర సంవాద ఘట్టము ననుకరించుచు కోలాహల శుక్తిమతుల యొక్క పాత్రలను రూపకల్పన గావించిన రామరాజభూషణుని ప్రతిభ అత్యద్భుతమైనదని చెప్పవలెను. పెద్దన శృంగార శాంతములకు ఘర్షణకల్పించి శాంతమునకు విజయమును కల్గించినాడు. వసుచరిత్రలో కోలాహలుడు వరూథిని వంటివాడు. సాత్త్వికురాలైన శుక్తిమతి ప్రవరుని వంటిది. ఇట శృంగార వైరాగ్యములకు కలిగిన ఘర్షణలో ఉద్ధతుడైన కోలాహలునిది పైచేయి కాగా వసురాజు చేత నాతడెగమీటబడినాడు. కోలాహలుడు తన దుష్కార్యమునకు శిక్షను పొందినాడు. మరియు ఈ ఘట్టమున రామరాజభూషణుడు గ్రహించిన నాయికానాయకులు నదీ పర్వతములు, నీనికి జరిగిన వివాదము నాతడొక స్త్రీ పురుషులకు జరిగిన వివాదము వలె శ్లేష వైభవమున ధ్వనింపజేయుచు అపూర్వ చమత్కారమును సృష్టించినాడు కాదంబర్యాది కావ్యములలో అనేక విధములైన శ్లేషలు కలవు. కాని అచేతనములు చేతనములవలె ధ్వనింపజేయగల కథాఘట్టములందు లేవు. ఇట్టి అపూర్వ సన్నివేశ కల్పనను రామరాజభూషణుడు పెద్దన ప్రవర వరూథినీ సంవాద ఘట్టము ననుకరించుచు కావించినను గురువును మించిన శిష్యుడని యనిపించుకొనినాడు.

ఈ ప్రధాన సన్నివేశముననేగాక రామరాజభూషణుడు మనుచరిత్రలో గల అనేక కథాఘట్టముల ననుసరించుచు వసు చరిత్రలో వివిధకథా ఘట్టములను అల్లినాడు. ఆ క్రమమును క్రింది పట్టికలో పరిశీలింతము—

| | | |
|---|---|---|
| 1. | వసురాజునొద్దకు వనపాలకులు వచ్చి వన వర్ణన కావించి వన దర్శనాకౌతుకమును కలిగింతురు. | స్వరోచినొద్దకు ఆటవికుడువచ్చి అరణ్య మృగములను వర్ణించి మృగయా కౌతుకమును కలిగించును. |
| 2. | వసురాజు ఉద్యాన వన దర్శనమునకై సిద్ధమగును. | స్వరోచి వేటకు బయలు దేరుటకు సిద్ధమగును. |
| 3. | రథ వర్ణన. | అశ్వవర్ణన. |
| 4. | వసురాజు రథముపై పరివారముతో వనమునకేగును. | స్వరోచి అశ్వముపై పరివారముతో అరణ్యమునకేగును. |

| | | |
|---|---|---|
| 5. | వసురాజునకు కిన్నరద్వయము ఆసన్న శుభము నెరిగించును. | స్వరోచికి శకునములు గోచరించును |
| 6 | వసురాజు గిరికా గానమును వినును. | స్వరోచికి మనోరమ ఆర్తనాదము వినఁబడును. |
| 7 | విదూషకుడు కోనను జూచును. | ప్రవరుడు కోనను జూచును. |
| 8 | కోన వర్ణన. | కోన వర్ణన. |
| 9. | విదూషకుడు కోనలోనికి దిగి నవరత్న మయమైన దివ్యమందిరమును గాంచును. | ప్రవరుడు కోనలోనికి దిగి గారుడోత్కీర్ణమైన భవనమును గాంచును. |
| 10 | మణి మందిరమున ప్రతి బింబముల ద్వారా విదూషకుడు స్త్రీల జాడ నెరుంగును. | తాంబూలవాసనను బట్టి ప్రవరుడు వరూథిని జాడ నెరుంగును. |
| 11. | విదూషకుడు వీణవాయించుచున్న గిరికను జూచును. | ప్రవరుడు **వీణ** వాయించుచున్న వరూథినిని జూచును. |
| 12. | మాయాముని వేష వర్ణన. | సిద్ధుని వేషవర్ణన. |
| 13. | మాయాముని—మంజువాణుల సంభాషణ. | ప్రవర-సిద్ధుల సంభాషణ. |
| 14. | కోలాహలుడు శక్తిమతిని ప్రేమించును. | వరూథిని ప్రవరుని ప్రేమించును. |
| 15. | శక్తిమతి కోలాహలుని నిరాకరించును. | ప్రవరుడు వరూథినిని నిరాకరించును. |
| 16. | తమకమును పట్టలేక కోలాహలుడు శక్తిమతిపై పడును. | మోహపరవశయై తాళలేక వరూథిని ప్రవరుని కౌగిలించుకొనును. |

| | |
|---|---|
| 17. శక్తిమతి గర్భము ధరించును. | వరూథిని గర్భము ధరించును. |
| 18. గిరికా వసుపదుల జననము, నామకరణము. | స్వరోచి జననము, నామకరణము |
| 19. గిరికా బాల్యము. | స్వరోచి బాల్యము మరియు మనోరమ బాల్యము. |
| 20. గిరిగా వసురాజుల చక్షుః ప్రీతి వర్ణన. | వరూథిని చక్షుః ప్రీతి వర్ణన మరియు వివాహవేళ స్వరోచి మనోరమల చక్షుః ప్రీతి వర్ణన. |
| 21. గిరికా విరహము. | వరూథిని విరహము. |
| 22. గిరిక విరహతాపము భరించలేక మరణ ప్రయత్నముచేయును. | వరూథిని విరహతాపము భరించలేక మరణ ప్రయత్నము చేయును. |
| 23. మరణ ప్రయత్నము నుండి గిరిక సఖులామెను మరలించి యామె నూరడింతురు. | మరణ ప్రయత్నమునుండి వరూథినిని మరలించి సఖులు యామెనూరడింతురు. |
| 24. గిరికను సఖులూరడించి యుద్యాన వనమునకు తీసుకొనిపోవుదురు | వరూథినిని సఖులూరడించి యుద్యాన వనమునకు తీసుకొనిపోవుదురు |
| 25. గిరికా సఖులయొక్క వనవిహారము, పుష్పాపచయము, జలక్రీడలు. | వరూథిని సఖులయొక్క వనవిహారము పుష్పాపచయము, జలక్రీడలు. |
| 26. గిరిక మన్మథాదులనుపాలంభించును. | వరూథిని మన్మథాదులనుపాలంభించును |
| 27. గిరికా వసురాజుల వివాహము. | స్వరోచి మనోరమల వివాహము. |
| 28 వివాహ పత్రికలనంపుట. | వివాహ పత్రికలనంపుట. |

| | | |
|---|---|---|
| 29. | నగరాలంకరణ. | నగరాలంకరణ. |
| 30. | గిరికను పెండ్లికూతురుగా నలంకరించుట. | మనోరమను పెండ్లికూతురుగా నలంకరించుట. |
| 31. | వసురాజును పెండ్లికుమారునిగా నలంకరించుట. | స్వరోచిని పెండ్లికుమారునిగా నలంకరించుట. |
| 32. | వసురాజు తరలివెళ్ళుట. | స్వరోచి తరలి వెళ్ళుట. |
| 33 | పురస్త్రీలు వసురాజును దర్శించుట | పురస్త్రీలు స్వరోచిని దర్శించుట. |
| 34. | వివాహ వర్ణన. | వివాహ వర్ణన. |
| 35. | దంపతులకు కానుకలు చదివించుట | దంపతులకు కానుకలు చదివించుట. |
| 36. | కేళీగృహ వర్ణన. | కేళీగృహ వర్ణన. |
| 37. | గిరికా వసురాజుల ప్రథమ రాత్రి వర్ణన. | స్వరోచి మనోరమల ప్రథమ రాత్రి వర్ణన. |

వరూథినికి సఖులున్నట్లుగా మూలమున లేకున్నను పెద్దన వారిని కల్పించినాడు. దాని ననుసరించుచు రామరాజభూషణుడు గిరికకు సఖులను కల్పించినాడు.

ఈ విధముగా వివిధ సన్నివేశములను రామరాజభూషణుడు మను చరిత్ర ననుసరించి వసుచరిత్రలో కల్పించుటయే గాక వివిధ ప్రబంధ వర్ణనల యొక్క క్రమమును గూడ నదేవిధముగా గ్రహించుట ఆశ్చర్యజనకముగా నుండును. మనుచరిత్రలో ప్రవరుడు వెళ్ళిపోయిన పిదప వరూథిని విరహమునకు గురియగుట, సూర్యాస్తమయము, సంధ్య, చంద్రోదయము, వెన్నెల స్త్రీపురుషుల మధుపానము, వారి శృంగార చేష్టలు, అభిసారికలు, వరూథిని విరహతాప మగ్గలమగుటచే మరణ ప్రయత్నము చేయుట, సఖులామెనూరడించుట. మన్మథాదుల నుపాలంభించుట, చంద్రాస్తమయము, సూర్యోదయము,

సఖులు వరూథినిని ఉద్యానవనమునకు తీసుకొనిపోవుట, అచట వారి వన విహారము, పుష్పాపచయము, జలకేళ్యాదులను పెద్దన క్రమముగా వర్ణించినాడు. వసుచరిత్రలో గిరిక వసురాజునొదలి వెళ్ళిపోయిన పిదప విరహమునకు గురి యైనదని చెప్పి రామరాజభూషణుడు మనుచరిత్రలోని వర్ణనాక్రమమున నొకటి రెండింటిని మార్చినను పై వర్ణనల నన్నింటిని విడువక వర్ణించెను. అదే విధ ముగా మనుచరిత్రలో స్వరోచి వివాహ వర్ణన, అదే సందర్భమున రెండవమారు సూర్యాస్తమయ, సూర్యోదయాది వర్ణనలను గావించుటను రామరాజభూషణు డనుసరించుచు గిరికా వసురాజుల వివాహ వర్ణనా సందర్భముననే రెండవమారు ప్రబంధమున సూర్యాస్తమయ చంద్రోదయ, సూర్యోదయాదులను వర్ణించినాడు. ఇట్లు ప్రబంధవర్ణన కొన్ని మనుచరిత్ర లోని క్రమముననుసరించి వసుచరిత్రలో చేయబడుటచేత వసుచరిత్రలోని కథాక్రమమునకు మనుచరిత్రలోని కథా క్రమముతో సామ్యము లేకున్నను సామ్యమున్నట్లుగా కనబడుచున్నది. ఇట్టి క్రమమును పాటించుట రామరాజభూషణుడు పెద్దన ననుకరించుటకే యని స్పష్టముగా చెప్పవలయును. లేకున్న ప్రబంధ వర్ణనలను అన్యక్రమములో ప్రబంధసూత్రమున గ్రుచ్చియుండెడివాడు.

సంస్కృత సాహిత్యమున మాఘుడు భారవి కిరాతార్జునీయమునకు భిన్నమైన కథను గ్రహించినను తన శిశుపాలవధ మహాకావ్యమున భారవి లోని కథాసన్నివేశములననేకముల అనుసరించినాడు. ఇది భారవిని మించిన కావ్యమును వ్రాయవలయునను స్పర్థతో గావించినాడని యందురు. It is clear that the tradition, for once is probably right in implying that Magha composed his Sishupalavadha with a view to surpass Bharavi's Kiratarjuniya by entering into a competetion with him on his own ground "[1] మరియు మాఘుడు గ్రహించిన కథ రామరాజభూషణుని వసుచరిత్ర కథ వలెనే చిన్నది అట్టి శిశుపాలవధ కావ్య కథను మాఘుడు భారవి కిరాతార్జునీయ కథాసంవిధానము ననుసరించి పెంచి వ్రాసినాడు.

"The epic story here is even simpler and more devoid of incidents than the episode of Arjuna's fight with the Kirata.

1. A History of Sanskrit literature – Vol I Page 191

The outline of the epic story is accepted, but its slenderness and simplicity are expanded and enbellished in twenty cantos, by a long series of descriptive and erotic passage deliberately modelled it seems, upon those of Bharavi"[1]

మాఘుని వలెనె రామరాజభూషణుడు మహాభారతేతిహాసము నుండి గ్రహించిన చిన్ని కథను పెద్దన మనుచరిత్ర ప్రబంధము నాధారముగా గొని దాని ననేక సన్నివేశములందనుకరించుచు పెంచి ఆరు ఆశ్వాసములు గల బృహత్కథగా రచించినాడు.

రామరాజభూషణుడు పెద్దనను మించవలయునను అహమహమికతో వసుచరితను శబ్దశ్లేషలతో. యమకాద్యలంకారములతో, ధ్వనివైభవముతో, ఊహావైచిత్రితో, వివిధార్థాలంకారములతో, అర్థచమత్కార ములతో, విభూషించిరచించినాడు. పెద్దన మనుచరిత్రలో లేని రసైక్యమును సాధించిన సాహిత్యరసపోషణచక్రవర్తి యైనాడు. మాఘుడు భారవిననుకరించుచు ఒకొక మారతడు ప్రయోగించిన ఛందస్సునే ప్రయోగించినట్లుగా రామరాజభూషణుడు పెద్దన వరూధిని వీణవాయించు వర్ణన, కోన వర్ణన, స్వరోచి వేటకై బయలు దేరునప్పటి గుఱ్ఱపు వర్ణనలలోని సీసపద్యముల ననుకరించుచు గిరిక వీణ వాయించు వర్ణన, కోనవర్ణన, వసురాజు ఉద్యానవన విహారమునకై బయలుదేరు నప్పటి రథవర్ణనలను సీసపద్యములలోనే గావించెను. పెద్దన వలెనే తానును వెన్నెల వర్ణనలను వివాహవేళ పెండ్లికుమారుడు తరలి వెళ్ళుటను దీర్ఘ వచన ములలోనే కావించినాడు. మాఘుడు తన చిన్ని కథను పెంచుచు భారవి నను సరించి బలదేవ ఉద్ధవ శ్రీకృష్ణుల మంత్రాలోచనమును, కృష్ణుడు ఇంద్రప్రస్థము నకేగు సందర్భమున రైవతక పర్వత వర్ణన, యాదవస్త్రీల జలకేళ్యాదులు, మొదలగు సన్నివేశములను కల్పించెను. అదేవిధముగా రామరాజభూషణుడు తాను గ్రహించిన చిన్న కథను పెంచుచు, పెద్దన ప్రవరవరూథినీ సంవాదము ననుస రించి శుక్తిమతి కోలాహలుల సంవాదమును, వరూథిని విరహము, మన్మథాదుల దూషణననుసరించి గిరికా విరహము, మన్మథాదుల దూషణములను, వరూథినీ సఖుల జలకేళ్యాదుల ననుసరించి గిరికా సఖుల జలకేళ్యాదులను, స్వరోచిమనో రమల వివాహము ననుసరించి గిరికావసురాజుల వివాహమును వర్ణించినాడు.

1. A History of Sanskrit literature – Vol I Page 190

ఇవియే గాక ఎన్నియో సామ్యములుగల కల్పనలు, సన్నివేశములు, వర్ణనలు, భావములు, శబ్దములు గలవు పెద్దన వర్ణించిన విరహము, మన్మథాదుల దూషణ, జలకేళ్యాదులను రామరాజభూషణుడు గ్రహించి, తన ఉక్తివైచిత్రి, శ్లేష చమత్కారాదులను ప్రదర్శించుచు మాఘుడు తన చిత్ర, బంధకవిత్వ రచనచేత భారవిని మించినట్లుగా, పెద్దనను మించినాడనవలయును.

మాఘుడెట్లు భారవిని మించిన కావ్యమును రచింపవలయునను పోటీతో ఆతని కావ్యమునే అనుసరించుచు శిశుపాలవధ కావ్యమును రచించెనో అట్లే అట్టి పోటీతోడనే రామరాజభూషణుడును పెద్దన మనుచరిత్రను మించవలయునని దానినే యనుకరించుచు వసుచరిత్రను రచించెను. మాఘ భారవులలో లేని విశేషమొకటి పెద్దన రామరాజభూషణులలో కలదు. అది వారు గురు శిష్యులగుట. ఒకే ఆస్థానము నలంకరించి యుండుట.

"ఎదురైనచోఁదన మద కరీంద్రము డిగ్గి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె........"

అను చాటు పద్యము ద్వారా శ్రీ కృష్ణదేవరాయలు తన ఆస్థాన కవులందరిలో కెల్ల పెద్దనను విశేషముగా సత్కరించినట్లు, అభిమానించి నట్లు కనబడును. అప్పటికి రామరాజభూషణుడు రాయల ఆస్థానములో పెద్దన వలెనే అష్టదిగ్గజ కవులలో నొకడై యున్నను పిన్నవాడై యుండును. పిన్నవాడైనను ఆతడు విద్వాంసుడు. యోగ్యసమ్మానము నాతడు పొందలేదు. అదియే ఆతని హృదయమున నిలిచిపోయి యుండును. రామరాజభూషణుడు తానును పెద్దన వలె గొప్ప ప్రబంధకర్తను కావలయుననియు, మనుచరిత్రను మించిన ప్రబంధమును రచింపవలయునను పట్టుదలతో దానినే అనుకరించుచు వసుచరిత్రను రచించెను. "ఆ కాలమున మనుచరిత్రయే రాజగౌరవము నంది యుండుటచే నెల్లవిధముల దానికన్న మిన్నయగు గ్రంథమును వ్రాసి యంతకన్న నధికమగు మన్ననఁబొందదలచి యుండు"[1] నని పండితుల యభిప్రాయము.

1. అష్టదిగ్గజములు. పుట 222.



# క థా వ స్తు వు

" ఇతివృ త్తంతు కావ్యస్య శరీరం పరికీ ర్తితం" అని భరతుడు ఇతివృత్తమును కావ్య శరీరముగా పేర్కొనినాడు. ఇతివృత్తమునకే కథ, కథావస్తువు అని నామములు. భారతీయాలంకారికులు దృశ్యకావ్య వస్తువును గూర్చి విశేషముగా చర్చించిరికాని శ్రవ్యకావ్యవస్తువిషయమున అశ్రద్ధ చూపించినారు చాలామట్టుకు ఆలంకారికులు భరతుడు దృశ్యకావ్యమునకు చెప్పిన లక్షణములనే శ్రవ్యకావ్యములకును పట్టించిరి. మహాకావ్యమున కథావస్తునిర్వహణ నాటకములో వలెనే సంధి, సంధ్యంగములతో నిర్వహింపబడవలయుననిరి. మహాకావ్యమున గ్రహింపబడిన కథలో రసవ్యంజకత కొరకై మార్పులు చేయవలయుననిరి. ఇదియు కాళిదాసాది కవులు తమ శాకుంతలాది నాటకములందు ప్రదర్శించిన లక్షణమే. కావ్యేతివృత్తములను పురాణాదులనుండి కవులు గ్రహించి తమ ప్రతిభావ్యుత్పత్తులతో మెరుగులు దిద్దుచుండిరి. ఇట్టి మెరుగులు దిద్దబడిన ఇతివృత్తమునే తెలుగు కవులు మిశ్రేతివృత్తముగా పేర్కొనిరి. సంస్కృతమున భామహుడు గద్య పద్య కావ్యములను వస్తువునుబట్టి నాలుగు విధములుగా విభజించెను. 1) దేవ సంబంధేతివృత్తము 2) కల్పితేతివృత్తము 3) కళా సంబంధేతివృత్తము 4) శాస్త్ర సంబంధేతివృత్తము.[1]

చివరి రెండు కళలకు, శాస్త్రములకు సంబంధించిన రచనలు. మొదటి రెండు విభజనలు కావ్యములకు సంబంధించినవి. వానిలో దేవసంబంధేతివృత్తముగా ప్రసిద్ధమగు దేవ సంబంధ కథ యగుటచే దానిని ప్రఖ్యాతేతి వృత్తముగా పేర్కొనవలెను. ఇక కల్పితేతి వృత్తమనగా కవి కల్పిత ఇతివృత్తము భామహుడు కావ్యవస్తువును ప్రఖ్యాత, కల్పితేతివృత్తములుగా విభజించినాడనవలెను.

---

1. వృత్తదేవాది చరిత శంసి చోత్పాద్య వస్తు చ
   కళా శాస్త్రాశ్రయం చేతి చతుర్ధాభిద్యతే పునః          కావ్యా 1-17

దండియు కొంతవరకు నిట్టి విభాగమునే పేర్కొనినాడు—

ఇతిహాస కథోద్భూత మితర ద్వా సదాశ్రయమ్
చతుర్వర్గ ఫలాయ త్తం చతురోదా త్త నాయకమ్

కావ్యాద 1-15

కావ్యము ఇతిహాసకథనాధారముగా గాని సత్పురుషునాధారముగా గాని చేసుకొని యుండవలయునని దండి యభిప్రాయము. ఇతిహాస కథనాధారముగా ననుటచే ఇతిహాస ప్రసిద్ధమగు కథ యగును. అనగా ప్రసిద్ధేతివృత్తమని చెప్పనగును. ఏదేనొక సత్పురుషుని యాధారముగా చేసుకొనిన ఇతివృత్తముగా ఇతిహాస కథనాధారముగా నని ముందే చెప్పుటచే అతడు ఇతిహాస సంబంధి పురుషుడు కాడనియే స్ఫురించుచున్నది. అనగా కవి కల్పితమైన సదాశ్రయ ఇతివృత్తమై యుండవలయునని తేలుచున్నది. ఈ విధముగా దండి ప్రఖ్యాతము, కల్పితమను ద్వివిధకథా వస్తువులను దృష్టిలో నుంచుకొనినాడని చెప్పవలెను. ఈ ప్రఖ్యాత కల్పితేతివృత్తములనే రుద్రటుడు ఉత్పాద్యము అనుత్పాద్యమని పేర్కొనినాడు. రుద్రటుడు వానినిట్లు నిర్వచించినాడు—

తత్రోత్పాద్యా యేషాం శరీరముత్పాద యేత్కవిః సకలమ్
కల్పిత యుక్తోత్ప త్తిం నాయకమపి కుత్ర చిత్కుర్యాత్
పంజర మితిహాసాది ప్రసిద్ధ మఖిలమ్ తదేక దేశమ్ వా
పరిపూర యేత్ స్వవాచా యత్ర కవిస్తే త్వనుత్పాద్యాః

కావ్యా. 16-34.

కవి నిర్మితమైన ఇతివృత్తము ఉత్పాద్యము. ఇతిహాసాది ప్రసిద్ధ ఇతివృత్తము అనుత్పాద్యము.

ఈ విధముగా కావ్యేతివృత్తము నాలంకారికులు ప్రఖ్యాతము, కల్పితమనియు లేక అనుత్పాద్యము, ఉత్పాద్యమనియు రెండు విధములుగా విభజించిరి ఆనంద వర్ధనుడు కావ్యమునందు విభావానుభావసంచారుల ఔచిత్యముచేత రమణీయమైన కథా శరీరమును గ్రహింపవలయునని చెప్పుచు—

ఇతివృత్త వశాయాతాకం త్యక్త్వా౽ననుగుణాం స్థితిం
ఉత్ప్రేక్ష్యా౽ప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః
ధ్వన్యా. 3-11.

అని అనెను అనగా ఇతివృత్తగతమగు అనౌచిత్యములున్నవానిని తొలగించి రసోచితముగా మార్చవలయునని ఆనందవర్ధనుని అభిప్రాయము. భరతుని దృశ్యకావ్య సంబంధి రససిద్ధాంతమును శ్రవ్యకావ్యముల కన్వయించి యా సిద్ధాంతమును విస్తృత పరచిన ఆనందవర్ధనుడు నాటకములో వలెనే కావ్యములలోను వస్తువులోగల రసవద్ఘట్టములను గ్రహించి రచింపవలయునను అభిప్రాయము కలవాడు. రసానుగుణము కాని ఇతివృత్తమును విడిచియో లేక మార్చియో కావ్యవస్తువును కూర్చవలయునని ఆనందవర్ధనుని మతము.

ధనంజయుడు దశరూపకమున రూపక సంబంధ కథావస్తువును త్రివిధముగా విభాగించినాడు. "ప్రఖ్యాతోత్పాద్య మిశ్రత్వ భేదాత్రేధాపి తత్త్రిధా" (దశరూ 1-15). ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రమమని మూడు విధములైన ఇతివృత్తములను గూర్చి ప్రసంగించినాడు. దండి భామహాదులు కావ్యమున రెండు తెరగులైన ఇతివృత్తములనే గ్రహించియుండగా దృశ్యకావ్యమున ధనంజయుడు త్రివిధ భేదములను పేర్కొనినాడు. ధనంజయుడు పేర్కొనిన మిశ్రేతివృత్తము ఆనందవర్ధనుని రసవ్యంజక వస్తు స్వీకరణమున కావ్యపరముగా అంతకుముందే ప్రతిబింబించి కనబడుచున్నది.

ఆంధ్ర సాహిత్యమున రుద్రటాదులు పేర్కొనిన ప్రఖ్యాత, కల్పితేతివృత్తములేగాక ఆనందవర్ధనునిచే ప్రసంగించబడిన; ధనంజయునిచే రూపకపరముగా చెప్పబడిన మిశ్రేతివృత్తముసైతము తెలుగు కవులు గ్రహించిరి. ఇట్టి త్రివిధములైన ఇతివృత్తములనుగూర్చి మొట్టమొదట జక్కన ప్రసంగించినాడు.

"సకల దేశభాషా విశేషమేల యందు
వరుసఁ బ్రఖ్యాత మనఁగ నుత్పాద్యమనఁ గ
మిశ్రమన నొప్పు సత్కథా మేళనంబు... వి. చ. 1-27.

ఆ తరువాత శృంగార శాకుంతలమున పినవీరన వీని ప్రసక్తిని తెచ్చినాడు.

ప్రఖ్యాతంబన మిశ్రబంధమన నుత్పాద్యంబనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతంబగు వస్తువందు మఱి యథ్యాహారముంజేయఁగాఁ
బ్రఖ్యాతంబితి వృత్తమైన కృతిచెప్ప న్వక్తకు న్శ్రోతకు
న్విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ న్విశ్వంభరా మండలిన్
శృం. శా. 1–24.

అని పిన వీరన, జక్కన పేర్కొనిన త్రివిధములైన ఇతివృత్తములను గూర్చి ప్రసంగించి, మహాభారత ప్రోక్తమగు కథనుగ్రహించి దానికి కాళిదాసుని నాటకక్రమమును కొంతచేర్చి రచించిన తన శృంగారశాకుంతల కథావస్తువు నాతడు ప్రఖ్యాతేతివృత్తముగానే చెప్పుకొనెను.

రామరాజభూషణుడును ఈ త్రివిధములైన ఇతివృత్త ప్రసక్తిని వసుచరిత్ర పీఠికలో కావించినాడు.

కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లాద్య సత్కథల్
వావిరి పుట్టురత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వ వృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్
వ.చ. 1–19.

రామరాజభూషణుడు స్వయముగా ఆలంకారికుడు కావున కథావస్తుభేదములను కొంత వివరముగా చెప్పినాడు. కేవలము కల్పితేతివృత్తముతో గూడిన కావ్యములు ఒక విభాగము. ఈ విభాగము పూర్వాలంకారికులు చెప్పిన కల్పితము లేక ఉత్పాద్యేతివృత్తము. పుట్టు రత్నముల వంటి ఆద్యసత్కథలనగా ప్రఖ్యాతము లేక అనుత్పాద్యేతివృత్తము. మూడవది సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములన మిశ్రేతి వృత్తము.

ఇట్టి కథాప్రసక్తిని పెద్దన యెచటను ఎత్తుకొనలేదు. "మార్కండేయ పురాణోక్త ప్రకారంబు"గా మనుచరిత్రను ఆతడు రచింపదలచెను. అందుచేతనే పెద్దన మార్కండేయ పురాణములోని కథాక్రమమునే ఉన్నదియున్నట్లుగా గ్రహించినాడు. ఆతడు కావించిన మార్పులలతియైనవి. అవి పాత్రపోషణ,

ప్రబంధవర్ణనలకు తోడ్పడినవి. అట్టి పెద్దన మనుచరిత్ర కథావస్తువు ప్రఖ్యాత మని చెప్పదగి యున్నది. రామరాజభూషణుడు తన పద్యమున "ఆద్య సత్కథల్ వావిరిపుట్టురత్నము" లని పెద్దన మనుచరిత్ర కావ్యమునే విమర్శించెనను ఇతిహ్యము కలదు. దీనిని బట్టియు మనుచరిత్ర కథ ప్రఖ్యాతేతివృత్తమనుట స్పష్టము. ఇక రామరాజభూషణుడు తన వసుచరిత్ర కావ్యములోని ఇతివృత్తమును మిశ్రమమని స్వయముగా చెప్పుకొనినాడు. పూర్వవృత్తము అనగా ప్రసిద్ధమైన పురాణేతిహాసాదులలోని కథను గ్రహించి సత్కవి స్వకపోలకల్పనల చేత దానిని విభూషించిన నది మిశ్రమమని రామరాజభూషణుని అభిప్రాయము. రామరాజభూషణుడు మహాభారతమను గని నుండి వసురాజు వృత్తాంతమను పుట్టు రత్నమును గ్రహించి తన అద్భుత వర్ణనలచేత, కల్పనలచేత విభూషించి దాని ననేక విధములుగా తన శైలీచమత్కారముల చేత సాన బెట్టి జగజగ మని మెరయు ప్రబంధ రత్నముగా రూపొందించినాడు.

ధ్వనికారుడుద్దేశించిన కథావస్తుసంవిధానమును స్వయముగా ఆలంకారికుడైన రామరాజభూషణుడు సంపూర్ణముగా వసుచరిత్ర కావ్యమున అనుసరించి చూపినాడు. ఆతడు వసురాజు కథలో గావించిన మార్పులు రసవ్యంజకమై యొప్పుచున్నవి. తెలుగులో "వసుచరిత్రమునందును, మహాభారతమున కొన్ని భాగములందును ప్రబంధ రసవ్యంజకత కానబడునని"[1] శ్రీసన్నిధానము గారి యభిప్రాయము. మహాభారతములోని కొన్ని భాగములలోనే రసవ్యంజకత కలదు. మరియు అది ఇతిహాసకావ్యముల కోవలోనికి చేరుటచేత రసాభివ్యక్తి గావించు ప్రబంధములలో లెక్కించుట కంత అవకాశము లేదు ఇక వసు చరిత్ర యొక్కటియే రసవ్యంజకతకు లక్ష్యముగా కనిపించు ప్రబంధరాజముగా తెలుగులో వెలయుచున్నది.

పెద్దన మనుచరిత్రలోని కథాక్రమము వస్తువ్యంజకమగు పురాణము నుండి గ్రహింపబడుటచే నది రసవ్యంజకమగు కథగా రూపొందలేక పోయెను. ఇట్టి దోషము కాళిదాసు రఘు వంశ, కుమారసంభవాదులకును సంభవించినది. కాళిదాసు నాటకేతివృత్తములోని రసవ్యంజకతను కావ్యములందు ప్రదర్శించలేదందురు. కాని "కాళిదాసాది మహాకవులు కావ్యవస్తువు రసవ్యంజ

1. కావ్యాలంకారసంగ్రహము. పుట 239.

కము కాకున్నను తమ ప్రతిభా నిష్పన్నమైన కవితా సంపదచే సుదాత్తముగా, రమణీయముగా, రసపోషణముగా విరచించి"[1] రని శ్రీ సన్నిధానము వారసినట్లుగా పెద్దనయు తన చతురవచోనిధిత్వము చేత పాత్రచిత్రణాశిల్పము చేత మనుచరిత్ర ప్రబంధమును అద్వితీయముగా రచించెను. పెద్దన మనుచరిత్ర పురాణానుసారియైన ఇతివృత్తము కలదై ప్రఖ్యాతేతి వృత్తమైన కావ్యముకాగా రామరాజభూషణుని వసుచరిత్రలోని కథ నామమాత్రమునకు మహాభారతము నుండి గైకొనబడినదై విశేషకవికల్పనావిభూషావహమై మిశ్రేతివృత్తమై యొప్పుచున్నది. వసుచరిత్ర తరువాత ఎన్నో మిశ్రకావ్యములకు వేగుజుక్కయై నిలిచినది. స్వకల్పనావిశేషవిభూషితమైన కథ గల వసుచరిత్రను రచించి రామరాజభూషణుడు పెద్దన పురాణప్రోక్త కథావస్తువు గల మనుచరిత్రను మించిన ప్రబంధమును రచించిన వాడయ్యెను.



1. కావ్యాలంకారసంగ్రహము, పుట 240.

# వస్త్వైక్యము

కావ్యములందు వస్త్వైక్యము సాధింపబడవలెనని దండ్యాదులు మహాకావ్యమునకు విధించిన నాటకపంచసంధులను బట్టి తెలియుచున్నది. నాటకములందీ పంచసంధులు కార్యారంభముతో నారంభమై ఫలాగమముతో నంతమగును నాయకుడేదో నొక అభ్యుదయము నాశించి కార్యారంభమునకు పూనుకొనును. ఆ కార్యసాధనకై యత్నములను గావించును. ఈ రెండు క్రమముగా ముఖ, ప్రతిముఖ సంధులందు జరుగును. గర్భసంధిలో ఫలప్రాప్తి యొక్క అనిశ్చితత్వము మరియు సంఘర్షణ చూపబడును అవమర్శ సంధిలో ఫలప్రాప్తి జరుగునను సూచనయుండును, నిర్వహణ సంధిలో ఫల ప్రాప్తి కలుగును. ఇట్లు కావ్యము "సుసంధిభిః" మరియు "పంచభిస్సంధిభిర్యుక్త" మై యుండవలయు ననుటచే నాటకమునందు వలెనే కావ్యములందు నాయకుని కార్యారంభముతో కథ ప్రారంభమై ఫలప్రాప్తితో ముగియవలయుననుటచే నాటక వస్త్వైక్యము కావ్యములందును సాధింపబడవలెనని తెలియుచున్నది. రఘువంశాది కావ్యములకు ఈ సూత్రము పట్టదు. ఈదృష్టితో నాలోచించిన అందు వస్త్వైక్యము లేదనియే తేలును.

కాని వస్త్వైక్యములేని కావ్యమెట్లుండునను ప్రశ్న ఉదయించుచున్నది. ఏలయన చతుర్వేదములందును ఏదోరూపమైన ఐక్యము గోచరించుచున్నది. చెల్లాచెదరై యున్న మంత్రములను వేదవ్యాసముని సంపాదించి దేవత, ఋషి, ఛందః క్రమములననుసరించి విభాగించి చతుర్వేదములను ప్రతిష్ఠాపించినాడు. అందును ఏదో ఐక్యరూపము నాతడు సాధించి యా విభాగమును గావించినాడు మరియు ఇతిహాస పురాణములలో నేదోరూపమైన వస్త్వైక్యము కలదు. అవి సర్గప్రతిసర్గ వంశమన్వంతర వంశానుచరితమను పంచలక్షణాన్వితములైనవి. వానిలోని కథలు ప్రజలకు ధర్మాది విషయములను బోధించుటకు ఏర్పడినవి. ఆ కథల సంపుటిలో ధర్మబోధకత్వమను ఐక్యగుణము కనిపించుచున్నది.

పంచమహాకావ్యములలో నొకటియగు కాళిదాసుని రఘువంశకావ్యమున పురాణములో వలెనే వంశచరిత్ర, ఇతిహాసములు కూర్చబడినవి. అందు రఘువంశమునకు చెందిన రాజుల చరిత్రలు ఆ వంశపతనావస్థ వరకును చెప్పబడినవి. అంతేగాక "తద్ గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః" (రఘు. 1–19), అని వారి గుణములే నన్నీ కావ్యమును రచించుటకు ప్రేరేపించినవని కాళిదాసు పేర్కొనినాడు. ఉదాత్తచరిత్రగల రాజుల చరిత్రను వర్ణించి కాళిదాసు కాంతాసమ్మిత ప్రయోజనానుసారిగా ప్రజలకు జీవనక్రమమునుద్బోధించినవాడయ్యెను. ఆదర్శగుణములైన రఘువంశరాజుల చరిత్రనాతడు సహజముగా వర్ణించినాడు. అట్టి సహజమైన ఉదాత్తచరిత్రచిత్రణమే రఘువంశమందలి ప్రత్యేకము.

అదే విధముగా పంచమహాకావ్యములలో నొకటియగు కాళిదాసుని కుమారసంభవమున కుమారస్వామి జననక్రమమును చిత్రించుట ముఖ్యోద్దేశము. పార్వతి భక్తి రూపమైన ప్రేమతోడ పరమాత్మరూపుడైన శివుని పొందినది. పరమాత్మ సమాగమము తపఃపూర్వకసమాధి లేనిదే సంభవించదు. అందుచేత పార్వతి తపస్సుచేత శివుని పొందినది. మరియు పార్వతి ప్రకృతి, శివుడు పురుషుడు వీరి సమాగమమున దుష్టశిక్షకుడైన కుమారుడుదయించినాడు. కుమారసంభవ కావ్యములోని ఎనిమిది సర్గములలో గల కుమారోదయము వరకే కాళిదాసు రచించినాడని విమర్శకుల అభిప్రాయమైయున్నది. మిగత సర్గములలోని కుమారస్వామి తారకాసుర విజయము నాతడు చెప్పలేదందురు. కాళిదాసు ఉద్దేశము కుమారస్వామి తారకాసురుని జయించుటను వర్ణించుట అయినట్లయిన ఆ కావ్యమునకు కుమారవిజయమనియో మరేదియో నామకరణము చేసియుండును. ఇంద్రాదిదేవతలు బ్రహ్మదేవుని కోరినది తారకుని జయించగల సేనాధిపతిని అట్టివాడు శివుని వీర్యమునుండి జన్మించగలడని బ్రహ్మదేవుడు చెప్పెను. శివుడు ప్రథమభార్యావియోగముచేత విరాగియై తపోనిష్ఠలోనున్నాడు, స్త్రీలను కన్నెత్తియైన చూచుటలేదు. పార్వతి యెడల శివునకనురాగోదయము గావించి తద్ద్వారా దేవతా సేనాధిపతిత్వము చేయ సమర్థుడైన కుమారుని ఉదయము కలుగునట్లుచేయు కార్యభారము దేవతలది. దేవతలు మన్మథ సహాయమున ఆ కార్యమును నిర్వహింప సమకట్టిరి కాని అది విఫలమయ్యెను. తరువాత పార్వతి తన తపోనిష్ఠతో శివుని హృదయమును పొందినది. అది వివాహమునకు,

కుమారోదయమునకు హేతువయ్యెను. ఇందు కథంతయు ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణ సంధియుక్తమై ఫలోన్ముఖమై కుమారోదయము వైపు నడిచినది.

రఘువంశము ఆదర్శచరిత్రను చిత్రించు బహునాయకాశ్రితమైన కథావస్తువుతో రఘువంశరాజుల చరిత్ర చిత్రణమను వస్త్వైక్యము కలదికాగా కుమారసంభవము కుమారోదయోన్ముఖమైన ఫలోదయము వైపు పరుగెత్తుకథా వస్తువుతో కుమారజననమను వస్తుతత్త్వప్రధానమైనది.

సంస్కృత పంచమహాకావ్యములలో మిగిలిన మూడుకావ్యములు కిరాతార్జునీయము, శిశుపాలవధ, నైషధములు ఏకనాయకాశ్రయములేగాక ఏక రసాత్మకమైనవి. వీనిలో నైషధమున శృంగారము, కిరాతార్జునీయ శిశుపాలవధ లలో వీరము అంగిరసములుగా పోషింపబడినవి. ఈ కావ్యములలో ప్రారంభము నుండి అంతమువరకు అంగిరసము విభావానుభావ సంచార్యాదులచేత పోషింపబడి స్థాయివరకును కొనిపోబడినది ఆనందవర్ధనుడు చెప్పిన రస వ్యంజకమగు కథావస్తువిదియే రూపకములలోగల రసైక్యమును ఆనందవర్ధనుడు కావ్యములకును విధించినాడు. భారవ్యాది కవులు ఇట్టి రసవ్యంజకమగు కథా వస్తువును తమకావ్యములలో గ్రహించిరి కావున కిరాతార్జునీయము, శిశుపాల వధ, నైషధ కావ్యములు రసతత్త్వప్రధానములైనవి.

ఈ విధముగా కావ్యములందు రెండు విధములైన వస్త్వైక్యము సాధింపబడి కనిపించుచున్నది — ఒకటి వస్తుసంబంధి వస్త్వైక్యము, రెండు రససంబంధి వస్త్వైక్యము. ఈ రెండు విధములైన వస్త్వైక్యములలో మను చరిత్ర వసుచరిత్ర కావ్యములే విధమైన వస్త్వైక్యమును సాధించినవో పరిశీలింతము.

మనుచరిత్రలో నాయకుడొక్కడు కాదు. కొందరు స్వరోచిని నాయ కునిగా జెప్పి మనుచరిత్ర ఏకనాయకాశ్రయమనిరి [1] మనుచరిత్రలో ప్రవరుని పాత్ర ప్రాధాన్యమల్పమైనది కాదు. మొదటి రెండు ఆశ్వాసములందును నాతని వృత్తాంతమే కలదు. మూడవ ఆశ్వాసమున ప్రవర రూపధారియగు గంధర్వుని వృత్తాంతము కలదు. నిజమైన ప్రవరుడు లేకున్న మాయాప్రవరుడును లేడు.

1 మనుచరిత్ర పీఠిక — వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి పుట 91.

కావున మూడు ఆశ్వాసములలోను అనగా సగము కావ్యమునందును ప్రవరుని చరిత్రయే కలదు. అంతేగాక ప్రబంధారంభము ప్రవరుని గుణగణ వర్ణనలతో నారంభమైనది. ఆతని శాంతిదాంతి గుణములు తరువాత స్వారోచిషునిలో ప్రస్ఫుటమైనట్లుగా వర్ణింప బడుటచే నాతడు మను సంభవమునకు కారకుడగు చున్నాడు కావున అట్టి ప్రధాన పాత్రయగు ప్రవరుని ప్రబంధమున నొక నాయకునిగా గ్రహించుట సమంజసము. ప్రవరుని నిరంతర స్మరణచే ఆతని తేజస్సును గ్రహించి స్వరోచి వరూథినికి జన్మించెను. ఆతనికి స్వారోచిషుడు జన్మించెను. స్వారోచిషమనుజన్మకు కారకుడైన స్వరోచి వృత్తాంతము మూడు ఆశ్వాసములలో వీరశృంగారరస సమంచితమై విస్తరించినది. ఆతడును కథలో ప్రధాన పాత్రయే. స్వారోచిష మనుసంభవము పెద్దన చెప్పదలచిన కథావస్తువు. కావున ఆ వృత్తాంతముతోడనే ఆరవ ఆశ్వాసమును ముగించినాడు. ఈ విధముగా మనుచరిత్రలో ప్రవరుడు, స్వరోచి, స్వారోచిషుడు ముగ్గురు నాయకులు. మనుచరిత్ర బహు నాయకమని శ్రీ డా॥ పల్లా దుర్గయ్య గారు సమ్మతించినారు.[1] దండి భామహాదులు మహాకావ్యమును ఏకనాయకాశ్రయముగా చెప్పినను విశ్వనాథుడు బహునాయకత్వము నంగీకరించినాడు —

సర్గబంధో మహాకావ్యమ్ తత్రైకో నాయకః సురః
సద్వంశః క్షత్రియో వాపి ధీరోదాత్త గుణాన్వితః
ఏకవంశభవా భూపాః కులజా బహవోఽపివా

సా. ద. 1-315, 316

రఘువంశము వలె మనుచరిత్ర బహునాయకాశ్రితేతి వృత్తము కలది. మరియు కుమార సంభవము వలే స్వారోచిష మనుసంభవమను ఫలప్రాప్త్యున్ముఖమై నడిచినది.

మనుచరిత్రతో వస్త్వైక్యము లోపించినదని కొందరు విమర్శకులు తలంచిరి. "మనుచరిత్రము వస్త్వైక్యము లేక యున్నద"ని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును,[2] "ప్రథమ ప్రయత్నమగుటచే వస్త్వైక్యము లేకపోయినద"ని

1. ప్రబంధ వాఙ్మయ వికాసము, సంపు. 1 పుట 310
2. సింహావలోకనము. పుట 183.

వంగూరి సుబ్బారావు గారును[1] తలచిరి. వంగూరి సుబ్బారావు గారి యభిప్రాయముతో శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారును ఏకీభవించి యున్నారు[2]

మనుచరిత్ర వేరు వేరు కథలతో కూర్చిన కావ్యము దానిని పెద్దనయే "మనువులలో స్వారోచిషమనుసంభవమరయ రససమంచిత కథలన్, విననింపు" అని సూచించి యున్నాడు. ఈ కథలన్నియు వలప్రాప్తి యగు స్వారోచిష మనుసంభవమును పురస్కరించుకొనియే చెప్పబడినవి. మనుచరిత్రలో ప్రవరుడు స్వరోచి, స్వారోచిషులు నాయకులు. ప్రవరుడు అందగాడు, ధర్మనిరతుడు, ధీరశాంతుడు. ఇట్టి ప్రవరుని తేజోరూపమునే వరూథిని ప్రథమ వీక్షణమున కామించినది. మోక్షపథానుగామియై, శాశ్వత బ్రహ్మానందము నాశించు ప్రవరుడు వరూథినిని త్రోసిపుచ్చినాడు. అప్పుడు వరూథిని నింతకుపూర్వము ప్రేమించి, తఱివేచియున్న గంధర్వుడొకడు ప్రవరుని తేజోరూపమును శాంబరీ మహిమచే ధరించి వచ్చి వరూథినిని పొందెను. వరూథినికి

ఆ ప్రతిజ్ఞా పూర్తి యయ్యెఁదనంత న
 వ్వనితకు రతిపారవశ్య పటిమ
నపుడు తత్ప్రివరదేహ సమిద్ధ శిఖిదీప్తి
 శాంబరీ మహిమచే సంగ్రహించి
నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ
జలనమేదిన మానసాబ్జమున నిలువ
వెలసెఁదేజోమయంబైన వృద్ధి నట్టి
మేటి గర్భంబు నెలలు తొమ్మిదియు నిండె.

మ. చ. 4-3

అట్టి మేటి గర్భమును ధరించి వరూథిని

"స్వరుచి స్ఫురణను శశి భా
 స్కర పావక తారకా ప్రకాశము లెల్లన్
విరళము.................................."

మ. చ. 4-6

1. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. పుట 301.
2. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 10, సంచిక 1.

గా చేయు స్వరోచిని కనెను. ఈ స్వరోచి యొక్క "స్వరుచి స్ఫురణ" వరూథిని ప్రవరుని నిరంతరము స్మరించుట చేత నాతనిలో ప్రవేశించిన "ప్రవర దేహ సమిద్ధ శిఖి దీప్తి" యే. ఈ విధముగా ప్రవరుని రూపగుణాధి కములు స్వరోచిలో ప్రవేశించినవి. స్వరోచిని గూర్చి చెప్పుచు పెద్దన ఆతని క్రీడలలో క్షత్రియగుణములనే ఎక్కుడుగా గ్రహించి వర్ణించినాడు ఆ తరువాత స్వరోచి గావించిన వేటలోను, రాక్షసునితోడి యుద్ధములోను ఆతని సాహస పరాక్రమమును ప్రదర్శింపబడినవి. మనోరమను రక్షించుటతో, విభావసి కళావతుల రోగనివారణ గావించి వారిని వివాహమాడుటతోను స్వరోచి ఆర్త జనరక్షణ, దయ, పరోపకార గుణములు ప్రకటమగుచున్నవి. మరియు వివా హానంతరము ప్రథమరాత్రి వేళ మనోరమ దుఃఖించుట ఆతనిని కలచివేసినది. "నాయెడఁగల్గ యేమేనియుఁబాటిల్లదు గదా, యెవ్వరేమప్రియంబు గావించి రెఱింగింపు వారిన్ దండించెద, నేమి సాధింప వలయుఁజెప్పుమది వేధ చేసున్న సాధించెద" (మ చ. 6-8) ననిన సుస్నిత హృదయుడు. కరుణాంతరంగుడు.

హంసీచక్రవాకముల యొక్క, హరిణముల యొక్క మాటలను వినియు స్వరోచికి వైరాగ్యోదయము కలుగలేదు. స్వరోచి ఆ తరువాతను అనేక సంవత్సరములు భోగముల ననుభవింప సాగెను. ఇట స్వరోచి భోగ ప్రకృతి ప్రస్ఫుటమగుచున్నది. స్వరోచి ప్రవరుని తేజోరూపమును గ్రహించి జన్మించిన వాడయ్యును భోగపరాయణత, పరాక్రమాదులు మొదలైన గంధర్వ లక్షణములనే పొందినాడు. భోగలాలసుడగు స్వరోచిలో మనువగు అర్హగుణములు లేవు. దేవతల పంపున వనదేవత స్వరోచితోడ భోగించి కుమారుని కనెను. వాని నిట్లు పెద్దన వర్ణించినాడు —

కాంచెం బుత్త్రు విశాల నేత్రుఁబృథు వక్షః పీఠ విభ్రాజితుం
బంచాస్యోద్భట శౌర్యధుర్యు ఘన శుంభద్బాహుఁదేజోనిధిం
బంచాస్త్ర ప్రతిమాను మానఘను సామ్రాజ్యైక హేతుప్రభా
తాంచల్లక్షణ లక్షితున్ సుగుణ రత్నానీక రత్నాకరున్

మ. చ. 6-99

ఇట్టి లక్షణములతో జన్మించిన స్వారోచిషునిలో ప్రవరుని అందచంద ములు, తేజస్సే గాక శాంతి దాంతి దయా సత్యశౌచములును సంక్రమించినవి.

(మ. చ. 6-101) మరియు స్వరోచిలోని "శౌర్యధుర్యత" యు నాతనిలో కలదు. అనగా ఆతడు ప్రవర, గంధర్వ, స్వరోచులలోని సమస్త "సుగుణ రత్నానీకము" తోడ జన్మించినాడు.

స్వారోచిషుడు విష్ణుదేవుని గూర్చి తపస్సు కావించినాడు. విష్ణుదేవుడు ప్రత్యక్షమై వరమువేడుకొనమనగా స్వారోచిషుడు సాలోక్యము నర్థించెను. విష్ణువు సాలోక్యము నీకు తుదినిచ్చెదనిపుడు ద్వితీయ మనువువై భూమిని పాలింపుమని స్వారోచిషుని ఆదేశించెను. గంధర్వ స్వరోచులలోగాని, వరూథినిలో గాని లేని స్వారోచిషునిలోని ఈ విరాగత్వము ప్రవరుని నుండి లభించినదే నైష్ఠికుడైన ప్రవరుడు స్వర్గలోకమును పొందినాడో లేదో గాని యాతని యంశను గ్రహించి జన్మించిన స్వారోచిషుడు తపోబలము చేత విష్ణువును మెప్పించి మనుత్వమును, సాలోక్యమును సాధించెను. ఈ విధముగా ప్రవరుడు మనుజన్మకు సాక్షాత్కారణము కాకున్నను పరంపరాకారణమగుచున్నాడు. కావ్య ప్రారంభ మున వర్ణింపబడిన ప్రవరుని రూపగుణశీలములు కావ్యాంతమున మనువులో సంక్రమించినట్లు చెప్పబడుటచేత ప్రవరునిచరిత్ర ప్రధానవస్తువగు మనుసంభవ మునకు పునాదియై వస్త్వైక్యము సాధింపబడినది. ఇట భామహుని వచనములు స్మరింప దగినవి -

నాయకమ్ ప్రాగు పన్యస్య వంశ వీర్య శ్రుతాదిభిః
న తస్యైవ వధమ్ బ్రూయాదన్యోత్కర్షాభి ధిత్సయా
యది కావ్య శరీరస్యనస వ్యాపిత యేష్యతే
న చాభ్యుదయ భాక్తస్య ముదాదౌ గ్రహణమ్ స్తవే

కావ్యా. 1-22, 23

కావ్యాదిలో నాయకుని వంశ, బల, జ్ఞాన, గుణాదులను వర్ణించవలయును. ఇతర పాత్రోత్కర్షకై వాని వధ వర్ణింపగూడదు. కావ్యమున వాని వ్యాపకత గాని, అభ్యుదయ సాధన గాని లేకపోయినట్లయిన కావ్యారంభమున నాయకుని గుణ ప్రశంస వ్యర్థమగును. అనగా కావ్యమున ప్రధాన పాత్ర వహించని గుణ ప్రశంస కావ్యారంభమున చేయకూడదు. కావ్యారంభమున నొక పాత్ర యొక్క గుణప్రశంస గావింపబడిన యెడల కావ్యమున వాని ప్రయోజనమేదైన ఉండ

వలెను లేదా అవి కార్యసిద్ధికై కారణము గాని కావలెను. అట్లు కార్యసాధకమైననే గుణప్రశంస కావింపవలెను. లేకున్నలేదు. పెద్దన మనుచరి త్రప్రబంధారంభమున ప్రవరుని గుణప్రశంస నాలంకారికులు చెప్పిన దానిని మననముసందిడుకొనియే కావించి యున్నాడు. ప్రవరుని సౌందర్యము తేజస్సు, శాంతి, దాంతి, దయా, సత్య శౌచములు స్వారోచిషునిలో సంక్రమించి ఆతనిని మనువును గావించినవి. కావున కావ్యారంభమున గావింపబడిన ప్రవరుని గుణప్రశంస వ్యర్థము గాక భామహుడు చెప్పినట్లుగా కావ్యఫలసాధనమై వస్త్వైక్యసిద్ధికి తోడ్పడినది.

ఈ విధముగా మనుచరిత్రలోని వివిధ కథలన్నియు స్వారోచిష మనుసంభవమను ఏకైకకార్య ప్రాప్తిని ఫలముగా గలవి. కావున మనుచరిత్ర లోని ఇతివృత్తమున వస్తుసంబంధి వస్త్వైక్యము సాధించబడినది.

రామరాజభూషణుడు తాను గ్రహించిన ఇతివృత్తమున రసవ్యంజ కతకై చాల మార్పులను, కల్పనలను కావించినాడు. వసుచరిత్ర కావ్యము మొదటి నుండి చివర వరకును నాయికానాయక సమాగమోన్ముఖమై నడిచినది. ఇందలి ప్రధానరసము శృంగారము. రామరాజభూషణుడు వసుచరిత్రలో నాటకములో వలెనే పంచసంధులను పోషించుచు వస్త్వైక్యమును ప్రదర్శించు టయే గాక నాటకములో వలెనే రసైక్యమును గూడ సాధించిన మేటి. విభావాను భావ సంచార్యాదుల చేత వసుచరిత్రలో కవి శృంగార రసమును నిండుగా పోషించినాడు. అందువలన "సాహిత్య రసపోషణ"డను రామరాజభూషణుని బిరుదము సార్థకమగుచున్నది. రససంబంధి వస్త్వైక్యమును సాధించుట చేత వసు చరిత్ర శ్రీహర్షాదుల మహాకావ్యస్థాయి నందుకొని మొట్టమొదటి ప్రబంధమనదగి యున్నది. "పెద్దనలో లేని వస్త్వైక్యమను తాను సాధింపగోరి రామరాజభూష ణుడీ వసుచరిత్రను వ్రాయబూనె" నని శ్రీ వజ్ఝల వారభిప్రాయపడిరి.[1]

మనుచరిత్ర బహునాయకాశ్రయమై మనుసంభవమను ఫలోన్ముఖమై వస్తుసంబంధి ఫలోదయాశ్రిత వస్త్వైక్యము గలది కాగ, వసుచరిత్ర సంభోగ శృంగారోన్ముఖమై నడుచు నాయికానాయకాశ్రితమైన రససంబంధి వస్త్వైక్యము గలది. మహాకావ్య భార్గవులగు భారవి, మాఘ, శ్రీ హర్షాదుల ఏకనాయకాశ్రయ

1. వసుచరిత్ర విమర్శనము, పుట 27, 28.

మైన రసైక్యము గల మహాకావ్యముల కోవలోనికి చెందినది వసుచరిత్ర. ఆనందవర్ధనుడు చెప్పిన రసవ్యంజకతను సాధించినట్టిది. రామరాజభూషణుడు ప్రబంధవిశేషమగు రససంబంధి వస్త్వైక్యమును సాధించుట చేత పురాణ లక్షణ విశేషమగు వస్తుసంబంధి వస్త్వైక్యమును సాధించిన మనుచరిత్రను మించినాడని చెప్పవలెను.



# ప్రబంధ నామ విచారము

మనువులలో స్వారోచిష
మనుసంభవ మరియు రసస్ఫురంచిత కథలన్
విన నింపు కలిగు ధ్వంసక
మనము! భవచ్చతుర రచన కనుకూలంబున్.

మ. చ. 1-16

అని శ్రీకృష్ణదేవరాయలు మార్కండేయ పురాణోక్త ప్రకారంబుగ "స్వారోచిష మనుసంభవ" మునే పెద్దనామాత్యుని రచింపుమని కోరినాడు. పెద్దనయు తన ప్రబంధమునకు స్వారోచిషమనుసంభవ మని నామకరణము గావించిట్లుగా కథా ప్రారంభ గద్యమును బట్టియు, ఆశ్వాసాంత గద్యమును బట్టియు స్పష్టమగు చున్నది —

"అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పంబూనిన స్వారోచిష మనుసంభవంబను మహా ప్రబంధమునకుఁగథా క్రమంబెట్టిదనిన....."
అని కథాప్రారంభ గద్యము.

"...... అల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిష మనుసంభవంబను మహాప్రబంధము నందు......" అని ఆశ్వాసాంత గద్యము. దీనిని బట్టి శ్రీకృష్ణదేవరాయలు రచింపు మన్నది స్వారోచిష మనుసంభవమునే పెద్దన రచించినది స్వారోచిషమనుసంభవమే అని తెలియు చున్నది. కాని "మనుచరిత్ర"యను నామ మీ ప్రబంధమునకు ఏల కలిగెను. అట్లు కలిగిన ఎప్పటి నుండి యది వ్యాప్తిలోనికి వచ్చెనను ప్రశ్నలు పుట్టును

కృష్ణరాయల పేరునిడి నీవు రచియించితివి
తొల్త - విష్ణుచిత్తీయ మనఁగ

కారిక్యమర్థంబు గ్రాహ్యంబు గాదు సాధారణులు
కని భూధవుడు పలుక
తరువాత మనుచరి తము నొనరించి తుత్తమ
కావ్యము మహాద్భుతముగఁబిదపఁ

అని చాటు వొకటి కలదు. మరియు —

కరమర్థిఁగవి రాయ గండ పెండేరంబు
చెల్లించు కొన్నట్టి బల్లిదుండు
కవుల లోపల నాంధ్ర కవితా పితామహ
బిరుదాంకితుడైన గంభీర మూర్తి
మనుచరిత్రాది సమ్యక్కావ్య రచనము
సలిపిన వైష్ణవ చక్రవర్తి

అని ఆముక్తమాల్యద వ్యాఖ్యాతయగు గుడిపాటి వెంకన చెప్పినట్లు కలదు. కోకటముకై ఫియత్తులో "రాయలవారి అంకితం మనుచరిత్ర విష్ణు చిత్తీయం..." అనియును పేర్కొన బడెను.

పెద్దన స్వయముగా తన ప్రబంధమును మనుచరిత్ర యని పేర్కొని నట్లుగా నొక చాటు పద్యమాధారముగా కలదు.

మనుచరిత్రంబందుకొను వేళఁబురయేఁగఁ
బల్లకిఁదనకేలఁబట్టియెత్తె......"

ఈ విధముగా కావ్యమున స్వారోచిషమనుసంభవమను నామమే కనిపించుచున్నను మనుచరిత్ర యను పేరు కూడ వ్యాప్తిలో నున్నట్లు తెలియు చున్నది.

రామరాజభూషణుడు తన ప్రబంధమునకు "వసుచరిత్ర" యను నామమొసంగెను. వసుచరిత్ర కథాప్రారంభ గద్యమున – "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన వసుచరిత్రంబను మహా ప్రబంధమునకుఁ గథాక్రమంబెట్టిదనిన......" అనియు "సాహిత్యరసపోషణ రామరాజభూషణ

ప్రణీతంబైన వసుచరిత్రంబు నందు ......" అని ఆశ్వాసాంత గద్యము నందును తన ప్రబంధమును వసుచరిత్రయనియే రామరాజభూషణుడు స్పష్టముగా పేర్కొని యున్నాడు వసుచరిత్ర ప్రబంధమున వసురాజు యొక్క చరిత్ర నిబద్ధింపబడినది. కావున దీనికా పేరు ఎంతగానో తగియున్నది. రామరాజభూషణుడు "పేరు పెట్టుట యందును దానిని (అనగా మనుచరిత్రను) ధిక్కరించి మెరుగు చూప సమకట్టె" నని వసుచరిత్ర యను నామము ప్రబంధమునకు సార్థకముగా నున్నదని శ్రీ వఝ్ఝల వారి యభిప్రాయము [1]

మనుచరిత్రలో నెక్కువ భాగమునందు ప్రవర వరూధినుల, స్వరోచి మనోరమాదుల చరిత్రయే నిబద్ధింపబడినది అందు స్వారోచిషమనుసంబంధి చరిత్ర కనిపించదు ప్రబంధము చివర స్వారోచిషుని జన్మము, తపస్సు మాత్రమే చెప్పబడియుండుటచే నీప్రబంధమునకు మనుచరిత్రయను పేరు నేతిబీరకాయ వంటి దగుచున్నది. మనుచరిత్ర పేరు ప్రబంధమునకు సౌందర్య హేతుకముగా గాక వస్తువిషయమున కొంత అపోహ కలిగించునదియును నై యున్నది. ఇట్టి పేరును పెద్దన స్వయముగా పెట్టినాడనుట సందేహజనకముగా నున్నది. పెద్దన స్పష్టముగా ప్రబంధ ప్రారంభమున, ఆశ్వాసాంత గద్యము లందును ప్రబంధనామమును స్వారోచిషమనుసంభవమనియే పేర్కొనియున్నాడు. శ్రీకృష్ణదేవరాయలు రచింపు మన్నది "స్వారోచిష మనుసంభవ"మే. పెద్దన రచించినదీ స్వారోచిషమనుసంభవమే. ఇక పోయిన చాటు పద్యములలో మనుచరిత్రయను పేరు కానవచ్చుచున్నది. కాని ఈ చాటువులు అర్వాచీనములు. కైఫియత్తులో మనుచరిత్రతోబాటుగా విష్ణుచిత్తీయము పెద్దనగారి రచనగాను, రాయలవారి కంకితముగాను చెప్పబడుటచే నది అసమగ్రమనియు, అర్వాచీనమనియు తెలియుచున్నది. ఇక "మనుచరిత్రంబందుకొనువేళ...."అను పెద్దన చెప్పినాడను చాటుపద్యములో 'మనుచరిత్ర' కు మారుగా 'మనుసంభవ' మన్నను ఛందోదోషము సంభవించుటలేదు. కావున మనుచరిత్రయను పేరు పెద్దన తరువాత ఆతని ప్రబంధమునకు కలిగినదే కాని ఆతడు స్వయముగా నిచ్చినపేరు మాత్రము కాదని తేలుచున్నది. పెద్దన పెట్టిన "స్వారోచిష మనుసంభవము" లేక "మను సంభవము" ను పేరునే మనము గ్రహించినయెడల కథకును పేరుకును పొత్తుకుదురును. మనుచరిత్ర యనునపుడు సుస్పష్టముగాని వస్త్వైక్య

1. వసుచరిత్ర విమర్శనము పుట. 27.

సిద్ధి స్వారోచిషమనసంభవ మనునపుడు సిద్ధించును. ఏలయన ప్రబంధము నందలి కథలన్నియు నదులు సముద్రమును చేరినట్లుగా స్వారోచిషమనుసంభవ మను కార్యప్రాప్త్యున్ముఖమైనవి. కాళిదాసుని కుమారసంభవము, తెలుగున నన్నె చోడుని కుమారసంభవములు కలవు ఆ పేర్లననుసరించి పెద్దన ప్రబంధమును మనుసంభవ మనుటలో కాఠిన్యమేమియు లేదు. కాని ఈ ప్రబంధమునకు కవి యొసగిన మనుసంభవమను పేరుగాక మనుచరిత్రయను పేరే బహుళ వ్యాప్తిలో నున్నది. ఇట్టిపేరు 'వసుచరిత్ర' ప్రబంధనామము ననుసరించి ప్రచారములోనికి వచ్చియుండును. వసుచరిత్ర నామము కవి యొసంగినదే, ఆ ప్రబంధమునకు ఆపేరు స్పష్టముగా చెప్పబడియున్నది అట్లుకాగా రామరాజభూషణుడు తన ప్రబంధనామమును 'వసుచరిత' గా 'మనుచరిత్ర' పేరు ననుకరించుచు పెట్టెనని యందురు కాని తన ప్రబంధమునకు పెద్దన యొసంగినపేరు స్వారోచిషమనుసంభవమనియే గాని 'మనుచరిత్ర' కాదని స్పష్టమగుచుండగా ఆ పేరును రామరాజభూషణుడనుకరించెననుటలో సామంజస్యము లేదు.

స్వారోచిషమనుసంభవమును ఉచ్చారణ సౌలభ్యమునకై మనుసంభవ ముగా చేసినను కుమారసంభవమనునపుడున్నంత ఉచ్చారణసౌలభ్యము మను సంభవమనుటలో లేక పోవుటచేతనో మరేకారణముచేతనో ఆ కావ్యమును మనుచరిత్ర యనదొడగిరి అట్టి మనుచరిత్రకు రామరాజభూషణుని వసుచరిత్ర రచనానంతరము దీని నామసామ్యముతో మనుచరిత్రయను నామము వ్యాప్తి లోనికి వచ్చియుండును. తంజనగరము తేవపెరుమాళ్ళయ్యగారి యభిప్రాయ మున—"మనుచరిత్ర యనుటకన్న మనుసంభవమనుటయే యుచితము. ఇది యే పెద్దన యాశాస్వాంత గద్యములలోను చెప్పియున్నాడు కావున నిదియే మొదటి నామము. తక్కినవి వ్యవహారవశమున వచ్చియుండును.[1]" ఈ వ్యవహారవశమున వచ్చుటకు ఏదియో కారణముండవలెనుగదా! అది వసుచరిత్ర ప్రబంధనామ ప్రభావమేయై యుండును.

సంస్కృతమున శ్రీహర్షుని నైషధము శృంగార రసప్రధానమైనది దానిని శ్రీనాథుడు శృంగారనైషధమను పేర ననువదించినాడు. తెలుగులో నంతవరకు శృంగార రసమంగిగా గల కావ్యములు లేకపోవుటచే శ్రీనాథుడు

1. మనుచరిత్ర పీఠిక పుట 3, 1909 ప్రచురణ.

కావ్యనామములోనే అట్టి శృంగారరసము ప్రాధాన్యముగా గల కావ్యమని సూచించుటకై శృంగారనైషధమని నామముంచెను. తరువాత పిల్లలమఱ్ఱి పినవీరన శకుంతలా దుష్యంతుల కథను గ్రహించి "శకుంతలా పరిణయ" మను పేరుతో కావ్యముగా రచించెను. ఈ కావ్యమునందును శృంగారరసము ప్రధాన మగుట చేతనేమో "శృంగారశాకుంతల" మనునామము దానికి ప్రచారములోనికి వచ్చినది. ఇట్లు ఒక కావ్యము ననుసరించి మరొక కావ్యనామము మారి ప్రచారములోనికి వచ్చుట సంభవించును. అట్లే వసుచరిత్రనను సరించి మను చరిత్రకా పేరు ప్రచారములోనికి వచ్చియుండును. లేకున్న పెద్దన తన కావ్యమునకట్టి యసందర్భపు పేరు పెట్టియుండడు. వసుచరిత్ర ప్రబంధ నామము యొక్క ప్రభావమున పెద్దన మనుసంభవ కావ్యమునకు 'మనుచరిత్ర' మను పేరు స్థిరపడినదన్న దానికి తక్కువతనమురాదు.



# వర్ణనలు

## అష్టాదశ వర్ణనలు

మహాకావ్యమున వర్ణ్యవిషయములనుగూర్చి దండి ఇట్లు చెప్పెను—

నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనైః
ఉద్యాన సలిలక్రీడామధుపాన రతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రదూత ప్రయాణాజినాయకాభ్యుదయైరపి

కావ్యాద. 1–16, 17.

మహాకావ్యమున యథాయోగ్యముగా, సాంగోపాంగముగా వర్ణించదగిన విషయములగూర్చి విశ్వనాథుడిట్లా చెప్పెను—

సంధ్యాసూర్యేందురజనీ ప్రదోషధ్వాంతవాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయాశైలర్తువన సాగరాః
సంభోగ విప్రలంభౌ చ్చముని స్వర్గపురాధ్వరాః
రణప్రయాణోపయమ మంత్రపుత్రోదయాదయః

సా. ద. 6–322, 323.

దండి వర్ణ్యవిషయములలో చేర్చిన సలిలక్రీడ, మధుపానములను విశ్వనాథుడు పేర్కొనలేదు దండి చెప్పని సంధ్య, రజని, ప్రదోష, ధ్వాంత, వాసర, మృగయా, ముని, స్వర్గ అధ్వరములను విశ్వనాథుడు కావ్యవర్ణ్యములలో చేర్చినాడు.

రుద్రటుడు, దండి విశ్వనాథులు చెప్పిన కావ్యవర్ణ్యములనే దాదాపుగా గ్రహించి విశదముగా **12** శ్లోకములలో వివరించినాడు. (కావ్యా 16:7–18).

సంస్కృతమున మహాకావ్యములకు చెప్పిన వర్ణనలనే ప్రబంధకవులు గ్రహించిరి. సంస్కృతాలంకారికులు చెప్పిన వర్ణనల సంఖ్యకు ఒకటిరెండు వర్ణనల నధికముగాచేర్చి తెనుగున చెప్పబడినవి. అప్పకవి ప్రబంధమున ఇరువది రెండు వర్ణనలుండవలెననియు, అందుకొన్ని లేకున్నను ఆ కావ్యము ప్రబంధ మనబడునని నుడివెను—

"పురమును, ఋతుషట్కమును, ప్రయాణంబును
శైలంబు, వేటయు, సాగరంబు,
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును, మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు, మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు

పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస!"

దండి, విశ్వనాథాదులు పేర్కొనని కన్యాంగసౌందర్యకథనదౌహృద వనవిహారమున్యాశ్రమ వర్ణనల నదనముగా అప్పకవి పేర్కొనినాడు. విశ్వనాథుడు వన, ముని యను వర్ణనీయములనుగూర్చి ప్రసంగించెను. అప్పకవి వనవిహారమున్యాశ్రమములుగా వానిని స్పష్టపరచినాడు. శాకుంతల, మను చరిత్రాది తెలుగు కావ్యములను పరిశీలించి అప్పకవి వేటను విశ్వనాథునివలెనే కావ్యవర్ణ్యవిషయములలోచేర్చినాడు. నైషధ, రఘువంశాది కావ్యములందు కన్యాంగసౌందర్యకథనదౌహృదములు కనిపించుచున్నవి. అయినను సంస్కృతాలంకారికులు వానిని మహాకావ్యవర్ణనీయములలో చేర్చలేదు. అప్పకవి తెలుగు కావ్యములలోను అట్టి వర్ణనలుండుటచూచి వానినిసైతము కావ్యవర్ణ్యవిషయము

లలో చేర్చినాడు. మొత్తముమీద అప్పకవి చెప్పిన ప్రబంధ వర్ణనలు తెలుగు ప్రబంధములను పరిశీలించి చెప్పినట్టివిగాతోచును

ప్రబంధరాజములగు మనుచరిత్ర, వసుచరిత్రలలో వర్ణింపబడిన యంశములలోని భావ, శైలిసంబంధిసామ్యవైషమ్యములను పరిశీలింతము —

—*ం*—

# పురవర్ణన

దండి ఆప్పకవ్యాదులు పురవర్ణనను కావ్యవర్ణనలలో నొకటిగా పేర్కొనిరి. కావ్యారంభముననే పురవర్ణన ఉండవలయునని సంస్కృతకవులు పాటించినట్లు లేదు. ఇక తెలుగులో నన్నయ మహాభారతమున ఆదిపర్వ అష్టమాశ్వాసమున ఇంద్రప్రస్థపురమును దీర్ఘముగా వర్ణించినాడు. తిక్కన నిర్వచనోత్తరరామాయణమున ప్రథమాశ్వాసారంభమున అయోధ్యాపుర వర్ణనను గావించినాడు. ఎఱ్ఱన నృసింహపురాణమున వైకుంఠపురమును దీర్ఘముగా వర్ణించియున్నాడు. ఈ కవిత్రయముయొక్క పురవర్ణనలు దీర్ఘములై సాంగోపాంగములై ప్రబంధయుగకవుల పురవర్ణనలను తలపించుచున్నవి (ఆ. ప. 8:70-79, ని. రా. 1:46-68, నృ.పు. 1:43-55) శ్రీనాథుడు సంస్కృతనైషధముననుసరించి నాయక వర్ణనతో కావ్యారంభమును గావించెను. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలముననుసరించి పినవీరన శృంగారశాకుంతలమును రచించెను. అందీతడు పురవర్ణనతో కావ్యమునారంభించెను. అంతకుపూర్వము విక్రమార్క చరిత, కేయూరబాహుచరిత్ర మొదలగు కథాకావ్యములు పురవర్ణనతో నారంభింపబడినవి. కావ్యారంభమున మొదట నగర వర్ణన ఆ తరువాత తన్నగరస్థితనాయక ప్రశంస చేయవలెనని రుద్రటుడు చెప్పినాడు—

> తత్రోత్పాద్యేపూర్వం సన్నగరీవర్ణనం మహాకావ్యే
> కుర్వంతి తదను తస్యాం నాయకవంశప్రశంసాంచ
>
> కావ్యా. 16-7.

ఈ సాంప్రదాయమునే తెలుగు ప్రబంధకవులు పాటించినారు.

పెద్దన మనుచరిత్రను అరుణాస్పదపురవర్ణనతో ప్రారంభించినాడు. ఈ వర్ణన రెండుపద్యములలో చేయబడినది. (మ.చ. 1:49-50) పంచమాశ్వాసమున ఒక్క పద్యములో గంధర్వనగరవర్ణనచేయబడినది మ.చ. 5-30) రామ

రాజభూషణుడు వసుచరిత్రమును అధిష్ఠానపురవర్ణనతో నారంభించినాడు. (వ.చ. 1:94-114) ఇది ఇరువదియొక్క పద్యములలో చేయబడినది. పంచమాశ్వాసమున ఇంద్రుడు నిర్మించి కోలాహలుని కిచ్చిన దివ్యనగరవర్ణన పది పద్యములలో చేయబడినది. (వ.చ. 5:41-50)

పెద్దన అరుణాస్పదపురవర్ణనా సందర్భమున అచటి నది, కోట, బురుజులను, భవనములను, చాతుర్వర్ణ్యమును, వేశ్యలను వర్ణించెను

రామరాజభూషణుడు అధిష్ఠానపురవర్ణనా సందర్భమున తరులను, సంపదలను, కోటగోడలను, పరిఖ, చాతుర్వర్ణ్యమును, గజాశ్వములను, రథములను, నాట్యశాలలను, భవనములను, గోపురములను, స్త్రీలను, ఉద్యానవనములను, పుష్పలావికలను, నదిని, సమీరడింభములను, శాలిపాలికలను, వర్ణించినాడు.

పెద్దన అరుణాస్పదపురము ఆర్యావర్తదేశమున "మహికంఠహార తరళస్ఫూర్తి విడంబింపుచు" న్నదని నుడివెను. రామరాజభూషణుడు అధిష్ఠానపురము జలముచేత నావరింపబడిన-హిరణ్మయమైన బ్రహ్మాండమువలె నొప్పుచున్నదని శ్లేషాలంకారసాహాయ్యమున ప్రౌఢోక్తితో చెప్పెను-

"వెలయు నావరణాంబు సంవీత హాట
కాండమోహాద పరిఖావృతాంఘ్రి వజ్ర
దంతురప్రాంతగంగా నిరంతరాగ్ర
భూరి వరణం, బధిష్ఠానపురవరంబు" వ.చ 1-94.

ఇందు రామరాజభూషణుడు "ఆవరణాంబు" అనుచోట పెద్దన వర్ణించిన అరుణాస్పదనగరము నంటి ప్రవహించు వరణానదిని స్మరించినాడు. ఆశబ్దమును ఆవరణ + అంబు అనియు, ఆ + వరణా + అంబు అనియు విడదీయ వీలగుచున్నది, 'వరణ' శబ్దప్రయోగము కవి అప్రయత్నముగచేసెనో, లేక మను చరిత్రలోని 'వరణా' నదిని స్మరింపజేయుటకు వేసెనో తెలియదు.

అరుణాస్పదపురము "వప్రస్థలీచుంబితాంబరమై సౌధసుధాప్రభా ధవళితప్రాలేయరుఙ్మండలీహరిణంబై" యొప్పుచున్నది. అదేవిధముగా ఆకాశ

మంటు కోటగోడలను రామరాజభూషణుఁడు ఒక పద్యమున చమత్కారముగా వర్ణించినాడు-

"అలఘు తరగ్రహాంశు గుణితాభినుతాగ్ర రత్నకం
దళరుచిఁబొల్చు పీటివరణంబు గతావరణంబొనర్ప, ని
చ్చలునల కోటకొమ్మలు సందుల పొందుల నేగగాఁ జుమీ
యలవరిచెం బతంగుఁ డసహాయ రథాంగముగా శతాంగమున్"

వ.చ. 1-95.

అధిష్ఠానపురపు కోటకొమ్మలకు నవరత్నములు పొదగబడినవి. నవగ్రహముల కాంతి ప్రసరణచేత నవరత్నములకాంతి ద్విగుణీకృతమై ప్రకాశించుచున్నది. ఆ కోటకొమ్మలు ఆకసమువరకు వ్యాపించి యుండుటచే, సూర్యునకు ప్రతి నిత్యము గమననిరోధమగుచున్నది. సూర్యుడు అసహాయచక్రముగల రథము నేర్పరచుకొని కోటసందులనుండి యేదోవిధముగా ప్రయాణము నలవరచుకొనెను.

పెద్దన పురవర్ణనకన్న రామరాజభూషణుని పురవర్ణన సాంగోపాంగము, భావ, అలంకారవైచిత్రితో నొప్పుచున్నది. పెద్దన మనుచరిత్రలో ప్రవరుడు పూర్వకథాభాగముననే నాయకుడు. ప్రవరుని వర్ణనతో కావ్యము నారంభించుచు అతడు నివసించు అరుణాస్పదపురమును ప్రాసంగికముగా మాత్రమే పెద్దన రెండు పద్యములలో వర్ణించినాడు. వసుచరిత్రలో నాయకుడు రాజు. అధిష్ఠానపురమునేలువాడు. కావున కవి పురవైభవవర్ణన మూలమున వసురాజు రాజ్యసమృద్ధివైభవమును ద్యోతకమగునట్లుచేయుట అవసరము; కాన వసుచరిత్రలో సాంగోపాంగమైన పురవర్ణన ప్రబంధౌచితీపోషకము. పెద్దనామాత్యునికి పంచమాశ్వాసమున రెండవమారుసైతము పురవర్ణనను విశదముగా చేయునవకాశము లభించలేదు. అచటను పురవర్ణన విస్తారముగా చేసినచో నది యప్రాసంగికమగును. అందుకే పెద్దన ప్రబంధౌచితికై పురవర్ణనను సుదీర్ఘముగావించలేదు. ఇరువురు మహాకవులును కారణములనుబట్టిచూడ ఔచిత్యమును పాటించిరనియే చెప్పవలెను.



# నాయక వర్ణన

కావ్యము నాయక వర్ణనతో ప్రారంభమగుట సాధారణముగా కనిపించును. పురవర్ణన కావ్యాదిన నిబద్ధమైనయెడల దానినేలు కావ్యనాయకుని వెంటనే వర్ణించుట కనిపించును. మహాకావ్యము నాయకునియొక్క కార్యారంభ, ఫలప్రాప్తులను చెప్పవలయునని ఆలంకారికులమతము. దండి కావ్యవర్ణ్యములలో నాయకాభ్యుదయమునుకూడ చేర్చిచెప్పెను. మఱియు భామహదండ్యాచార్యులు మహాకావ్యము సదాశ్రయమైయుండవలెననిరి. అనగా మహాకావ్యమున సత్పురుషుడైన పురుషుని చరిత్ర నిబద్ధింపబడవలయును. రుద్రటుడు మహాకావ్యమున నాయకుని మంత్ర, దూత, ప్రయాణము ~~వర్ణింపబడవలయునని~~ యుద్ధము, విజయము, వివాహము, కుమారోదయము వర్ణింపబడవలయునని చెప్పెను. (కావ్యా. 16:11–18) ఈవిధముగా రుద్రటుని యభిప్రాయమున మహాకావ్యము నాయకచరిత్ర నిబద్ధించునట్టిది. రుద్రటుడు ప్రబంధమును "ప్రబధ్యతే నాయకచరితమ్" అని నిర్వచించుటనుబట్టికూడ మహాకావ్యము నాయకప్రధానమైనదని తెలియుచున్నది రుద్రటుడు మహాకావ్యారంభమున నగరము, నగరములోని నాయకవంశప్రశంస, తదనంతరము నాయకవర్ణన చేయవలయునని చెప్పెను. (కావ్యా 16–7) దీనినిబట్టి కావ్యారంభమున నాయకప్రశంస రచింపబడవలయునని తెలియుచున్నది.

మనుచరిత్ర బహునాయకాశ్రితమైనది. ప్రవర, స్వరోచి, స్వారోచిషులు – ముగ్గురు నాయకులు. వారిలో ప్రవరుడు ధీరశాంతుడు. ప్రవరుని గుణప్రశంసలో కవి కడునేర్పును చూపినాడు. మనుచరిత్ర పేరు విననంతనే ప్రవరనామము పాఠకుల హృదయములలో స్ఫురించును. అతడే కావ్యమంతయు నాక్రమించి పాఠకహృదయములందు తిష్ఠవేసుకొనును. అతడే కావ్యమున ప్రధాన నాయకుడనుభ్రమకల్గును. ఈ ప్రవరుని తేజస్సు మనువునందు నిక్షిప్తమైనది. ప్రవరుని శమదమాది గుణములను గ్రహించి స్వారోచిషుడు

జన్మించినాడు. అట్టి ప్రవరుని తేజస్సు, నియమనిష్ఠతోకూడి నశీలమును, పెద్దన పెద్దగా వర్ణించినాడు. పొల్లువోని శబ్దరచనతో భావికథా సూచకమును, పోషకమును, అగు సౌందర్యశీలాదుల వర్ణనతో కూడిన నాయక వర్ణనను పెద్దన కావ్యారంభమున గావించినాడు.

మనుచరిత్రలో రెండవనాయకుడైన స్వరోచివర్ణనను పెద్దన విశేషముగా వర్ణించకపోయినను కథావృత్తాంతముల ద్వారా ఆతనిగుణములు వ్యజ్యమానములగుచున్నవి. స్వరోచి విద్యాభ్యాసము, వేట, యుద్ధములను కవి వర్ణించినాడు. వేట, రాక్షసునితోడి యుద్ధము, మనోరమను రాక్షసునిబారినుండి రక్షింపబూనుకొనుట, కళావతీవిభావసులను ఆయుర్వేదవిద్యచే రోగవిముక్తలను చేయుట, మొదలగు వృత్తాంతముల వలన స్వరోచియొక్క ధైర్యసాహసపరాక్రమఔదార్యగుణములు ప్రకటితమగుచున్నవి. స్వరోచి కాముకుడనుట చక్రవాకి, హరిణముల మాటలద్వారా ప్రకటమగుచున్నది. కాముకత్వము వలననే యాతడు మనుస్థానమున కర్హుడు కాలేకపోయె ననవచ్చును.

మనుచరిత్రలో మూడవనాయకుడు స్వారోచిషుడు ప్రవరుని శమదమాదులీతనిలో నిక్షిప్తమైయున్నవి. విష్ణువును గూర్చి తపముగావించి సాలోక్యమును వేడెను. కాని విష్ణువాతనిని మనువై ధర్మముగా భూమండలమును పాలింపుమని ఆదేశించెను. అట్లే స్వారోచిషుడు శాంతి, దయా, శౌచసత్య నిరతుడై ప్రజలను కన్నబిడ్డలవలె పాలించెను.

వసుచరిత్రలో నాయకుడొక్కడే–వసురాజు. అతడు చేది దేశమునకు రాజు. రాజునందు కీర్తి, ప్రతాపము, ఆజ్ఞా, దుష్టదండన, వివేకిత్వ, సంగ్రామ, శస్త్రాభ్యాస, రాజనీతి, క్షమా, ప్రజాపాలన, శత్రుశైలాధివాస, అరిపురశూన్యత్వ, ఔదార్య, ధైర్య, గాంభీర్య, శౌర్య, ఐశ్వర్య, ఉద్యమాదులు వర్ణితముగావలయును. (కా.సం. పుట. 234) పెద్దన స్వరోచిలో నీ గుణములను కొన్నిటిని వర్ణించినాడు. రామరాజభూషణుడు వసురాజునందు కీర్తి, పరాక్రమ, దుష్టదండన, ప్రజాపాలన, ఔదార్య, ధైర్య, గాంభీర్య, ఐశ్వర్యాదులను వర్ణించెను. (వ.చ. 1:116-124) వసురాజుయొక్క సౌందర్య ప్రసక్తిని కవి కావ్యారంభమున చెప్పక తృతీయాశ్వాసమున 46వ పద్యమున వర్ణించెను. ఇక

వసురాజు పరాక్రమమునకుమెచ్చి దేవేంద్రుడంతటివాడే ఆతనితో సఖ్యముగా విించినాడు. వసురాజు పరాక్రమము ముందు తనపరాక్రమమెందుకు పనికిరాదని దేవేంద్రుడు మనమున సిగ్గిలుచుండెడివాడట. ఈ విషయమును కవి అందముగా నిట్లుచెప్పెను—

"ఘనుఁడతఁడేఁగుదెంచి సరిగద్దియనుండ, నగారి శైలఖం
డనకథ చారణాళిపొగడన్ నిజసన్నుతి కోసరించు నే
ర్పునఁదలవంచి, పీఠతట రూఢమణిన్ బొటవ్రేలిపొటు న
య్యనఘుఁడు కొండమీటిన మహాద్భుతకృత్యముఁ దెల్పుకై వడిన్"
వ చ. 1–122,

వసురాజు దేవేంద్రునివలెనే నగారి. ఇంద్రుడు పర్వత గర్వమును "శతకోటి" సాధనముతో ఖండించినాడు వసురాజో! నఖమాత్ర సాధనముచేతనే నగాద త్యమును మాన్పినాడు! మరి దేవేంద్రుడేల సిగ్గుపడకుండును!

మనుచరిత్రలోని ప్రవరుడు ధీరశాంతుడు. స్వరోచి ధీరోదాత్తుడు. భార్యలందు సమాన ప్రేమను చూపుటచేత స్వరోచిలో ధీరలలిత లక్షణములును కన్పించును. వసుచరిత్రలోని నాయకుడగు వసురాజు ధీరో దాత్తుడైనను ధీరలలితలక్షణములు అధికముగా కలవాడు. మనుచరిత్రలో అంగిరసము శాంతము ధీరశాంతనాయక వర్ణనతో కావ్యారంభమగును. ఇది సమంజసము. పెద్దన ప్రవరుని వర్ణనలోనెంత నేర్పును ప్రదర్శించెనో, వసు రాజు వర్ణనలో రామరాజభూషణుడును అంతే నేర్పును ప్రదర్శించెను.
ప్రవరునివర్ణన—

అర్ధచంద్రునితేట నవఘళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగ మట్టితోడ
చెక్కుటద్దములందుఁ జిగివెల్లువలు చిందు
రమణీయ మణికుండలములతోడఁ
బసిఁడిప్రాతచెఱంగు మిసిమిఁదోఁపఁ జెలంగు
నరుణాంశుకో త్తరీయంబుతోడ

సరిలేని రాకట్టు జాళువామొలకట్టు
బెడఁగారు నీర్కావి పింజతోడ

ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాశికాముద్ర యిడిన యుంగరముతోడఁ
శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁడయ్యెవియచ్చర ప్రవరుఁడపుడు"

మ.చ. 3-71

ఇందలి ప్రవరుని వేషధారణ ఆతని రూపశీలములకు తగినదిగానే యున్నది. ఇట్టి సహజవర్ణన ప్రవరుని వేషము, రూపలావణ్యములు పాఠకునికక్షిగోచరము లగుటకు దోహద మొసగినది. ప్రవరుని రూపవర్ణన గల పై పద్యమున శ్రీనాథుని రూపచిత్రణ గల పద్యముల పోకడ స్పష్టముగా గోచరించుచున్నది.

గిరికాదులముందు వసురాజు లతాదులమాటునుండి వచ్చి నిలిచినపుడు ఆతని రూపమిట్లు వర్ణింపబడినది.

"తలిరుఁ బ్రాయమువాని వలరాజు నలరాజు
నలరాజుఁదెగడు సోయగమువానిఁ
బసిఁడి చాయలవానిఁ బగడంబు జగడంబు
జగడంబు గలమోవి సొగసువానిఁ
దళుకుచెక్కులవానిఁ దులకింపుఁ బలుకెంపు
పలుకెంపులొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించు దొరయించు
దొరయించు కాంచనాంబరమువాని

నొఆపు గలవాని, మకుట కేయూరహార
కటక కుండల చాకచక్యములవాని
నమ్మహీజానిఁ గనిలేచి యమిత వినయ
సంభ్రమముఁదోప నిలిచిరజ్ఞాతముఖులు"

వ.చ. 3-463.

ఇట వసురాజు లతలమాటునుండి బయల్వెడలుట, నైషధములో నలుడు శాంబరీ మహిమను తొలగించుకొని దమయంతి, ఆమె సఖులముందు వచ్చి నిల్చు దృశ్యమును తలపించును. అచట హఠాత్తుగా కనిపించిన నలునిగాంచి కాంత లందరు ససంభ్రమచిత్తలై లజ్జాభయముతో ప్రత్యుత్థానము గావించిరి. వసు రాజునుగాంచి యిట చెలువలు అమిత వినయసంభ్రమముతోడ నిల్చిరి.

వసుచరిత్రలోగల వసురాజువర్ణనాపద్యమున గల అనుప్రాస "వాని, వాని" యని సీసపాదముల ముగింపు, ముక్తపదగ్రస్తము, జగడంబు, పలు కెంపు, దొరయించు అనుచోట గల శబ్దశ్లేష, ఉపమాలంకారములు–ఇవియన్నియు పాఠకుని హృదయమును కట్టివేయును. ఇంకను సీసపద్యపు నడక సంగీత గీతమువలె చెవులకింపుగా సాగిపోవుచుండును. పెద్దనామాత్యునివలె రామరాజ భూషణకవి వసురాజు వేషధారణను వర్ణించలేదు. కాంచనాంబరము, మకుట కేయూరహార కటకకుండలములనుగూర్చి మాత్రము ప్రసంగించినాడు. ఇది నాటకములలో ముఖ్యముగా కూచిపూడినాటకములలో ప్రధానపాత్ర ప్రవేశవిధా నమును పాఠకునకు స్ఫురింపజేయుచున్నదేకాని వసురాజుయొక్క రూపమును సజీవముగా మాత్రము నిలుపుటలేదు. రామరాజభూషణుని పద్యములోని అలంకార, అర్థచమత్కృతులు పెద్దన పద్యములో కాన్పింపవు. పెద్దనలోని సజీవరూపచిత్రణ రామరాజభూషణునిలో లేదు.



# కన్యాసౌందర్య కథనము

కన్యాసౌందర్య కథనమును సంస్కృతాలంకారికులు మహాకావ్యవర్ణ్యములలో చేర్చియుండలేదు. ప్రబంధవర్ణనలలో దీనిని చేర్చినవాడు అప్పకవియే. నైషధ, శాకుంతల, వసుచరిత్రాది ప్రబంధ ములలోని నాయికల సుదీర్ఘవర్ణనల నాతడు పరిశీలించి దీనినొక వర్ణ్యవిషయముగా ప్రకటించినాడేమో. సంస్కృత మహాకావ్యములలో నఖశిఖపర్యంత స్త్రీవర్ణనలు కలవు. బాణుడు కాదంబరిలో కాదంబరీ, మహాశ్వేతలను సుదీర్ఘముగా వర్ణించియున్నాడు. నైషధమున శ్రీహర్ష మహాకవి నఖశిఖపర్యంతముగా దమయంతి వర్ణనను రెండుమార్లు కావించినాడు. కాళిదాసుసైతము స్త్రీవర్ణన చేసియున్నాడు. శ్రీహర్షుని నైషదకావ్యము తెనుగున కనువదింపబడిననాటినుండి నాయిక అంగాంగవర్ణన తెనుగు కవులకు వర్ణ్య విషయమయ్యెనని చెప్పవచ్చును. పినవీరన నైషధముననుసరించి రెండుమార్లు శకుంతల అంగాంగవర్ణన గావించినాడు. శ్రీనాథునకు పూర్వము నన్నెచోడుడు పార్వతిని నఖశిఖపర్యంతముగా రెండుమార్లు ప్రౌఢప్రబంధమార్గ మున వర్ణించియున్నాడు. నన్నయ. తిక్కన, ఎఱ్ఱన, నాచనసోమనాది కవులు సందర్భానుగుణముగ తగినమోతాదులలో స్త్రీ సౌందర్యవర్ణనను చేసినారు జక్కనాది పద్యకథాకావ్యకర్తలు కొంతమట్టుకు దీర్ఘముగా స్త్రీవర్ణన చేసి యుండిరి. కాని నైషధమువలె అవి ప్రౌఢమైన అంగాంగవర్ణనలు కావు.

మనుచరిత్రలో పెద్దన నైషధములోవలె నఖశిఖపర్యంత స్త్రీవర్ణన నెచటను చేయలేదు. వరూధిని విగ్రహమెట్టిదో పెద్దన ఒకేఒకపద్యమున ఇట్లు చెప్పినాడు.

"అతఁడావాత పరంపరాపరిమళ వ్యాపారలీలన్ జనా
న్వీత మిచ్చోటని జేరబోయికనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకఁ జికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలానొకానొక మరున్నారీశిరోరత్నమున్"

మ.చ. 2—25.

ఇందు వరూథిని కచకుచాదుల వర్ణనచేయబడినది. వరూథిని మెరుపుతీగవంటి శరీరముగలది, తుమ్మెదలవలె నల్లని వెంట్రుకలు గలది. పద్మదళమువంటి కన్నులు గలది, చక్రవాకములవంటి వక్షోజములు గలది, లోతైననాభి గలది. ఈ వర్ణనతో ఆమె అందమైనదని తెలియుచున్నది, తరువాత వీణవాయించు వరూథిని వర్ణనలో ఆమెరూపము పాఠకులకు ఇతర ప్రబంధ సుందరులకన్న భిన్నమై సజీవమై గోచరించును—

"తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపు కావిరంగు వలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్ల
వరుణాంగుళీధూత తంత్రీ స్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులునటింప
నాలాపగతిఁజొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్య విభ్రమముఁదెలుప...." మ.చ. **2–27**

ఈ పద్యమున వాచ్య వ్యంగ్యరూపమున వరూథిని సౌందర్యము వర్ణింపబడినది. "తతనితంబాభోగ" యనుచోట వాచ్యముగా నామె నితంబములు పరిపూర్ణత చెప్పబడినది. "కాయలుత్తుంగ కుచపాళినత్తమిల్ల" వీణకాయలతో కుచములు పోటీపడుచున్నట్లున్నవన్నమాట. ఆమె ముద్దులుగుపలుకుస్వరముతో వీణ వాయించుచు సన్నగా పాడుచున్నది, ఆమె రతిపారవశ్యవిభ్రమముతో గూడిన అరమోడ్పు కనులు యెట్టివారి హృదయమునైన లోబరచుకొనగలవు. మరియు వరూథిని ఔత్సుక్యముతో చూచునెడను, ప్రవరుని లోబరచుకొనవలయునని ప్రయత్నించునెడను, ఆమెవిలాసవిభ్రమములు పాఠకులకు వాచ్యవ్యంగ్య రూపమున గోచరించకమానవు.

"కాంతి పెల్లుబ్బి కనీనికల్ వికసితోత్పల పంక్తులగ్రుమ్మరింప", "విలోకన ప్రభావీచికలన్ తదీయ పదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్", "ఒయ్యారంబున చంద్రికల్ దనుకన్ జూచె" (మ చ. 2-29) అనుచోట్ల ఆమె అక్షిసౌందర్యమును, మరియు అవి,కోరికలతోనున్నపుడెట్లు మెరయునో చక్కగా చెప్పబడినది.

"ఝళంఝళత్కటక సూచితవేగ పదారవిందయై" అనునెడ ఆమె నడకలోని సౌందర్యము సూచింపబడినది "కుచంబులున్ దఱుము లేనడుమల్లలనాడ" అనునెడ ఆమె కుచకచభారము, సన్నని నడుము పాఠకులకు గోచరింపక మానవు.

"తనకనుఁగవ మెఱుఁగులుబ్బఁ దాటంకములున్
జనుఁగవయు నడుము వడకఁగ
వనిత సెలవివాఱనవ్వి......." (వ.చ. 2-40)

కనుగవలలోని మెఱుగులతో తాటంకములకదలిక, చనుగవ నడుముల కదలికలు, పెదవులుబాగుగావిచ్చి నవ్వుటలోని వరూథిని శృంగారవిలాసములు అపురూపముగా వర్ణింపబడినవి. "మదనహరునె నఁజదురునం గదియ గమకించు తిమురునన్". "జక్కవ గిబ్బలుంబోని గబ్బిగుబ్బలన్ జొబ్బిల్లు కుంకుమ రసంబునంబంకిలంబులగు హారముక్తాతారకంబుల సఖకోరకంబులంగిరి తీఱువడం జేయుచు, పతితవనతరు కుసుమ కేసరంబులు రాల్చు నెపంబునఁ బయ్యెద విదిల్చి చక్క సవరించు...." "జిడిముడిపాటు చూపులనంకురించు జంకెల" (వ.చ.2-61) సఖుల వారించుచున్న వరూధినిలో ప్రౌఢవనితాసౌందర్య విలాసవిభ్రమములు విస్పష్టముగా గోచరించును.

ఈ విధముగా పెద్దన నైషధ మార్గమున నాయికావర్ణనను గావింపక హృద్యముగా వాచ్యవ్యంగ్య రూపమున ఆమెరూపును పాఠకులముందు నిల్చునట్లుగా వర్ణించియున్నాడు. మనోరమ వర్ణనలో సైతము పెద్దన ప్రబంధ మార్గమున అంగాంగవర్ణనకు పూనుకొనలేదు. ఈ విషయమున రామరాజభూషణుడు పెద్దనవలెగాక నైషధాది కావ్యములమార్గమున గిరికను నఖశిఖపర్యంతముగా వర్ణించినాడు. నైషధ, శాకుంతలాది కావ్యములలోవలె నాయికావర్ణన రెండుమార్లు రామరాజభూషణుడు చేసినాడు-ఒకమారు విదూషకుని ముఖమున మరొకమారు నాయకుని ముఖమున విదూషకుని ముఖతః గిరికావర్ణన ఇరువదియారు పద్యములలోను (వ.చ. 2:27, 31-53), వసురాజు ముఖతః ఐదుపద్యములలోను కలదు. (వ.చ. 2:70-74).

గిరికావర్ణన సందర్భమున వసుచరిత్రకారుడు ప్రవరుని వర్ణనా సందర్భమున పెద్దన రచించిన రెండుపద్యములను అనుకరించినాడు. పెద్దన పద్యములు—

"నేరెటేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానబట్టిన రాపొడిచల్లి మెదిపి
పదను సుధనిడిఁ జేసెనో పద్మభవుఁడు,
వీనిఁ; గాకున్న గలదె యీమేనికాంతి"

"సురగరుడోరగ నరఖే
చర కిన్నర సిద్ధసాధ్యచారణ విద్యా
ధర గంధర్వకుమారుల
నిరతము గనుగొనియె! పోలనేర్తురె వీనిన్?"

మ చ. 2:36-37.

వీనిలోని పదములను, భావములను అనుసరించి వసువరిత్రకారుడు పద్యముల నిట్లు రచించినాడు—

"మేటి జమ్మేటియసటఁ గ్రొమ్మించు మించుఁ
బొదివి, మదనప్రతాపాగ్ని పుటమువెట్టి,
తమ్మి గద్దియ దాకటఁ గ్రమ్మి యట్టి
కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి

నరరాజకన్యలును, గి
న్నరరాజ కుమారికలు, ఫణాధర, విద్యా
ధర నీణాధరశోణా
ధరలును నాతరుణిఁ బోల్పఁ దగరునరేంద్రా!"

వ.చ. 2:32-31.

జంబూనది బురదలో సూర్యుని సానబెట్టగ రాలిన పొడిని కలిపిమెదిపి అమృతమును పదనుగ బెట్టుకొని ప్రవరుని బ్రహ్మ సృష్టించినాడని పెద్దన వర్ణించెను.

రామరాజభూషణుని యూహ మరికొంత ఉన్నతమైనది. జంబూనది బురదలో క్రొత్తమెరుపును కలిపి మదన ప్రతాపాగ్నిలో పుటము పెట్టుటయేగాక తమ్మిపూ గద్దియపై కమ్మిసాగించి గిరికను బ్రహ్మదేవుడు సృష్టించినాడట. బంగారము పుటము పెట్టుటచే పరిశుద్ధమగును. కమ్మిసాగించుటచే మెరుగెక్కును, చక్కనైనతీగెగా సాగును. అమృతముతో పదనుపెట్టు పెద్దన ఊహను వదిలిపెట్టి రామరాజభూషణు డదనముగా వీనిని కల్పించినాడు.

శ్రీహర్షుని తలపించు రామరాజభూషణుని కన్యాసౌందర్యవర్ణనలోని భావములు, ఊహాకల్పనలు, శ్లేషోక్తివైచిత్రులు, చమత్కార స్ఫోరకములై మించినవి. తరువాతి కవులు రామరాజభూషణుని అనుకరింప దలచి నీరసానుకరణలను మాత్రమే రచింప గలిగిరి. పెద్దన స్త్రీ వర్ణన నైషధవర్ణనల ననుకరించక స్వతంత్ర భావయుక్తమై, సహజ సుందరముగా నొప్పుచున్నది.

—*c*—

# శైల వర్ణన

దాదాపు ఆలంకారికులందరును శైలవర్ణనను ప్రబంధ వర్ణనీయములలో చేర్చిరి. కవిత్రయాది కవులు తెలుగు కావ్యములందు సందర్భానుసారముగ శైల వర్ణన గావించిరి శ్రీనాథుడు హరవిలాసమున కాళిదాసుని కుమారసంభవము లోని హిమాలయపర్వత వర్ణనను కొంతవరకు అనువదించుచు, అనుకరించుచు వర్ణించినాడు. నన్నెచోడుడు మాత్రము తన కుమారసంభవమున హిమాలయ మును, స్వంతముగా సుదీర్ఘముగా వర్ణించినాడు. (కు సం. 3:3- 9). తర్వాత జక్కనాది కవులు సందర్భాను కూలముగా శైలవర్ణన చేసియున్నారు. శైల వర్ణనా సందర్భమున మహౌషధులు, ధాతువులు, వంశములు, కిన్నరులు, నిర్ఝ రులు, శృంగ, తట, గుహ, రత్న, వన, జంతు, ఉపత్యకలు, వర్ణింపబడవలయు నని అలంకారశాస్త్రము చెప్పుచున్నది (కా. సం. పుట 253).

సంస్కృత సాహిత్యమున కాళిదాసుని హిమాలయవర్ణన హిమాలయ శృంగమువలె అజరామరమై నిలిచినది. అదే విధముగా తెనుఁగు సాహిత్యమున పెద్దన హిమవన్నగవర్ణన స్వతంత్రమై, సరసమై, మిన్నయై యొప్పుచున్నది.

ప్రవరుడు మహిమాన్వితమైన పాదలేపమును పూసుకొని హిమాలయ మును చూడగోరి యటకు పోవును. ఆ సందర్భమును పురస్కరించుకొని పెద్దన పది పద్యములలో హిమవత్పర్వత వర్ణనచేసెను. (మ.చ. 2:3-12). ఇదేగాక మనుచరిత్ర చతుర్థాశ్వాసమున ఒక పద్యములో కైలాసనగవర్ణన, పంచమాశ్వాస మున ఆరు పద్యములలో మందరగిరి వర్ణన కలదు. (మ. చ. 4:78, 5:47-52), ఇందు ఉత్తుంగ శిఖరములు, నాట్యమాడు నెమళ్ళు, నిర్ఝరములు, సాల వృక్షములు, వనజంతువులు, ఓషధులు, విద్యాధరులు, శబరకాంతలు, శిలలు మొదలగునవే గాక ఇంకను ఆ పర్వతమునకు సంబంధించిన పురాణ కథలు, ఆ కథా సంఘటనలు జరిగిన చోటులు వర్ణింపబడినవి. వసుచరిత్రలో వసురాజు నర్మసచివునితోకూడి తన కేళీపర్వతమగు కోలాహలమును సమీ

పించిన సందర్భమున ఈ పర్వతవర్ణన ఐదు పద్యములలో మరియు ఒక సుదీర్ఘ ప్రౌఢ సమాసభరిత వచనములో కలదు. (వ. చ. 2:7-12). ఈ వర్ణన నర్మ సచివుని ముఖతః కవి చేయించెను. ద్వితీయాశ్వాసములోని శక్తిమతీకోలాహల వృత్తాంతమున కోలాహలము కథలో నొకపాత్ర. కావున కవి శ్లేష వ్యంగ్యముల సాయమున పర్వతముగనే కాక గంభీరుఁడు ఉన్నతుడగు పురుషునిగను, వర్ణించెను.

వసుచరిత్ర పంచమాశ్వాసమున గిరికా వసురాజుల వివాహ సందర్భమున కోలాహలుని వైపునుండి విచ్చేసిన పర్వతముల వర్ణన గావింపబడినది. అట ఐదు పద్యములలో హిమాలయ, మైనాక, మేరు, మందర, రోహణ శైలములు వర్ణింపబడినవి. (వ. చ. 5:34-38). ఇతడును పెద్దనవలెనే శైలములందు, ఔషధ, వన, జంతు, నిర్ఝర, దేవకాంత శబరకాంతలను, మరియు పురాణకథలను గ్రహించి వర్ణించెను. పెద్దన పద్యములు సరసమధురములైయుండ రామరాజభూషణుని పద్యములు శ్లేషాద్యలంకార చమత్కృతులతో కూడినవి. (మ. చ. 2-3) "అటజనికాంచె భూమిసురుఁడంబరచుంబి శిరస్సరజ్ఝరీ..." అనుపద్యములోని శీతశైల వర్ణన అపూర్వమైనది ఆపద్యమునందలి వృత్త్యనుప్రాస అంత్యానుప్రాసాలంకారములు మృదంగధ్వనిని కల్పించుచున్నవి. కవిచెప్పిన "ముహుర్ముహుర్లుఠదభంగ, తరంగ మృదంగ నిస్వన" మును నిజముగానే పాఠకులకు శ్రవణగోచరమగుచున్నది.

"విలయకృశానుకీలములవేడిమిఁ బోడిమిమాలివెల్మిడిన్
గలసిన భూతధాత్రి మఖిక్రమ్మర రూపయినిల్పి యోషధుల్
మొలవగజేయునట్టి నయముంబ్రతికల్పము నెట్లుగాంచునీ
చలిమల వల్ల నుల్లసిలుచల్లదనంబును నూనకుండినన్"

మ చ. 2-10

పెద్దన "తలమె బ్రహ్మకునైననీ నగమహత్త్వం" బని యనినను సుందర ప్రసాదగుణమాధుర్యము గల పైపద్యమున కావ్యలింగాలంకారములో హిమాలయ మహత్త్వమును చక్కగా వర్ణించినాడు.

"తొండముల్ సాచి యందుగుఁ జిగుళ్ళకు నిక్కు-
కరుల దంతచ్ఛాయ గడలుకొనఁగ"— మ.చ. 2-7.

అను పద్యమున పెద్దన తాను చూచిన విజయనగర సమీపారణ్య భూములను మనస్సులో నుంచుకొని హిమాలయములను వర్ణించినా డనిపించును.

పెద్దన నాల్గుపద్యములో మందరగిరి వర్ణన చేసెను. మందరగిరికి వాసుకిని చుట్టగా దానిపై నొక్కులేర్పడినవి అవి చతుర్భుజుడైన విష్ణువు మందరగిరిని ధరించుటచే నాతని భుజాంగదముల బంగారుకాంతి వ్యాపించి మొలనూలు, ఒడ్డాణము, కంఠి, ఫాలపట్టమునై యొప్పుచున్నవని కవి యుల్లేఖించినాడు—

"వైకుంఠాంగదహేమ మాతత వలద్వ్యాతాశనాకృష్టరే
ఖాకారంబులఁ జుట్టునంటి మొలనూలై మేటి యొడ్డాణమై
శ్రీకారప్రభఁ(కంఠియై శిఖరిరాట్సింహోల్లసత్పట్టమై
యీకొండంగనుగొంటె! మాయదిపుడున్ హేరాళవున్ గాంతులన్"
మ.చ. 5-48.

పూర్వము జరిగిన వృత్తాంతపుచిహ్నములు ఇప్పటికిని మాయక పర్వతముపై యున్నవని చెప్పు పెద్దన భావమును గ్రహించి రామరాజభూషణుడు కోలాహల పర్వతముపైగల ధాతువులను, అరుణాంబుఝరుల నిట్లు వర్ణించినాడు——

"అక్కట నీయుదగ్ర చరణాహతికోర్వులేక యేగతిన్
స్రుక్కునొ గట్టు రాచకొమరుం డలనాడు కపోతహుంకృతిన్
గ్రక్కున మూల్గుచున్ బిలముఖంబున నేడును గంటె! నెత్తురుల్
గ్రక్కెడు ధాతువుల్ సెదరగా నరుణాంబు ఝరీమిషంబునన్"
వ.చ. 1-9.

మనుచరిత్రలో ఇందీవరాక్షుడు మందరగిరిని చూపుచు వర్ణించగా వసుచరిత్రలో నర్మసచివుడు కోలాహలమును చూపుచు వర్ణించినాడు. పెద్దన మందరగిరిపై గల తమాలములు, కేశముల వలె నొప్పుచున్నవన్నాడు. అవి తెల్లబడకుండు

టకు కవి హాలసంద్రమునందు కవ్వమైనపుడు బిలముఖమున అమృతము నాస్వాదించుటను కారణముగా నుత్ప్రేక్షించినాడు. అదేవిధముగ రామరాజభూషణుడు కోలాహలముపై గల పృథుగండశిలలను, కోలాహలము వసురాజు పాదహతిని పొందగా దాని నూరార్చుటకై వచ్చిన మేరుముఖగోత్రాధీశులనుగా నుత్ప్రేక్షించినాడు,

పురాణాగమేతిహాస కథార్థస్మృతియుతుడుగాన పెద్దన హిమవన్నగ వర్ణనాసందర్భమున దానికి సంబంధించిన పురాణకథలను గ్రహించి యిట్లు వర్ణించినాడు—

"పసుపునిగ్గులుఁదేఱు పాపజన్నిదమొప్పఁ
ప్రమథాధిపతి యింటి పట్టెఱింగె
శచికేఁత గఱుపుచుఁజదలేట సురరాజు
జలకేళి సవరించుఁ చెలువెఱింగె
నదనుతోఁజేపి చన్నవిసి యోషధుల మ
నోదవు కొండలకెల్లఁ బిదుకనెఱిఁగె
వేల్పుటింతులలో విఱ్ఱవీగుచు మేన
నవరత్న రచనల రవణమెఱిఁగెఁ

ఎరిపరివిధంపుఁ జన్నంపుఁ బరికరంపు
సొంపుసంపద నిఖిల నిలింప సభయు
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పుడుల్ల
నామెతలెఱింగి సీతుషారాగ్ని కతన" మ.చ. 2—11.

ఈ పద్యములోని భావములననుకరించుచు, రామరాజభూషణుడీ కింది పద్యమును రచించినాడు—

"అజ్ఞాతగోత్రయనాది శక్తి సుగోత్ర
భవమయ్యె నితని గర్భమునఁ బుట్టి
యాదిభిక్షుండు దుర్గాధ్యక్షుడయ్యె నీ
తని పాదతీర్థ మౌదల ధరించి,

మిత తేజుఁడగు జగన్మిత్రుఁడుత్కట వసు
స్థితినొందె నీతని దిక్కుఁజేరి
కులమువారభిరామ గోరత్నములుగాంచి
రితని శేషంబున కిచ్చగించి

తనకొక మఖాంశ మొసగు నియ్యనిమిషులకు
ననవరత యాగ భాగ భోజనము లొసఁగి
యతఁడపర్ణైక గురుఁడన నెసఁగుననుచు
నాకులు నుతింపవచ్చె మేనాకుటుంబి" వ. చ. ౫-౭౪.

పెద్దన గ్రహించిన పురాణవృత్తాంతములనే దాదాపుగా రామరాజభూషణుడును గ్రహించినాడు. పెద్దన శివుని "యిటిపట్టెటింగె"ననగా, రామరాజభూషణుడు ఆదిభిక్షువు దుర్గాధ్యక్షుడయ్యెనని, దుర్గపై శ్లేషనువేసి చమత్కారమును చేర్చెను.

"ఆదనుతోఁజేపి చన్నవిసి యోషధులను
న్మోదపు కొండలకెల్లఁబిదుకనెఱిగె"—నని పెద్దన వర్ణించగా దానిని వసుచరిత్రకారుడు—

"కులమువారభిరామ గోరత్నములుగాంచి
రితనిశేషంబున కిచ్చగించి"—అని వర్ణించెను.

"జిహ్వాత్రుప్పుడుల్ల" హిమవంతుడు దేవతల కామెత లొసగెనని పెద్దనార్యుడు వర్ణించిన దానిని గ్రహించిన రామరాజభూషణుడు—

"తనకొకమఖాంశమొసఁగు నియ్యనిమిషులకు
ననవరత యాగభాగ భోజనములొసఁగి''—అని వర్ణించెను.

రామరాజభూషణుడు కోలాహలపర్వతముపై గల కోలాహలము నంతటిని చక్కని మసృణతా గుణముతో శోభిల్లు సీసమున తన సంగీతమాధుర్యమును జేర్చి యిట్లు వర్ణించియున్నాడు.

"ఒకచాయననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానామయూరనినద,

మొకవంక నకలంక మకరాంక హయహేషి,
లోక క్రేవ వనదేవ యువతి గీత,
మొకచెంత సురకాంతల కరాంత తతనాద,
మొకదారి నవశారికోదితంబు,
లొకయోరఁబటు చారణకుమార ఫణితంబు,
లొకదండ నలిమండలి కలగాన,

మొక్క మొగిమ్రోయఁ గదళీగృహోప పన్న
కిన్నరీబృంద బృంద సంగీతరీతి,
నమరు నతివేల కోలాహలముల కలిమి
నధిప! యీయద్రి కోలాహలాఖ్య మొక్కొ". వ. చ: 2-7.

ఈ పద్యములో రామరాజభూషణుడు పెద్దన—

"తొండముల్చాచి యందుగుఁజిగుళ్ళకు నిక్కు
కరులదంతచ్ఛాయగడలు కొనఁగ" మ. చ. 2-7.

నను వివిధ జంతువర్ణన గల సీసపద్యమునకు పోటిగా వివిధ పక్షులరావము లతో కూడి కోలాహలముగా నున్న కోలాహలపర్వతమును సీసమున వర్ణించెను. రెండు పద్యముల ఆశ్వాస, క్రమసంఖ్య ఒక్కటే అగుట గమనింపదగినది.

గిరికావసురాజుల వివాహమునకు కోలాహలుని సోదరుడగు మైనాకుడు విచ్చేసెను. మైనాకుడు ఇంద్రునికి భయపడి సముద్రముననే ఉండు వాడగుటచే నాతని శరీరము పాచివట్టి పచ్చగా నయ్యెను. దానిని రామరాజభూషణకవి సహజసుందరమగు ఊహలతో నుత్ప్రేక్షించెను (వ.చ. 5-36) ఈపద్యము ప్రసాదగుణయుక్త భావరచనకు చక్కని యుదాహరణ. మందర మేరు పర్వతములు కలిసి జంటగా గిరికావసురాజుల వివాహమునకు వచ్చినవి. వానిని కలిపి జంటగా శ్లేషకవితా ప్రియుడగు కవి యిట్లు వర్ణించెను—

"ఇరువురుదేవసంభరణు, లిర్వురు నబ్జధరోన్నమత్కరాం
తరమహనీయు, లిర్వురు ననంతగుణాఢ్యులు గావునం, బర

స్ఫరసమతాసమగ్రతర సఖ్యమునం గవగూడి, మేరు మం
దరధరణీ ధరాన్వయవతంసులు వచ్చిరి తత్షణంబునన్"
వ. చ. 5—37.

మేరు మందరులిరువురును దేవ సంభరణులు, అబ్జధరోన్నమత్కారాంతర మహ నీయులు, అనంత గుణాఢ్యులు,— మేరువు దేవతలకు నివాసము, మందరము సముద్రమథన సమయమున దేవతలచేత భరింపబడినది. చంద్రధరుడైన శివుని చేతిలో చాపమై యొప్పినది మేరువు, విష్ణువుచేత తరువబడినది మందరము. ఆదిశేషుని నారిగా గలది మేరువు, వాసుకిని కవ్వపుతాడుగా గలది మందరము. ఈ విధముగా విశేషణములు శ్లేషించినవి. రోహణపర్వతము రత్నములకు నిధి. రత్నశాస్త్ర ప్రియుడగు రామరాజభూషణుడు ఇట్లుదానినుత్ప్రేక్షించెను —

"రోహణశైల రాజము మరుద్గిరితోడనెవచ్చి నిల్చివై
వాహిక కార్యకర్త మఘవంతుడనంత సువర్ణరత్నసం
దోహము రాశివోసి విబుధుల్మనుజుల్భుజగుల్నుతింపఁగా
నాహిమవత్కుమార తనయామణి కుంకువదెచ్చెనోయనన్"
వ. చ. 5—38.

అనంత సువర్ణరత్నరాసులను; దేవతలు, నాగులు, మానవులు మెచ్చుకొను నట్లుగా వధువగు గిరికకు ఓలితెచ్చినాడనునట్లు రోహణము వచ్చి నిల్చెనట.

పెద్దన ప్రవరుని హిమవన్నగ సందర్శనమును పురస్కరించుకొని తన్నగ వర్ణనను మూలకథ ననుసరించుచునే ప్రబంధోచితముగ వర్ణించినాడు. రెండవమారు మందర పర్వత వర్ణనాసందర్భమును పెద్దన కల్పించుకొనినదే. మనోరమాస్వరోచుల వివాహమును ఇందీవరాక్షుడు, లక్ష్మీ నారాయణుల పరిణయము జరిగిన మందరపర్వతముపై జరుపనెంచెను. ఇది మూలాతిరిక్తముగ పెద్దన కల్పించుకొనినది. ఇందీవరాక్షుడు స్వపరివారముతో మందరగిరికి ఆకాశమార్గమున ప్రస్థానించును. ఆ సందర్భమున కవి రెండవమారు శైలవర్ణన చేసెను రామరాజభూషణుడు ప్రబంధోచితముగ ద్వితీయాశ్వాసమున కోలాహలమును వర్ణించెను. పంచమాశ్వాసమున గిరికావసురాజుల

వివాహమునకువచ్చిన పర్వతములను గూర్చి చెప్పునెడ కవికి హిమ, మైనాక, మేరు, మందర, రోహణములను వర్ణించు అవకాశము లభించెను. పెద్దన మందరము నొక్కదానినే వర్ణించగా రామరాజభూషణకవి ప్రధానపర్వతముల నన్నింటిని గ్రహించి వర్ణించెను. రెండు ప్రబంధము లందును రెండవమారు వర్ణింపబడిన శైలవర్ణనలో ఔషధ, వన్యమృగాదులుగాక పురాణకథావృత్తాంత ములే ఎక్కువగా గ్రహింపబడినవి. రామరాజభూషణుడు రెండుమారులు పెద్దనతో సమానముగా పర్వతవర్ణన గావించి పద్యసంఖ్యలో, శ్లేషచమత్కార ములలో నాతనిని మించెను.



# వ న వి హా ర ము

భారవి కిరాతార్జునీయమున అర్జునుడింద్రకీలాద్రికి ప్రస్థానించునపుడు శైలమును, అర్జునుని ప్రలోభపెట్టుటకై వచ్చిన అప్సరసల యొక్క పుష్పాపచయ, వన విహార, జలకేళి మధుపానాదులను వర్ణించినాడు. (కిరా. 5,10 సర్గములు) మాఘునిచే శిశుపాలవధకావ్యమున, శ్రీకృష్ణుడు ససైన్యుడై ఇంద్రప్రస్థమునకు పయనించు సమయమున శైల, వనవిహార, ఋతు, పుష్పాపచయ, జలకేళ్యాదులు వర్ణింపబడినవి. (శిశు. 4, 12 సర్గములు . తెలుగులో నిర్వచనోత్తరరామాయణమున సీతారాముల వనవిహార, జలవిహారాది వర్ణనలు చేయబడినవి. (ని.రా. 8:18–21). నన్నెచోడకవి కుమారసంభవమున పార్వతీ పరమేశ్వరుల వివాహానంతరము విటవిటీజనంబుల జలక్రీడ, వనవిహార పుష్పాపచయములను, ప్రబంధశైలిలో వర్ణించియున్నాడు. (కు సం. 8 78–126). నాచనసోమనాథుడు ఉత్తరహరివంశమున ఇందుధరోపాఖ్యానమున గిరిజాశంకరులు పరివారముతో వనవిహార, పుష్పాచయ, జలక్రీడాదులను చేయుట ప్రౌఢముగా ప్రబంధ ఫక్కికలో వర్ణించినాడు (ఉ. హ. 5 60–70) తరువాత జక్కన మొదలగు కవులు వనవిహార జలకేళ్యాదులను తమ కథాకావ్యములందు చేర్చి వర్ణించియుండిరి. ఈ వనవిహార పుష్పాపచయ, జలకేళీ వర్ణనలను ప్రబంధకవులు చేపట్టి తమ ప్రబంధములలో వర్ణ్యముల పట్టికలో చేర్చుకొనిరి. మహాకావ్యమున నుండదగు వర్ణనలో వీనిని దండ్యాదులు చేర్చియున్నారు. అప్పకవియు తెలుగున వీనిని పేర్కొనియున్నాడు.

మనువసుచరిత్రలలో నీ వనవిహార, పుష్పాపచయ జలకేళీవర్ణనలు సమానముగా కలవు. అంతేగాక అవి వర్ణింపబడిన ఘట్టములలోను సాదృశ్యము కలదు. మనుచరిత్రలో వరూథిని ప్రవరుని విరహమును సహించలేక మన్మథాదుల నుపాలంభించును. విరహముతో క్రుంగు నామెనూరడించి, వినోదమును కల్పించుటకై యామెసఖులు ఆమెను ఉద్యానవనవిహార

మునకు తీసుకొనిపోదురు. వసుచరిత్రలో వసురాజును వీడి గిరిక, వెళ్ళి పోయిన పిదప విరహబాధ నొందును. అట్టి యామెనూరడించి వినోదము కూనుర్చుటకై సఖులామెను ఉద్యానవనవిహారమునకు కొనిపోదురు. ఈ సందర్భమున మనుచరిత్రలో సఖులు గావించిన వనవర్ణన పది పద్యములలో కలదు. (మ చ. 3:73–82 . వసుచరిత్రలో సఖులు గావించిన వనవర్ణన పదు నాల్గు పద్యములలో కలదు. (వ.చ.) 3:134–147). ఇట రామరాజభూషణుని వర్ణన పెద్దన వర్ణనకన్నను దీర్ఘము, ప్రౌఢముకాగా, పెద్దన వర్ణన నాత్యలం కారమై సులభగ్రాహ్యమై యున్నది.

రామరాజభూషణుడు పెద్దన కథాసందర్భము ననుసరించి వనవిహార వర్ణనను గావించుటయేగాక, కావ్యారంభమున వసురాజు ఉద్యానవన సందర్శన మునకు పోయిన సందర్భమునకూడ పన్నెండు పద్యములలో వనవర్ణన గావించినాడు (వ. చ. 1:149–160). ఈకథాసందర్భము నైషధము ననుసరించి కల్పించినట్టిది. ఇచ్చట కవి శ్రీహర్షమహాకవి వనవర్ణన వలెనే ప్రౌఢతరముగా రచించినాడు.



# పుష్పాపచయము

మనుచరిత్రలో పెద్దన పుష్పాపచయవర్ణన నొక రగడలో గావించినాడు. పెద్దనకన్న పూర్వము కవులు రగడల నుపయోగించిరి. పినవీరన శృంగార శాకుంతలమున దుష్యంతుని సైన్యమును రగడలో వర్ణించినాడు. పెద్దనకు పూర్వమే రగడలో పుష్పాచయమును వరాహపురాణకర్తలగు నందిమంట కవులు వర్ణించియుండిరి. (వ. పు. 3-92)

పెద్దన పుష్పాపచయ వర్ణనను రగడలో రచించుట ననుకరించుచు వసుచరిత్రకర్త కూడా పుష్పాచయమును రగడలోనే రచించెను. పెద్దన ద్విరదగతి రగడను ప్రయోగించెను. (మ.చ 3-94) రామరాజభూషణుడు వృషభగతి రగడను ప్రయోగించెను. (వ. చ. 3-149) పెద్దన రగడ ప్రసాద గుణ యుక్తము. అందు వృత్త్యనుప్రాస, అంత్యానుప్రాసలు కలవు. తెలుగు పద సంయోజనము కలిగి దీర్ఘసమాసరహితముగా నున్నది. రామరాజభూషణుని రగడ ప్రౌఢ పదసంఘటనతో కూడినది. అందు వృత్త్యనుప్రాస. అంత్యానుప్రాసలే గాక యమకాలంకార వైచిత్రియు కలదు. అది చిత్రవర్ణభాసురమై కాంతి యను గుణముతో కూడి యొప్పుచున్నది.

పుష్పాపచయ సమయమున చెలువలు తమలోతాము మాటాడుకొను నర్మ సంభాషణలను, హాస్యోక్తులను, శాఖాగ్రస్థపుష్పములను కోయుటకై వారు చేయు యత్నములను పెద్దన వర్ణించినాడు. రామరాజభూషణుడును అట్టి వర్ణననే కావించి యున్నాడు. పెద్దన వరూథినీ సఖుల పుష్పాపచయ వర్ణనను చేయగా వసుచరిత్రకారుడు గిరికాసఖుల పుష్పాపచయ వర్ణనను చేసెను. రామరాజ భూషణకవి వివిధ తరులతలకు గావించు దోహదక్రియలను గ్రహించి యీ రగడలో చమత్కరించినాడు. పెద్దన రగడలోని భావములు సరసములై హృదయరంజకములై యున్నవి. వసుచరిత్రకారుని రగడలోని భావములు ప్రౌఢములై యమకాలంకార భారములై సులభరంజకములు గాకున్నవి.

# జ ల కే ళి

మనుచరిత్రలో జలకేళి ప్రసక్తి ఒక్క పద్యమున కలదు. వసుచరిత్రలో గిరికా సఖులు సరోవరమును గాంచుట ఒక పద్యమున వర్ణింపబడినది. (వ. చ. 3-158) ఒక సుదీర్ఘవచనమున సరోవరము, అందలి హంస చక్రవాకాది పక్షులు, తుమ్మెదలు, తామరలు, మత్స్య కూర్మాది జంతువులు, రూపకశ్లేష ఉత్ప్రేక్షాద్య లంకారములలో వర్ణింపబడినతీరు బాణుని ప్రౌఢశైలిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. (వ. చ. 3-154 ఆ తరువాత గిరికా సఖుల జలక్రీడలు పదమూడు పద్యములలో వర్ణింపబడినవి. (వ. చ. 3:155-166) రామరాజభూషణుడు జలకేళీ వర్ణనలో పెద్దనను మించినవాడనవచ్చును. మనుచరిత్రలో జలకేళీఘట్టము కథాగతికి తోడ్పడినది. సఖులు జలకేళిలో మునిగియుండగా వరూథిని వారి యాహ్వానమును నిరాకరించి అక్కడి నుండి వెళ్లిపోయినది. అన్యమనస్కయై తిరుగుచు ప్రవరరూప ధారియైన గంధర్వుని గాంచినది. ఈవిధముగా వరూథిని వెళ్లిపోయి మాయా ప్రవరుని కనుగొనుట పెద్దన కల్పనయే. ఇట్టి కథా సందర్భమున జలకేళిని విస్తరముగా వర్ణించుట కథాగతి కాఘాతమగునని కాబోలు సుదీర్ఘ వర్ణనకు కవి పూనుకొనలేదు.



# ఋ తు వ ర్ణ న

మహాకావ్యవర్ణనలలో నొకటిగా పేరొందిన ఋతువర్ణనను పురస్కరించుకొని కవులు కొందరు షడృతువులను క్రమముగా వర్ణించిరి. భారవి కిరాతార్జునీయమున వరుసగా వర్ష, శరత్, హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ ఋతువులను వర్ణించినాడు (కిరా. 10:19-36), మాఘకవి శిశుపాలవధకావ్యమున క్రమముగా వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత శిశిరములను రెండుసార్లు వర్ణించినాడు. (శిశు. 6 : 1 – 79 , కాళిదాసు కుమారసంభవకావ్యమున సందర్భానుకూలముగా వసంతర్తువర్ణన గావించియున్నాడు. (కా. కు. సం. 5 సర్గము .

ఆంధ్రసారస్వతమున కవులు సందర్భానకూలముగా వసంత, వర్షాది ఋతువులను వర్ణించి యుండిరి. మనుచరిత్రలో పెద్దన సందర్భానుసారముగా వసంతర్తువర్ణన గావించెను. ఆముక్తమాల్యదాది కావ్యములందు గ్రీష్మాది షడృతువులు వర్ణింపబడగా రామరాజభూషణకవి పెద్దన ననుసరించుచు కాబోలు ఒక్క వసంతమునే వర్ణించినాడు.

మనుచరిత్రలో షష్ఠాశ్వాసమున కళావతీ జన్మవృత్తాంత సందర్భమున వసంతర్తు వర్ణన నాలుగు పద్యములలో చేయబడినది. (మ. చ. 6:26-29) వసుచరి తలో ప్రథమాశ్వాసమున పదిహేడు పద్యములలో వసంతర్తువర్ణన చేయబడినది. (వ చ. 1:125-14 ).

మనుచరిత్రలో కళావతి తల్లి పుంజికస్థలయను అప్సరస ఇంద్రునాజ్ఞచే పారుడను బ్రహ్మర్షి తపోభంగము చేయుటకై వచ్చినది. తత్సందర్భమున వసంతర్తు ప్రవేశమును పెద్దన వర్ణించెను. శృంగారశాకుంతలమున మేనకా ప్రవేశము తోబాటు వసంతర్తుప్రవేశవర్ణనను కవి చేసెను. అక్కడ

పీరన పం్రడెండు పద్యములలో నీ వసంతమును వర్ణించినాడు. (శృం. శా. 4:131-132). ఇతనినే పెద్దన కొంతవర కాదర్శముగ గ్రహించినాడు. పెద్దన నాదర్శముగా రామరాజభూషణుడు గ్రహించి చమత్కార ప్రౌఢిమను ప్రదర్శించి నాడు.

వసంతఋతుప్రవేశ సమయమున హిందోళరాగమును పాడుట కలదు. కవులును వసంత ర్తు సందర్భమున హిందోళరాగ మాలాపించుటను వర్ణించిరి పినవీరన "ఏతెంచెన్మధు మాసలక్ష్మి తరుణీ హిందోళరాగధ్వను, ల్వీతిం చెన్పటు..." (శృం. శా. 2-121) అని హిందోళరాగధ్వనులు వ్యాపించుటను పేర్కొనెను. పెద్దనయు ఈ హిందోళరాగ ప్రసక్తి నిట్లుచెప్పెను—

"హిందోళమునఁబాడిరి
బృందారక సతులు విరహిబృందార్తిగఁ ద్రేఁ
చెం దేటులు వాసంతిక
విందునఁ బిక శిశువుదాడి వెడలం దోలెన్" మ. చ. 6-28.

స్త్రీలు హిందోళరాగమున పాడిరని మాత్రమే పెద్దన పినవీరనలు చెప్పగా సంగీతకళారహస్యనిధియగు రామరాజభూషణుడు చమత్కారముగా హిందోళ రాగ ప్రసక్తినిట్లు వర్ణించినాడు—

"అరిగాఁ బంచమమేవగించి నవలాలవ్వేళ హిందోళ వై
ఖరిఁబూనం బికజాత మాత్మరవభంగవ్యాకులంబై, వనీ
ధరనాలంబిత పల్లవ వ్రత విధుల్దాల్చెన్ దదీయధ్వనిన్
సరిగాగై కొనియెన్ వసంతము మహా సంపూర్ణ భావోన్నతిన్"
వ. చ. 1- 30.

హిందోళము ఋషభ పంచమములు లేని ఔడవరాగము. వసంత రాగము ఋషభ పంచమ స్వరములతో గూడిన సంపూర్ణ రాగము. స్త్రీలు ఔడవ రాగమగు హిందోళరాగమును వసంత ర్తు ప్రవేశ సూచకముగా ఆలా పించిరి. అపుడు కోయిలలది చూచి పంచమస్వరము యొక్క తిరస్కారమైనదని భావించి, చిగురుటాకులను భుజించి వ్రతముదాల్చి తపముగావింపగా వసంతమా

కోయిలల యొక్క పంచమ స్వరమును సరిగా (ఋషభముతో కూడినదిగా) గ్రహించెను. అనగా కోయిలలు వసంతమున పంచమస్వరముతో కూసెనని యర్థము వసంతర్తులో కోయిలలు పంచమస్వరమున కూయుటను మామూలు విషయమును రామరాజభూషణుడు తన సంగీతపాండిత్య సహాయమున చమత్కరించెను. "అరిగా, సరిగా" అను పదములలో చమత్కారము కలదు. స్త్రీలు పంచమ స్వరమును "అరిగా" సేవగించిరట- అనగా శత్రువుగా ననియు ఋషభస్వర రహితముగా ననియు రెండర్థములు. వసంతము పంచమమును సరిగా గ్రహించెననగా—సరిగాను, ఋషభ స్వరయుక్తముగాను గ్రహించెనని యర్థము.

వసంతుడు హేమంతమను రాజుపై దండెత్తుటను పినవీరన ఇట్లు వర్ణించెను.

"హేమంతంబనురాజు సేనపఱపన్ హేలాగతిన్ జైత్రుడన్
సామంతుండెదురం దదీయ ఆవరాజత్కీర తుక్షార రిం
ఖామార్గంబుల నించుపాంసువులు నాగం బర్వె నారామ గుం
జామల్లీ లపలీలవంగ నవపుష్పశ్రేణికా రేణువుల్" శృం.శా. 2-128

ఇదే విధముగా పెద్దన ఆమని దొర మంచురాజును అనగా హేమంతమును దాకి పారద్రోలుట నిట్లు వర్ణించెను—

"అనువగు సుళ్ళనొప్పు మలయానిలవాహమునెక్కి తేంట్లున
ల్లిన నిడువాగెఁబూని లవలీ నవ మల్లికలెమ్మె సొమ్ములై
పనుపడఁజెట్లువట్టి మనుప్రాఁతదళమ్ముల తోడఁదోలెనా
మనిదొర మంచురాజు మడిమంచగఁగోయిల గంట మ్రోయఁగన్
మ. చ. 6-26.

ఈ పద్యమున పెద్దన సుడులు, దళములనుచోట శ్లేషనుపయోగించెను. హేమంతమునందు రాజత్వమారోపింప బడినది. శ్లేషరూపకాలంకార సహాయమున పెద్దన చేసినట్టి రాజత్వారోపణ, పినవీరన వసంత హేమంతములందు గావించిన రాజత్వారోపణను మించి చక్కగా రూపింపబడినది. ఇట్టి దండయాత్రను గ్రహించి రామరాజభూషణకవి వసంతకాలమున సూర్యుడు మంచును పారద్రోలుట నిట్లు వర్ణించెను-

"కరఘాతంబులకోర్వలేక హిమ సంఘాతంబు శీతక్షమా
ధర దుర్గంబు భజింపఁగానల జగత్కంపప్రదాస్తోక భీ
కర దోషాయతిశాలిఁ జుట్టుకొని లగ్గల్పెట్టి ధట్టింతు నం
చరవిందాప్తుఁడు దీచికేగెఁ బ్రబలుండై మాని దాక్షిణ్యమున్"

వ. చ. 1-131.

సూర్యుడు దాక్షిణ్యము మాని అనగా దక్షిణదిశను విడిచి మరియు కరుణా భావమును వీడి, జగత్కంపము కలిగించు హిమసంఘాతమును హిమగిరిదుర్గము జేరునట్లుగా కరఘాతములతో పారద్రోలెదనని ఉత్తరదిశకు పోయెను. సూర్యుని యరవిందాప్తుడనుటచే, మంచువలన తామరలు కాంతి విహీనమగుట నాతడు సహించలేక మంచును శిక్షింప బూనుకొనెనను వ్యంగ్యార్థము పుట్టుచున్నది. హిమ సంఘాతము జగత్కంప ప్రదమని చెప్పుటచే జగత్తులను చలిచేత వణికింప జేయునదనియు, జగత్తులకు భయకంపమును గలిగించు నదనియు అర్థములు. అదే విధముగా కరఘాతములు, దాక్షిణ్యమను శబ్దములలోని శ్లేషార్థములు చమత్కారహేతువులగుచున్నవి. ఈ విధముగా రామరాజభూషణుడు శ్లేష వ్యంగ్య చమత్కారములచే పెద్దన పద్యమును అధిగమించె ననవచ్చును.

"చలిగాలి బొండు మల్లెల పరాగము రేఁచి
నిబిడంబు సేసె వెన్నెల రసంబు
వెన్నెల రసముబ్బి వెడలించె దీర్ఘికా
మంద సౌగంధిక మధు నదంబు
మధు నదంబెగఁబోసె మాకంద మాలికా
క్రీడానుషంగి భృంగీవరంబు
భృంగీరవంబహంకృతిఁ దీఁగెసాగించెఁ
బ్రోషితభర్తృకారోదనముల

విపిన వీథుల వీతెంచెఁగుపితమదన
సమదభుజనత సుమధనుష్టాంకృతములు
సరసమధుపాన నిధువనోత్సవ విలీన
యువతి యువకోటి కోరికల్ చివురులొత్త"

మ. చ. 6-29.

అని పెద్దన కారణమాలాలంకారమున మధుపాన నిధువనోత్సవములను వర్ణించగా ఈ పద్యపునడక ననుసరించుచు రామరాజభూషణుడు లతికల వసంతోత్సవముల నిట్లు వర్ణించినాడు.

"మను సుమనోనురాగమున వసంతము సూపెఁ
గానవేందిరయశోకంపుఁగొమ్మ
కాకొమ్మ నగుచు నెయ్యమునఁ గ్రొన్నన తేనె
మెలఁగెడు సరసాళి మీదఁజల్లె
నాసరసాళి సోయగపుఁ బాటలతోడ
జనిమాధవి ప్రవాళశాటిఁదుడిచె
నా మాధవి పరాగ మక్షిరాగము మించఁ
బఱతెంచు కరికంఠిపై విదిర్చె

నిట్లులతికలు హితకోటి నెఱసి యపుడు
మదన దేవోత్సవక్రీడబొదలు ననిన
వరులు దరుణులు విరులయో వరుల వరలు
సిరులవలరాచ జాతరల్ సేయుటరుదె" వ. చ. 1-129.

పెద్దన ఒక పదార్థము మరొక పదార్థ గుణాధిక్యతకు కారణభూతమైనట్లుగా పరంపరగా వర్ణించినాడు. రామరాజభూషణుడు ఒక తరువు మరొకదానిపై వసంతమును చిలికినట్లుగా వర్ణించినాడు. రామరాజభూషణుని యీ వర్ణనా పద్యము పెద్దన కారణముల పరంపరతో కూడిన సీసపద్యమును పోలియున్నది రామరాజభూషణుడీ పద్యమున తరువులతోబాటు తరుణుల వసంతోత్సవ క్రీడలనుకూడా ధ్వనింపఁజేయుచు తన రచనా వైభవమును చూపెను.

"లలనా జనాపాంగ వలనా వసదనంగ
తులనాభికాభంగ నోక్షప్రసంగ..."
"ఇమ్మలై, మరుహజారమ్మలై పొదలుండఁ
బూఁజవికలు వేఱె పూనవలదు...." వ. చ. 1:126, 141.

ఇత్యాది సంగీత మాధుర్యము, అలంకారోదాత్తత, శబ్దార్థ చమత్కారములుగల పద్యములు పెద్దనలో కానపించవు. పెద్దన మనుచరిత్రలో చివరి ఆశ్వాసమున సందర్భానుకూలముగ జేర్చిన వసంతర్తువర్ణనను నాలుగు పద్యములలో ముగించెను. అందును పినవీరన పద్యములను కొన్నింటి ననుసరించుచు అటనట నాతని పద్యములకు మెరుగులు దిద్దుచు రచించెను. రామరాజభూషణుడు కావ్య ప్రారంభమున వసంతర్తువును పదిహేడు పద్యములలో దీర్ఘముగా వర్ణించెను. పెద్దన పద్యములలోని భావములను అనుకరించుచు అలంకార విషయములో, సంగీత పాండితిలో, శబ్దార్థ చమత్కృతిలో, నాతనిని మించుచు రామరాజభూషణుడు తన ప్రతిభను చాటెను.



# విప్రలంభ శృంగారము

శ్రీనాథుడు శృంగారనైషధమున దమయంతీ విరహమును, ఆమె మన్మథాదులను దూషించుటను సుదీర్ఘముగా వర్ణించెను. శ్రీనాథుని నైషధము ననుసరించి పినవీరన శృంగారశాకుంతలమున శకుంతలా విరహమును, మన్మథోపాలంభనమును వర్ణించినాడు. తత్పూర్వము తిక్కన మహాభారత విరాటపర్వమున కీచకుని విరహమును వర్ణించియున్నాడు. కీచకుని సూర్యోపాలంభనమును, శిశిరోపచారములతో నాతడు దినమును గడుపుటను కవి వర్ణించినాడు. నన్నెచోడకవి పార్వతీదేవి విరహతాపమును శిశిరోపచారములను, స్వప్నము, మూర్ఛ, శుక, పిక, మలయానిలాదుల ఉపాలంభనమును కుమారసంభవమున వర్ణించినాడు. (కు. సం. 5:107-172) ఇది ప్రబంధ వర్ణన వలెనే ఒప్పుచున్నది. విక్రమార్కచరిత్రలో మదనరేఖ విరహతాపము, ఆమెకు చేయబడిన శిశిరోపచారములును వర్ణింపబడినవి. దశకుమారచరిత్ర తృతీయాశ్వాసమున అవంతిసుందరి విరహతాపము, శీతలోపచారములు, మన్మథోపాలంభనములు వర్ణింపబడినవి. కేయూరబాహుచరిత్ర చతుర్థాశ్వాసమున నాయిక ప్రణయలేఖ విరహము శీతలోపచారవర్ణన గలదు. నాయికల విరహతాపమునే గాక కవులు నాయకుల విరహమును సైతము వర్ణించిరి. వరాహ పురాణమున దుర్జయుని విరహము ప్రబంధ మార్గమున వర్ణింపబడినది. తరువాత రాజకన్యల విరహము, మన్మథునుపాలంభించుట, శీతలోపచారములు వర్ణింపబడినవి (వ. పు. 4 ఆశ్వా). ఈ విధముగా సంస్కృత మహాకావ్యములలోని వర్ణ్యముల పట్టిక ననుసరించి తెనుగు కావ్యములలోనికెక్కిన విరహ వర్ణనను ప్రబంధ కవులు గ్రహించిరి.

పెద్దన వరూథిని విరహమును, మరణ ప్రయత్నమును, సఖులు ఆమెనూరడించుట, మన్మథాదుల ఉపాలంభనమును ఇరువది నాలుగు పద్యగద్యములలో వర్ణించినాడు. (మ. చ. 3:29-52), వరూథినిని మూర్ఛనుండి తేర్చుటకై

సఖులు గావించిన శైత్యోపచారముల వర్ణన మాత్రము ఒక్క వాక్యమున చెప్పబడినది. రామరాజభూషణుడు పెద్దన ననుసరించి గిరికావిరహము, మరణ ప్రయత్నము, చెలులు ఊరడించుట, మన్మథోపాలంభనము, మూర్ఛ, శైత్యోపచారములను సుదీర్ఘముగా వర్ణించినాడు. (వ చ. 3 : 99 – 130). "ఏకత్రైవానురాగ" మగుటచే పెద్దనకు నాయక విరహవర్ణన చేయు అవకాశము లేకపోయెను. వసుచరిత్రలో నాయికా నాయకులు పరస్పరము అనురక్తులు. కావున వసుచరిత్రలో కవి వసురాజు విరహమును సైతము వర్ణించెను. వసురాజు ఉన్మాదావస్థను, విదూషకుడాతనిని ఊరడించి నగరికిగొనివచ్చుట, కృశత, పాండురత, జాగరణాదులను కవి వర్ణించినాడు.

విరహవర్ణనా సందర్భమున, ఆలంకారికులు విప్రలంభ శృంగారమునకు జెప్పిన అవస్థలను అనగా–అసౌష్ఠవము, (అంగమాలిన్యము) తాపము, పాండురత్వము, కృశత్వము, అరుచి, అధైర్యము, అనాలంబము (శూన్యమనస్కత), తన్మయత్వము, ఉన్మాదము, మూర్ఛ, మృతి, వీనిని కవులు నాయికా నాయకులందు వర్ణింతురు. కవులు మూర్ఛ వరకే విప్రలంభావస్థను వర్ణించుట కలదు. మృతిని వర్ణించినను మరణ ప్రయత్నమును మాత్రమే వర్ణించవలయునని యాలంకారికుల అభిప్రాయము.

మనుచరిత్రలో–"పాటనసేయమిం ముంగురులుపైబడి శీర్ణపటీర పంక..." (మ.చ. 3–53) అను పద్యమున వ్యంగ్యముగా వరూథినియందు అంగమాలిన్య, పాండురతలు చెప్పబడినవి. తృతీయాశ్వాసమున తొమ్మిదవ వచనమున వరూథిని తాపము, విచారము, దుఃఖము, అధైర్యములు వర్ణింపబడినవి.

"ఏవిహంగముఁ గన్న నెలుగిచ్చుచును సారె
కును సైకతంబులఁగూడఁ దారు...." (మ.చ. 3–16)

అను పద్యమునందు వ్యంగ్యముగా వరూథిని తన్మయత్వము సూచింపబడినది. తన్మయత్వమనగా బాహ్యాభ్యంతరములందు ప్రియురాలు [illegible]యొక్క, ప్రియుడు ప్రియురాలియొక్క రూపమును దర్శించుట...

"ఘనసార పంకమొక్క లతాంగి దెచ్చిన
ముట్టిప్రేలనె చుక్కబొట్టువెట్టి-" (మ.న. 2-66)

మరియు 3-57. 3-58 పద్యములందు వరూథిని అరుచి వర్ణింపబడినది.

"చనుఁగప్పుఁదొలఁగ వాసన గాలికెదురేగు
బరువొప్పు నలుగులఁ బాఱు కరణి" (మ.చ. 3-31)

అను పద్యమున వరూథిని మరణ ప్రయత్నము వర్ణింపబడినది. ఈ పద్యము ననుసరించుచు రామరాజభూషణుడు సీసపద్యమున గిరికా మరణప్రయత్నమును వర్ణించినాడు:-

"పవమాన మానవ, ప్లవమాన కైరవ,
చ్యవమానరజము, మైనంటఁ దివురుఁ
గురుసారసాగ్రతామరసాతి సాంత్ర సీ
ధురసాప్తిఁ గన్నీరుఁ దుడువఁగోరు,
మదనానల ప్రభాసదనామకోమల
చ్ఛదనార్చిపైఁ జూపుబరపఁ జూచుఁ
చలయాహత లతాకిసలయాగమలయాగ,
నిలయానిలున కూర్పుదెలుపఁదలఁచుఁ

గుంజపుట గుంజదళిపుంజశింజితంబు
వెగ్గలంబైనఁ జెవియొగ్గి వినఁగడంగుఁ
బంచశరభూత పరిభూత పంచభూత
ములఁ దదీయ స్థలంబులఁ గలుపు కరణి" వ.చ. 3-118.

పెద్దన సీసపద్యపాదముల చివరగల 'కరణి' ని గ్రహించి రామరాజభూషణుడు "కరణి" యను శబ్దముతో గీతపద్యమును ముగించినాడు. ఇందు పుష్ప రాగము-పృథ్వీతత్త్వము, మకరందరసము-జలతత్త్వము, ఆమ్రకిసలయము-తేజస్తత్వము, మలయానిలము-వాయుతత్త్వము, మధుకరఝుంకారము-ఆకాశ తత్త్వమును కలిగినవి. గిరిక తన శరీరమందలి పంచభూతాంశములను

పంచభూతతత్త్వములందు కలిపివేయ బూనుకొనినదని కవి చమత్కారముగా వర్ణించినాడు. ఇట్టి భావచమత్కారము పెద్దన పద్యములో లేదు. మరణ యత్నమునకు పూనుకొన్న వరూథినిని సఖులు తత్ప్రియత్నమునుండి వారించి యూరడింతురు. వరూథినిని సఖులు ఊరడించుట రెండు పద్యము లలో కలదు(మ. చ. 3-33, 34). దీనిననుసరించి రామరాజభూషణుడు సఖులు గిరికను, మరియు విదూషకుడు వసురాజు నూరడించినట్లుగా వర్ణించియున్నాడు. (వ.చ. 3-121, 122, 87, 89)

వియోగ శృంగారమున, చంద్రమన్మథాదుల ఉపాలంభనము వర్ణింప బడుట కలదు. పెద్దన వరూథినిచే చంద్ర, మన్మథ, మలయానిలములను పాలంభింపజేసినాడు. రామరాజభూషణుడును చంద్ర, మన్మథ, మలయానిలో పాలంభనమును గిరికాదేవి చేసినట్లు వర్ణించెను. నాయికలు అళి, పిక,శుక, హంసా దుల నుపాలంభించినట్లుగాను కవులుదీర్ఘ వర్ణనలు చేసియుండిరి. కాని రామరాజ భూణుడు పెద్దన ననుసరించి నాయిక చేత చంద్రమన్మథ మలయానిలోపాలంభన లను మాత్రమే చేయించెను.



## చంద్రోపాలంభనము

ప్రవరుడు వెళ్ళిపోయిన తరువాత సూర్యాస్తమయ, చంద్రోదయ, కౌముది వర్ణనలను పెద్దన కావించెను. వెన్నెల సూర్యతాపమువలె బాధించుచుండగా వరూథిని మిక్కిలి విరహతాపమును పొందినదై చంద్రోపాలంభనమునకు పూను కొనును సరిగా నిట్టి సందర్భమే వసుచరిత్రలో చెప్పబడినది. సూర్యాస్త మయ, చంద్రోదయానంతరము వెన్నెల వర్ణనను రామరాజభూషణుడు చేసెను. వెన్నెల విజృంభణముచే గిరికావిరహతాప మధికమయ్యెను.ఆవిరహతాపము నోర్వ లేకఆమె చంద్రోపాలంభనమునకు పూనుకొనెను. పెద్దన పదిపద్యములలో చంద్రో పాలంభనమును వర్ణించినాడు. (మ.చ. 3:65—44) వసుచరిత్రకారుడు పదు నొకండుపద్యములలో దీనిని వర్ణించెను.'వ.చ. 4:26-36)చంద్రునకు రాజుఅని

పేరున్నందున పెద్దన దానిని గ్రహించి–

"ఓ చెల్లా! విరహిణీవధ
మే చతురత నీకు? దురితమే చేయుపనుల్
రాచఱికపు ఫలమే? య
య్యోచంద్ర! వివేకమెఱుఁగవాకొ గురుసేవన్" మ.చ. 3–36.

ని నిందించగా దానిననుసరించుచు రామరాజభూషణుడు–

"రాజీవాక్షులనేచుపాతకివి, చంద్రా! రాజవానీవు, నీ
రాజత్వంబున, ద్విక్రముల్మఁసియెనో, రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ, డిందెనో యహి భయోద్రేకంబు, తాఁజెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే, రాజౌట దోషార్థమే"
వ.చ 4–27.

అని వర్ణించినాడు. రాజు స్త్రీ యభిమానమును రక్షించుట, రాష్ట్రమును పాలించుట, పండితుల నాదరించుట, ఈతిబాధలు తొలగించుట, అను ధర్మములను నెరవేర్చవలయును. ఈ ధర్మములను రాజ శబ్దముచే రాజిల్లు చంద్రుడు నిర్వహించుటలేదని కవి శ్లేష సహాయమున చమత్కరించినాడు. ***

## మన్మథోపాలంభము

పెద్దన మన్మథోపాలంభనము మూడు పద్యములలో ముగించినాడు. (మ. చ. 3: 46–48) రామరాజభూషణుడు ఆరుపద్యములలో వర్ణించినాడు. వ.చ. 43:38–43)

"శంబర వైరివీవు, పటు శంబర పోషణ శాలియాతఁ, డ
బ్జాంబకధారి వీవు, మథితాబ్జుఁ డతండు, నిశాటఘాట ద
ర్పంబడఁగించు బల్లిదుని పట్టివి నీవు, నిశాటుఁడాతఁడో
యంబు చరాంక! నీకు దగునా హరిణాంకుని తోడికూటముల్"
(వ.చ. 4–39)

మన్మథుడు శంబరవైరి; చంద్రుడు శంబరపోషణశాలి; మన్మథుడు అబ్జాంబక ధారి; నిశాటుల చంపువాని కుమారుడు; చంద్రుడు మథితాబ్జుడు, నిశాటుడు- అని, మన్మథునికి విరుద్ధముగా ఆచరించువాడు చంద్రుడని శ్లేషమూలకముగా అర్థము సాధింపబడినది. అట్టియెడల "ఓ మన్మథా! నీకు చంద్రునితో స్నేహ మెట్లు కుదురు"నని నింద. ఇట్టి నిందలు విజయవిలాసకర్త తన కావ్యమున మన్మథాదుల ఉపాలంభన సమయమున రచించియున్నాడు. (వి.వి. 3:43-67) వాని కాధారభూతములగు చమత్కృతులీ రామరాజభూషణుని ప్రబంధ మున గానవచ్చును.

## మలయానిలోపాలంభనము

పెద్దన మలయానిలోపాలంభనమును రెండుపద్యములలో వర్ణించగా రామ రాజభూషణుడు ఏడు పద్యములలో వర్ణించెను. (మ.చ 3:50-51) (వ.చ. 4 45-51) పవనుని అధికముగా తినుటకే బ్రహ్మ,సర్పములకు రెండునాల్కలు కల్పించెనట. అయినను విరహిజనులు చేసికొన్న పాపమెట్టిదోగాని మృగ పవనుని సర్పములు నిశ్శేషముగా తినలేకున్నవట. ఇట్లు పెద్దన మలయపవను నుపాలంభింపజేసినాడు —

"నాలుకలు రెండు నిన్నుం
గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి న
న్నాలి గ్రహమిపుడు దెగఁడినఁ
జాలద మృదుపవన! విరహిజన దురితమునన్" మ.చ. 3-51

ఇట్టి పెద్దనార్యుని విశేషోక్తిని మనమున నిడుకొని రామరాజభూషణుడు—

"గోలలనా వల్లభుఁడిది
గోలలనల యుసురువోసికొందువని వనీ
బాలానిల నిను మెసవం
గాలాహికి నేండ్లువేయు గావించె వెసన్" వ.చ. 4-47 లలనల

యుసురుపోసికొను మలయపవనుని భక్షించుటకు సర్పములకు వేయేండ్లు జీవ మను బ్రహ్మదేవుడు కల్పించినాడు. అనగా వేయేండ్లు సర్పములచేత భక్షింప బడియు పవనుడు నశించకున్నాడని వ్యంగ్యము

## నాయక విరహ వర్ణన

సంస్కృతనాటకములందు నాయకుని విరహ మొక్కొక్కమారు సుదీర్ఘమై యొక అంకమంతటను ప్రదర్శింపబడుచుండును. విక్రమోర్వశీయమున పురూరవుని విరహము,శాకుంతలమున దుష్యంతుని విరహముసుదీర్ఘముగా వర్ణింపబడినవి. కొందరు తెలుగుకవులును ఈ నాయక విరహవర్ణన చేసిరి. పిన వీరన తన శృంగారశాకుంతలమున దుష్యంతుని విరహమును వర్ణించెను. శ్రీనాథుడును నలుని విరహవర్ణనను నైషధప్రథమాశ్వాసమున చేసెను. అట దమయంతీ గుణశ్రవణ మాత్రముననే నాయకుడు విరహానలము బారిబడినట్లు వర్ణింపబడినది. దమయంతీ విరహవేదనయు వినుకలి మాత్రమున కలిగినదే.

వసుచరిత్రలో వసురాజు విరహము, విరహావస్థలో నాతడు ఉన్మాదియై గిరికకొరకై వనవన వెదకుట (వ.చ.3: 79-98). మరియు అతని తాపము, శూన్యమనస్కత,తన్మయత్వము,పాండిమములు వర్ణింపబడినవి మంజువాణి దౌత్యసందర్భమున వసురాజు విరహావస్థ మరల వర్ణింపబడినది. ఇట వసురాజుయొక్క అరుచి, జాగరణ, కృశత్వ పాండిమములు వర్ణింపబడినవి. (వ. చ. 4: 79-86)

వసుచరిత్రకారుడు నాయికా నాయకుల విరహవర్ణనను సుదీర్ఘముగా గావించియున్నాడు. పెద్దన కథ కనుకూలముగ నొక్క వరూథిని విరహమును మాత్రమే వర్ణించినాడు. నాయక విరహవర్ణన నభివర్ణించు పద్ధతిలో తరువాత కవిరాజమనోరంజనాది ప్రబంధకవులకు రామరాజభూషణు డాదర్శప్రాయుడయ్యెను.

—*o*—

# సంభోగ శృంగారము

పెద్దన మనుచరిత్రలో మాయాప్రవర వరూధినుల సంభోగశృంగారముసు రెండు పద్యములలో వర్ణించినాడు. (మ.చ. 3;116,117) "అవధూటి ప్రథమ సురతంబు గంధర్వపతిఁ గరంచె" ననియు, "వరూధిని రతి కన్నె కన్నెటికపు రతియుఁబోలె కడుసింపొసగెన్" అనియు పెద్దన వాచ్యమొనర్చి సంగ్రహముగా వర్ణించియున్నాడు. సంభోగశృంగారమును వర్ణించగల అవకాశమున్నను పెద్దనరెండుపద్యములలో ముగించి, అంగిరసమగు శాంతమునకు భంగము వాటిల్లనీయక ఔచిత్యమును పాటించెను. తృతీయాశ్వాసము 123వ పద్యమున పెద్దన, వరూధిని గర్భాలసయై గంధర్వుని కూడుటను వర్ణించెను. ఈ గర్భిణీరతి అశ్లీలమైనదని దానిని పెద్దన వ్రాయలేదని కొందరు విమర్శకుల అభిప్రాయము కామిని యగు వరూధినిగర్భరతి వర్ణన మాపాత్రకు ఉచితముగ నున్నదేగాని మరొకటి కాదు. మనుచరిత్ర షష్ఠాశ్వాసమున స్వరోచిమనోరమల మొదటిరాత్రి సమయమున మనోరమ హృదయము ప్రియసంభోగమునకుగాక సఖుల దుఃఖనివారణకై తొందరించుచున్నది. కావున పెద్దనకు అక్కడను సంపూర్ణ సంభోగశృంగారమును వర్ణించు అవకాశము లేకపోయెను.

వసుచరిత్ర ప్రబంధము నాయికా నాయకుల సంభోగ శృంగారముతో సుఖాంతమై ముగియుచున్నది గాన కవి దానిని విస్తరముగా వర్ణించినాడు.

సంభోగశృంగారమును విస్తరముగా వర్ణించుట శ్రీనాథుని నైషధముతోడనే తెలుగున ప్రవేశించినదని చెప్పవచ్చును. తత్పూర్వము నన్నెచోడుడు కుమారసంభవ నవమాశ్వాసమున పార్వతీ పరమేశ్వరుల సంభోగశృంగారమును విస్తరముగా వర్ణించియున్నాడు. దశకుమారచరిత్రాది కథాకావ్యము లందు ఈ వర్ణన ఉన్నను ప్రబంధకర్తలకు మార్గదర్శకమైనది నైషధమనియే చెప్పవచ్చును.

## కేళీగృహ వర్ణన

రామరాజభూషణుడు కేళీగృహ వర్ణనతో సంభోగశృంగార వర్ణన నారంభించినాడు. శ్రీనాథుడు నైషధమున తొమ్మిది పద్యములలో నలదమయంతుల విహారసౌధమును వర్ణించినాడు. (శృం.నై. 7:149-157) ఇందు పాంచాలికలు, జలయంత్రములు, చంద్రికలుగాయు చంద్రకాంతోపల స్తంభములు, అసమశరశాస్త్రకారికల నభ్యసించు శారికలు, గోడలమీద వ్రాయబడిన శృంగారదృశ్యములు, పరిమళధూపములు మొదలగునవి వర్ణింపబడినవి. ఈ వర్ణనా విషయసారము నంతను గ్రహించెనా యన్నట్లు రామరాజభూషణుడు రెండు సీసపద్యములలో కేళీగృహ వర్ణనను గావించినాడు. ఈ సందర్భమునందీతడు చూపిన రత్నశాస్త్ర పాండితి, వర్ణనానైపుణ్యము లద్భుతములు.

మనుచరిత్రలో పెద్దన సీసపద్యపు నాల్గుపాదములలో కేళీగృహము నిట్లు వర్ణించినాడు.

"పాండుర ప్రభ క్రిందువడిన చీకటి వోలె
జిగినొప్పు నీలంపు జగతి మెఱపి
యౌన్నత్యమున మింగినట్టి నింగులు గ్రక్క
కరణిధూపము గవాక్షముల వెడల
ధారుణీసతి సుగంధ ద్రవ్యములు దాఁచు
నరలపేటికవోలె పరిమళములు
నెలవులై చెలువారు నిలువుల విలసిల్ల
కొణిగఁబారావత కులము వదరఁ...." మ.చ. 6-3

గోడల పాలగచ్చు యొక్క తెల్లనికాంతుల చేత క్రిందువడిన చీకటివలెఇంద్ర నీల మణులు తాపిన నేల ఒప్పుచున్నదట! ఇట "క్రిందువడిన" అను పదమున కవి చమత్కారముగా ఓడిపోయిన, క్రిందభూమిమీదపడిన అని శ్లేషను ప్రయోగించినాడు. ఇట్టి చమత్కారము పెద్దనలో అరుదు. మిగతా పాదముల లోని ఉత్ప్రేక్ష పెద్దన కవితాఊహలకు చక్కని తార్కాణము.

మరియు స్వారోచీ మనోరమల కేళీగృహమున—
"పసిడిసీట లిఖించిన ప్రతిమ లమర

నీఁగ్రాలిన నంరంద యెలుగులొసఁగు
నట్టి సకినల మంచము లాదిగాఁగ
మెఱయు పరికరముల నొప్పు మేడమీద" మ.చ. 6–3

అని బంగారు నీటిచేత లిఖింపబడిన ప్రతిమలుగల, ఈఁగవాలిన ధ్వని చేయునట్టి సకినల మంచము మొదలగునవా మేడలో నున్నవట.

"ఒకచోటఁ బువ్వు పందిరి
యొకచోఁ జప్పరముఁదూగుటుయ్యేల యొకచో
సకినెల గిలిగిలి మంచం
బొకచోఁ గప్పురపుఁ బలుఁగుటోవరి యొకచోన్" శృం.నై.7-148

అని సకినెల మంచమును గూర్చి శ్రీనాథుడు చెప్పినాడు. సకినెలమంచమనగా కృత్రిమపక్షులు, కీచుబిళ్ళలు గల పందిరిమంచము. సకినెలమంచముచు రామ రాజభూషణఁడు ఒక పద్యమున నిట్లు వర్ణించెను.

"చికిలి పసిండిత్రాత నునుచెంద్రిక వన్నియ మేలుకట్టునం,
జకజక పర్వఁ గ్రొవ్విరులు చంపకముల్నవిఁదేంట్లు మూఁతి ము
ట్టక, నవకంపుఁ గెంపు మొగడల్గని రాఁదెలి ముత్తియంపు బ
ల్సకినల కూకలం, గిలకిన్నగు మోహనశయ్య నున్నెడన్"
వ.చ. 6–74

శ్రీనాథుఁడు నామమాత్రముగా పేర్కొనగా పెద్దన పసిడినీట వ్రాసిన బొమ్మలు గలది, ఈఁగ్రాలిన ధ్వనిచేయుచున్నదని సకినెల మంచమును వర్ణించినాడు. రామరాజభూషణడు ఆమంచమునకే పెద్దన చెప్పిన బంగారు వ్రాతపనినే గాక చంద్రకాంతి గల మేల్కట్టు నేర్పరచినాడు. ఇంకను ఆ చకచకమను మేలుకట్టునుచూచి చంపకములను భ్రాంతితో తుమ్మెదలు వానిని ముట్టక పద్మరాగమణులచే చేయబడిన మొగ్గలను జూచివచ్చి వానిపై వ్రాలుచున్నవట. ముత్తియములు కుట్టబడిన కీఁచుబిళ్ళల మ్రోతలు పై భ్రాంతినొందిన తుమ్మెదలను చూచి గేలిచేయుచు నవ్వుచున్నట్లున్నవట! పెద్దన "ఈఁగ్రాలిన నందంద..."అన్న భావమును గ్రహించి వసుచరిత్రకారుడు భ్రాంత్యుత్ప్రేక్షలను జోడించి రమ్యమొనర్చినాడు.

"వర పద్మ మకర ముల్కారగతంబులు నీకు
సతి నీవి యింతచే సడలరాదె..."
"లాలింతునేఁ బాదనాళీక యుగళి నా
కటకేశ్వరత్వంబు గణన మీఱ..." వ చ. 6–84,85

అను పద్యములలో గిరిక లజ్జాభయములను తొలగించుటకై వసురాజు అనురాగయుక్తముగ పలికిన మాటలు కలవు.

"చూర్ణాలకంబులు స్రుక్కఁ జక్కఁగ దీర్చి
నలువ నెమ్మోములో మొలువఁబెట్టు
కర్పూరహారంబు గదియించు నెపమునఁ
గుచకోరకంబుల గోళ్ళఁగముచుఁ..." శృం.నై.7–172

అని నైషధములో నలుడు, దమయంతి సిగ్గువాపుటకు ప్రయత్నించినట్లుగావర్ణింపబడినది. దాని ననుసరించి గాబోలు పెద్దన—

"దట్టంబు నీ కట్టినట్టి చెంగావికి
బాగుగాదని కేలఁబయఁట నిమిరె
గోరంటా గోళ్ళ నిక్కువఁపు గెంపౌయని
చేయిపట్టి నయమున సెజ్జసేర్చె..." (మ.చ. 6–8) నని

వర్ణించెను. ఇట మనోరమ లజ్జాభయములను తొలగించుటకై స్వరోచిప్రయత్నించుటను కవి వర్ణించినాడు. కాని పై రామరాజభూషణుని పద్యములలోగల శ్లిష్ట వాక్చమత్కృతి వీనిలో లేదు.

అలంకారశాస్త్ర పాండితిగల రామరాజభూషణుడు గిరికావసురాజుల సంభోగము నంతయు నిట్లు వర్ణించెను.

"సతి సాహిత్య రహస్య మీశువలనన్ సాధించి తోడ్తోనత
త్పతికిం బ్రత్యుపదేశమిచ్చె. నతుల ప్రౌఢిన్ ధ్వని వ్యక్తిఁద
చ్ఛ్రితికిం జొన్పుచు, లోచనాంజన రస ప్రోన్మేషము ల్తన్ముఖో
ద్గతముల్సేయుచు ప్రత్యలంకరణ మౌఖర్యంబు దీపింపగన్" (వ.చ. 6–04) గిరికాదేవి వసురాజు వలన సంభోగరహస్యమును గ్రహించి మిగుల నేర్పుతో భూషణాదుల రవము చెలగగా, కాటుకకన్నీరు వసురాజు

ముఖముపై బడగా పుంభావసురతము గావించెనని ప్రకృతార్థము. పార్వతి శివుని వలన సాహిత్యరహస్యముల నెఱిగి ప్రతిభగల ధ్వన్యర్థము మరియు ఉపమాద్యలంకారముల యొక్క వైచిత్రి ప్రకాశింపగా ప్రత్యుపదేశ మిచ్చెనని అప్రకృతార్థము ఇట రామరాజభూషణుడు వ్యంగ్యముగా తన వసుచరిత్ర కావ్యమునుగూర్చి చెప్పినట్లుగా గోచరించుచున్నది. అతడు సాహిత్య రహస్యముల నన్నింటిని పెద్దన యొద్ద అభ్యసించినాడు. ఆ అభ్యసించిన విద్యకు తన అసమానమైన ప్రతిభను జోడించి ధ్వని విశేషములను జతగూర్చి, ఉపమాద్యలంకారములవైచిత్రిని చేర్చి నూతన సృష్టిని గావించినాడు. విద్యనేర్పిన గురువరేణ్యుని సృష్టిని (మనుచరిత్ర) మించిన ప్రతిసృష్టిని (వసుచరిత్ర) గావించి మించి అలరించినాడు. ఏ గురువుకడ సాహిత్యవిద్య నభ్యసించినాడో, ఆ గురువు నేర్పిన విద్య నాధారముగనే తన ప్రతిభచేత అధిగమించి ప్రకాశించినాడు. పై పద్యమున వ్యంగ్యరూపమున ఆ విషయమునే రామరాజభూషణుడు నిక్షిప్త మొనరించినాడనవచ్చును.

మనుచరిత్రలో పెద్దన వరూధినిచే "ఎందే డెందము..." అని చెప్పించిన పద్యమున ఇంద్రియములకు రతి యందు గలుగు ఐహికసుఖమును బ్రహ్మానందముగా సమన్వయించి యర్థమును వివరించెను. రామరాజభూషణకవి వరూధిని నిర్వచనమును మనస్సులో నుంచుకొనియే కాబోలు గిరికావసురాజుల సంభోగ సౌఖ్యమును బ్రహ్మానందానుభవముగా వర్ణించి చెప్పినాడు —

"భూనాథాగ్రణికిన్ వధూమణికి, సంభోగాంత సౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యంబై, యవేద్యాంతరం
బై నిర్లేప కలాపమై, క్రమ విముక్తానేకబంధాను సం
ధానంబై, యపునర్భవ ప్రభవ ఖేదంబై విజృంభించుచున్"

వ.చ. 6 — 95

అనవద్యమై, అవేద్యాంతరంబై, నిర్లేపకలాపమై, విముక్తానేకబంధానుసంధానంబై, అపునర్భవ ప్రభవఖేదంబై, అను విశేషణములు శ్లిష్టములుకాగా సంభోగాంత సౌఖ్యము బ్రహ్మానందముతో సమానమైనదను అర్థమును రామరాజభూషణుడు సాధించినాడు.

అభిరామ నవపల్లవారామ కుంజ వా
టికలఁ గిరముల నాడించుకొనుచుఁ" వ.చ.6-27

అను పద్యమున వసంత, శరత్, వర్ష, హేమంత, ఋతువులలో ఆయాకాలమునకు తగిన క్రీడలతో కాలము గడుపుచు గిరికా వసురాజులు రతీమన్మథుల వలె సరస్వతీ బ్రహ్మలవలె, శచీంద్రుల వలె, లక్ష్మీనారాయణుల వలె మించి సముచితక్రీడలను సలిపిరని కవి అత్యంత చమత్కారముగ వర్ణించి సంభోగ శృంగార వర్ణనను ముగించినాడు.

మనుచరిత్రలో పెద్దనకు రసస్ఫూర్తిగల సంపూర్ణ శృంగారమును వర్ణించుట కవకాశము లేకపోయెను. అవకాశమున్నంతవరకు ఔచితిని పాటించి సుదీర్ఘవర్ణనకు దిగక పెద్దన నిగ్రహమును పాటించినాడు. రామరాజభూషణునిది శృంగార మంగిగాగల కావ్యమగుటచే రతిస్థాయిగా గల శృంగారమును సంపూర్ణముగా వర్ణించినాడు ఈ వర్ణన విషయమున కవి నైషధము నాధారముగా గ్రహించినను కొన్నిచోట్ల చమత్కారాదుల విషయమున దానినిమించినాడనవలెను.



# యుద్ధము

సంస్కృత మహాకవులు, తెలుగు మహాకవులు, యుద్ధ వర్ణనను తమ కావ్యము లందు సందర్భానుకూలముగా అతి విస్తరముగను, నాతి విస్తర ముగను వర్ణించుట కలదు. కావ్యవర్ణనలలో యుద్ధము నొకదానిగ అలంకారికులు పేర్కొనిరి. కావ్యములందు శృంగారమునకు ప్రాధాన్యమున్నట్లుగానే వీరరసమునకు మొదటినుండియు ప్రాధాన్యమీయబడినది. వీరరసపోషణకు యుద్ధమొక ముఖ్య సన్నివేశము. పెద్దన శృంగారశాంతరసముల నెంత మిక్కిలి సుందరముగా పోషించినాడో, వీరరసమును అంత సమర్థవంతముగా పోషించి నాడు.

ప్రాచీన కవులు కొందరు యుద్ధమును వర్ణించుచు ఆ వీరుడైదు బాణ ములు వేసెనని, ప్రతిపక్షవీరుడు పదిబాణములు వేసెనని మాత్రమే వర్ణించిరి. పెద్దనామాత్యుని యుద్ధవర్ణన (4ఆ. 95-115) తత్పూర్వకవుల వర్ణనకన్న భిన్నమై, సహజమై పాఠకుల కన్నులకు కట్టినట్లుగా నున్నది.

మారన మూలము ననుసరించి మార్కండేయపురాణమున నొక పదకొ మున, స్వరోచి తనపైకివచ్చు రాక్షసునిపై చండబాణ మొకటి వేసెనని, దానితో వాడు శాపవిముక్తుడయ్యెనని చెప్పెను. స్వరోచి భయంకరముగా యుద్ధము గావించినట్లు పెద్దన 21 గద్యపద్యములలో వర్ణించి ప్రబంధ వర్ణనాక్రమమును పాటించినాడు. అభిజ్ఞానశాకుంతలమున నాటకలక్షణముల ననుసరించి సూచించ బడిన దుష్యంతుని రాక్షసులతోడి యుద్ధమును పినవీరన శృంగారశాకుంతలమున కావ్యలక్షణముల ననుసరించి విశదముగా వర్ణించియున్నాడు. అట్లే పెద్దనయు పురాణమున నామమాత్రముగా చెప్పబడిన యుద్ధమును పెంచి ప్రబంధౌచిత్య మును పాటించినాడు.

స్వరోచి వేటాడి వేటాడి అలసిపోయి విశ్రాంతి తీసుకొనుచుండగా అతనికి

యొక స్త్రీ యార్తనాదము వినిపించుట, తద్దిశగా పోయి మనోరమను అతడు గాంచుట,ఆమె తన జన్మవృత్తాంతమును చెప్పుట, అంతలో రాక్షసుడు భయంకరాకారముతో వచ్చుట, స్వరోచి రాక్షసునితో పోరాడుట మొదలగు విషయములు పెద్దన ప్రబంధోచిత కథా కల్పనాశక్తికి తార్కాణములు

పెద్దనకు వేటతో ప్రత్యక్షపరిచయము మున్నట్లుగానే, యుద్ధముతోడను ప్రత్యక్ష పరిచయమున్నట్లు నిస్సంశయముగా చెప్పవచ్చును. సాహిత్యగోష్ఠి ప్రియుడు, సాహితీసమరాంగణ సార్వభౌముడునగు శ్రీకృష్ణదేవరాయలతో పాటు పెద్దనయు యుద్ధశిబిరములలో వసించియుండును. యుద్ధములందు తాను స్వయముగా పాల్గొనకపోయినను వీరుల వీరవిహారముల నాతడు సమీపస్థుడై పరిశీలించియుండును. ఇట్టి పరిశీలనాజ్ఞానముతోడనే పెద్దన స్వరోచి, రాక్షసుల మధ్య జరిగిన యుద్ధమును (ముఖ్యముగా 4-115 వచనమున) సహజముగా వర్ణించియున్నాడు. అశ్వారూఢుడైన యోధుడు ఎట్లు తన అశ్వమును వివిధ గతులతో నడిపించి ప్రతివీరు నెదుర్కొనునో కవి స్వయముగా పరిశీలించి యుండును. కవి షష్ఠ్యంత పద్యములలో రాయల అశ్వారోహణ కళను ప్రశంసించియున్నాడు. ("ఆపల్లి తురగ బహువిధారోహ కళారేపంతునకు..." (మ.చ. 1-43).) పెద్దన రాయల అశ్వారోహణ కళను మనస్సులో నుంచుకొనియే కాబోలు స్వరోచి, గుఱ్ఱమును రాక్షసునిపైకి దుమికించుచు చేసిన యుద్ధవిధానమును కన్నులకు కట్టునట్లు వర్ణించినాడు- "వజ్రాయుధ చంచకం బకబక నవ్వుచు వజ్రభేది యలుంగు వెలుంగ మత్తారులకు సుత్తలంబును బద్మరాగమణి చూడంబగు కేడెంబునుంగొని, వేడెంబు పం దురంగంబుం బఱపి తెలిపిం గని తఱటుజేసి యొరసి చన నురికించి కటకుటరిబరి బఱియ పడం బొడిచి కడచి నిలిచినం"-(4-115) స్వరోచి ఈటెను, కెంపులు చెక్కిన డాలును గైకొని, కొరడాతో కొట్టి రాక్షసుని యొరసుకొనిపోవునట్లు గుఱ్ఱమును పరుగెత్తించి వానిప్రక్కలో పఱియవడువట్లు ఈటెతో పొడిచి గుఱ్ఱము నవ్వలికి దాటించి నిల్చెనట. గాయపడిన రాక్షసుడు గుఱ్ఱమును పట్టుటకై చేసాచి సందుసురాగా స్వరోచి వానివ్రేళ్ళను నరికి గుఱ్ఱమును-"మడమలం దాటించిన ఘోటకంబు వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలిక చెడక మోకరించుకొని కొన్ని యడుగులు చని సేకరించుకొని కంచుమించుగం- "పరుగెత్తించెను. మోకాళ్ళపై గుఱ్ఱము కొంతదవ్వు చని తెప్పరిల్లుటను కవి చక్కగా చెప్పినాడు. ఈ విధముగా పరు

గెత్తిన గుఱ్ఱమును స్వరోచి లాలింపుటను చూడుడు–"అట్లు పరంచిన గందంబుఁ జూచి మొగంబు దుడిచి ప్రస్తుతుల గుస్తరించి యతిరభస ఘూత్కార ఘోరారవంబుతో ఘోణరంధ్ర నిశ్వాస గంధవాహ ప్రవాహంబు వెడలు వాహంబుదగ మిట్టిపడ నిట్టట్టు మట్టించుచు"–యుద్ధములో అశ్వము అలసటచెందగా, రౌతులు వానిని లాలించి, అలసటపోగొట్టుటను పెద్దన స్వయముగా గమనించి యుండను. ఆతర్వాత స్వరోచి రాక్షసునిపైకిగుఱ్ఱమునుతోలి యాతనినిగాయపరచి తిరిగి దూరముగా గుఱ్ఱము గెంటి చటను ఎంతసహజముగా చిత్రించినాడో చూడుడు– "నోషాచరుండు పాషాణముల కెపుడెపుడు పంగె నపుడెల్లం దురంగంబు నంటం దోలి గంటియుఁడి వెంటంబడుటయు గెంటించి లేదు బంతి యన్నయట్లల్లంత నుండవాఁగె పడలించి పగతునిపై నిగిడి వాఁగె గుదియింప ముంగాళ్ళ గగనంబున రా మగిడించి యందెవప్పుడుం గింకిణీ రవంబును నురుమ గీసినగతిందేఁటి ప్రమోసిన క్రియ నావాలక యే దిక్కు జూచిన నా దిక్కుననే వినంబడ, నెక్కడఁ జూచినం దానయై నీడ యేర్పడక పార్శ్వంబులం గట్టుకెంబట్టులాలసరి సమకట్టు తెక్కలుగా యాతుధానుండను కొండచిలువ నొడియ నేల పఱుపుగా నాడు గరుడుండనబాఁటుచు, డాయుచు, దవ్వులం బొలసి, కుఱంగటఁదోచి, కుఱంగట నసిఁజూడ దవ్వులం బొలసి దవ్వు చేరుపల సిద్ధార్థ్యంబులుగా మెలంగన్ దేజీ కాశ్వంబు మెలంపుచు–" ఇట్లు అశ్వము నారోహించిన వీరుని యుద్ధమును సహజముగా వర్ణించిన కవి మరొకడు కనిపించడన్నచో నతిశయోక్తి యిసుమంతయు లేదు.

వసుచరిత్రలో–కోలాహలుడు శుక్తిమతిని ఘర్షించగా గ్రామములన్నియు జలమయములైనవి. ప్రజలు పోయి వసురాజుతో మొరపెట్టుకొనిరి. రాజు ఆ దుష్ట కోలాహల శిక్షణార్థము వెడలెను. అతనివెంట చతురంగబల మాయత్తమై కదలెను. కాని వసురాజు నఖాగ్రమాత్ర సాధనముచేతనే కోలాహలుని శిక్షించెను కావున ఆ చతురంగబలావసరము లేకపోయినది అయినను కవి ఆ బలములను వర్ణించెను. (వ.చ. 2-152)

వసుచరిత్రలోనాయకుడగు వసురాజు తనపాద నఖాగ్రమాత్రముననే కోలాహలుని నిర్జించుపట్టున రామరాజభూషణుడు వీరరసమునుపోషించినాడు. శృంగార నాయకుని వీరునిగా చెప్పవలెనని ఆలంకారికుల మతము. నాయకుని

సాహసపరాక్రమములను చెప్పుటకై ఆతడు యుద్ధమొనర్చినట్లు వర్ణించుటకలదు. కాని వసురాజు కొనగోటి తోడనే కొండనెగమీటిన వీరుడు. అతని పరాక్రమమును గూర్చి వేరే యుద్ధవర్ణనచేయు అవసరముగాని అవకాశముగాని కవికి లేక పోయెను.

—*:*—

## వేట

ఆలంకారికులు కొందరు మాత్రమే వేట వర్ణనను ప్రబంధవర్ణనలలో నొకదానినిగా చెప్పిరి. సాహిత్యదర్పణకారుడు దీనిని వర్ణ్యసామాగ్రిలో చేర్చెను. (3-322). తెనుగున అప్పకవి వేటను ప్రబంధవర్ణనలలో చేర్చియున్నాడు. (1-28). సంస్కృత మహాకావ్యకర్తలు ఇతరవర్ణనలను పాటించినట్లుగా ఈ మృగయావర్ణనను తమ కావ్యములందు పాటించలేదు. సంస్కృత పంచ మహాకావ్యములలో యేయొక్కదానిలోనైన ఈ మృగయావర్ణన లేదు. వీరుకాక ఇతర కావ్యకర్తలు కొందరు వేట వర్ణనకు పూనుకొన్నారు. బాణుడు కాదంబరిలో 'శబరుల వేట'ను వర్ణించియున్నాడు ధనుస్సు, ఛురిక, బల్లెము, జాలెలు మొదలగు శబరుల ఆయుధసామాగ్రిని, వానితో శబరులు వేటకై పోవుట, వారి భయంకరారావమును విని అరణ్యమున గల సింహ, గజ, సూకర, మృగ, విహంగాదులు సంచలనము నొందుటను ఆ మహాకవి వర్ణించియున్నాడు. త్రివిక్రమభట్టుకూడా నలచంపువులో నలుని వేటను వర్ణించినాడు. త్రివిక్రమభట్టు తనకావ్యమున మహాభారత కథాతిరిక్తమగు కల్పనల నెన్నింటినో చేసినాడు. భారతమున నలుడు వనవిహారము చేసినట్లుండగా నితడు నలుని వేటకు పంపించినాడు. (న.చం. 1:44-62) వర్షర్తు ప్రారంభమున వనపాలుడు డొకడు నలుని కడకు వచ్చి విహారవనమున అంజనపర్వత భ్రాంతిని మరియు జలాశి

మేచురమగు మేఘ భాంతిని కల్గించునట్టి భయంకర సూకర మొకటి ప్రవేశించి లీలా సరోవరాదులను ధ్వంస మొనర్చుచున్నదని నివేదించును. నలుడు తన సేనాపతియగు బాహుకుని పిల్చి మృగయాప్రయాణావసర వస్తుసామాగ్రిని సిద్ధము చేయుమని యాజ్ఞాపించును. నలుడు వ్యాధులతో కూడి వనమున ప్రవేశించును. వీరి యార్భాటమునకు గజ కురంగాది జంతుజాలములు బెదిరి చెల్లాచెదరైనవి. క్రూర సూకారమునకై వెదకి కనుగొని దానితో రాజు పోరాడి చంపును. ఈ కవి మృగయా వర్ణనావసరమున శ్లేషను విరివిగా ప్రయోగించినాడు.

అనతభట్టు చంపూభారతమున పాండురాజు వేటను వర్ణించినాడు. భా చం. 1:15-26. పాండురాజు హరిణములను, లులాయములను, సింహములను, సూకరములను వేటాడి చంపినట్లుగా వర్ణించెను. ఇతడు వీరరస పోషణము కన్నను శబ్ద చమత్కారమునకే ప్రాధాన్యమిచ్చెను.

వ్యాసమహాభారతమున వేటప్రసక్తి పలుమార్లు వచ్చినది. కాని ఎచ్చటను విస్తారముగా వర్ణించబడలేదు. శకుంతలాదుష్యంతుల కథలో మాత్రము దుష్యంతునివేట 1శ్లోకములలో వర్ణించబడినది. (సం.అ ప 69 అధ్యా 19-31) దీని ననుసరించియే నన్నయ దుష్యంతుని వేటను వర్ణించినాడు. (అ.ప. 4 10-13) మహాభారతము ననుసరించి కాళిదాసు శాకుంతలనాటకమున ప్రథమాంకారంభమున రాజు వేటకై బయలుదేరి మృగాకర్షితుడై చాలాదూరము కొనిపోబడినట్లుగా చెప్పినాడు.

కాళిదాసుని శాకుంతల క్రమమును గ్రహించిన పినవీరన తన కావ్యమున దుష్యంతుని వేటకు పంపినపుడు విస్తారముగ వేటను వర్ణించెను. ఇతనికన్న ముందు నాచనసోమన ఉత్తర హరివంశమున విస్తారముగా మృగయావర్ణన చేసినాడు. (ఉ.హ. 4:31-29. హంస డిభకు లిరువురు లేళ్ళను, పందులను, దుప్పులను వేటాడుట ఇందు కలదు. ఆ తర్వాత జక్కన, అనంతుడు, గౌరన, గోపరాజు, నంది-ఘంటయలు వేటను వర్ణించియుండిరి. నందిమల్లయ, ఘంటసింగనలు వరాహపురాణానువాదమున తమ పూర్వుడగు వీరన ననుసరించి దుర్జయుని వేటను విస్తారముగా వర్ణించిరనవచ్చును. (వ పు. 4:67-87)

ఇట్టి పూర్వకవుల మృగయావర్ణనలచే పెద్దన ఆకర్షితుడై, స్వానుభవముచే ప్రేరేపితుడై మనుచరిత్రలో 'వేట'ను ప్రవేశపెట్టెను. పినవీరన వేటవర్ణనకు పెద్దన వేట వర్ణనకు పోలికలు కలవు. దీనినిబట్టి ఇతరకవుల వేట వర్ణనకన్న పెద్దనను పినవీరన వర్ణన మిక్కిలి యాకర్షించిన దనవచ్చును. మూల మార్కండేయపురాణములో స్వరోచి, కథాంతమున వేటకై బయలుదేరిపోయి అరణ్యమున నొక హరిణమును గాంచినట్లుండగా పెద్దన రెండుమార్లుస్వరోచి వేటకు పోయినట్లుగా వర్ణించినాడు. మొదటిమారు వేట ప్రసక్తి మూలమున లేదు. పెద్దన వేటను విస్తారముగా వర్ణించదలచి కథాంతమున నట్టి వర్ణన ఔచితీ పోషకము కాదని తలచి కాబోలు మొదటిమారు వేటను ప్రవేశపెట్టి సవిస్తరముగా వర్ణించెను

పెద్దనకు వేటయందనుభవము గలదనుట సుస్పష్టము. అతడు వీరన వర్ణనాక్రమమును కొంత అనుకరించినను, అధికభాగము అతని స్వంతమనుట నిస్సంశయము.

స్వరోచి ఆప్తజనపరివేష్టితుడై శశికాంతశిలపై నగాగ్రమున విశ్రమించి యున్నయెడ నొక ఎఱుకతేఁడు వచ్చి గోరజము, జున్ను, నక్కకొమ్ము, చాఱపప్పు మొదలగువానిని కానుకవెట్టి అరణ్యమున గల వరాహాదులను వర్ణించి చెప్పి వేటకై పురిగొల్పెను.

పెద్దన 4-27వ వచనమున స్వరోచి వేటకాయత్తమగు విధమును కన్నులకు కట్టునట్లుగా వర్ణించెను. ఇట్టి వర్ణన వీరనకావ్యమున లేదు. అక్కడ దుష్యంతుని పూజావారువముల వర్ణన మాత్రము కలదు. (శృం. శా. 1-111)

స్వరోచి గుఱ్ఱమును పెద్దన వర్ణించిన తీరు వీరన వర్ణనకన్న సహజము. (మ.చ. 4-28) ఇది పెద్దనకు గల ప్రత్యక్ష అశ్వపరిచయమును, వాని యలంకార పరిచయమును స్పష్టము చేయుచున్నది.

"పులిమల్లఁ డచవిపోతులరాజు గరుడుండు
గాలివేగంబు పందేల పసిడి..." (శృం శా. 1-68) అని

శృంగారశాకుంతలకర్త చెప్పినదాని ననుసరించి పెద్దన—

"పులియుఁడు బూచిగాఁడసుర పోతులరా జుమంతుగాతు..." అని వేటపక్కుల పేర్లు చెప్పె నందురు. స్వరోచి ఒక్కొక్క మృగమును వేటాడుటను మ.చ. 4-32) కవి సుందరముగా వర్ణించెను. స్వరోచి పరివారముతో అరణ్యమున ప్రవేశించి వివిధానేక జంతువులను పట్టుటకై వలలను పన్నుట, వివిధ వాయిద్యములను మ్రోయించి, అగ్నియంత్రములను ముట్టించి కలతపెట్టుట, తదనంతరము పందులు, లేళ్ళు, కణితి, పెద్దపులి, కాఱుదున్నపోతులు, కుందేళ్ళు,ఉడుము, ఏదులు, చెమరుకాకి, కొంగలు మొదలగు పశుపక్ష్యాదులను వేడాడిన తీరులను పెద్దన స్వతంత్రముగా, వివరముగా, సహజముగా వర్ణించి, తన మృగయా పరిచితిని ప్రకటించినాడు.

స్వరోచి వేటావుబోయల నైపుణికి మెచ్చి కోరినవస్తువులు వారికి బహుమానముగా నిచ్చుట 4-49) మొదలైన ఎన్నియో వర్ణనలు సహజములై అప్రయత్నముగా శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని వేటను స్ఫురింపజేయు నట్టివిగా నున్నవి.

వేటాడుటకై పెంచు డేగలయొక్క వాడిగోళ్ళు గ్రుచ్చుకొనకుండా "అత్తెము"లను చర్మ కవచములను చేతికి తొడుగుకొనుట, డేగలు చేత పట్టుకొన్నవారి కన్నులు బొడుచునను భయముచే వానికి "కనుగట్టు" అను తోలుతిత్తిని కనులు కానరానట్లుగా తొడుగుట, ఆకలి బాగుగా కలిగి వేటయందుత్సాహము కల్గించుటకై వానికి మందునిచ్చి వాంతి చేయించుట, మన్నులనెడి మృగములను, బిసను త్రొక్కగానే తగులొక్కను బోనులను పన్ని పట్టుకొనుట, నరమాంస భక్షణ కలవాటుపడిన పులులను వాకట్టు కట్టి వేటాడుట, వేటకుక్కలకు పసుపు నీటితో స్నానము చేయించుట, అవి అలసిపోయి దప్పిగొనినప్పుడు వానిపై తడిదుప్పట్లను దాహము తీర్చుటకై కప్పుట, మృగముల వేటాడునపుడు వేటగాడు పచ్చని యాకులను తమ తలలపై, నడుములకు, ధనుష్కోటులకు కప్పుకొనుట, పక్షులను డేగలను వేటాడు తీరులను-ఎన్నింటినో సహజముగా వర్ణించి పెద్దన పూర్వకవులను మించెను. వేటాడునపు డాజ్ఞలనిచ్చు స్వరోచిని "ఒక్కొక్కయెడఁ దురగాధిరూఢుండై మెలంగుచు యెల్లయెడల దాస"యై యున్నాడనుట పెద్దన రాయలు వేటాడునపుడు తానుచూచినది దృష్టిలోనిడుకొనియే చెప్పియుండవచ్చును. ఇంకను పెద్దన వివిధారణ్య మృగములయొక్క

సంచారములను, ఆహారములను, అలవాట్లను తనకు గల మృగయా పరిచితిచే సహజముగ వర్ణించగలిగెను ఆ వేట తర్వాత స్వరోచిపరిజనులు తాము వేటాడిన జంతుమాంసములను వండుకొను విధానమును పెద్దన సహజముగా చెప్పెను. ఇట వేటగాండ్రు కఱకుట్లను వండుకొనుటను పెద్దన అసహ్యించుకొనక తాను రాజు వెంట వెళ్ళినపుడు పరిశీలించిన దానిని వ్రాసియుండును. (మ.చ. 4–60) ఈ సహజ వర్ణనలతో కూడిన పెద్దన వేటవర్ణనను వేరొక్క కవి మించ లేదని చెప్పవచ్చును.

పెద్దన రెండవమారు షష్ఠాశ్వాసమున, స్వరోచి వేటకు పోవుటను వర్ణించినాడు ఈ మృగయాసందర్భము మార్కండేయపురాణకథలో నున్నట్టిదే. కథ కవసరమైనట్టిది. కాని కావ్యాంతమున నున్నది గాన పెద్దన దీనిని 3 పద్యములలో ముగించెను. (మ.చ 6:87–89)

రామరాజభూషణుడు తన కావ్యమున పెద్దనాదులు గావించిన మృగయా వర్ణనను స్వీకరించలేదు. వ్యాసమహాభారతమున వసురాజు మృగయా వినోదిగా చెప్పబడినాడు.[1] తెనుగు మహాభారతమునను ఈవిషయము స్పష్టముగా చెప్ప బడినది.[2] అయినను రామరాజభూషణు డేలనో వేటను తన కథలో గ్రహించ లేదు. శృంగారశాకుంతలము ననుసరించి పెద్దన వేటను వర్ణించినాడు. కావున దానినే తాను గ్రహించిన చర్వితచర్వణమే కాగలదని కాబోలు నవ్యతకై నైషధ కావ్యము ననుసరించి కవి వసురాజును ఉద్యానవన విహారమునకు పంపియుండును. కాని పెద్దనకువలె తనకును వేటతో పరిచయము కలదనుటను అక్కడ క్కడ ప్రదర్శించుటకు పూనుకొనినాడు—

గిరిక విరహమును వర్ణించుచు రామరాజభూషణుడు శ్లేష సహాయమున

---

1. రాజోపరిచరోనామ ధర్మ నిత్యో మహీపతిః
   బభూవ మృగయాం గంతుం సదాకిల ధృతవ్రతః
   (సం ఆ ప. 36–1)

2. వాసవప్రతిముండు, వసువనునాతడు చేది భూనాథుడు శిష్టలోక నుతకీర్తి, మృగయావినోదార్థ మడవిడెఁజని (అ.ప. 3–23)

మన్మథుని, వేటాడు కిరాతకునితోడ పోల్చినాడు. ఆ మదనకిరాతకుడు యౌవన రేఖలో వేటాడ నారంభించినాడట—

"వరగుణజాల సంవనన సామాగ్రితోఁ
బాశంబు లాశలఁ బాదుకొల్ప,
చటుల తాపానల జ్వాలికల్నెరపి, జీ
వన మంతయుఁ గలచి, వనచరాళి
నిస్వనంబులు రేఁచి, నిగుడకాతర నేత్ర
శంబరంబులువాడు శరభ గండ
కములు దూలెడు చిత్రకాయలీలలు సోయ
గములు పీడ్కొను భద్రగతులు జడియ
నాతత స్తబ్ధ రోమంబు లలసి త్రావాలు,
ఘన సితా పాంగములుగాఁగఁ గాండవృష్టిఁ
బఱపి, వేటాడుఁ దొడఁగె శంబర విరోధి
కాంత యౌవనరేఖలోఁ గలయ మెలఁగి" వ.చ. 3—111

వేటగాడు వలలను, ఉరిత్రాళ్ళ నంతటపాదుకొల్పుట, అగ్నిజ్వాలలను కల్పించుట, శుకపికాదులను లేవగొట్టుట. శరభ, ఖడ్గ, వ్యాఘ్ర, గజ, వరాహ, మయూరాది జంతువులు పరుగెత్తి అలసిన వానిపై బాణవర్షములను కురిపించుట మొదలగు మృగయా చర్యల నిందు వర్ణించినాడు. అట్లే "ఓదము"లను కపట బిలములను త్రవ్వి ఏనుగులను ఆ బిలములందు పడునట్లుగా తరిమి వేటాడుటను రామరాజభూషణు డెరుఁగును. ఆ పరిచయము నుపయోగించి చంద్రోదయ వర్ణనా సందర్భమున ఇట్లు వర్ణించినాడు—

"పటుతరాపట ఖండమండిత నిజప్రాగంశుధారా పరి
స్ఫుటసూత్రంబులఁ బ్రోఁగువారి వెస, నంభోవాహమార్గాఖ్యమౌ
నటవిం, బ్రాక్తనభిల్ల మౌళిమణి వేటాడన్, మదానేకప
చ్ఛట లోదంబులఁబడ్డయట్లు; తమముల్ జాఱెన్ బిలశ్రేణికిన్"
వ.చ. 4—19

గట్టిగా నుండుటకు వేటగాడు తారకారుచు లనెడు గుడ్డపేలికలతో చుట్టిన చంద్ర కిరణములు అను నూలుపగ్గములను "ఓదము"ల చెంత ఏనుగులను బంధించుటకు పన్నినాడట.

అట్లే దీము పెంటిని ఎఱగాపెట్టి మగపక్షులను వేటగాండ్రుపట్టుకొందురు. దానిని రామరాజభూషణుడు ఈ క్రింది పద్యమున జక్కవ వర్ణనాసందర్భమున నిట్లు చెప్పెను.

"ఎలమి, మనోజలుబ్ధుఁ డెనయించిన జక్కవదీము పెంటి పే
రెలుఁగునఁ బిల్చి, చూడ్కి గదియించి, యెదుర్కొని మేను మేను ని
శ్చలగుణ సంగతిం బెనఁచి. చక్రము దామర తెంకిఁజేర్పఁద
త్కల కలశంకఁబోలె విహగంబులు వీడెఁ గులాయకూటముల్"

వ.చ.4-12

రామరాజభూషణుడు పెద్దనవలె వేటను ప్రత్యేకముగా వర్ణించకున్నను వేటతో తనకు గల పరిచయమును కొంత ప్రకటించినాడు. రామరాజభూషణుడు హరిశ్చంద్రనలోపాఖ్యానమను తన ద్వ్యర్థి కావ్యమున ద్వితీయాశ్వాసమున హరిశ్చంద్రునివేటను కొంతమేరకు వర్ణించియున్నాడు. కాని అచట నల, హరిశ్చంద్రుల కథలు రెంటిని నిర్వహించుటచే నలుని ఉద్యానవనవిహారమును గూర్చిన యర్థమును గూడ సాధించు అవసరముండుటచే వేటను ప్రత్యేకముగా, సహజముగా వర్ణించలేకపోయినాడు.



## సూర్యాస్తమయము – సంధ్య

సూర్యాస్తమయ వర్ణనను సందర్భానుకూలముగా కవులు చేయుట కలదు. తిక్కన విరాటపర్వమందలి సూర్యాస్తమయవర్ణన తరువాతికవులకాదర్శప్రాయమయ్యెను. ఆతరువాత మహాభారత యుద్ధపర్వములందు దివసావసానాదుల నెరింగించుటకు తిక్కన సూర్యాస్తమయ వర్ణనలను గావించినాడు. తిక్కన వర్ణనలు ప్రబంధమార్గమున నడచి మనోహరములై యున్నవి. నన్నెచోడుడు

కుమారసంభవమున దీర్ఘమైన, అలంకార చమత్కారయుక్తమైన సూర్యాస్తమయ, తారక అంధకారాది వర్ణనలను చేసెను. (కు.సం. 8:87-99) తదనంతరము ఎఱ్ఱన, సోమన, శ్రీనాథాది కవులు సూర్యాస్తమయ అంధకారాది వర్ణనలను ప్రబంధ ఫక్కితో ప్రౌఢముగా రచించిరి. పెద్దనాది ప్రబంధ కవులును, ఆ మార్గము ననుసరించుచు స్వతంత్రమైన, చక్కని ఊహాకల్పనలతోగూడిన సూర్యాస్తమయ, అంధకారాది వర్ణనలను చేసిరి.

ప్రవరుడు వరూథినిని నిరాకరించి వెడలిపోయిన పిదప ఆమె విరహమును గూర్చి చెప్పి అప్పుడు సూర్యుడస్తమించినట్లుగా పెద్దన వర్ణించి, సఖుల శిశిరోపచారములను, మన్మథాదుల నుపాలంభించుటను చెప్పెను. మరునాడు వరూథిని సఖుల బలవంతమున ఉద్యానవన విహారమునకు పోయినట్లుగా నుడివెను. వసురాజు సమక్షమునుండి గిరిక తల్లిపిలుపుఅను మిషతో పోయిన వెనుక ఆమె విరహమునకు గురి యగుటను చెప్పి,సఖుల కోరికపై ఉద్యానవన విహారమునకు బయలుదేరుటన్న సఖులామెకు శైత్యోపచారములను చేయుటను ముగించి రామరాజభూషణుడుఅప్పుడు సూరాస్తమయమును వర్ణించెను. ఈవర్ణన తరువాత ఇతడు మన్మథాదుల నుపాలంభనములను రచించెను. ఇట్లు మను, వసుచరిత్రల కథాక్రమమున కొంతపోలిక కనిపించుచున్నది. ఇరువురు కవులును తమ నాయికల విరహసందర్భముననే సూర్యాస్తమయ వర్ణనను గావించియున్నారు. పెద్దన ఏడు పద్యములలో (మ.చ. 3:10-17) రామరాజభూషణుడు ఆరు పద్యములలో వ.చ. 4:4-9) సూర్యాస్తమయ సంధ్యాకాల వర్ణనలను చేసిరి.

మనుచరిత్రలో తృతీయాశ్వాసముననే గాక పంచమాశ్వాసమునను సూర్యాస్తమయ వర్ణన కలదు స్వరోచి మనోరమల వివాహోత్పూర్వమే ఈ వర్ణన కలదు. వసుచరిత్రలోను సూర్యాస్తమయ వర్ణన చతుర్థాశ్వాసముననే గాక షష్ఠాశ్వాసారంభమునను కలదు. అది వసురాజు పెండ్లికొడుకై కోలాహల పురమునకు తరలి వెళ్ళుటకు పూర్వము వర్ణించబడినది. ఇట్లు రెండు ప్రబంధము లందును రెండవమారు వివాహసందర్భముననే సూర్యాస్తమయ, సంధ్యా వర్ణనలు గావించబడినవి పెద్దన,రామరాజభూషణకవులిరువురును ఇటరెండేసిపద్యములలోనే ఈ వర్ణనను ముగించిరి (మ.చ. 5:33,34: వ.చ. 6:3,4). మన

వసుచరిత్రలలోని సూర్యాస్తమయ వర్ణనలలో చాల సామ్యములు కలవు. పెద్దన వలెనే రామరాజభూషణుడును సూర్యుడ స్తంగతుడగుటను కథకు ముడివెట్టి వర్ణించెను.

"తరుణి ననన్యకాంత నతిధారుణ పుష్పశిలీ ముఖ వ్యథా

భర (మ.చ. 3-10) అను పద్యమున వరూథినిపై సానుభూతితో సూర్యుడు రోషభీషణస్ఫురణవహించినాడని పెద్దన ఉత్ప్రేక్షించెను. ఇక రామరాజభూషణుడు— "భవ ననుజాత్మజన్ వసునృపాలుడు గైకొన నెల్లినేఁట నయ్యె వని" (వ.చ! 4—) అని సూర్యుడేగుటలోని కారణమును ఉత్ప్రేక్షలోనే కథ కన్వయించి చెప్పెను.

"ఉరు దరీకుహర సుప్తోత్థ శార్దూలముల్

ఝురవారి శోణితశంకఁ ద్రావ" మ.చ. 3-11) అను పద్యమున పెద్దన చక్కని భ్రాంతిమదలంకారములో "జరఠారుణాతపముల"ను వర్ణించినాడు. రామరాజభూషణుడు సీసమును గాకున్నను ఉత్పలమాలలో "పరిణతా తపము"లను వర్ణించెను. (వ.చ 4-5) పెద్దన "జరఠాతపము" రామరాజభూషణునిలో "పరిణతాపము"గా రూపొందెను.

పెద్దన సంధ్యాసమయమున దీర్ఘములగు నీడలను చంద్రుని పిల్వనరిగెడు రజనీ తరుణీమణి దూతికలుగా నుత్ప్రేక్షించెను. (మ.చ. 3-13) రామరాజభూషణుడు ఛాయను ఖండిత నాయికగా జేసి సూర్యుని వెంబడి ఛాయ వెడలక మరలెనని చెప్పి చమత్కారమును చూపెను—అపరదిశ యను నూత్నస్త్రీ యందు సూర్యున కనురాగము కలిగి ఆమె యొద్దకు పోయినాడు, అపుడు భర్త తమను విడుచుటచే కమలము, ప్రభలను నాయికలు మోము ముడిచి, కాంతి విహీనమైనవి. ఇక ఛాయయను నాయిక భర్త ననుసరించక కోపముతో వెనుకకు మరలెనని, సంధ్యాసమయమున నీడలు వెనుకకు సాగుటను గ్రహించి చిత్రమైన ఊహ చేసెను. (వ.చ. 4-6)

"ఏ విహంగముఁ గన్న నెలుఁగిచ్చుచును సారె

కును సైకతంబులఁగూడఁ దారు..." మ.చ. 3-16

అను పద్యమున చక్రవాకి యొక్క విరహమును వర్ణించుచు పెద్దన వ్యంగ్య

వైభవమున వరూథిని విరహవేదనను, అవస్థాచేష్టలను సూచించెను. రామరాజ భూషణుడును చక్రవాకముల వర్ణన గావించినాడు. ఈ వర్ణన నాతడు రెండు పద్యములలో చేసెను. అందొకపద్యము సూర్యోదయసమయమున పెద్దన వర్ణించిన చక్రవాక వర్ణనను పోలియున్నది. పెద్దన పద్యము—

"కొలకొలఁగూయు నానొఱఁగుఁ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టుఁబాయుచి
ల్వలక్రియఁగానరాని గతులన్ మయిమైఁబెనచున్ జనించు న
శ్రులఋత నొత్తుసోలు నిలుచున్ విధి చాతురి గూడియున్ రతిం
దలఁపవు కంటెఁబాసిన వెతల్ దలఁపించుచు గోక దంపతుల్

మ.చ. 3—63

ఇట్లు పెద్దన వియోగానంతరము ప్రభాతసమయమున కలిసికొను కోక దంపతులను వర్ణించగా, ముమ్మూర్తులదానినే అనుకరించుచు, సూర్యాస్తమయమున ఎడబాటు నొందు కోకదంపతులను రామరాజ భూషణుడు ఇట్లు వర్ణించెను.

"మొగము మొగంబుగూర్చి బలుముచ్చటఁ బక్ష పుటాంతరంబులన్
బిగియఁ గవుంగిలించి తన ప్రేయసి ముంగలఁ జంచుపాలికా
విగళితనాళ దంభమున వెగనె రాఁగతమిచ్చి యేగె లో
నొగులుచు నొక్క జక్కవ యినుండుంసనం దదధీన వృత్తియై

వ చ 4—9

కోక దంపతులు మోమున మోముజేర్చి, గొంతులను పెనవేసుకొని, శరీరములను కౌగిలించుకొని దుఃఖముతో విడిపోయినవి.

సాయంసంధ్యనుత్ప్రేక్షలో పెద్దన వర్ణించిన విధము—

"రవిబింబ పతన దీర్ణ పయోధిగర్భని
ర్గత శేషఫణి ఫణారత్న రుచియొ!
దివసావసాన సందీప్తా స్తగిరి శిఖా
జ్యోతిర్లతా ప్రతానాతపంబొ!
తపనధూర్దండ నిర్దళిత దిక్తటదృశ్య
కమలజాండ కటాహ కనక ఘృణియొ!
చండీశ తాండవోత్సవ సంభృతక్షపా
హస్తాగ్రదీప గభస్తి చయమొ!

ద్రాగి దాహచ్చిదా వినిద్రాణ మదవ
దంజనాలాన మూల శయ్యావిధాన
వారణా ధోరణా కల్పితోరు శోణ
మృత్తికారాశియో యన మెఱసె సంధ్య" (మ.చ. 4–17

పెద్దన ఈపద్యమున చక్కని ఊహౌన్నత్యమును ప్రదర్శించెను. సాయంకాలము సూర్యుడుపడుటచే పాయగా విచ్చిన సముద్రమునుండి పైకిప్రసరించిన ఆదిశేషుని పడగలమీది రత్నాల కాంతియో; పశ్చిమాద్రి శిఖరముపై సూర్యకాంతి తగ్గుటతో వెలిగెడు జ్యోతిర్లతల కాంతియో; సూర్యరథముయొక్క కాడి తగిలి చీల్చబడి దిక్తటమున కనబడు బ్రహ్మాండమను బంగారు కటాహము యొక్కకాంతియో; శివతాండవ సమయమున రాత్రియను స్త్రీచేత పట్టుకొనబడిన దివిటీయొక్క కాంతియో; పశ్చిమదిగ్గజము యొక్క దాహమును పోగొట్టుటకై మావటివాడు ఆలానమూలమున పరచిన ఎఱ్ఱమట్టి యొక్క రాశియో యనునట్లు సంధ్యా రాగమొప్పెను.

పెద్దన స్వతంత్రమైన ఊహావైచిత్ర్యమును ప్రకటించగా. రామరాజ భూషణుడు కవియేగాక గొప్ప అలంకారికుడు కావున సంధ్యా వర్ణన పద్యమున అభిసారిక, వాసకసజ్జిక ప్రోషితభర్తృక యను నాయికాభేదములను వ్యంగ్యముగా చెప్పెను–

"వనజాలయము మూసియును జాడఁదిలకించు
లలితాబ్జినీ రాగలక్ష్మి యనగ
ఘనపదాయస పట్టికఁ దమోంజనము పట్ట
నపరాశయిడిన దీపార్చియనగ
గప్పుచూపుచుఁ బాంథ గణము నేఁచు ప్రదోష
కరిమేని ధాతుశృంగారమనగ
ద్విజసూక్తిఁ బతిరాక దెలిసి మోమెత్తిరా
త్రివహించు కాశ్మీరతిలక మనగ
సమయ మృగహృత రవిరఘూత్తముని సతిఁగ
భామ యిు, దమోనిశాటుండు పఱపకుండ

నసల దామంబులో డాఁచి యమరఁలిడిన
వంచనా గౌరగాత్రి నావఱలె సంధ్య వ.చ. 4-7

"యన మెఱసె సంధ్య"యని పద్యమును పెద్దన ముగించగా రామరాజభూష ణుడు "నావఱలె సంధ్య"యని ముగించెను. రామరాజభూషణకవి రూపక శ్లేషాలంకార సహిత ఉత్ప్రేక్షలో సంధ్యావర్ణన గావించినాడు. సంధ్యావర్ణనలో పెద్దన గజప్రసక్తినితేగా ఇతడు సీసపద్యపు మూడవపాదమున సంధ్యను ధాతుశృంగారము గల ఏనుగుగా నుత్ప్రేక్షించినాడు. తేటగీతి పద్యమునపెద్దన తన గజశాస్త్రపాండిత్యమును ప్రదర్శించగా, రామరాజభూషణకవి తేటగీతిలో తన రామాయణకథా ప్రీతిని ప్రదర్శించినాడు. "సాయంకాల మనెడు మాయా మృగముచేతకొనిపోబడిన సూర్యుడనెడి శ్రీరాముని యొక్క ప్రభయనెడుభార్యను చీకటి యను రావణు డెత్తుకొనిపోగా అగ్నితేజము నందు దాచియుంచి దేవతలు నిల్పిన పసుపుచాయ శరీరము గల మాయాసీతయో యన్నట్లుగా సంధ్యారాగము ప్రకాశించెను" అని అధ్యాత్మరామాయణము నందలి సంఘటన నిక్కడ రామ రాజభూషణుడు స్మరించినాడు.

సంధ్యావర్ణనలోని పెద్దన పద్యమున గల ఊహౌన్నత్యముతో గూడిన ప్రసన్నత, శ్లేషాద్యలంకార సంకరమైన రామరాజభూషణుని పద్యములో లేదు.

మనుచరిత్ర పంచమాశ్వాసమున రెండవమారు గావించిన సాయం సంధ్యావర్ణనను పెద్దన కథ కనుసంధానించినాడు. (మ.చ. 5-83) అట్లే రామరాజభూషణుడును రెండవమారు సాయంకాలవర్ణనను కథకుముడిపెట్టి చెప్పినాడు. (వ.చ. 6-3)



## రాత్రి

అప్పకవి రాత్రి వర్ణనను ప్రబంధవర్ణనలలో నొకదానిగ పేర్కొనలేదు. విశ్వనాథుడు సాహిత్యదర్పణమున "రజనీప్రదోషధ్వాంత వాసరాః" అని సంధ్య, తమస్సు, రాత్రి, వర్ణనలను మహాకావ్యములందు ఉండవలెనని చెప్పినాడు. పూర్వకవులు సూర్యాస్తమయమునననుసరించి చీకట్లు ముసురుటను చెప్పి, పిదప చంద్రోదయ మధుపానాదివర్ణనలను చేసియుండిరి. ఈరాత్రివర్ణనలో అంధకార తారకోదయములు వర్ణించబడును

మనుచరిత్ర తృతీయాశ్వాసమున రెండుపద్యములలో, పంచమాశ్వాసమున నొక్క పద్యములో రాత్రిని కవివర్ణించెను (మ చ. 3: 18,19,5 : 34) వసుచరిత్రలో చతుర్థాశ్వాసమున ఆరు పద్యములలో షష్ఠాశ్వాసమున రెండు పద్యములలో అంధకార వర్ణనను కవి కావించెను.

(వ.చ.4:10-15.6:4,5)

రజనీ వర్ణనావసరమున రామరాజభూషణుడు పెద్దనకన్న నెక్కువ సంఖ్యలో పద్యములను రచించుటయేగాక, ఆతని వంటి ఊహౌన్నత్యముతోబాటు తనసహజ చమత్కారమును చూపి మించెననవచ్చును.

—*c*—

## చంద్రోదయ వర్ణన

మనుచరిత్రలో పెద్దన చంద్రోదయమును తృతీయాశ్వాసమున ఎనిమిది పద్యములలో, పంచమాశ్వాసమున రెండుపద్యములలో వర్ణించెను (మ.చ. 3:20-27, 5:85, 86). వసుచరిత్రకారుడు నాలుగవ ఆశ్వాసమున ఏడుపద్యములలో ఆరవ, ఆశ్వాసమున ఒకపద్యములో చంద్రోదయ వర్ణన కావించెను. (వ.చ. 4 : 16-22, 6-6)

రామరాజభూషణుడు తననాటకపరిచితి నంతయు నుపయోగించి చంద్రోదయము నపూర్వముగా వర్ణించెను.

''హరిదంభోరుహలోచనల్గగన రంగా భోగరంగ త్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోచె నా
హరిణాంకాకృతి వాల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్''
వ.చ. 4-17

వీథినాటకమున ముఖ్యమైన పాత్రప్రవేశించునపుడు తెరనుబట్టి క్రమక్రమముగా దానిని తొలగింతురు. ఆనాటక పద్ధతిని కవి చంద్రోదయవర్ణనా సమయమున నుపయోగించినాడు. దిక్కులనెడుస్త్రీలు ఆకాశమనెడు రంగస్థలమునందు చీకటి యనెడు తెరను మెల్లమెల్లగా తగ్గించగా రాత్రియనెడు నాట్యసుందరి యొక్క ముత్యాలపట్టము, ఫాలము, ముఖము కన్పించె నన్నట్లుగా చంద్రునియొక్క రూపము రేఖాకారమై, సగమై, సంపూర్ణబింబమై, తూర్పుదిక్కున ప్రకాశించెను. పెద్దన చంద్రోదయమునిట్లు వర్ణించినాడు.

''మరునకొసంగఁగాలము తమశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక శోణితసిక్త సితోడుభక్తము

స్ఫారిహయ దిఙ్నభస్స్థలమునన్ బలిఁజల్లి వటాంకమున్వసూ
త్కార భరితంబునై వెలుఁగఁగాంచి సుధానిధినెత్తె నత్తఱిన్"
మ చ. 3–21

మూలికల రసముతో చేసిన సిద్ధాంజనమును పెట్టుకొని భూమిలో నెక్కడ నిధి యున్నచోటు కనిపెట్టి ఆ నిధులను రక్షించుచుండు భూతపిశాచాదులకు రక్తమును కలిపిన అన్నమును బలిగా తూర్పువైపునవేసి, ఏదోయొకవృక్షమును గుర్తుగానుంచుకొని భూమినిత్రవ్వి నిధులను వెలికితీయుదురని లోకప్రసిద్ధి ఇట కవి కాలమను పురుషుడు, చీకటియను అంజనమును పెట్టుకొని, అరుణకాంతి యనెడు, విరహుల రక్తమును, నక్షత్రములను అన్నమున కలిపి తూర్పుదిక్కునందు జల్లి చంద్రునిలోనిమచ్చగా గల వటవృక్షమును గుర్తు నిడుకొని చంద్రుడనెడునిధినెత్తెనని రూపకాలంకారమున ఊహాకల్పన గావించెను.

## వెన్నెల వచనము

చంద్రోదయముననుసరించి కవులు చంద్రికా వర్ణనను గావించిరి. చంద్రికలు లోకమంతటను వ్యాపించుట, జ్యోత్స్నలలో చకోరములు విందు గావించుకొనుట, అభిసారికల గమనము మొదలగువానిని చంద్రోదయసందర్భమున కవులువర్ణించిరి. నన్నెచోడ, ఎఱ్ఱన, జక్కన, శ్రీనాథ, పినవీరన, కొలనివిగోపరాజు, ముక్కుతిమ్మనాదికవులందరును వెన్నెలలను వర్ణించినారు. గోపరాజు వెన్నెలలో చకోరములవిందును పసందుగా వర్ణించినాడు ఇతనికన్నపూర్వులగు పినవీరనాదికవులు వెన్నెలవిందులను వర్ణించిరి. నన్నెచోడుడు కుమార సంభవమున వెన్నెల వర్ణనావసరమున జారస్త్రీవర్ణన నధికముగ చేసెను.ఇందు కవి స్త్రీలస్వేచ్ఛా సంచారములను, వారిమనోభావాదులను తెల్పినాడు.ఎఱ్ఱన నృసింహ పురాణమున–''లోచనంబులకమృత సేచనంబులును, శరీరంబునకు జందనా సారంబును, నంతరంగబునకు నానందతరంగంబును నగుచు విజృంభించిన–'' చంద్రికలను వర్ణించెను (నృ.పు. 3 : 89–91). ప్రబంధయుగముబాడగు తిమ్మన పారిజాతాపహరణమున ముద్దుముద్దుపల్కులతో అనేకసొబగులతో నీవెన్నెలవర్ణనను చేసెను (పా.హ. 2–49). చకోరపక్షుల వెన్నెలవిందులలో కవులు లేతవెన్నెల పల్చనివెన్నెల, ఊరువెన్నెల, ముదురువెన్నెల, అనిపలురక

ముతైన వెన్నెలలను చమత్కారముగా వర్ణించినారు. పెద్దనకూడా మనుచరిత్రలో ప్రాచీనుల సంప్రదాయమునుసరించి ప్రౌఢభావములను వెన్నెలవచనమున ప్రదర్శించినాడు (మ.చ. 3–28) ఎఱ్ఱనాదికవులీ వెన్నెలలను, చకోరముల విందులను, విటజారసంచారములను, పద్యములందేవర్ణించిరి. పెద్దన 3–27, 5–38 పద్యములందు కొంతవర్ణించినను వెన్నెలలను విరివిగా సుదీర్ఘమైన వచనముననే వర్ణించినాడు. పెద్దన వెన్నెలవచనము సరసమై ప్రసన్నమధుర శైలిలో నడచినది వెన్నెలనిట్లు విస్తరముగా వచనములో మొదట వర్ణించినది పెద్దన కవియే పెద్దన వెన్నెలవచనము ననుసరించి రామరాజభూషణుడు అనుప్రాసలతో కూడిన ప్రౌఢగంభీరశైలిలో వెన్నెల వచనమును రచించినాడు (వ.చ. 4–23). వసుచరిత్రకారుడు 4–22; 6–7పద్యములలో కొంత కౌముదీ సముదయములను వర్ణించినను అధికభాగమును ఈ వచనముననే చెప్పెను.

పెద్దన వెన్నెల వచనమున, చకోరముల వెన్నెల విందులను, కలువ పూలలోని మధువును మధుపములు సేవించుటను, స్త్రీపురుషుల శృంగారచేష్టలను, దొంగచాటుగాపోయి ప్రియులను కలుసుకొనెడి అభిసారికలను, స్త్రీపురుషుల మధుపానమును వర్ణించెను.

వసుచరిత్రలో కవి చకోరములు వెన్నెలను భుజించుట, ప్రేమికుల శృంగారచేష్టలను, అభిసారికలను, మధుపానమును వర్ణించెను. మధుపానమును కొందరాలంకారికులు ప్రత్యేక కావ్యవర్ణనగా పేర్కొనినారు. పెద్దన, రామరాజ భూషణ కవు లిరువురును వెన్నెల వచనముననే మధుపానమును గూడా వర్ణించి యుండిరి.

పెద్దన వెన్నెలవర్ణన సరళముగా రసవంతముగా నున్నది. రామ రాజభూషణుని వర్ణన దీర్ఘమై పెద్దన వర్ణనను ప్రౌఢత్వమున మించియున్నది. ఉదాహరణకు భావసామ్యము గల అభిసారికల వర్ణనను గ్రహింతము–

మనుచరిత్రలో–"సంజ కడందారు నొడవిన సంకేతంబుల నుండక తెరువుగట్టి పొరువు దరువుల నీడలనడంగి నవ్వుటాలకు వెనుకపాటున గదిసి ముసుంగు లెడలింప బెగడి కళవళంపుఁ జూపుల వల్లభులం జూచు యల్లన నగు నభిసారికల బెడంద కన్నుల చెన్నున నన్నుకొని..."

వసుచరిత్రలో- "కోయకకోయు కాయజుని మాయకత్తుల రాయిడిం బడలేక ధవళాంబర మాల్యానులేపన నేపథ్యంబులు పూని మునిమాపు చూచివచ్చిన కర్పూర కదళికాంకిత కుంజంబులకు వచ్చి యచ్చట నఖిలకుంజంబులు నట్లయుండఁ గొండొక సేపు వివరింపలేక వలపు వలనం దెలిసి నిజసమయనిలయంబగు నిత్వరీ జనంబుల మనంబు లరయవలసి మార్మ్రగలు మాటున కరుగుటయు, నవ్వేళ నెవ్వరింగానక యరణ్యరోదనంబు నిజంబయ్యెనని నిశ్శబ్దంబుగా నేడ్చుచుం జేయునది లేక చేష్టలు దక్కియున్న, యన్నెగులు వారింప సన్నిహితులై వారు కన్నీరు దుడిచి కవుఁగిట మన్నించి నం గనుదెఱచి చూచి యన్నెలంతలవిస్మయ సూచన ప్రభాదట్టంబుల నిట్టి విడచెనోయన..." ఇట్లే పెద్దన రామరాజభూషణుల చకోరముల విందుభోజనవర్ణనలోని సామ్యవ్యత్యాసములను గమనింపుడు- పెద్దన చకోరవర్ణన- "సేవించు చకోర కందంబుల పుక్కిళ్ళకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కంబడి..." మనుచరిత్రలోని యీ "ముక్కులకునెక్కు" భావమునే రామరాజభూషణుడు గ్రహించి "పుక్కిళ్ళకువెక్కసంబుగా ముక్కున బంటి మెక్కి"న వని తన కావ్యములో చకోరముల తిండిని వర్ణించెను. "నిండార విరిసిన బొండు మల్లియల తండంబులం బొదలు మృదుల దళపుటాంతరంబుల వడిగొనిన తేటతేనియం దోచిన శశికిరణసారంబు లుత్ఫుల్ల హల్లక పరాగ మధురాచ్ఛ మత్స్యండికా పుంజంబులం బొరలించి పుక్కిళ్ళకు వెక్కసంబుగా ముక్కున బంటి మెక్కి మెడలు నిక్కించు చలచ్చంచు సుందరీ బృందంబుల"ను రామరాజభూషణకవి వర్ణించెను. పెద్దన చకోరము లూరకయే వెన్నెలను మెక్కగా రామరాజభూషణుడు బొండుమల్లియలందు వడసిన తేటతేనియలందు ముంచిన, ఎర్ర కలువలయొక్క పరాగమును మధురఖండ శర్కరలలో పొరలించిన వెన్నెలతో చకోరస్త్రీ తండములకు విందులు గావించినాడు, పూర్వకవుల వెన్నెల విందులను చప్పబడజేసినాడు.

ప్రేమికులు తాగినమత్తులో వెన్నెలను వివిధ వస్తువులుగా భ్రాంతి నొందుటను వసుచరిత్రకర్త చమత్కారముగా హృదయానందకరముగా వర్ణించినాడు. ఈకవి యిక్కడ పెద్దన వెన్నెల వర్ణనను మించినాడనవచ్చును. ఈ ప్రేమికుల శృంగారచేష్టా వర్ణనలు నన్నెచోడుని స్వేచ్ఛాసంచారులగు జారకామినుల శృంగారము కన్న భిన్నమైయున్నది. రామరాజభూషణుడు వెన్నెల వచనారంభముననే చక్రవాక విరహమును, పెద్దనయొక్క—

"అరసి కన్నీటితో మరలి తామరయెక్కి
వదనమెండగ సరోవారి నద్దు
నద్ది ద్రావఁగ సైపకట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు-" మను. 3-16

అను చక్రవాక విరహవర్ణన ననుసరించుచు ఇట్లు వచనమునవర్ణించినాడు- "జిగి మిగులు తొగఁదొర నిగనిగల మిగుల బుగులుకొను, నెగులు నందన మగని నగణిత వన ప్రదేశంబుల నరసియరసి వేసరి యో సరితసరసీ మధ్యంబు నం దనపీడ జూచుకొని కంటిఁగంటి నంటుకొని ననుచు నంటంబోవ నదియు నుం దవుల కవల జన నాసన్నుండయ్యు నొల్లండు వల్లభుండేల యని యసు రుసురనుచు నసురులై సొక్కు జక్కవ జవరాలి బహువిధాలాపంబులకుఁ గనిక రించిన తెఱుంగునం గఱంగు కురంగధరకాంత కంరంబుల జలజలని తెలిసీటి జాలునం గ్రాలుకొనుచు నచ్చవెన్నెల విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి..." వసుచరిత్రకారు డిట పెద్దన సీసపద్యములోని భావమును కొంత ఉన్నదున్నట్లు గ్రహించుట గమ నార్హము. వెన్నెలకాంతికి చంద్రకాంతశిలలు కరగి జాలుకట్టుటను వసుచరిత్ర కారుడు చక్రవాకీ విలాపమును విని కనికరించుటతో ముడివెట్టుట చక్కని భావ కల్పన. చంద్రకాంతశిలలు వెన్నెలచే కరగుటను పెద్దన-

"కలయ వెల్లువగట్టి జలజల ప్రవహించు
శశికాంత వాంత నిర్ఝరము జలము..." (మ చ. 5-38)

లని సుందరముగా వర్ణించినాడు.



# మ ధు పా న ము

"ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః" అని దండి మధుపాన మును కావ్యవర్ణ్యములలో నొకదానిగ పేర్కొనినాడు. తెనుగున విన్నకోట పెద్దన, అప్పకవి మధుపానమును కావ్య వర్ణ్యముల పట్టికలో చేర్చినారు. తెలుగు

కవులు చంద్రోదయ, చంద్రికలను, విటీ విట జారచోరాదుల స్వేచ్ఛా సంచారాదులను వర్ణించిరి గాని మధుపాన గోష్ఠులను వర్ణించినవారు తక్కువ. నన్నెచోడకవి కుమారసంభవ అష్టమాశ్వాసమున చంద్రికా వర్ణనావసరమున విటీవిటులను, అభిసారికలను, వేశ్యమాతలను, తార్పుగాండ్రను, విటవిదూషకుల చతురోక్తి, పరిహాసోక్తి వక్రోక్తి, గ్రామ్యోక్తులను, స్త్రీపురుషుల శృంగారమును దీర్ఘముగా వర్ణించినాడు. (కు.సం. 8:124-130. కాని యిట మధుపాన ప్రసక్తిని తీసుకరాలేదు. విరివిగా ప్రబంధవర్ణనల జొప్పించిన జక్కన పినవీరన, శ్రీనాథాది కవులు మధుపానమును వర్ణించలేదు. ఎఱ్ఱన నృసింహపురాణమున చంద్రికా వర్ణన సందర్భమున మధుపాన వర్ణనగావించినాడు. హిరణ్యకశిపుడు తన దేవితోడ మరియు నితరకాంతాజనముతోడనుపరివృతుడై విమలసౌధతలమున మధుర మధురసములను సేవించినట్లుగా వర్ణించినాడు (నృ.పు. 5.92-103) దాదాపు మనుచరిత్రకు సమకాలిక రచన యగు పారిజాతాపహరణ కావ్యమున వెన్నెల వర్ణనావచనమున మధుపానము వర్ణించబడినది. (పా.హ. 2-53)

మనుచరిత్రలో పెద్దన మధుపానమును నామమాత్రముగా నిట్లు పేర్కొనెను- "వల్లభులఁజూచి యల్లననగు యభిసారికల వెడందకన్నుల చెన్నున నన్ను కొని పొదలు మదనోన్మాదంబునకుం బ్రోదిగా మోదంబునం గాదంబరి గండూషించి విట కిదంబంబునకు నొసంగు..." (మ.చ. 3-28)

రామరాజభూషణుడు మధుపానమును స్త్రీపురుషుల శృంగారవిలాసమును, కాదంబరీ మదోన్మాదమున వారుచేయు చేష్టలను వచనమున ప్రౌఢముగా వర్ణించినాడు. (వ.చ. 4-23). మద్యపాన మదోన్మత్తులై చంద్రికల నాసవముగా, ఆసవములో సువాసనల కొరకు వేసిన కలువరేకులను చంద్రునిలోని మచ్చగా, ప్రతిబింబించిన తారకలను ద్రాక్షాఫలములుగా, వట్టివేళ్ళ పందిరులపై బడిన వెన్నెలను పువ్వులగా, ముత్యాల అరుగులపై ప్రకాశించు వెన్నెల తళుకులను వస్త్రములుగా భ్రమించుట చక్కగా వచనమున వర్ణించబడినది. మద్యములో సువాసనకై కలువరేకలు గాని, కమలదళములను గాని వేయుట కలదు-

"బింబితం భృత పరిస్ఫృతి జానన్ భాజనే జలజమిత్యబలాయాః
ఘ్రాతుమక్షి పతతిభ్రమరః స్మభ్రాంతిభాజి భవతిక్వవివేకః

(శిశు. 10-5

చషకమున ప్రతిబింబించిన రమణి నేత్రములను కమలదళములుగా దలచి భ్రమరము వాని నాఘ్రాణించ నిచ్చగించి మధ్యమున పడిపోయెననికమల దళములను మద్యమున వేయుటను మాఘకవి సూచించినాడు. రామరాజభూషణుని మద్యపాన గోష్ఠీవర్ణన భారవి, మాఘులు గావించిన వర్ణనలవలె చమత్కారభరితము ప్రౌఢమునై యున్నది కిరా. 9: 51-71, శిశు. 10:1-37. రామరాజభూషణునివర్ణన సంస్కృత వర్ణనలకనువాదముగాని అనుకరణగానిగాక స్వతంత్ర భావభరితమునై యొప్పుచున్నది. "మదోన్మాదంబున కుంభ్రోదిగా మోదంబునం గాదంబరి గండూషించి విట కదంబంబునకు నొసంగు..." అను పెద్దన వర్ణనను మించునట్లు రామరాజభూషణుడిట్లు చమత్కారసృష్టినిగావించినాడు. "నిజాననాంభోజ భాజనంబులంబట్టిన మైరేయంబు మగలకుఁ ద్రావించునెడ, వారు వాసనాశ్రిత సహకార పల్లవంబని చక్కెర మోవిచురుక్కున నొక్కెనం...." అని పెద్దనవర్ణనను పెంచినాడు.

ఈ విధముగ రామరాజభూషణుని మధుపానవర్ణన పెద్దన వర్ణనకన్న దీర్ఘమై చమత్కారభావయుక్తమై మించినదని చెప్పవచ్చును.



## సూర్యోదయము

సూర్యోదయ వర్ణనావసరమున చంద్రుడు పాండురతను బూనుట, వేకువ, వేగుజుక్క, కృకవాకములు మొరయుట, వెలవెలబోవు దీపకళికలు, చక్రవాకముల కలయిక, రాత్రి బందీగావించబడిన తుమ్మెదలు పద్మములలో నుండి ఎగిరిపోవుట, విహంగముల కలకలధ్వనులు, సూర్యు డుదయించుట మొదలగు అంశములు వర్ణించబడును. సామాన్యముగా సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనానంతరము కవులు సూర్యోదయ వర్ణనను గావించుట కలదు. తిక్కన గావించిన సూర్యోదయవర్ణన ప్రౌఢమై ప్రబంధోచితమైయున్నది.

(వి.ప. 5:236-241) ఆతర్వాత నన్నెచోడ, ఎఱ్ఱన, నాచన సోమన, శ్రీనాథాది కవులెందరో సూర్యోదయ వర్ణనను గావించిరి. శ్రీనాథుడు శృంగారనైషధమున, కాశీఖండమున గావించినసూర్యోదయవర్ణనలు అనువాదము లనిపించుకొన్నను ప్రబంధకవుల కాదర్శములైనవి. (శృం. నై. 8:4-15, కా. ఖం 10:121-133)

పెద్దన సూర్యాస్తమయము వలెనే సూర్యోదయమును రెండుమార్లు వర్ణించినాడు. మనుచరిత్ర తృతీయాశ్వాసమున పదిపద్యములలో (మ చ. 3: 53-62, 5:40) పంచమాశ్వాసమున ఒక్క సీసములో ఈ వర్ణనను చేసెను. రామరాజభూషణుడు వసుచరిత్రలో సూర్యోదయ వర్ణనను చతుర్థాశ్వాసమున పదమూడు పద్యములలో, షష్ఠాశ్వాసమున రెండుపద్యములలో వర్ణించెను (వ.చ.4:125-137, 6:40-41).

వరూథినికి అచ్చవెన్నెల కారణమున విరహబాధ అతిశయించినట్లుగా చెప్పి సఖులామెకు శైత్యోపచారములు గావించుట, ఆమె – మన్మథాదుల నుపాలంభించుటను చెప్పి అపుడు సూర్యోదయమైనట్లుగా పెద్దన వర్ణించెను. సూర్యోదయానంతరము వరూథిని సఖుల ప్రోద్బలమున ఉద్యానవనవిహారమునకై యేగును. గిరికాదేవి విరహబాధతో మరణప్రయత్నమును గావించగా, ఊరడిల్లు నట్లుచేసి సఖులామె నుపవనికి తీసుకపోయినట్లు వర్ణించి రామరాజభూష ణుడు అట వనవిహార, పుష్పాపచయ, జలకేళ్యాదుల తర్వాత శిశిరోపచారములు మన్మథోపాలంభనాదులను చెప్పి తరువాత సూర్యోదయ వర్ణనను చేసెను. అనగా పెద్దన సూర్యోదయానంతరము జలకేళ్యాదులనువర్ణించగా నితడుసూర్యాస్తమయా త్పూర్వమే జలకేళ్యాదుల వర్ణనను చేసెను. వరూథిని వనవిహారమునకు వెడలిన పుడు మాయాప్రవరుని గాంచును గాన వరూథిని విరహోపాలంభనలు వర్ణించిన అనంతరము సూర్యోదయమును పెద్దనవర్ణించెను.కథకొరకై యట్టిక్రమ మును పాటించెను. రామరాజభూషణుడును మంజువాణి రాయబార ఘట్టమును వర్ణించువాడై యుండుటచేత జలకేళి, శిశిరోపచారాది వర్ణనలను ముగించినతర్వాత సూర్యాస్తమయమును వర్ణించెను. అపుడు మంజువాణి ప్రవేశించి, వసు రాజు ప్రేమను గూర్చి గిరికకు తెల్పి యామె ప్రాణములకూరట గల్గించె

ననియు,అంతలో వేఁగెననియు, చెప్పెను. రామరాజభూషణుడు కథా సంఘటనల కూర్పునకై పెద్దన వర్ణనాక్రమము నిట్లు కొద్దిమార్పులతో ననుకరించెను. వీరిరువురి వర్ణనలలో గల మరి యొకసామ్యము–నాయికాసఖి సూర్యోదయమును వర్ణించి చెప్పినట్లుగా కూర్చుట.

పెద్దన వేఁగుజుక్క నొక సీసములో నుత్ప్రేక్షించి వర్ణించెను–

"సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు
తుహినాంశు దుమదారు దొరయనంగ
న సీరమై వచ్చు నలినబాంధవు టెక్కి
యంబుపై దీపించు నద్దమనఁగ
నరుణాగ్ర నిబిడ వాద్యములలోఁ గనుపట్టు
సమయశాంఖికు చేతి శంఖమనఁగ
నినుఁ దప్పడజుఁడౌట మునుమున్న పడివాగెఁ
గొనివచ్చు రాయంచ కొదమ యనఁగ
నుదయపురిమీద గోపురంబుండి నిగుడు
నహిత రవిరశ్మిచే బద్ధుఁడగుచు ఁదోడి
బలగమైనట్టి చుక్కల వలసత్రోవఁ
జూపనేతెంచెనన వేగుఁజుక్క వొడిచె" —ఇట.

మ.చ. 3–54

పెద్దన తనసామరిక జ్ఞానము నుపయోగించి చక్కని ఉత్ప్రేక్షను రచించి నాడు. వేగుజుక్క, కుటుంబముతో పారిపోవు చంద్రుడను రాజుయొక్క సేనా నాయకునిగాను, ఉదయపర్వతముపై పొంచియుండి శత్రువైనసూర్యుడు తన కిరణములచే బంధించగా తనతోడిబలగమగు నక్షత్రములు పారిపోవుమార్గమును చూపుటకై వచ్చినట్లుగాను, ఉత్ప్రేక్షించినాడు. శ్రీకృష్ణదేవరాయల చేతిలో నోడి పోయిన రాజులస్థితిని, చూచినదృశ్యములను మనసున నుంచుకొని పెద్దన ఇట్టి యూహలను చేసెనేమో?

పై సీసపద్యములోని "సకుటుంబమున వీఁగి చరమ శైలము జేరు తుహి నాంశు..." ను మదిలో నుంచుకొని రామరాజభూషణుడు ఈక్రిందిపద్యమును రచించెననవచ్చును.

"అపుడరవిందగంధి హృదయాంబుజ ఖేదమడంప వచ్చి,తో
రపురుచితో వెలుంగు వసురాజు కరోర్మికఁగాంచి భీతిమైఁ
జపలవిలోచనం బొదువఁ జాలక తారభటాలితో సిశా
ధిపుని బలంబులేగిన గతిన్ రహివీడెను బాండు చంద్రికల్"

మ. చ. 4-1౩౯

శత్రువగు సూర్యునియొక్క కరోర్మికకు భయపడి చంద్రుడు తారలుఅను భటాలితో పారిపోయినట్లు వర్ణించబడినది.

పెద్దన ప్రభాతకాలమందలి కోడికూత నిట్లు వర్ణించెను

సకలాశాగతి నర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్దజ్ఞానమే మూలమిం
తకుఁబోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతంగొండపై పల్లెలం
గృకవాకు ల్మొరసెంగృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్"

మ.చ. ౩-55

ఇందలి "త్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్" అను భావమును గ్రహించి రామరాజభూషణుడు స్పర్ధతో పెద్దనను మించిన పద్యమును రచించవలెనను నట్లుగా తన పురాణ కథాజ్ఞానమును, వ్యాకరణ శాస్త్రాభిమానమును ప్రకటించుచు ఈ క్రింది పద్యమును చెప్పినాడు.

ఒకనాఁడింద్రునియంత వేలుపు మదీయోక్తి న్విడంబించి తా
నొకకాలంబెఁజెగింపవచ్చి ముని శాపోద్వృత్తి పాలయ్యెమా
మకశబ్దంబిది యల్పమే! త్రిముని సంభావ్యత్రికాలీ విబో
ధకమన్ రీతిఁద్రిభంగిగాన్ మొరసెఁ జెంతందామ్రచూడౌఘముల్"

వ.చ. 4-126

రామరాజభూషణుడు పెద్దన "త్రిభంగి"ని గ్రహించి యొక చమత్కారమైన కల్పనచేసినాడు. ధర్మ, అర్థ, కామములు అను వర్గత్రయిని సాధించుటకు నా కూతయే మూలకారణమనునట్లుగా కోళ్ళు త్రిభంగిగా కూసెనని పెద్దన స్వభావోక్తిలో నుత్ప్రేక్షించి చెప్పగా రామరాజభూషణుడు త్రిభంగికి వేరొక అర్థమును గ్రహించి, హ్రస్వ, దీర్ఘ, ప్లుత కాలముల ననుసరించి యుచ్చరించబడు మూడు

ధ్వనులనుగాను, అవి వ్యాకరణప్రసిద్ధులగు పాణిని, కాత్యాయనుడు, పతంజలి యను త్రిమునులచే గ్రహించబడినవని చమత్కరించెను.

ప్రాతర్వేళ ఒకవైపు చంద్రుడు అస్తమించుచున్నాడు మరియొక వైపు సూర్యుడుదయించుచున్నాడు. ఆకాశమున తూర్పుపడమరలందు ఒకేమారు కనిపించు సూర్యచంద్రబింబములను మాఘకవివర్ణించి యజరామరకీర్తిని సంపాదించుకున్నాడు.

"ఉదయతి వితతోర్ధ్వరశ్మి రజ్జౌ
అహిమరుచౌ హిమధామ్ని యాతిచాస్తమ్
వహతిగిరిరయం విలంబి ఘంటా
ద్వయ పరివారిత వారణేంద్ర లీలామ్" శిశు. 4—20.

పొడవైన ఊర్ధ్వముఖములైన కిరణములు అను త్రాళ్ళుగలఉదయించుసూర్యుడు, అస్తమించు చంద్రుడు గల పర్వతము, క్రిందకు వ్రేలాడు రెండుఘంటలచే నలంకరించబడిన గజము వలె శోభిల్లుచుండెను.

ఈశ్లోకము వలన మాఘునకు ఘంటామాఘుడన్న కీర్తి లభించెను. ఇట్లే పెద్దన మహాకవియు అస్తమించు చంద్రుని, ఉదయించు సూర్యుని రమణీయముగా వర్ణించినాడు—

"ఉరుసంధ్యాతప శోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమ
న్గరడిం గాలపుహాొంతగాడు చరమాగ స్కందముంజేర్చని
బ్బరపున్, సంగడ మోయనన్ శశిడిగెం బ్రాగ్భూమి భృత్తైకతవే
తరబాహాగ్రపు సంగడంబనగ మార్తాండుండు, దోచెన్ దివిన్"
మ.చ. 3—59

ప్రాతఃకాల సంధ్యారాగమను ఎర్రమన్నుతో కూడిన బ్రహ్మాండమను సాముచేయు ప్రదేశమున, కాలమను మల్లుడు చరమగిరియను మూపునందుజేర్చుకొన్న సంగడమోయనునట్లు చంద్రుడు క్రిందికి వ్రాలెను, తూర్పుకొండయను రెండవమూపు చివరి సంగడమనునట్లుగా సూర్యుడుదయించెను. ఇట మాఘునివర్ణనలో వలె సూర్య చంద్రులొకేమారు కనిపించకున్నను, మల్లునియొక్క భుజముపై సంగడము, ఒకభుజమునుండి జారి మరొక భుజముపైకి వచ్చుటకు క్షణకాలముమాత్రమేపట్టును, అట్టి క్షణకాలవ్యత్యాసముగల చంద్రాస్తమయ, సూర్యోదయముల

నపూర్వముగా కవి వర్ణించినాడు. పెద్దనకు సాముగరిడీలలోగల పరిచయము, అభిరుచియే, ఈచక్కని కల్పనకు కారణమైయుండవచ్చును. మాఘునిఘంటా కల్పన ఎట్టిదో పెద్దన కాలపుహాంతగాడు, తిప్పసంగడము కూడ అట్టి అందమైన కల్పనయే ఆశ్లోకము వలన మాఘునకెట్టికీర్తి లభించినదో పెద్దన కీపద్యము అట్టికీర్తిని తెచ్చిపెట్ట గలట్టిది.

మనుచరిత్రలో స్వరోచిమనోరమల వివాహోత్పూర్వమే సూర్యాస్తమయ సూర్యోదయ వర్ణనలు కథలో చక్కగా నతికించబడినవి. వసురాజు పెండ్లి కొడుకై వివాహమునకు తరలివచ్చునప్పుడుసూర్యాస్తమయ చంద్రోదయములు; గిరికావసురాజులవివాహానంతరము సూర్యోదయ వర్ణన చేయుటచే ఆరాత్రివారి వివాహకార్యము సంపన్నమై తెల్లవారువరకు ముగిసినదని తెలియుచున్నది ఇట్లు కథాక్రమమునకు వర్ణన లతికినట్లు సరిపోవుట ఈ కావ్యముల విశేషము



## ప రి ణ య ము

పరిణయమును ప్రబంధ వర్ణ్యములలో నొకదానిగ ఆలంకారికులు పేర్కొనిరి. సంస్కృత పంచమహాకావ్యములలో శృంగారప్రధానమైన నైషధమున వివాహవర్ణన కడు దీర్ఘముగా చేయబడినది. తెలుగుకవులు సందర్భానుకూలముగా పరిణయమును వర్ణించుచుండిరి. నన్నయ ద్రౌపది వివాహమును ఆరు గద్యపద్యములలో వర్ణించెను.(ఆ.ప. 7:28 -882) కుమారసంభవమున నన్నెచోడుడు పార్వతీపరమేశ్వరుల వివాహమును మిక్కిలి దీర్ఘముగా వర్ణించినాడు. సంస్కృత కుమారసంభవమునను కాళిదాసు పార్వతీపరమేశ్వరుల వివాహమును తీరముగానే వర్ణించియున్నాడు.

తిక్కన వర్ణించిన ఉత్తరాభిమన్యుల వివాహము ప్రబంధమార్గమున రమ్యముగా నడచినది (వి.ప, 5:380–408). 24 గద్యపద్యములలో తిక్కన

వైదిక లౌకికాచారములను మేళవించుకొనిన తెలుగువారి వివాహమును కన్నులకు గట్టునట్లు వర్ణించెను. తిక్కన గావించిన ఈ వర్ణనయే తదనంతర కవులందర కును ఆదర్శమైనదనవచ్చును.

పెద్దన మనుచరిత్ర పంచమాశ్వాసమున స్వరోచిమనోరమల వివాహమును 51 గద్యపద్యములలో వర్ణించినాడు (మ.చ. 5:53-103). 71వ గద్యమిందు అతి దీర్ఘమైనది. అట్లే 101వ గద్యమును దీర్ఘమైనదే. రామరాజభూషణుడు వసుచరిత్ర పంచమ,షష్ఠాశ్వాసములందుకలిపి 147గద్యపద్యములలో గిరికావసురాజుల వివాహవర్ణనను చేసెను(వ చ. 5:32-125, 6:9-83). ఇందు షష్ఠాశ్వాసమందలి 8వ గద్యమతిదీర్ఘము.

పెద్దన కావ్యమునకు మూలమైన మార్కండేయపురాణమున స్వరోచీమనోరమల వివాహము ఒక్క మాటలో చెప్పబడగా నీతడు దానిని విస్తరించి ప్రబంధోచితముగ వర్ణించెను.[1]

మనుచరిత్రలోని వివాహవర్ణనకన్న వసుచరిత్రలోని వివాహవర్ణన దీర్ఘమైనది. వసుచరిత్ర 5,6 అశ్వాసములలో గిరికావసురాజుల వివాహ ప్రసక్తి మాత్రమే కలదు. వానిలో కథ లేదు ఇంద్రాదులు కోలాహలుని చెంతకు వచ్చి వసురాజుకై గిరిక నడుగుట, శుక్తిమతీ కోలాహలుల సమ్మతము,నదులు, కొండలు పెండ్లిపెద్దలుగా వచ్చుట. ఇంద్రుడు వసురాజు కడకు పోయి వివాహ ముహూర్తమును గూర్చి చెప్పుట, ప్రతిష్ఠాన నగరాలంకరణ, పెండ్లి పత్రికలు పంపుట, వివిధదేశపు రాజులు వచ్చుట, వసురాజు పెండ్లికొడుకై తరలిపోవుట, గిరికను పెండ్లికూతురుగా నలంకరించుట, పురస్త్రీలు రాజును చూడ

---

1. (ఎ) సంస్కృతమార్కండేయపురాణమున-
"తతః పితాస్వయందత్తాం, తాం కన్యాం సవిధానతః ।
ఉపయేమే గిరౌతస్మిన్ స్వరోచిశ్చారులోచనామ్"- 56-61

(బి) మారన మార్కండేయపురాణమున-
"అనుడు రాగంబునొందిన యత్తనూజ, నక్కుమారునకిడి వివాహము
సేసి దివ్యగతి నేగె"

వచ్చుట, లాజలు చల్లుట, కోలాహలు డెదురేగి వసురాజు నెదుర్కొనుట, వసురాజు వివాహవేదికను చేరుట, కన్యాదానము, ఆశీర్వచనము లు, కట్నములు, గిరికకు తలిదండ్రులు బుద్ధులు చెప్పి కట్నము కానుకలతో అత్తవారింటికి సాగనంపుట, గిరికావసురాజులు ప్రతిష్ఠానపురమునకు ప్రయాణమై వచ్చుట—వర్ణించబడినవి. మను, వసుచరిత్రలలోని వివాహవర్ణనలోగల సామ్యభేదములను పరిశీలింతము— మనుచరిత్రలో వివాహవర్ణనకు ముందు కవి నగరాలంకరణను ఒక్క పద్యమున వర్ణించెను (మ.చ. 5–53). రామరాజభూషణుడు వివాహోత్పూర్వము ఇంద్రుడు కోలాహలునకు నిర్మించియిచ్చిన దివ్యనగరమును, మరియు వసురాజు యొక్క రాజధానియగు ప్రతిష్ఠాననగరమును వరుసగా పది పద్యములలో (వ.చ. 5 41–50,మరియు ఐదు పద్యములలో(వ చ.5:63–67) వర్ణించినాడు. కోలాహల నగర వర్ణనాసందర్భమున వసుచరిత్రకారుడు పర్వతము నగరముగా మార్పునొందుట, పర్వతముపై గల శిలలు, వాయువు, జంతువులు, వృక్షలతాదులు, నగరములోని వివిధవస్తుప్రాణతతులుగా మారుటను శ్లేష వైభవముతో రచించెను.

మనుచరిత్రలో వలెనే వసుచరిత్రలో వివాహశుభలేఖలు పంపుట చెప్పబడినది. ఆహ్వానము నందుకొని వివిధ గంధర్వాధిపతుల రాకను పెద్దన వర్ణించగా, రామరాజభూషణుడు నదులు, కొండలు కోలాహల నగరమును చేరుట, సమస్త వసుధాధీశులు ప్రతిష్ఠానపురమునుచేరుటను చెప్పినాడు. వివాహవేళలందు రోదసిలో నఖండమగుచు చటుల తూర్యవ్రజముల యొక్క నాదాత్మక బ్రహ్మ మతిశయిల్లెననియు, పుణ్యపురంధ్రికామణులు సింధుకన్యకా వివాహగీతికలను పాడిరనియు కవి వర్ణించి తన సంగీతప్రేమను విశదపరచుకొన్నాడు.(వ చ. 5:69–70).

మనుచరిత్రలో స్వరోచి మంగళస్నానము, వరాలంకరణలు రెండుపద్యములలో వర్ణించబడినవి (మ.చ. 5:57,58). రామరాజభూషణుడు వసురాజు స్నానాలంకరణలను 22పద్యములలో చమత్కారభావములతో వర్ణించెను. (వ. చ. 5:73–94). తరువాత ఇంద్రుడు తన స్నేహితుడగు వసురాజునకు అమ్లానపద్మమాలికను ధరించుటకై ఇచ్చి దాని వైలక్షణ్యమునుగూర్చి చెప్పెను. ఇది పద్యములలో చెప్పబడినది (వ.చ. 5:95–104).

మనోరమకు నలుగులిడుట, పెండ్లికూతురుగా నలంకరించుటను పెద్దన రెండుపద్యములలో వర్ణించెను. (మ.చ. 5:72,73). గిరికకు నలుగుపెట్టుట అలంకరించుట 19 పద్యములలో వర్ణించబడెను (వ.చ. 5:106-123). వధూవరుల అలంకరణల సందర్భమున రామరాజభూషణుడు అద్భుతకల్పనలతో కూడిన పాండిత్యస్ఫోరకములగు పద్యముల నెన్నింటినో రచించినాడు. తనకుగల రత్నశాస్త్ర పాండిత్యమును, జ్యోతిశ్శాస్త్ర ప్రవేశమును, సంగీతశాస్త్రపాండిత్యమును, నక్షత్రశాస్త్ర పరిజ్ఞానమును, వ్యవసాయ పరిచయమును, శ్లేషోక్తి వైచిత్రిని,అలంకార వైదగ్ధ్యతను ప్రకటించుచు అద్భుత చమత్కారభావనలు గల పద్యములను వసుచరిత్రకారుడు రచించినాడు. పెద్దన వేట, యుద్ధవర్ణనల సందర్భములలో నెట్లు తన ప్రతిభాజ్ఞానములను ప్రదర్శించెనో, ఇతడు వివాహవర్ణనా సందర్భమున తనకుగల శాస్త్రపరిచితి నంతయు ప్రదర్శించెను.

స్వరోచిపెండ్లికొడుకై విడిది నుండి వధూగృహమునకు తరలిపోవుటను పెద్దన ఒక దీర్ఘమైన వచనమున చెప్పెను. (మ.చ.5—71) దాని ననుసరించి వసుచరిత్రకారుడును వసురాజు పెండ్లికొడుకై తరలిపోవుటను ఒక సుదీర్ఘ వచనమున చెప్పినాడు (వ.చ. 6—9). ఇరువురు కవులును సితాతపత్రములను, వింజామరలను, చతుర్విధవాద్యముల ఘోషలను, వెన్నెలను వెదజల్లుచు వెలిగెడి దివిటీల వెంట నడచు బంధుసమూహమును, వేత్రధరులను, ఏనుగుల గుఱ్ఱముల సమూహములను, వాటివైభవములను వర్ణించిరి. పెండ్లికూతురున కిచ్చు మంగళకరద్రవ్యముల నెత్తించుకొనినడచినట్లు పెద్దన పేర్కొనెను. రామరాజభూషణకవి సుగంధతైలముచే వెలిగించబడిన దివిటీలను,బాణాకారీలను[1], బంధుజన సమూహము వసంతమాడుటను గూడా వర్ణించెను. విజయనగర సామ్రాజ్యకాలమునాడు ధనవంతుల, రాజమహారాజుల యొక్క వివాహములందు వరుడు కడువైభవముతో నిట్లు తరలి వధూగృహమును చేరుట ఆచారము కాబోలు వైభవముగా తరలిపోవు మహమ్మదీయుల ఆచారమును విజయనగరమువారు నేర్చుకొనియుందురు. ఇది మహమ్మదీయాచారముగానే కనిపిం

1. "అనేక రూపంబులం దీపించు తమోరిపుత్రయంబునం జిత్రయంత్రాకార సంధానిత లీలాగ్ని యంత్ర చంద్ర సూర్యజ్యోతుల, మరీచి ఛట్టంబులు దట్టంబులై నెట్టనం జట్టబగలు గావింప...." వ.చ.6-9.

చును. ఇప్పటికిని ఉత్తరహిందూదేశమున వరుడు వైభవముతో గుఱ్ఱముపై నెక్కి బంధుమిత్రాదులతో, బహువిధ వాయిద్యములతో, దివిటీలతో తరలిపోవుట కనిపించును

ఆనాటి విజయనగరరాజుల ఆచారములనే పెద్దన, రామరాజభూషణు లిరు వురును వర్ణించియుందురు ఆనాటి వివాహవైభవములు కనులకు కట్టునట్లుగా వర్ణించబడినవి. ఏతత్సందర్భమున రచించబడిన వచనములలో రామరాజభూష ణుని వచనరచనయందు శ్లేషచమత్కారములు కలవు. అట్టి చమత్కా రములు పెద్దన వచనమున లేవు. పెద్దనలో సహజప్రసన్నతలు రామరాజ భూషణునిలో కాన్పించవు.

నాయకుడు పెండికొడుకై తరలిపోవునపుడు పురస్త్రీలు ఆసక్తితో శృం గార రసావేశులై కాంచినట్లుగా వర్ణించుట ఒక కవి సమయముగా కనిపించును. వివాహ సమయములందేగాక వేరు సమయములందును, నాయకుడు పురమున రాజ మార్గమున పయనించు చున్నపుడు స్త్రీలుచూచి కామపరవశులగుట కూడ వర్ణించ బడుట కలదు. ఆలంకారికులు దీనిని ప్రత్యేక కావ్యవర్ణనగా చెప్పుకున్నను, కవులు తమ కావ్యములందు ఇట్టి పురస్త్రీలవర్ణన చేసినట్లు కన్పట్టుచున్నది. నన్నెచోడ, ఎఱ్ఱన, శ్రీనాథాది తెలుగుకవులు, కాళిదాసు, మాఘ, శ్రీహర్షాది సంస్కృతకవులును తమ కావ్యములందిట్టి వర్ణనలు చేసియుండిరి. అట్టి కవి సమయము ననుసరించియే పెద్దన, స్వరోచిని పురస్త్రీలు కామవివశలై దర్శించి నట్లుగా పదునొకండు పద్యములలో వర్ణించెను. (మ.చ. 5:60–70). రామ రాజభూషణుడును ఏడు పద్యములలో నిట్టి వర్ణన గావించెను. (వ చ. 6:10–16). పెద్దన అన్నియు వృత్తములు వాడగా, రామరాజభూషణుడు 5వృత్తములు 2 సీసపద్యములను రచించెను. పెద్దన పద్యములలో రోమాంచము, పరవశ మగుట, స్వేదము, స్తంభము, జృంభిక, అశ్రు మొదలగు శృంగార సంబంధ సాత్త్వికభావ వర్ణనలు కలవు. ఉత్ప్రేక్షాద్యలంకారముల నధికముగా ప్రయోగించి కవి భావకల్పనలను కావించెను. రామరాజభూషణుడును సిగ్గు, కుతూహలము, ఆవేగము, విభ్రమము అను శృంగారసంబంధ సంచారీభావములను వర్ణించెను. పెద్దన వలెనే ఉత్ప్రేక్షాద్యలంకారములనధికముగా ప్రయోగించి భావకల్పనలను కావించెను.

"అంచెలుగట్టి కాలితొడుసై చనసీవుగదమ్మ ప్రోదిరా
యంచ లివేటి స గడములయ్యెను? దయ్యమ! యేటివేడ్కనా
కంచుఁబదంబునన్ మొరయునందియ యూడగఁ దన్నిపోయినీ
కించెలతాంగి యోర్తు మురజిన్నిభ సాగరమేఖలావిభున్''

మ.చ.5-61

అను మనుచరిత్ర పద్యములోని "కాలియందెలరవళులువిని పెంపుడుహంసల వరుసలు వెంట తగులగా, నడకసాగక విసిగి, ఆ స్త్రీ కాలియందెల నూడ దన్ని శీఘ్రముగా స్వరోచిని చూడవచ్చె" నను భావమును గ్రహించి రామరాజ భూషణుడొక చక్కని సీసపద్యమును రచించెను.

"తనుఘనంబుగ నమ్మిదరియు నెమ్మికిఁగొప్పు
మాల్యభోగినొసంగి మఱలఁ బంచె
దనుఁగొండ యని వచ్చునును జింకఁ గుచముగా
రుడశిలాసరదూర్వలిడి మఱల్చెఁ
దనుఁ గల్పలతికగాఁ దలచి వ్రాలెడు శారిఁ
గరమురత్న ఫలాళినెరపి నిలిపెఁ
దను పద్మమని యంటఁబెనుగు నంచకు నంఘ్రి
హీరాంగద మృణాళ మిచ్చియనిచె
"నాత్మపోషిత వర్గంబు లవని పావ
లోకగమ నాంతరాయంబు గాకయుండ
నవయవంబులె తోడయ్యెనతివ కనుచు
నెచ్చెలులు మెచ్చవచ్చె మానిని యొకర్తు''

వ.చ. 6-16.

పెద్దన పద్యములోని స్త్రీ, యొక్క పోషితహంసలను కాలియందెల నూడదన్ని పారదోలి కదలెను కాని పై పద్యములోని మానిని వెంటదగిలిన పెంపుడు వైన మయూర, బాలకురంగ, శారిక, హంసలు అంతరాయములు కాగా మాల్యభోగిని, గరుడపచ్చలనెడి గఱికలను, మణులనెడి ఫలములను, కాలియందెలనెడు మృణాళము నొసగి వెనుకకు మరల్చెను. అనగా ఆమె విసరివేసిన మాల్యము, గారుడ శిలాహారము, మణులు, వజ్రమయములైన కాలియందెలు, మయూరాదులకు వాసి

వాని యాహారములుగా భ్రాంతికలుగుటచే నవి నిలచిపోయినవని పద్యములోని చమత్కారము. పెద్దన భావములను గ్రహించి, రామరాజభూషణుడు చమత్కారపు తళుకులనద్ది, భావమును విస్తరింప జేయుననుట కిది మంచి యుదాహరణ.

ఒకస్త్రీ స్నానము చేయుచుండి యట్లే,మార్చుకొనుటకు సమయములేక తడి వెంట్రుకలతోవచ్చి స్వరోచిని కాంచుచుండెను. ఆమె"నీకునేనువశమైతి నని శపథము చేయుటకై నిలిచినదా" యనునట్లుండెనని పెద్దన ఉత్ప్రేక్షించి వర్ణించిన పద్యము—

"జిలుఁగులఁబెట్టుచుందొడలఁ జెంద్రిపొవడయంటమై తడిం
బెళపెళలేనిచీరఁగటి బింకపుఁజన్నుఁ జేర్చికొంచువే
జలకములాడి యాడి యొకచాన కరస్థిత కేశయై నృపు
న్వాలువడి జూచె లోపడితి నీకని బాసకు నిల్చెనో యనన్"

మ చ. 5—63

ఘోరప్రమాణము చేయువారు స్నానముచేసి, తడిబట్టలతో,తడితలతో రాజుఎదుట నిల్చి ప్రమాణముచేయుట కలదు. ఈ "బాసచేయు" భావమునే రామరాజభూషణుడొక స్త్రీని వర్ణించుటలో గ్రహించి చమత్కరించినాడు—

"పొలతి యొకర్తు చెంగలువ పొట్లము చేతనె జూని వచ్చుచు
న్వాలపులదండ జాఱ గుణవద్దళమాత్రమెతాల్చె, నిమ్మహీ
తలపతికేన కూర్తునని తప్తపరశ్వథ మెత్తివైచి మం
జుల దళతంతు లేశ పరిశుద్ధి జనాళికిఁ దెల్పుకై వడిన్"—

వ చ. 6-13.

ఒకస్త్రీ చెంగల్వపొట్లమును చేతిలోపట్టుకొని వసురాజును చూడవచ్చినది. అప్పుడామెచేతిలోని చెంగలువలు జారిపోయెను. పొట్లము కట్టినదారము,చిగురుటాకు చేతిలో నిలిచిపోయెను ఇది సన్ననినూలుదారమును, చిగురుటాకులను చేతబట్టుకొని, చెంగలువ యను కాలిన గండ్రగొడ్డలిని దూసి"ఈరాజునకు నేన్ప్రియురాలనౌదు" నని ప్రమాణము చేయుచున్నటుల ఉన్నదని రామరాజభూషణుడుత్ప్రేక్షించెను లోకములో ప్రమాణముచేయువారు దారముతో కూడుకొన్న చిగురుటాకులను చేతిలోపట్టుకొని కాలిన గండ్రగొడ్డలి నాచేతితోనే పట్టుకొనియెత్తివైచుట కలదు.

పెద్దన 5-64పద్యమున, ఒకస్త్రీ వీణవాయించుచు ఉండి స్వరోచి రాగానే వీ న పక్కకునెట్టి వ్రేళ్ళకుపెట్టుకొన్న బంగారుగోళ్ళను తీయక యేపైటను, హార ము సవరించుకొను చు వచ్చెననిచెప్పి, ఆమెవ్రేళ్ళకున్న బంగారుగోళ్ళను మన్మ థుడుఆమెను హింసించుటకు వేయుచున్న సంపెంగ బాణములుగా నుత్ప్రేక్షిం చెను. రామరాజభూషణుడు ఈపద్యమును మదిలోనుంచుకొనియే కాబోలు వాయించు చున్న వీణను పక్కకు పెట్టుటకు వీలులేక అట్లే చేతిలోపట్టుకొని కాలియందెల మ్రోతలకు వెంటదగులు హంసలను తోలుచు వచ్చెనని యొకస్త్రీని వర్ణించి యామెను చతురాస్యుడైన వసురాజును చూడవచ్చిన సరస్వతిగా నిట్లు చెప్పెను-

"డించఁగఁ బొద్దులేకెద ఘటించిన రత్నవిపంచితో సువ
ర్ణాంచితమూర్తియొ ర్తు ముఖరాంఘ్రి సమాశ్రితసత్కలాపయై
యంచలవచ్చు సోయగపుటంచలఁ దోలుచు మిన్కు చేడె
యౌనంచు నుతింపవచ్చె వెసనా చతురాస్యుని మోముఁ గన్గొనన్"

వ.చ. 6-12.

ఇట రామరాజభూషణుడా స్త్రీని చతురాస్యుడైన వసురాజును చూడవచ్చిన సరస్వతీదేవి యని చెప్పగా పెద్దన అరచాటుగా తలుపువెనుక నిలిచిన ఒకస్త్రీని అర్ధనారీశ్వర రూపములోని పార్వతిగానిట్లు ఉత్ప్రేక్షించియున్నాడు-

"ఒక నేత్రాంబుజమొక్కగల్లమొక చన్నొయ్యారపున్ లీల వీ
థికిఁదోపన్ దలుపోరగా నొకపురంధ్రీరత్నమీక్షించె రా
జకిశోరంబుఁ దదీయలై వెలయు భాషాలక్ష్ములంజూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచెనాన్"

మ.చ. 6-69.

తన సహవాసలగు లక్ష్మిసరస్వతు లప్పుడే స్వరోచి నాశ్రయించియుండుటచే, వారి తోడిస్నేహముతో వచ్చిన పార్వతిగా చెప్పెను. ఈ పార్వతి ప్రసక్తియాధారమ రామరాజభూషణుడు సరస్వతీభావమును అల్లియుండును.

పెండ్లికొడుకురాగానే ముత్తయిదువలు లాజలు చల్లినట్లుగా వసుచరిత్ర కారుడు చెప్పెను. మనుచరిత్రలో ఆయాచారము చెప్పబడలేదు. పెండ్లికుమా రుని మామ ఎదుర్కొనుట, మంగళవస్తుచయముల నీక్షించుచు వివాహవేదికను చేరజనుట, మధుపర్కమొసంగుట, వధువువివాహవేదిక కడకు తీసికొని

రాబడుట, వధూవరులనడుమ తెరపట్టుటను పెద్దన రామరాజభూషణు లిరువురును ఒకే క్రమములో వర్ణించిరి. పెద్దన తెరపట్టుటను, వధూవరులు పరస్పరము వీక్షించుకొనుటను రసవంతముగా వర్ణించినాడు. క్రమక్రమముగా తెరను దించగా వధువు మనోరమ, పాలసముద్రము నుండి క్రమముగా పైకిలేచి వచ్చు లక్ష్మీదేవి వలె నుండెనని పెద్దన చక్కని యుపమాలంకారమున వర్ణించి నాడు—

"అప్పుడు తూర్యములొమ్మరయ నమ్మిధునమ్ము విలోకన స్పృహం
దెప్పలఁదేల వంపఁబడు తెల్లని చీరతెరం గ్రమంబునం
గొప్పు, మొగంబు, నబ్బుఁజనుగొండలు, దోప లతాంగిపోలెఁ జె
ల్వొప్పతిలన్ సుధారస పయోనిధి పెందెరబుట్టు నిందిరన్"

మ.చ. 5-80

తెర వంచగా క్రమముగా కొప్పు, ముఖము, మెశ, వక్షోజములు కని పించి పాలసముద్రము నుండి పైకి లేచు లక్ష్మీదేవి వలె మనోరమ ఉండెనట. పెద్దన వధూవరుల పరస్పర వీక్షణములను మూడుపద్యములలో సరసముగా వర్ణించినాడు. (వ.చ, 5:81—83). రామరాజభూషణుడు పాణిగ్రహణమును కంకణములను కట్టుట, కన్యాదానములను వర్ణించినాడు. కాని వధూవరుల పర స్పర వీక్షణములను వర్ణించలేదు, వారి ప్రథమసందర్శనా సమయమున, ద్వితీ య, తృతీయాశ్వాసమున వర్ణించియుండుటచే నిట వర్ణించక విడిచియుండ వచ్చును. (వ.చ. 2:63—68, 3:48—53)

రామరాజభూషణుడు కన్యాదానము, మాంగళ్యధారణ, తలఁబ్రాలు, అగ్ని వేల్చుట, శిలను త్రొక్కించుట, అరుంధతీ దర్శనము, ఆశీర్వచనములు, కట్న ములు చదివించుట మున్నగునవి క్రమముగా వర్ణించియున్నాడు. పెద్దన ఈ క్రమమును కొంత వేరుగా వర్ణించినాడు. కన్యాదానము తర్వాత తెరపట్టినట్లుగా చెప్పెను. ఆ పిదప తలఁబ్రాలు పోసుకొనుట, మంగళసూత్రధారణ, హోమము చేయుట, సన్నెకల్లు త్రొక్కించుట, అరుంధతీ దర్శనము, కట్నములు చదవించు టలను క్రమముగా పెద్దన వర్ణించెను.

మనోరమ తండ్రి ఇందీవరాక్షుడు భద్ర గజాశ్వములను, తలచినచోట నిల్చు విమానమును, గృహోపకరణములను, ఆభూషణాంబరములను, సుగంధ ద్రవ్యానేకములను, నాగరికపుపనులయం దారితేరిన, రసికజన మనంబుల మరులు కొలుపగలిగిన సురుచిరాభరణ భూషితులగు పరిచారికా సహస్రములను వధూ వరులకు అరణముగా నిచ్చెను. మరియు మందరపర్వతపు లోయలోనున్న రమ్యమైన గ్రామములను కొన్నింటిని పసుపుకుంకుమలకై యిచ్చెనని పెద్దన వివరముగా చెప్పి ఆకాలపువారు తమ కూతుళ్ళకు ఇచ్చు కట్నముకానుకల వివర ములను తెలియచెప్పెను.

కోలాహలుడును వసురాజునకు గృహోపకరణములను, అనేకాభరణాంబర ములను సుగంధద్రవ్యములను ఇచ్చెను. శుక్తిమతియు తనలో బుట్టిన రత్న ములను వసురాజున కొసంగెను. ఇట కవి పర్వతస్థితవస్తువులు, నగరోచిత ఉపకరణ వస్తువులుగా మారినట్లు చమత్కారముగా వర్ణించెను. (6-36). పెద్దన పేర్కొన్నట్లు వస్తువుల పట్టికను రామరాజభూషణుడు పేర్కొనలేదు.

గిరికకు శుక్తిమతీకోలాహలులు దుఃఖభారముతో బుద్ధులు చెప్పి సాగనంపినట్లు, కాళిదాస శాకుంతలము నాదర్శముగా కవి గ్రహించి కల్పించినాడు. శాకుంతలమున పంపుడు తండ్రియగు కణ్వుడు శకుంతలకు అత్తవారింట మసలుకొను విధానమును బోధించినట్లుగానే, కోలాహలుడు నాలుగుపద్యము లలో గిరికకు అత్తవారింట భర్తతో బంధువులతో మెలగు విధానమును బోధ జేసెను. (వ.చ. 6.55-58). ఈ నాలుగు పద్యములును "తత్రశ్లోక చతు ష్టయమ్" అని ప్రశస్తిగాంచిన శాకుంతలములోని శ్లోకముల వలెనే గణనీయము లైనవి. శుక్తిమతియు కూతురు ఎడబాటు వలన కలుగు దుఃఖము పగవారి కైన కలుగరాదని యమకాలంకారమున నుడివిన మాటలు మర్మస్పర్శియై యొప్పుచున్నవి-

"బెగడ వలదనుచు బెట్టిద
మగు నెవ్వగ నగడుపడుచుఁ నాడుబడుచు లే
పగవారికి వలదన నా
పగావారికి నేలయొసఁగెఁ బద్మజుఁ డనుచున్" వ చ. 6-62

మాతృమూర్తికి సహజమైన పుత్రికావియోగబాధను రామరాజభూషణకవి గొప్పగా వర్ణించినాడు. పెద్దన కథ కనవసరమనుకొని కాబోలు ఇట్టి బుద్ధులు చెప్పు ఘట్టమును కల్పించుకొనలేదు వధూవరులు తరలి వరుని యింటికిపోవుటను రామరాజభూషణకవి పేర్కొనెను గాని పెద్దన ఈ విషయము నెత్తుకొనలేదు. వివాహానంతరము స్వరోచి గంధర్వనగరమున మామ కడనే యుండెనా? లేక తన రాజ్యమునకు పోయెనా? తెలియదు.

ఇట్లు పరిణయ సందర్భమును రామరాజభూషణుడు వివిధశాస్త్ర పరిచితిని, భావచమత్కార, ఉక్తివైచిత్రీవైభవములను పుష్కలముగా ప్రకటించుచు వర్ణించినాడు. పెద్దన మాత్రము సరసముగా నాతిదీర్ఘముగా వర్ణించినాడు.



## దౌహృదము

సంస్కృతాలంకారికు లెవ్వరును మహాకావ్య వర్ణనలలో దౌహృదమును చేర్చలేదు. దీనిని మహాకావ్యవర్ణనలలో చేర్చినవాడు అప్పకవి. లాక్షణికులు దౌహృదము నష్టాదశవర్ణనలలో చేర్చకున్నను సంస్కృతకావ్యములలో నీ వర్ణన అటనట గోచరించును. కాళిదాసు రఘువంశమున సుదక్షిణాదేవి యందు శరీర కార్శ్యము, ముఖపాండిమము, చూచుకముల నీలిమ, మృద్భక్షణాభిలాష మున్నగు గర్భధారణ కాలమునాటి లక్షణములను వర్ణించినాడు రఘు.3: — 10). అట్లే బాణుడు కాదంబరి, హర్షచరిత్ర కావ్యములందు తారాపీడుని భార్య విలాసవతియొక్క, మరియు ప్రభాకరవర్ధనుని భార్య యశోవతియొక్క దౌహృదములను వర్ణించినాడు. అందు హర్షచరిత్రలో యశోవతి దౌహృదలక్షణము లను బాణుడు కొంతవరకు దీర్ఘముగా వర్ణించియున్నాడు. (హ.చ. పుట 26)

తెలుగు కవులు పెక్కురు తమ కావ్యములందీ దౌహృదమును వర్ణించి యుండిరి శృంగారశాకుంతలమున పినవీరన శకుంతల దౌహృదలక్షణము లను ఐదు పద్యములలో వర్ణించినాడు. (శృం.శా. 4:53-57). శ్రీనాథుడు కాశీఖండమున తార దౌహృదలక్షణములను కొంతవరకు విస్తరముగా వర్ణించి నాడు. (కా.ఖం. 4:205–213). ఎఱ్ఱన నృసింహపురాణమున హిరణ్యకశిపుని భార్య లీలావతి దౌహృదమును వర్ణించియున్నాడు. (నృ.పు. 3:120–135). తిక్కన నిర్వచనోత్తర రామాయణమున ఒక్క పద్యములో సీతాదేవి గర్భ చిహ్నములను వర్ణించెను. (ని.రా. 8–86). పాల్కురికిసోమనాథుడు బసవ పురాణమున బసవేశ్వరుని జననమునకు పూర్వము మాదాంబా గర్భచిహ్నము లను వర్ణించెను. (బ.పు పుట31). ఈ పరిపాటి ననుసరించి ప్రబంధకవులును సందర్భోచితముగా తమ ప్రబంధములందు దౌహృదవర్ణనను కావించిరి. ఈ వర్ణనలను పరిశీలించి యప్పకవి దౌహృదమును ప్రబంధవర్ణనలలో చేర్చియుం డును.

మనుచరిత్రలో పెద్దన వరూథినీ దౌహృదలక్షణముల నారుపద్యములలో వర్ణించెను. (మ.చ. 3:118–123). రామరాజభూషణుడు వసుచరిత్రలో శుక్తి మతి దౌహృదలక్షణములను రెండు పద్యములలో వర్ణించెను.(వ.చ. 3:19-20). నడకవేగము మందగించుట, చనుమొనలు నల్లబడుట,బడలిక, నిద్రలు హెచ్చుట, అరుచి కలుగుట, చెక్కిళ్ళు పాలిపోవుట, నోటిలో నీళ్ళూరుట, నడుముబలియుట మొదలగు దౌహృదలక్షణములను పెద్దన వరూథిని యందు వర్ణించెను. ఈ లక్షణముల నన్నింటిని గ్రహించి రామరాజభూషణుడు ఒక్క సీసపద్యమున ఇట్లు వర్ణించినాడు–

"నాళికముఖికి నెన్నడుము గానఁగనయ్యె
దనరు నెత్తరుల బిత్తరము దరలె
శఫరాక్షికున్నతస్థలు లగమ్యములయ్యె
బడిబడి నడలెల్ల జడను పడియెఁ
జారువేణికి వింతచవుల నింపులు మీఱెఁ
గనుపట్టె విశదమై గండరేఖ
కంబుకంఠికి సాంద్ర కంకణములు జాఱె
నాదంబు మందమందత వహించె

హంసయానకు నలిమేచ కాంచలముల
గుబ్బపొందమ్మి మొగ్గలు కొమరు మిగిలెఁ
బ్రకటతావర్తనాభి కేర్పడియె నంత
రుచిరతర శైవలశ్యామ రోమరాజి" వ.చ 3-20

శుక్తిమతియొక్క దౌహృదలక్షణములు పైపద్యమున వర్ణించబడినవి. అది యొక నది. స్త్రీ గర్భమును ధరించునపుడు కలుగు లక్షణములతో నదీ జలములు తగ్గినపుడు ప్రవాహమున కన్పించు లక్షణములను జోడించి వ్యంగ్య వైభవమున రామరాజభూషణుడీ పద్యమును రచించినాడు. నాళీకముఖి, శఫరాక్షి, చారువేణి, కంబుకంఠి, హంసయాన, ఆవర్తనాభి యని శుక్తిమతికి విశేషణము లు వేయుటచే స్త్రీ యనియు, నది యనియు రెండర్థములు స్ఫురించుచున్నవి అట్లే "శఫరాక్షి కున్నతస్థలు లగమ్యములయ్యె; వింతచవుల నింపులు మీఱెఁ సాంద్రకంకణములు జాఱె; నాదంబు మందమందత వహించె; గుబ్బపొందమ్మి మొగ్గలు కొమరు మిగిలె. శైవలశ్యామరోమరాజి యేర్పడియె" నన్నప్పుడు స్త్రీ గర్భలక్షణములతో పాటుగా శరత్కాలమునీ క్షీణించిన నదీపరముగాను అర్థము అనాయాసముగా గోచరించి పాఠకుల హృదయములలో నొక వింత చమత్కృతిని పుట్టించుచున్నది. పెద్దన చెప్పక విడిచిన వళిత్రయ విలాసము తగ్గుట, ఉన్నతస్థలు లగమ్యము లగుట, వింత చవులతిశయించుట, శరీరకార్శ్యము-వీటిని రామరాజభూషణుడు పేర్కొనెను.

—*○*—

# కు మా రో ద య ము

కుమారోదయము నాలంకారికులు మహాకావ్య వర్ణనలలో నొకదానినిగా పేర్కొనిరి. కొందరు కవులు కుమారోదయముతో మంగళాంతముగా కావ్యములను ముగించిరి.

రామరాజభూషణుడు మూలకథలో లేని మంజువాణి దౌత్యఘట్టమును, కల్పించి యపూర్వముగా రచించినాడు.

శ్రీహర్షమహాకవి మహాభారతాంతర్గతమగు హంసదౌత్య, నలదౌత్యములను గ్రహించి నైషధమహాకావ్యమున అద్భుత సన్నివేశములుగా తీర్చిదిద్దినాడు. నైషధానువాదముతో శ్రీనాథుడు, ఈదౌత్యములను తెలుగుసాహిత్యములో ప్రవేశ పెట్టెను. ప్రబంధకవులకు శైలీ విషయమున ఆదర్శుడైన శ్రీనాథుడు దౌత్యఘట్టములకు విధాతయైనాడు. ప్రభావతీ ప్రద్యుమ్న, తపతీసంవరణోపాఖ్యానములలో పింగళిసూరన, అద్దంకి గంగాధరకవులు. నైషధములోని హంస దౌత్యములోని హంసవంటి హంసీ, శుకముల పాత్రలను సృష్టించిరి. ప్రేమికుల ప్రేమరాయబారములను వానిద్వారా నడపించిరి.

రామరాజభూషణుడు నైషధకావ్య ప్రౌఢిచేత నెక్కుడు ప్రభావితుడైనాడు. నైషధమందలి నలదౌత్య ఘట్టమాతనిని అధికముగా నాకర్షించినది. సూరనాదులు హంసదౌత్యమునే ముఖ్యముగా దృష్టిలోనుంచుకొని తమ కావ్యములందనుకరించిరి. కాని రామరాజభూషణుడు ఏ కవులను అనుకరించుటకు పూనుకొనని నలదౌత్యఘట్టమును దృష్టిలో నుంచుకొని మంజువాణి దౌత్యఘట్టము నపూర్వముగా తీర్చిదిద్దెను. (వ.చ. 4:58-121).

రామరాజభూషణుడు నాటకప్రియుడు. తన కావ్యమునంతటిని యొక శ్రవ్యనాటకముగా రచించెను. నైషధమునందు వలె కవియే దౌత్యమును వర్ణించుటకు పూనకొనలేదు. గిరిక దుస్సహ విరహవేదనను గాంచి విచారించి మంజువాణి వసురాజు దగ్గరకుపోయి యాతని చిత్తమరసి వత్తునని కార్యసాధనకుపూనుకొని రంగముపైనుండి నిష్క్రమించును. తిరిగి వసురాజొసంగిన అంగుళీయకమును తీసికొని గిరికాదుల సమక్షమునకు వచ్చి తన ఆకాశగమనము, విచిత్రముగా వసురాజు నగరిలో ప్రవేశించుట, వసురాజును గాంచి యాతని ప్రేమను పరీక్షించుట, గిరికపై అతనికి గల అనురాగమును తెలుసుకొనుట మొదలగు వృత్తాంతములను వర్ణించిచెప్పును. ఇట్లు పాత్రముఖమున సంఘటనలను చెప్పించి రామరాజభూషణుడు నాటకశిల్పమును పాటించెను.

మంజువాణి ఆకాశమార్గమున ప్రతిష్ఠానసగరము చేరుకొనుట, తిరస్కరిణీ ప్రభావముచేత అదృశ్యమై వసురాజు భవనమున ప్రవేశించుట, అట వివిధ దశలలో నిద్రించు స్త్రీలను గాంచుట, నృపమంచ సమంచితయంత్ర పుత్రికలలో నొక మణిమండిత పుత్రికయైయుండి వసురాజు ప్రేమను పరీక్షించుట-మొదలగు నవి నైషధములో నలదౌత్యఘట్టమును తలపించుచున్నవి. అదృశ్యుడై యున్న నలుని మెడలో దమయంతి దండవేయుట ననుసరించి, మంజువాణి గిరికా మౌక్తికహారమను వసురాజు మెడలో వేసినట్లు కవి కల్పించినాడు. దమయంతి కడ కింద్రాదుల దూతికలు రాగా అదృశ్యుడై యున్న నలుడు "భీమసుతా వినోద సంభావనకై సఖీజనులు పన్నిన ఆత్మ మనోజ్ఞ పుం స్వరూపావళిలో నిజాకృతి బయల్పడకుండగ రత్నవేదికన్" (శృం.నై. 3-118) చేరియుండి దమయంతికి తనపై గల ప్రేమాధిక్యమును, ఆమె దూతికలకు నొసగు సమాధానముల ద్వారా గ్రహించును. ఇట మంజువాణియు "నృప మంచ సమంచిత పుత్రికామండలి లోన నొక్క మణిమయ మండిత పుత్రికయై నిల్చి" (వ.చ. 4-88) గిరికా మౌక్తికహారమును వసురాజుపైకి విసరును. వసురాజా హారమును గుర్తించి విరహమును చెందును తద్వారా అతనికి గిరికపైగల ప్రేమాధిక్యమును ఆమె కని పెట్టెను. అభిజ్ఞానశాకుంతలమున సానుమతియు అదృశ్యయై యుండి శకుంతలకై పరితపించెడి దుష్యంతుని మాటలను విని యాతనికి శకుంతలపైగల ప్రేమాధిక్యమును తెలిసికొనిన దృశ్యమిచట స్మరణకు వచ్చును.

అదృశ్యుడై నలుడు దమయంతీ భవనమున ప్రవేశించును. అపుడతడు రాజమందిరములోని—

ఆయుధహస్తులై యాయితంబై యున్న
రక్షివర్గముల తీవ్రతకు నవ్వు
నదియెవ్వరని ప్రతీహారు లెవ్వరినన్నఁ
దన్నుగాదలచి చిత్తమున నొదుగు
నెదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల
కొయ్యనఁ దెరువిచ్చి యోసరిల్లు..." శృం.నై. 3-84

అంతఃపురమున గల సుందరాంగుల నెందరినో జూచుచు నొకచోట—

"సోరణ గండ్లమార్గమునఁ జొచ్చిన సన్నని గాలియొక్క యం

ఖోరుహ పత్రనేత్ర నును బొంకపుఁ జన్నులమీది సన్నపుం
చీఱచెరంగు వాయగిలఁ జేసిన............" శృం.నై. 3-89

చూచి పరస్త్రీ పరాఙ్ముఖుడగు నలుడు మోము నింకొకవైపు మలుపుకొనెను. అట్లే మంజువాణి, యంతఃపురములో నిద్రావస్థలోనున్న స్త్రీలను గాంచెను—

"అనుపమరత్న సౌధ కమలాలయ వాటిక నొత్తగిల్లఁ పైఁ
జను మొనఁదోప నొంటి వలి జక్కవతో నరవిందముల్మొగి
డ్చిన యెలదమ్మి దీవియల దీవిగనుంగవ మూసియున్న యం
గనల ననంగ దేవతల........." వ.చ 4-74

స్త్రీలు జంట నెడబాసిన ఒంటిచక్రవాకముతో కూడిన పద్మలతలవలె నున్నారన్న రామరాజభూషణుని వర్ణన నైషధములోని వర్ణనకన్న, అలంకారశోభతో కూడి రమ్యమైనది.

మంజువాణి తిరస్కరణీవిద్యాసహాయమున అదృశ్యయై రాజభవనమున ప్రవేశించుచుండ "అదె యిదె వింతనీడ యని యారెకులూరక సంభ్రమింప"సాగిరి. ఇది నైషధములోని "ఆయుధహస్తులై యాయితంబైన రక్షవర్గముల తీవ్రత"ను జ్ఞప్తికి తెచ్చును.

రామరాజభూషణుడీ మంజువాణి దౌత్యఘట్టమున పూర్వకవ్యనుకరణ గావించినను, మనోజ్ఞ మనోహర చమత్కార రచనచే మించి తరువాత రసిక జనమనోభిరామ ప్రబంధకర్తలవంటి మహాకవుల కెందరికో ఆదర్శపాత్రుడయ్యెను.



# ఇతర వర్ణనలు

## కోన వర్ణన

మహాకావ్యవర్ణనల పట్టికలో లేని యితరవస్తు వర్ణనలను కవులు తమ కావ్యము లందు సందర్భోచితముగా చేర్చుట కలదు. అట్టివానిలో మనుచరిత్ర లోని "కోన" వర్ణన ఒకటి.

ప్రవరుడు తన పాదలేపనము ప్రక్షాళనమగుటచే ఇంటికేగు విధము నెరుగక ఎవరైన తనకు సాహాయ్యము చేయగలవారు కనిపింతురేమోనని తిరుగుచు ఒకచోట ఒక "కోన"ను గాంచినట్లు పెద్దన వర్ణించెను. ఒక సీసపద్యమున కోనవర్ణన, రెండు వృత్తములందు ప్రవరుడు కోనలోకి దిగుట, గారుడోత్కీర్ణ భవనమును గాంచుట వర్ణించబడినవి. మనుచరిత్రలోని కోనప్రసక్తిని, వసు చరిత్రకారుడును అనుకరించి గ్రహించెను వసురాజు నర్మసఖునితో కూడి కోలాహలపర్వతముపై విహరించుచు దూరము నుండి యేతెంచు గానమును వినును. ఆ గాన మెచటిదో, ఎవరాలపించుచుండిరో కనుగొనుటకై నర్మ సఖుని వసురాజు పంపును. అపుడు విదూషకుడు బయలుదేరి "మల్లియలం బూచిన కోనలం"గాంచెను. పెద్దన పేర్కొనిన కోనయు "పూచు మల్లికలు" గలదియే పెద్దన "ఒక్కకోనం గనియె"నని ఏకవచనమున కోనను గూర్చి చెప్పగా రామరాజభూషణుడు "కోనల గాంచి యొక్కచో"నని బహువచనమున వృత్తపద్యమున చెప్పినను తరువాత సీసమున "కోనంగనియె"నని ఒక్క కోననే వర్ణించెను.

కోనవర్ణనను పెద్దన సీసపద్యమున చేయగా రామరాజభూషణుడు పెద్దన ననుసరించి సీసపద్యముననే కోనను వర్ణించెను. పెద్దన వలెనే ఇతడును కోన లోనికి దిగుట నొక పద్యమున, భవనము నొకపద్యమున వర్ణించెను రామ రాజభూషణుడు కోనవర్ణనాసందర్భమున పెద్దన ఛందస్సు ననుకరించుటయేగాక భావముల సొంపులో సైతము పెద్దన ననుసరించినాడు.

మనుచరిత్రలో సుతోదయ వర్ణన రెండుమార్లు కలదు- ఒకటి స్వరోచి జననము, రెండు స్వారోచిష జననము. పెద్దన ఐదు పద్యములలో స్వరోచిజననము, నామకరణము, బాల్యక్రీడలు, విద్యాభ్యాసములను గూర్చి చెప్పెను. (మ.చ. 4:5-9) రెండవమారు రెండుపద్యములలో స్వారోచిషుని జననమును గూర్చి పేర్కొనెను. (మ చ 6:99- 00).

రామరాజభూషణుడు వసుచరిత్రలో గిరికా వసుపదుల జననమునుగూర్చి పేర్కొనెను. (వ.చ. 3:22-34). పదమూడు పద్యములలో గిరికా జననము నామకరణము, బాల్యక్రీడలు, కళాభ్యాసములను వర్ణించెను. ఇందు వసుపదుడు కథలో ప్రధానపాత్ర కాదు కావున నాతని జననము మాత్రమే పేర్కొనబడినది. అనగా నాయికా జన్మవృత్తాంతము మాత్రమే విశదముగా చెప్పబడినది. పెద్దన స్వరోచి, స్వారోచిషుల జన్మమే గాక మనోరమ జన్మమును, గారాబు పెంపకమునుగూర్చి రెండుపద్యములలో వర్ణించియున్నాడు. (మ.చ. 4:75-76).

స్వరోచియొక్క స్వరుచి స్ఫురణను పురస్కరించుకొని మునులు అతనికా పేరు పెట్టిరని పెద్దన చెప్పెను-

"స్వరుచి స్ఫురణను శశి భా
స్కర పావక తారకా ప్రకాశములెల్లన్
విరళములుసేయ నతనికి
స్వరోచియను నామమిడి రచటి మునులెల్లన్" మ.చ.4-7

అట్లే రామరాజభూషణుడును గిరికా నామకరణమును గూర్చి యిట్లు చెప్పెను.

"గిరిరాజతనయ కై వడి
సిరి రాజిల వెలయు నీ సుశీలయనుచు నా
గిరికన్య కచటి మౌనులు
గిరికా శుభనామ మిడిరల్పిష ఫణితిన్" వ.చ. 3-26

స్వరోచికి "మునులు నామకరణాదులు" నిర్వహించిరని పెద్దన చెప్పగా రామరాజభూషణుడును "అచటి మౌనులు" గిరికకు నామకరణము చేసిరని చెప్పెను.

మనోరమ–"కళలందు రమించుటంజేసి భువి మనోరమ యనగన్" వెల సినట్లుగా మూలపురాణకథలో లేని వివరణకు పెద్దన పూనుకొనెను. రామరాజ భూషణుడును "గిరిరాజతనయ కైవడి సిరిరాజిల వెలయు" గావున నాయికకు గిరికానామ మొసఁగబడెనని అర్థవివరణము నొసంగినాడు.

సాహసపరాక్రమవంతుడుగా వర్ధిలబోవు స్వరోచికి యను గుణమైన విద్యా భ్యాసములను గూర్చి పెద్దన చెప్పెను. స్వరోచి క్షత్రియోచితమైన మల్ల, ఖడ్గ యుద్ధ, ధనుర్విద్యల నభ్యసించుటను పెద్దన సహజముగా వర్ణించినాడు. ఆనాడు క్షత్రియవీరు లభ్యసించు విద్యలను దృష్టిలో పెట్టుకొ్ఁయే ఆతడు ఆ విద్యాభ్యాస ములను గూర్చి చెప్పియుండును గుజ్జనగూడులు వండుట, గూఢరత్నసికతాన్వేష ణముల నాడుకొనుట మొదలగు బాలికాసహజమగు ఆటలను వర్ణించి, యానాడు అంతఃపురకన్య లభ్యసించు సంగీత సాహిత్యకళలను దృష్టిలోనుంచుకొని. గిరిక ఆ విద్యల నెల్ల నభ్యసించినట్లుగా రామరాజభూషణుడు చెప్పినాడు.

ఈ విధముగా పెద్దన, రామరాజభూషణు లిరువురును సమకాలిక అంతః పుర కన్యలు, క్షత్రియవీరు లభ్యసించు విద్యావిశేషములను దృష్టిలో పెట్టుకొనియే తమ నాయికానాయకుల విద్యాభ్యాసములను వర్ణించినారు.



## ప్ర యా ణ ము

ప్రయాణవర్ణన మహాకావ్య వర్ణనలలో నొకటి. "మంత్రదూత ప్రయా ణాజి" యని దండి చెప్పిన క్రమమును గమనించినచో ప్రయాణమనిన చతు రంగబలములతో గూడిన నాయకుని ప్రయాణమని తెలియుచున్నది. భారవి కిరాతార్జునీయమున అర్జునుడు తపస్సుచేయుటకై ఇంద్రకీలపర్వతమునకు ప్రయా ణమైపోవుటను వర్ణించినాడు. మాఘుడు శిశుపాల వధలో శ్రీకృష్ణుడు యాదవ

బలముతో స్త్రీ పరివారసమేతముగా ఇంద్రప్రస్థమునకు, ధర్మరాజుచేయు రాజసూయయాగమునకు ప్రయాణమైపోవుటను వర్ణించినాడు. దీనినిబట్టి ప్రయాణ వర్ణన అనగా నాయకుడు యుద్ధమునకై చతురంగబలములతో తరలిపోవు వర్ణనయేగాక ఏదోనొక కార్యార్థియై పయనించు వర్ణనయు కావచ్చునని తెలియుచున్నది.

స్వారోచీ మనోరమలు పరస్పర వివాహమున కంగీకరించగా ఇందీవరాక్షుడు వారి వివాహమును రమానారాయణుల వివాహము జరిగిన మందరపర్వతము పైన చేయదలచి వారిని హిమవత్పర్వతము నుండి తీసికొని, బయలుదేరి పోవును. మరియు శాపవిముక్తిని పొందిన తమ ప్రభువును కొల్చుటకై గంధర్వులు హిమవత్పర్వతమునకు విచ్చేసిరి. అచ్చటికట్లు విచ్చేసిన గంధర్వ పరివారముతో ఇందీవరాక్షుడు మందరపర్వతమునకు ప్రయాణమై పోవును. మూల కథలో చేసిన చిన్నమార్పుతో నిచట పెద్దనకు అష్టాదశవర్ణనలలో నొకటియగు ప్రయాణవర్ణన కావించుట కవకాశము లభించినది.

పెద్దన ప్రయాణవర్ణనను ఐదు పద్యములలో చేసినాడు. (మ.చ 5:41-45). ఇందు ఇందీవరాక్షుని పరివారమున గల గజాశ్వములు, దివిటీలవారు, గంధర్వస్త్రీల సంభ్రమములు వర్ణించబడినవి. ఆకాశమను నీలివర్ణపువస్త్రముపై చిత్రించిన చిత్రములు గల బొమ్మల వలె నుండి ఆకాశమొక కలంకారీ దుప్పటి వలె ఒప్పుచున్నట్లు పెద్దన ముచ్చటగా వర్ణించెను—

"కుంజర శతాంగ హయభట
రంజితమై పై రజః పరంపరలలమన్
మంజుల కాంతిగ సీసపు
మాంజిషమున్ బోలె గగనమండప మమరెన్" మ.చ.5-45

గజాశ్వ రథ భటాదుల బొమ్మలను కలంకారీ దుప్పటుల మీద చిత్ర విచిత్ర వర్ణనములలో నద్దుట కలదు. చతురంగబలము నడుచుచున్నప్పుడు, ధూళిపరంపర లేచి వ్యాపించి చిత్రచిత్ర వర్ణముల నాపాదించుచున్నది. ఈ చక్కని వర్ణన లోకజ్ఞానము నాధారముగా జేసుకొనిన మౌలికమైన ఊహాకల్పనతో కూడినది

ధామరాజభూషణుడు తన కావ్యమున ప్రయాణమును విశేషముగా వర్ణించ లేదు. కాని ఒక సీసపద్యమున, వసురాజు శుక్తిమతిని రక్షించుటకై బయలు దేరినప్పుడు చతురంగబలములు కదలి వెంట నడచినట్లుగా వర్ణించినాడు. (వ.చ. 2-152).



# దౌత్యము

ఆలంకారికులు దౌత్యమును ప్రబంధ కావ్యవర్ణనలలో నొకదానిగాచేర్చిరి. దౌత్యమన నెట్టి దౌత్యమను ప్రశ్న ఉదయించును. "మంత్రదూత ప్రయణాజి"-అని దండి మంత్రాలోచన తర్వాత దౌత్యమును చెప్పుటచే, రాజకీయ సంబంధమగు రాయబారమని స్ఫురించుచున్నది మహాభారతములో శ్రీకృష్ణుని దౌత్యమిట్టిదే. సంస్కృత తెలుగుకావ్యములలో నిట్టి దౌత్యము లనేకములు కలవు. కాని నైషధము వంటి మహాకావ్యమున హంసదౌత్యము, నలదౌత్యములు కలవు మరియు కాళిదాసు ప్రేమికులకు మేఘమును దూతగాజేసి మేఘసందేశకావ్యమును వ్రాసెను. వీని ననుసరించి తరువాతి కవులు తమ కావ్యములందు దౌత్యఘట్టములను ప్రవేశపెట్టుటయే గాక ప్రత్యేకముగా దూత కావ్యములను రచించిరి. దీనినిబట్టి దౌత్యమనగా రాజకీయసంబంధి యగు దౌత్యమేగాక ప్రేమికుల నడుమ జరుప డెడు దౌత్యములును చేరునని చెప్ప వచ్చును.

మనుచరిత్రలో కథాగమనమున కవసరము లేదనికాబోలు పెద్దన మూలాతిరిక్తముగా దౌత్యఘట్టమును ప్రవేశపెట్టలేదు. "వర్ణనీయా యథా యోగ్యం" మ్మను విశ్వనాథుని సూక్తి ననుసరించి కవులు యథాయోగ్యముగా, సందర్భోచితముగా వర్ణనలు చేయవలెను గదా!

"కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగుమోవఁగ జేగుత్తైన తటులఁ
గనుపట్టలోయ గంగా నిర్ఝరము వాఱ
జలువయౌ నయ్యేటి కెలకులందు
నిసుకవెట్టిన నేల నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యిరులు గలియు
క్రముక పున్నాగ నారంగ రంభా నారి
కేళాది విటపి కాంతారవీథిఁ
గెరలు పికశారికా కీర కేకి భృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వ యక్ష
గాన ఘూర్ణితమగు నొక్క కోనఁ గనియె" మ.చ.2-19

అను గంధర్వగాన ఘూర్ణితమగు పెద్దన 'కోన'వర్ణన ననుసరించి రామరాజభూష ణుడు "కిన్నరీ నినాదానుకారి శారీశుకాది ఘోష ఘుమ ఘుమితంబైన" కోన నిట్లు వర్ణించెను.

"రేలెల్ల నమృతమరీచి నంటున నంట
గరఁగి నిర్మల పయోఝురులఁ దొరఁగి
బలువిడిఁ బెనులోయఁ బడిన క్రొన్నెలరాల
చరులలో నిరుగడఁ దఱచుమెఱచు
పటికంపుఁ బఱకుల పజ్జ గొజ్జగి నీటి
యేటిక్రేవలఁ జలి యిసుకవెట్టు-
నేడాకుటనఁటుల నెలమావి గుమురుల
సురపొన్న కూటాలఁ జుట్టుకొనిన
బండి గురివెంద తీఁగె చప్పరము లెనసి
ముడిగొనిన ద్రాక్ష పందిళ్ళ నడుమఁగిన్న
రీ నినాదానుకారి శారీశుకాది
ఘోష ఘుమ ఘుమితంబైన కోనఁ గనియె" వ.చ. 2-21

పెద్దన వర్ణించినకోనలో "గంగానిర్ఝరమువాఱఁ జలువయౌ నయ్యేటి కెలకులందు నిసుకవెట్టిన నేల" కలదు. ఆ నేలపై "ఏచి యర్కాంశులఁజొర

నీక దట్టమై యిరులుఁ గవియుక్రముక, పున్నాగ, నారంగ, రంభా నారికేళాది విటపి కాంతారవీధి'' కలదు. చంద్రకాంత శిలలతో కూడిన దరులు కలవు. రామరాజభూషణుని కోనలోను ''గొజ్జఁగి నీటి యేటి క్రేవలఁ జలి యిసుక'' కలదు. ఆ యిసుకపై ''ఏడాకు టనటుల నెఱమావి గుములుల సురపొన్న కూటాలఁ జుట్టుకొనిన బండిగురివింద తీఁగె చప్పరము లెనసి ముడిగొనిన ద్రాక్ష పందిళ్ళు'' కలవు. పెద్దనయు వరూథిని భవనవర్ణనా సందర్భమున ద్రాక్ష పందిళ్ళను గూర్చి చెప్పియున్నాడు. మనుచరితలోని కోనకు వలెనే వసుచరిత్ర లోని కోనయు ''క్రొన్నెల రాల చఱుల''తో కూడినది.

ప్రవరుడు కోనలోనికి దిగుటను పెద్దన ఇట్లు వర్ణించినాడు-

''నికట మహీధరాగ్రతట నిర్గత నిర్ఝర ధారబాసి లో
యకుఁ దలక్రిందులుగా మలకలై దిగు కాలువ వెంటఁ బూచు మ
ల్లికల వలంబనంబుగ నలిప్రకరధ్వని చిమ్మి రేఁగ లో
నికి మణి పట్టభంగ సరణిన్ ధరణీసురుఁడేగి చెంగటన్''

మ.చ. 2-21

వసుచరిత్రలో విదూషకుడు కోనలో ప్రవేశించిన తీరు ఇట్లు వర్ణించబడి నది-

''ఓరఁగయి వ్రాలిన నమేరువుల పుప్పొడుల
సారువుల వెంట సహకార మిళదేలా
ధారములఁ జారు హిమవారి కృతసారణులఁ
బై రయిన చెంగలువ యోరికలలోఁ గా
శ్మీర కృత సేతువుల దారిఁ జనుచో నచటఁ
గూరు కలహంసలగడై రొదలు సేయం
గీరములు సారెఁ బెఱవార లిటుఁ జేరిరని
చారణులఁజీర వసుపీరసఖు డంతన్''

వ.చ.2-22

కోనలోనికి సమీపమునగల కొండనుండి మలకలై సెలయేరు ప్రవహించు చున్నది. ఆయేటి దరులలో మల్లెతీగలు మొలచినవి. తీగలకు గల మల్లెల వాస నలకు తుమ్మెదలు మూగినవి. ఆ లోయలోనికి మణినిర్మితమైన మెట్లు కలవు.

మల్లెతీగలు పట్టుకొని, తుమ్మెదలు రేగి ఝుంకారములు చేయచుండగా ప్రవరుడు ఆమెట్లమీదుగా కోనలోనికి దిగెను. పెద్దన సహజక్రమమునకు సమీపముగా నిట్లు వర్ణించగా, రామరాజభూషణుడు పెద్దన ననుకరించుచునే పాఠకులను వింత లోకములలో విహరింపజేసినాడు సురపొన్నల పువ్వొళ్ళు సొరువులుగా నేర్పడినవి. ఆ సొరువుల వెంట సహకారముల పైకి ప్రాకిన ఏలకితీగెలు కలవు. వాని పాదుల నుండి స్రవించుచున్న మంచునీరు కాలువలుగా ప్రవహించుచున్నది. పెద్దన సెలయేరును గూర్చి సహజముగా చెప్పగా రామరాజభూషణుడు ఏలకితీగెల పాదులనుండి స్రవించు మంచునీటి కాలువలను గూర్చి ప్రసంగించినాడు. ఆ కాలువలలోని నీటివలన చెంగలువలు పెరిగి పూచినవి. పెద్దన మల్లెపూవుల నీతడు చెంగలువలుగా మార్చెను. ఆ చెంగలువ చాల్పులలోన కుంకుమపువ్వు చేత చేయబడిన సేతువుల మార్గము గుండా నర్మసచివుడు నడిచిపోవుచుండగా నట నిద్రించుచున్న కలహంసలు బెదరి రొదలుచేయుచున్నవి. మనుచరిత్రలోని తుమ్మెదలు, వాని ఝుంకారము లిచట కలహంసలు వాని బెదరిన రొదలుగా మారినవి. ప్రవరుడు కోనలోనికి దిగిపోయినట్లు పెద్దన చెప్పగా, విదూషకుడు కోనలోనికి దిగినట్లుగా కాక నడచివెళ్ళినట్లుగనే రామరాజభూషణుడు స్ఫురింపజేసెను.



# భ వ న వ ర్ణ న

మనుచరిత్రలో ప్రవరుడు కోనలోనికి దిగి ఎదురుగా నొక గారుడోత్కీర్ణ భవనమును కాంచెను. వసుచరిత్రలో విదూషకుడు కోనలోనికిపోయి యొక దివ్యమందిరమును కాంచును. పెద్దన భవనము నొక శార్దూలమున వర్ణించగా రామరాజభూషణుడీ వర్ణన నొక సీసమున చేసెను.

> "తావుల్ క్రేవలఁజల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
> మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ

గ్రావా కల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుందీవెల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్"
మ.చ. 2- 2

ఈ వర్ణనను దృష్టిలో నిడుకొని రామరాజభూషణుడు తన దివ్యమందిరము నిట్లు వర్ణించెను.

"పగడాల కొణిగల నిగనిగ ల్వ్రజంపు
జగతిత్రేవల నెఱజాజు నింప
నీలశాలకజాల జాలోకము లఖండ
కాలా గరుజ ధూపకాంతిఁ బెనుప
ముత్యాల నవరంగముల రంగు నవరంగ
వల్లివిభూతి ముంగిళ్ళ నునుప
గారుత్మతద్వార చారుప్రభా పూర
తోరణంబుల హరిత్తులు పొసంగ
ఛర్మపాంచాలికాపాణి పద్మరాగ
రాజి నీరాజనోపచారముగ వఱలఁ
దరళ వైడూర్య వలభికల్ తెరలు నెఱప
నిరుపమంబైన దివ్యమందిరముఁ గనియె" వ.చ. 2-23

పెద్దన వర్ణించిన భవనము, చెంగలువ కేదారతీరమున గల మావులు క్రోవులు పెనవైచుకొనియున్న వనమున, చంద్రకాంత శిలాస్తంభ నిర్మితమైన పందిరిపైకి ప్రాకిన ద్రాక్షతీగలకు కాచిన ద్రాక్షగుత్తులచేత, పూచిన తీగలచేత కూడి, ప్రకాశించు గరుడపచ్చలచే నిర్మితమైనట్టిది. పెద్దనకాలము నాటి ఒకానొక శ్రీమంతుని భవనముగా నిది పాఠకుల మనఃఫలకమున పొడగట్టును. పెద్దన గరుడపచ్చలు మాత్రమే పొదుగబడిన భవనమును గూర్చి ప్రసంగించగా రామరాజభూషణుడు నవరత్ననిర్మితమైన, ఊహాలోకమున మాత్రము సాధ్యమగు ఒకభవనమును వర్ణించెను. రత్నశాస్త్రకోవిదుడగు రామరాజభూషణు డాయా రత్నముల కాంత్యాది గుణములను మనసులో నుంచుకొని యుచితస్థానములందు భవనమున కలంకారముగ చెప్పెను.

పెద్దన "తావుల్ క్రేవలఁ జల్లి" అను పద్యభావానుకరణను రామరాజ భూషణుడీ క్రింది పద్యమున కొంతవరకు చేసినాడనవచ్చును-

"అని యనుపన్ వినోదసఖుఁడచ్చటి పూబొదరిండ్లు చూచి కాం
చనమణి కందరా.సదన సంతతులారసి పక్వగోస్తనీ
ఘనతర కాయమానములు గన్గొని తిన్నని కన్నె మావి గుం
పున బెనగొన్న మల్లియల బూచిన కోనలు గాంచి యొక్కచోన్"
వ.చ.2-20

ఇందలి పక్వగోస్తనీ ఘనతర కాయమానములు, కన్నెమావి గుంపులు వానికి పెనవేసుకొన్న మల్లియలు పెద్దన వర్ణించినవే.

పెద్దన కోనవర్ణన సహజకల్పనలతో కూడి యందముగా నున్నది. రామ రాజభూషణుడు పెద్దన ననుసరించుచు ఈపట్టున తన ఊహాబలము,పాండిత్యము లను ప్రదర్శించినాడు.



## దశావతార వర్ణన

నైషధమున కవి నలునిచే దశావతారస్తుతిని చేయించి-ట్లుగా కలదు. పెద్దనయు స్వారోచిషుని ముఖమున నీ స్తుతిని చేయించినాడు.ఇది పది పద్యము లలో కలదు. ఇందు మత్స్య, కమఠ, వరాహ, నరసింహ, వామన, పరశు రామ, బలరామ, కృష్ణ, కల్క్యవతారముల స్తుతి కలదు. ఇందలి 6-115వ పద్యమున కృష్ణావతారముగాక బుద్ధావతార వర్ణన కలదని యితర వ్యాఖ్యాతలు పేర్కొనినట్లుగా శ్రీ వెంపరాలవారు తమ వ్యాఖ్యలో (పుట. 784)పేర్కొనుచు

భాగవతవృత్తాంత మాధారముగా నది కృష్ణావతార మని యే వారు నిరూపించిరి. వైష్ణవాభిమాని పెద్దన కృష్ణావతార వర్ణనను ఏల విడిచిపుచ్చెను! ఈ పది పద్యములలోని దశావతారవర్ణనలు అపూర్వభావయుక్తములై కవి భావనైపుణిని ప్రదర్శించుచున్నవి. 6-108 పద్యమున భూమి చిరకాలము నీటిలో నుండుటచే విచ్చిపోకుండ దానికి గాయుటకై మందరగిరిని తిరుగలిగా చేసి శంఖాదులను పిండిచేసి యాదికూర్మము లోకములను రక్షించుటగా నూహించుట అపూర్వము. 6-109 పద్యమున బ్రహ్మాండమును గాజుకుప్పెతో పోల్చుట అనితరలభ్యమగు ఉపమానము. వసుచరిత్రలో మనుచరిత్రలో వలె భగవన్నుతిగాని, దశావతార వర్ణనగాని లేదు. అనేకవిషయము లందు నైషధము ననుసరించిన రామరాజ భూషణకవి యేలనో ఈ విషయమున దాని ననుసరించలేదు.

— *** —

## చక్షుః ప్రీతి

సంస్కృతాలంకారికులు చెప్పకపోయినా 'కన్యాంగ సౌందర్య కథనము'ను అప్పకవి ప్రబంధవర్ణనల పట్టికలో చేర్చి చెప్పెను. చక్షుఃప్రీతి శృంగార దశవిధావస్థలలో నొకటి. చింత, కృశత, స్మృతి, అరతి, తాపము, ఉన్మాదము, మూర్ఛ, మరణోద్యోగములు అను శృంగారావస్థలను కవులు విప్రలంభ శృంగార వర్ణనా సందర్భమున వర్ణించిరి. చక్షుఃప్రీతి యను అవస్థ విప్రయోగమునకు ముందు కలుగు ప్రథమావస్థ. "ఆదరాద్దర్శనం చక్షుఃప్రీతి రిత్యభిధీయతే" అనగా నాయికా నాయకులు పరస్పరము ఆదరముతో దర్శించుకొనుట చక్షుఃప్రీతి. సంస్కృత నాటకములందీ చక్షుఃప్రీతి వర్ణన విశేషముగా కన్పించును. అభిజ్ఞానశాకుంతలమున దుష్యంతుడు శకుంతలను, తీవెలమాటు నుండి వీక్షించుట, తదనంతరము వారి పరస్పరవీక్షణములు వర్ణించబడినవి. దాని ననుసరించియే పినవీరన శృంగారశాకుంతలమున నాయికానాయకుల చక్షుఃప్రీతి

వర్ణనను విస్తరముగా చేసెను. (శృం శా. 2:84-89). అంతకుముందు శృం గారనైషధమున శ్రీనాధుడు చక్షుఃప్రీతి వర్ణనను చేసెను. నలుడు తిరస్కరిణీ సహాయమున దమయంతి అంతఃపురమునకు ఇంద్రాదుల దూతయై వచ్చినపుడు దమయంతిని ప్రథమముగా వీక్షించెను. అపుడు నలుని చక్షుఃప్రీతి వర్ణనచేయబడినది. (శృం నై. 3:146- 52)

మనుచరిత్రలో పెద్దన వరూథిని చక్షుఃప్రీతిని వర్ణించినాడు. ఇట అనురాగ మేకనిష్ఠమగుటచే ప్రవరుని చక్షుః ప్రీతిని వర్ణించు అవకాశము పెద్దనకు లేకుండెను వరూథిని చక్షుఃప్రీతి 11 పద్యములలో వర్ణించబడినది. (మ చ. 2:28-38) వరూధిని ప్రవరుని దర్శించుటలో కొంత ప్రౌఢలక్షణములు కలవు మనోరమ స్వరోచిని దర్శించుటలో ముగ్ధతాలక్షణములు గోచరించును. స్వరోచి పెండ్లికొడుకై తరలిపోవునపుడు పురస్త్రీల చక్షూరాగము వర్ణించబడినది. వసుచరిత్రలో అనురాగము నాయికానాయక నిష్ఠమగుటచే వారిరువురి చక్షుఃప్రీతి వర్ణించబడినది. ఈ వర్ణనను రామరాజభూషణుడు దీర్ఘముగాచేసినాడు. వసురాజు తీవెలమాటు నుండి గిరికాదేవిని వీక్షించుట, ఆ సౌందర్యరాశిలో మునుగుట 14 పద్యములలో వర్ణించబడెను (వ చ. 2:62-75) గిరిక చక్షుఃప్రీతి ఆరు పద్యములలో వర్ణించబడినది. (వ.చ. 3.58-63). వసురాజు పెండ్లికొడుకై తరలిపోవునపుడు పురస్త్రీల చక్షురనురాగమును రామరాజభూషణుడు పెద్దన వలెనే వర్ణించెను.

మనుచరిత్రలో వరూథిని దూరము నుండియే ప్రవరుని కాంచి యాతని సౌందర్యమున కచ్చెరువంది చంచలహృదయముతో రోమాంచముతో. స్వేదాంగముతో, లజ్జతో, బిత్తరచూపులతో, మోహవిభ్రాంతితో నిలచెను. వరూథిని సాత్త్వికభావములను పెద్దన సహజసుందరముగ వర్ణించెను "అబ్బురపాటు తోడ నయనాంబుజముల్వికసింప.......": "చూచి ఝళంఝళత్కటకసూచితవేగ పదారవిందయై..." (మ.చ. 2:28,29 వంటి రసవత్తర పద్యములు పెద్దన ఈ సందర్భమున రచించెను.

రామరాజభూషణుడు వసురాజు చక్షుఃప్రీతిని వర్ణించుపట్ల నైషధము నాదర్శముగ గ్రహించినాడనవలెను. నలుడు అదృశ్యుడై యుండి దమయంతిని

చూడగా, వసురాజు తీవెలమాటునుండి గిరికను చూచును నైషధములో నలుని చక్షుఃప్రీతి వర్ణన, అతని ముఖతః నాయికాసౌందర్య వర్ణనలు క్రమముగా కావించబడినట్లుగానే, వసుచరిత్రకారుడును రాజు చక్షుఃప్రీతివర్ణన, అతని ముఖతః నాయిక గిరికా సౌందర్యవర్ణనలను కావించెను. నాయిక అంగాంగ సౌందర్య వర్ణన విషయమున రామరాజభూషణునికి నైషధ మాదర్శమని చెప్పవలెను.

వసురాజు ఎదుటపడినపుడు గిరికాదేవి చక్షుఃప్రీతి వర్ణన వరూథినీ చక్షుః ప్రీతి వర్ణనను స్మరణకు తెచ్చుచున్నది—

"ముఖమున్ బుట్టెడు కొంకులౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్
జొనుపన్ గోర్కులు క్రేవ్కు ద్రిప్ప మదిమెచ్చుల్ తెప్పలల్లార్ప న
త్యనుషంగ స్థితి జిచ్చపాటొసఁగ నొయ్యారంబునన్ జంద్రిక
ల్దనుకన్ జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్ర పద్మంబులన్"
మ.చ. 2-30

అని వరూథిని కనులను విచ్చి ప్రవరుని చూచిన క్రమమును పెద్దన వర్ణించినాడు. ఇందు ప్రౌఢస్త్రీ లక్షణములు కనిపించును. రామరాజభూషణుడు ముగ్ధయగు గిరికచూపుల నిట్లు వర్ణించెను.

తొలుదొలుతన్ విలోలగతిఁ దొంగలి తెప్పలనాని, కర్ణ కుం
డల రుచి ధాళధళ్యముల డాపున నల్లనఁ బొంచి మించులై
వెలువడి పూర్ణచంద్రుపయి వెన్నెల పుల్గుల చాలు వ్రాలు లీ
లల విభు మీఁదవ్రాలె నవలానవలాలిత దృష్టిజాలముల్"
వ చ. 3-49

చకోరపక్షిశ్రేణి చంద్రునిపై వాలినట్లుగా గిరికచూపులు వసురాజు ముఖముపై వ్రాలినవి వరూథిని అనిమేషయై కనుల తెల్లనికాంతులు వెన్నెలలు కాయుచుండగా ప్రవరుని గాంచినది. గిరికచూపులు కనుకొలకులలో చేరి కర్ణ కుండల కాంతులలో పొంచియున్నవట. అనగా సిగ్గుచే నామె కనులు బాగావిప్పి చూడలేకుండుట సూచించబడినది.

పెద్దన ముగ్ధయగు మనోరమ చూపుల నిట్లు వర్ణించెను.

"రాజు చూచినప్పుడు రాజీవముఖి చూడ్కి
లెదురుకొనియె లజ్జఁ గొదికి కొదికి
జడిసి జడిసి జహ్నుసంభవా-భో వేణి
కెదురులెక్కు మీల కొదమ లనఁగ" మ.చ.5-93

లజ్జచే జడియు గిరికాదేవి చూపులు వసురాజున కెట్లు అసమాంబకుని చిత్ర శరములైనవో రామరాజభూషణు డిట్లు వర్ణించినాడు-

"వసుధా సుధాంశుఁ బొదవుచు
వెస మఱలుచు మరలి మగుడ వెడలుచు లలనా
లసమాన దృష్టి జాత
లసమాంబకు చిత్ర శరములై విలసిల్లెన్" వ.చ. 3-50

వరూథిని అప్సరయై యుండి అనిమేషవృత్తి మాని విచిత్రరచూపులతో ప్రవరుని చూచెను. మనుష్యుని భావించుటచే నామెకు భ్రమరకీటన్యాయము వలె మానుషత్వలక్షణములు ప్రకటమయ్యెనని కవి యామె రెప్పలల్లార్చుటను సమర్థించెను. గిరిక వసురాజును చూచుటకై అనిమేషవృత్తిని వహించెనని రామరాజభూషణుడు చమత్కరించెను వసురాజు చూపులనెడు వలచేత నావరించబడి గిరికాదేవి నిడువాలికచూపులు అనిమేషవృత్తితో కూడినవై, లజ్జయను సముద్రమున క్రుంకియు మన్మథుడను జెస్తవాని నేర్పుపెంపున సమ్మోహమను గుణశక్తిచేత మరల లేచెనట-

"వనజదళాయతాక్షి నిడువాలికచూపనిమేషవృత్తి నా
మను నవకంబుపైఁ బొలసి కాంత తదీక్షణ జాలకంబుపై
కొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును గోరికఁ గ్రమ్మఱఁగూడ బాఱు మో
హన గుణశక్తి నివ్వటిలు నవ్వలరాయని నేర్పు పెంపునన్"
వ.చ. 3-51

ఇట్టి భావనాశక్తిగల పద్యములు, రామరాజభూషణుని కల్పనా ప్రతిభకు నిదర్శనములు, తెలుగుకవితాకన్యకు ప్రత్యేకతగల సొమ్ములు. స్వతంత్ర భావౌన్నత్యము గల ఇట్టి పద్యములు ఈ కవిని సంస్కృత మహాకవుల స్థాయికి తీసుకపోగలట్టివి.

ఇట్లు రామరాజభూషణుడు పోటీపడి పద్యసంఖ్యలోనూ, ఊహావైచిత్రిలోను, రసావిష్కరణలోను, చమత్కారవైభవములోను పెద్దనను మించెనని చెప్పవచ్చును.

# సన్నివేశ సామ్యములు

మను, వసుచరిత్రలలో గల సన్నివేశసామ్యములు కథాసంవిధాన ప్రకరణమున చూపబడినవి. కథా సంఘటన సామ్యమేగాక సంపూర్ణ భావసామ్యముతో కూడిన సన్నివేశములను పరిశీలింతము.

1. మనుచరిత్రలో స్వరోచి కడకు ఎఱుకతేడొకడు వచ్చి వనజంతువుల సంచారములను వర్ణించి చెప్పి యతనికి మృగయాకౌతుకమును కల్గించును. అటే వసుచరిత్రలో వసురాజు కడకు ఉద్యానవనపాలురు వచ్చి ఉద్యానవనశోభను వర్ణించి చెప్పి యతనికి ఆరామదర్శనోత్సుకతను కలిగించిరి. మనుచరిత్రలో ఎఱుకతేడు వచ్చి–

"అల్లదె కంటె పెనపెన
తెల్లని గట్టుఱత మఱ్ఱిదేఱెడు పొల మం
దెల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ! సీరాము సేన వాలుమెకంబుల్" మ చ. 4–16

అని యనగా, వనపాలురు వసురాజుతో నిట్లు మనవిచేసికొనిరి–

"స్వామీ! యేమని పొగడెద
మామనికిన్ మనికియైన యారామము నం
గామ నిశితాస్త్రములౌ ద
త్కోమలతర లతలు చిగురుగొమ్మ చేవల్" వ.చ. 1–35

ఎఱుకతేడు అడవిలోని వాలుమెకములను గూర్చి ప్రసంగించగా, వనపాలురు ఆరామము నందలి లతలను గూర్చి ప్రసంగించిరి. రామరాజభూషణుడు తన పద్యమున "చిగురుగొమ్మ చేవల్" అను ఉక్తిని పెద్దన ప్రసంగాంతరమున "చిగురుగొమ్మైన చేవ" (మ చ. 1–50 అని చెప్పినదానినే గ్రహించి ప్రయోగించినాడు.

బలమికఁ నేమిచెప్ప విను పందు వెదుళ్ళవలీల మోరత్రో
పులఁ బడఁజొప్ప వంచుకొను పోలికవంచి తదగ్రధాన్యముల్
సెలవుల ఫేనముట్టిపడ జిట్టలతోడనె చప్పరించు న
ప్పొలము వరాహపోతములు భూవర తొండములేని యేనుఁగుల్
మ.చ. 4-18

అని పెద్దన వరాహపోతముల గూర్చి చెప్పగా రామరాజభూషణుడు కీరకేకి షట్పదులను గూర్చి యిట్లు ప్రసంగించెను.

కేళి వనాళి నీ యెడద శుకీనినదార్భటి చెప్పనేల భూ
పాలక ! నీలకంఠములు పాయక మ్రోయు లతాంత వాసనా
జాలము పోడుముట్ట సురపాలము వీడ్కొని వచ్చు షట్పదీ
మాలిక దోచు నబ్బురపు మబ్బుల యుబ్బులు గుబ్బతిల్లగన్
వ చ 1-136

"ఇకనేమి చెప్ప"నని పెద్దన యనగా "చెప్పనేల"యని రామరాజభూషణుడాతని ననుకరించెను. "తొండములేని యేనుఁగుల్"అని పెద్దన వరాహములను వర్ణించగా రామరాజభూషణుడు తుమ్మెదల గుంపును అబ్బురపు మబ్బులుగా చెప్పెను. మనుచరిత్రలోని పీఠికలో గల "ధరకెందూళులు" అను పద్యమున (మ.చ. 1-38) చెప్పిన "వింత చీకటు"లను గ్రహించి కాబోలు రామరాజభూషణుడు "అబ్బురపు మబ్బుల"ను సృష్టించినాడు. ఎఱుకతేడు చేసిన వనజంతువుల వర్ణన వినిన స్వరోచికి మృగయాకౌతుకము కల్గెను-

అనుట మృగయా కౌతుక
మునఁ జిత్తము చెంగలింప భూధర శృంగం
బున నుండి డిగ్గి నగరికి
ననిమిష కాంతా కుమారుఁ డరిగి రయమునన్ మ.చ. 4-26

అదేవిధముగ వసురాజుకు వనపాలుర ఆరామవర్ణనను విని దానిని చూడ వలెనను కోరిక కల్గెను-

అని వనపాలురుఁ దెలిపిన
జనపాలున కనఘ సాలాళీ నూ
తనపాళి ఘనకేళీ
వనపాళీ దర్శనోత్సవం బిగురొత్తెన్ వ.చ. 1-142

మనుచరిత్రలో అరణ్య జంతువర్ణనను ఎనిమిదేడు 11 పద్యములలో చేసెను. (మ.చ. 4:16-26. వసుచరిత్రలో వనపాలురు 9 పద్యములలో నారామ వైభవమును వర్ణించిరి. (వ.చ 1:134-142). పెద్దన ఎక్కువ కందములను ప్రయోగించగా వసుచరిత్రకారు డెక్కువ వృత్తములను రచించెను. ఈసందర్భమున పెద్దన ఒక సీసపద్యమున క్రొవ్విన ఏకలములను వర్ణించగా రామరాజభూషణుడు రెండు సీసపద్యములలో గంధవహుని ధౌర్త్యములను, చైత్రుడు సమకూర్చు సహజసౌభాగ్యములను వర్ణించెను.

మృగయాకౌతుకముతో స్వరోచి సన్నద్ధుడు కాగా ఒక సాహిణి సైంధవము నలంకరించి తెచ్చెను. పెద్దన దానినిట్లు వర్ణించినాడు.

పచ్చని హురుముంజి పనివాగె పక్కెర
పారసి పల్లంబు పట్టమయము
రాణనొప్పారు పైఠాణంబు సింగిణి
తళుకుల కోరీల తరకసంబు
మిహిపసిండి పరుంజు మొహదా కెలంకుల
రావు గుజ్జరి సేతకేవడంబు
డాకెలంకున సిరాజీ కరాచుర కత్తి
కుఱంగటఁ గ్రొవ్వాడి గొఱకల పొది

పీలికుంచె తలాటంబుఁ బేరొజంబు
మణుల మొగముట్టువన్ని సాహిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవంబైన యొక మహా సైంధవంబు మ.చ. 4-28

అదేవిధముగ వసురాజు కొరకై ఒక సారథి రథమును సిద్ధము చేసి తెచ్చెను. రామరాజభూషణుడు సైంధవవర్ణనగల పెద్దన సీసపద్యమునకు పోటిగా రథవర్ణనను సీసపద్యమున నిట్లు చేసెను-

జతగూర్చి తార వజ్రాలఁ బమ్మిన కమ్మి
గ్రమ్మిన మణి రథాంగములగములు

సీ. నీలాలదృష్టి పూనిన నక్రముఖముల
తగు పచ్చపని నిగనిగని నొగలు
ముత్యాల బపెరె కెంపుల చట్టము తదంశు
ఘట్టంబు మాడ్కిఁ గెంబట్టు పఱపు
పగడాల కంబాల జిగి మించు పుష్యరా
గపు లోవ వైడూర్య ఘంటికలును

దళతళని మానికంబుల కలశమును జ
యాంక కేతనమును గల్గు నరద మొకటి
మనసుతోనన మెలఁగు సామ్రాణికాశ్వ
రత్నములఁ బన్నితెచ్చె సారథి యొకండు వ.చ. 1-144

వేఁటకుపోవు స్వరోచి గుఱ్ఱముపై బయలుదేరినట్లు పెద్దన చెప్పగ, వసురాజు ఉద్యాన వన విహారమునకు పోవుచుండుటచే కాబోలు రామరాజభూషణుడు దానిని రథముగా మార్చినాడు. పెద్దన గుఱ్ఱమును సీసపద్యమున వర్ణించగా రామరాజభూషణుడు సీసపద్యమునను, మరియొక తేటగీతిలోను రథమును వర్ణించినాడు. (వ.చ. 1-145). పెద్దన గుఱ్ఱపువర్ణన పినవీరన వర్ణించిన దుష్యంతుని పూజవారువముల వర్ణనను తలపించుచున్నది. (శృం. శా. 1-11). అట్టి పెద్దన గుఱ్ఱపువర్ణనను దృష్టిలో నిడుకొని రామరాజభూషణుడు రథవర్ణనను భవ్యముగా చేసినాడు. మృగయా. అశ్వపరిచితులు గల పెద్దన స్వరోచి గుఱ్ఱమునకు గల అలంకారములను సహజముగా వర్ణించినాడు. ఆయారత్నముల లక్షణములను, విభేదములను, కాంతివిశేషణములను తెలిసిన రత్నశాస్త్రపాండితీ విలసితుడు గాన రామరాజభూషణుడు రత్నాలంకార ఔచిత్యము నెరింగి రథ వైభవమును వర్ణించినాడు.

మనుచరిత్రలోని ఎఱుకతేని రాక, అతడు జున్ను, చాఱపప్పు మొదలగు వానిని స్వరోచికి కానుకగా నిచ్చి అరణ్యమృగములను వర్ణించుట, స్వరోచి ఆఖేటమునకు బయలుదేరుట మొదలగు సన్నివేశముల ననుకరించుచు రామరాజభూషణుడు వనపాలకుల రాక, రాలిన సుమములను, రజములను, ఫలములను వసురాజునకు చూపుట, ఆరామవైభవమును వర్ణించుట, వసురాజు ఉద్యానవనమునకు విహారార్థమై బయలుదేరుటలను కల్పించి రచించినాడనుట పరిశీలన వలన

నమ్ములు, వనితారత్నములు మెలగు వలనెఱిఁగింపన్" (వ చ. 2-24 ,పోయి అటు వీణ వాయించుచున్న గిరికను కాంచును, "పొలుపు దెలుపు" అన్న పెద్దన మాటలనే "వలనెఱిగింపు"టగా- రామరాజభూషణుడు అనుకరించినాడు. ప్రవరుడు మారుత మొలసినవైపుగాపోయి వరూథినిని కనుగొనుటను పెద్దన ఇట్లు వర్ణించెను-

"అతడా వాతపరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటసిఁజేరఁబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్"

మ చ 2-25

ఈ పద్యము ననుకరించుచు, నర్మసఖుడు గిరికను కనుగొనుటను రామరాజభూషణు డిట్లు వర్ణించెను-

"తరువుల పొంతఁబొంచి వసుధావర మిత్రుడు గాంచె నచ్చటం
దరుణిఁ దమో వినీల కచఁ దామరసోదర సోదర ప్రభం
దరళ విలోచనం, దతనితంబఁ దటిన్నిభగాత్ర వల్లరిం,
దరణ శశాంకఫాల, నొకదన్విఁ, దరంగవళిం,దలోదరిన్"

వ చ. 2-25

సామ్యము గల పై రెండు పద్యములును మను, వసుచరిత్రలలో ద్వితీయాశ్వాసములోని 24 25 సంఖ్యగల పద్యములగుట విచిత్రసన్నివేశము. పెద్దన చకారారంభ శబ్దములను కొన్నింటిని మాత్రము వరూథినికి విశేషములుగా వాడగా రామరాజభూషణుడు పూర్తిగా తకారారంభశబ్దములను గిరికకు విశేషణములుగా ప్రయోగించెను. అతడు "ఒకతన్వి" అని చెప్పి విశేషణములన్నింటిని తకారారంభ గానే రచించి రచనా చమత్కారమును చూపెను ఇట్టి నియమమును పూర్తిగా పాటించని పెద్దనను రామరాజభూషణుడు అనుకరించి మించెనని చెప్పవచ్చును.

వీణ వాయించుచున్న వరూథినిని ప్రవరుడు చూచిన సందర్భమున ఆమె స్వరూపము నిట్లు పెద్దన వర్ణించినాడు-

తతనితంబా భోగ ధవళాంశుకములోని
యంగఘట్టపు కావిరంగు వలన
శశికాంత మణి పీఠి జాఱు వారఁగ గాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతి పారవశ్య విభ్రమముఁ దెలుప
ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకుఁ

గ్రమ కర పంకరుహ రత్నకటక ఝుణ ఝు
ణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణవాయింపు చుండి మ.చ. 2-27

పై సీసపద్యములోని వీణవాయించు వరూథిని వర్ణన ననుకరించుచు రామరాజభూషణుఁడు వీణవాయించు గిరికను సీసపద్యముననే ఇట్లు వర్ణించెను—

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగు గుబ్బ
కాయల కపరంజి చాయలొసఁగ
లలితాంగుళీ దళంబులు సమేళములైన
సారెలపై రాగ సంపదలిడఁ
బాణికంకణ రుతుల్ ప్రాణానుబంధంబు
గల తాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్త సంవాది స
మస్వరంబులకు గ్రామంబు లునుప

బ్రచురతానామృతముల మూర్ఛనలచేన
చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతన ఖాతి నొనర
వీణ వాయించునొక యలివేణిఁ గంటి" వ.చ. 2-30

పెద్దన, వీణయొక్క "కాయలుత్తుంగ కుచపాళి నత్తమిల్ల"యని వర్ణించగా, ఈ విషయమునే గ్రహించి రామరాజభూషణుడు "వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగు గుబ్బకాయల కపరంజి చాయలొసగ......" అని ప్రపంచించి రచించినాడు. "తరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ముద్దులు నటింప" అనుదానిని "లలితాంగుళీదళంబులు సమేళములైన సారెలపై రాగ సంపద లిడ" అనియు "క్రమపంకరుహ రత్న కటక ఝుణ ఝుణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుప" అనుదానిని "పాణి కంకణరుతుల్ ప్రాణానుబంధంబు గల తాళగతి కనుగ్రహము లీన" అనియు, సీసపద్యములోని చివరిపాద మందలి "ఆలాపగతి"ని గ్రహించి అశ్లీలమును తొలగించి, "ఆలాపభంగి యత్యక్త సంవాది సమస్వరంబులకు గ్రామంబులనుపఁ" అనియు రామరాజభూషణుడు ముమ్మూర్తుల పెద్దన పద్యము ననుకరించుచు ఈ పద్యమును రచించినాడు రామరాజభూషణుడీ పద్యమున వీణాసంబంధి, సంగీతసంబంధి పారిభాషిక పదములను ప్రయోగించి, భావచమత్కారమును సాధించి తన రచనా నైపుణ్యమును ప్రదర్శించినాడు. ప్రసేవకవృత్తి, గుబ్బకాయలు, సమేళములు, సారెలు. ప్రాణములు, తాళములు, అనుగ్రహములు, ఆలాపభంగి, అత్యక్త, సంవాది, స్వరములు, గ్రామము మొదలగు పారిభాషికపదములు రామరాజభూషణుని సంగీతకళా విద్వత్తకు నిదర్శనములు. ఇట్టి పాండితీ వైభవమును తన పద్యమున పెద్దన చూపలేదు. పెద్దన పద్యము సరళసుందరమై యున్నది.

4. మనుచరిత్రలో వరూథినీప్రవర సంవాద ఘట్టము కంఠహారమున మణిపతకము వంటిది. ఆ ప్రబంధగౌరవ మంతయు ఆ ఘట్టము కారణమున సమాయత్తమైనదనిన అతిశయోక్తి కాదు ఆ సంవాదఘట్టము ప్రబంధముననే గాక ఆంధ్రసాహిత్యముననే ఒక రసగుళిక వంటిది. ఈ సన్నివేశ చిత్రణా నైపుణికి సమకాలికులు పెద్దనను పెద్దగా పొగడియుందురు. పెద్దనకు ఘన కీర్తిని తెచ్చిపెట్టిన ఈ సన్నివేశమును మించినసన్నివేశమును చిత్రించవలయు నను స్పర్థతో రామరాజభూషణుడు అదే సన్నివేశము ననుకరించుచు శుక్తిమతీ కోలాహలసంవాద ఘట్టమును వసుచరిత్రలో రచించినాడు. ప్రవరవరూథినీ సంవాదఘట్టమును ఆదర్శముగా గ్రహించి, యనుకరించుచు రామరాజభూషణుడు తన వసుచరిత్రలో శుక్తిమతీ కోలాహల వృత్తాంతమును తీర్చిదిద్దుటలో మను చరిత్రను మించవలయునన్న విజిగీషను చూపించినాడనుట స్పష్టము. సంస్కృ

తాంధ్ర మహాభారతములలో శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతము అతి సంగ్రహముగా చెప్పబడినది. అట్టి సంగ్రహేతివృత్తమును రామరాజభూషణుడు ప్రవర వరూథినీ సంవాదఘట్టము నాధారముగా విస్తరింపజేయుచు తన కల్పనా చాతురిని కూడ చాటినాడు. పూర్వకవి రచనకు భిన్నమైన, సామ్యములేని వృత్తాంతమును గ్రహించి దాని ననుకరించుచు మలచుకొని చెప్పి పాఠకులను మెప్పించుట ప్రతిభాసంపన్నుడైన కవికే సాధ్యము. మనుచరిత్ర ననుకరించుచు, దానిని మించవలయునను కోరిక రామరాజభూషణునిలో నెంత ప్రగాఢమైనదో ఈ యొక్క ఘట్టమును బట్టియే నిర్ణయించవచ్చును

శుక్తిమతీ కోలాహలు లచేతనములైన నదీపర్వతములు. వానిని నదీపర్వతములుగా కాక స్త్రీ పురుషులుగా భాసింపజేయుటకై రామరాజభూషణుడు సమకట్టెను. పెద్దన రచించిన ప్రవరవరూథినీ సంవాదఘట్టము నాటకము నందలి దృశ్యమువలె పాఠకుల నలరించును. ఇక రామరాజభూషణుడు తీర్చిదిద్దిన శుక్తిమతీ కోలాహలుల సంవాదఘట్టము చేతనాచేతనముల వ్యాపారములను వాచ్య వ్యంగ్యరూపములలో గోచరింపజేయుచు పాఠకుల నానంద జలధిలో ముంచును.

వరూథినీ ప్రవరవృత్తాంతములో వలెనే శుక్తిమతీ కోలాహలుల వృత్తాంతమున అనురాగము ఏకనిష్ఠము. మనుచరిత్రలో వరూథిని ప్రవరుని కాంక్షించును, వసుచరిత్రలో కోలాహలుడు శుక్తిమతిని మోహించును. కోలాహలుడు వరూధిని వంటివాడు. శుక్తిమతి ప్రవరుని వంటిది. మొదటిచూపులోనే వరూధిని ప్రవరుని ప్రేమించి యాతని నిట్లు చూచినది-

> ''మునుమున్ పుట్టెడు కౌంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్
> జొనుపన్ గోర్కులు క్రేళ్ళుద్రిప్ప మది మెచ్చుల్ ఱెప్ప లల్లార్ప న
> త్యనుషంగ స్థితి ఱిచ్చపాటొసఁగ నొయ్యారంబునన్ జంద్రిక
> ల్దనుకన్ జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్ర పద్మంబులన్
>
> మ.చ. 2-30

వరూథినిలో కలిగిన అనురాగకారణమునకు కార్యములైన కనుల వింత కదలికలు, కనురెప్ప లల్లార్చుట, తరువాత కనుల కదలిక నిలచిపోవుట మొద

లగు వానిని పెద్దన వర్ణించెను. కోలాహలుడును మొదటిచూపులోనే శుక్తిమతిని ప్రేమించినాడు. అతని యవస్థను రామరాజభూషణు డిట్లు వర్ణించెను—

"అలఘు శ్రీనిధి యానగేంద్రతనయుం డా సైకతశ్రోణి యొ
ప్పులు తెప్పాడక చూచి చన్న మొదలుం బొంగారి పైపై రసం
బులు జృంభించు భ్రమించు నాశయము కూర్మిల్మించు దీపించు ను
త్కలికా చాపలము ల్మనోనిబిడ చింతా తన్మయ్యంబునన్"

వ.చ. 2-112

ప్రవరునికి మనసిచ్చిన వరూథిని యాతని దారికడ్డముగా నిలిచినది—

"అని చింతించుచు మీనకేతున ధనుర్జ్యాముక్త నారాచ దు
ర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహయై దీపించు పెందత్తలం
బునఁ జేచెత్తిన లజ్జనంఘ్రి కటకంబుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁజని పల్కెన్ వాడు విభ్రాంతుడై"

మ.చ. 2-38

తన ధైర్యమును లోగొనిన శుక్తిమతిని కలియక, తన విరహానలము చల్లారదని కోలాహలుడు వరూథిని వలెనే బాధపడుచు శుక్తిమతిని సమీపించెను—

"శైలకులేంద్రుడిట్లు మదశాలి శుకాలి పికాలి శారికా
జాలక నీలకంఠ రవ సంగతి దాలిమి నిల్పఁజాలకు
ద్వేల కరాళకంతు శరవేదన దీరనదీ రసోర్మికం
దేలక యేల కల్గు మహనీయసుఖంబని నిశ్చితాత్ముడై వ.చ. 2-117

వరూథిని ప్రవరునిపై గల తన ప్రేమ నిట్లు ప్రకటించెను.

"నిక్కము దాపనేల ధరణీసుర నందన! యింక నీపయిన్
జిక్కె మనంబు నాకు నను జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరంద మద్యముల చూఱలఁ బాటలు వాడు తేంట్ల సొం
పెక్కినయట్టి పూవుఁ బొదరిండ్లను గౌఁగిట గారవించెదో"

మ.చ. 2-51

పై పెద్దన పద్యము ననుసరించుచు రామరాజభూషణుడు రెండు పద్యములలో కోలాహలుడు శుక్తిమతిపై తనకుగల అనురాగమును ప్రకటించిన

విధము నిట్లు రచించినాడు.

"చెప్పెడిదేమి నాకుఁగల జీవనమంతయు నీకుఁగూర్చి యె
ల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియాచరణం బొనరింప నేర్తు నీ
చొప్పున నీవు నియ్యకొని చొక్కపు జక్కవ గుబ్బలాడి మేల్
దప్పక యంతరంగమునఁ దేరిచి నన్ను నదీనుఁ జేయవే"

"నావిని గట్టు జేఁడు వదనంబున విన్నదనంబు దోఁప నో
శైవలినీ శిఖామణి నిజంబు భవత్కమనీయ కాంతి ధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్ళఁ బెట్టెదో
నీవిక గ్రుచ్చి యెత్తి ఘన నిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్"
వ.చ. 2–130,134

జక్కవ గుబ్బలాడి, భవత్కమనీయకాంతి ధారావళిలో మునింగితి, సుళ్ళఁ బెట్టెదో, తెప్పలఁ దేల్చెదో" యని కవి నదీపరముగాను, స్త్రీపరముగాను పదములను ప్రయోగించి ధ్వని వైభవమును ప్రకటించినాడు "నాకుఁగల జీవనమంతయు నీకు" కూర్చెద ననినపుడు, "నన్ను నదీనుఁజేయవే" అని నపుడు రామరాజభూషణుడు నదీపర్వతపరముగాను స్త్రీపురుషపరముగాను అర్థములను సాధించి తన రచనావైభవమును చూపినాడు. మనసెరింగించిన వరూథినిని గాంచి ప్రవరుడు–

"...వనజేక్షణ! యిట్లువలుక వరుసయె వ్రతులై
దినములు గడిపెడు విప్రులఁ
జనునే కామింప? మది విచారము వలదే?" మ.చ. 2–52

అని యనును. ప్రవరుడు వ్రతదీక్షతో దినములు గడుపు నిష్ఠగల విప్రుడు. శక్తిమతియు అట్టి నిష్ఠాగరిమ గల సాత్త్విక స్వభావురాలు. కామించివచ్చిన కోలాహలునితో శక్తిమతి కూడ ప్రవరుని వలెనే ఇట్లు పలుకును–

"పుడమి నచలేంద్రు లెచ్చట
జడవాహిను లెచట నెచటి సఖ్యము వినఁ జొ
ప్పడదు పొడవడరు మీ యెడ
నెడపక మారసము లెచటికెక్కు మహాత్మా!"

"మతిఁ గ్రీడారతిఁ గల్గెనేని సకలక్ష్మాపుణ్య దేశాళిఁ గాం
చి తపస్స్ఫూర్తి మెయిం గృశించి వనరాశిం జెందు మాబోంట్ల ను
ద్ధతినేఁ గ్రమ్మఁగ నేల నీకుఁ గఱవే తారుణ్యలావణ్య జృం
భిత రంభాది నిలింపభామ లన భూ భృన్మౌళి రాగాంధుఁడై"

వ.చ. 2:132, 136

ప్రవరుడు "నేను మానవుడను నీవు దేవతాస్త్రీవి, మీవారిలో నీవు మెచ్చిన వానితో భోగింపు"మని వరూథినితో పలుకలేదు గాని, అట్టి భావము పై పద్యమునఁగల "విప్రుల జనునె కామింప" అను మాటల ద్వారా పాఠకుల హృదయములలో తళుక్కుమనును. ఆవిధముగా పెద్దన పద్యములను చదివినపుడు రామరాజభూషణకవి తన హృదయములో తళుక్కున మెరసిన భావములను గ్రహించి పైపద్యములలో భావమును ప్రపంచించినాడు. వరూథిని చెప్పిన సర్వ సౌఖ్యములను నిరసించి ప్రవరుడిట్లనును.

"బ్రాహ్మణుఁ డింద్రియ వశగతి
జిహ్మచరణైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మనందాధి రాజ్య పదవీచ్యుతుడై" మ.చ. 2–60

బ్రాహ్మణుడైనవాడు మన్మథబాణముల పాలై స్త్రీలోలుడైన యెడల అతడు పరబ్రహ్మానందరాజ్య పదవీచ్యుతుడగునని ప్రవరుడు వరూథినిని నివారించ ప్రయత్నించును. అదే విధముగా తనతోకూడిన ఎడల కులగిరికోటిలో కోలాహలునకు లఘుత్వము సంభవించును, అని శుక్తిమతి యాతనిని నివారించ ప్రయత్నించును–

"వెలవెలఁ బాఱి శుక్తిమతి వెండియుఁ గొండలతేనిఁ బల్కెన
గ్గలమగు పంచసాయక వికారమునన్ నిజగౌరవోన్నతు
ల్దలపవు గాని మాదృశ జడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరి కోటిలోఁ గడు లఘుత్వము గాదె తలంచి చూడుమా"

వ.చ. 2–136

ఈ విధముగా నీ ఘట్టమున సంభాషణాసామ్యములు, పాత్రల గుణసామ్యములు కొట్టవచ్చినట్లు కనబడుచున్నవి.

తనను నిరాకరించు ప్రవరుని సమ్మతింపజేయుటకు ప్రయత్నించుచు వరూథిని యిట్లనును—

"వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి తప్పుఁజేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టఱికము
ననుపుకాడై వేల్పు నాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సురల హ
ల్యా జారుఁడైన జంభాసురారి

వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె
పవన పర్ణాంబు భక్షులై నవసి యినుప
కచ్చడాల్గట్టుకొను ముని ముచ్చులెల్లఁ
తామరస నేత్ర లిండ్ల బందాలు గారె" మ.చ. 2-73

నిరాకరించు శక్తిమతిని కోలాహలుడు సమ్మతింపజేయుటకు ప్రయత్నించును, ఆ సందర్భమున రామరాజభూషణుడు పెద్దన సీసపద్యము ననుకరించుచు వ్రాసిన సీసపద్యము—

"అతనుభూతి ఘటింపదయ్యెనే చదలేఱు
సికఁదాల్చు నింధాన చిత్రకునకు
వరవంశవై ఖరి వదలెనే రవి సుతా
పతియైన దైతేయ భంజనునకు
వసులాభ సంపత్తి మసలెనే జాహ్నవిఁ
జేకొన్న శంతను క్షితిప మణికిఁ
గమలోదయ ఖ్యాతి దెమలెనే నానా న
దీ కాంతుఁడైన రత్నాకరునకు

వారికే లాఘవము వచ్చె వనిత యెంత
మారు మసలెదు వట్టి నేమములు చాలు
నేలు నన్నని సతి కమలాలి పట్టి
ప్రబలతర దీర్ఘ భుజ శాఖఁ బట్టుటయును

వ.చ. 2-131

అతనుభూతి యనగా అధికైశ్వర్యము మరియు మన్మథుని విభూతి యనియు, వరవంశవైఖరి యనగా మంచికులము మరియు శ్రేష్ఠ వేణుగాన వైఖరి యనియుఁ వసులాభ సంపత్తి యనగాధనలాభ సంపత్తి మరియు అష్టమ వసువగు భీష్ముడు కలుగుటనియు, కమలోదయఖ్యాతి యనగా సంపదలు ఉదయించు ప్రఖ్యాతి మరియు లక్ష్మీదేవి జననఖ్యాతి యనియు, అర్థద్వయిములను సాధించి పెద్దనలోలేని చమత్కారమును వసుచరిత్రకారుడు చేర్చెను. కోలాహలుడు "ప్రబలతర దీర్ఘ భుజశాఖలతో" శుక్తిమతిని పట్టెను. అట్లే వరూథినియు "ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగార పైయంచుల్ మోవగ" ప్రవరుని కౌగిలించుకొన్నది. వరూథిని శృంగారచేష్టలు వర్ణించబడిన వచనము(2-61 లోని శైలిని, భావముల ననుసరించి రామరాజభూషణుడు ఒక వచనమున కోలాహలుడు శుక్తిమతిని బలాత్కరించుటను వర్ణించినాడు (2-140). ఆ వచనములలోని భావసామ్యముల నిట పరిశీలింతము- మను చరిత్రవచనము- "...అసిన నత్తెఅవ యక్కఱ కరి పలుకులు కులికి, గఱి గఱింగఅవ, గర కరిం జెఱుకువిలుకాడు పరఁగించు విరిదమ్మి గొరకలు నెఱఁ కులఁ జుఱుకు చుఱుక్కనం గాఁడినఁ గడుంగెరలి..." వసుచరిత్ర వచనము- "నెట్టన నాగట్టు దొరపట్టి యెట్టకేలకు మట్టుమీఱి గుట్టునం బట్టరాని తమకంబునం దట్టువడి కట్టలుకం గట్టలు వడనేయు గట్టడి మరుని యంప సెల కట్టియలనఁబెటు బట్టు బెట్టిదపు నొప్పి దట్టి....".

వరూథిని మరుని బాణములకు గురియైనట్లే, కోలాహలుడును మరుని బాణములకు గురియైనాడు. మనుచరిత్ర వచనము-

"చంచల దృగంచు ప్రభలతని ముఖాంబుజంబునఁ బొలయ వలయ మణి గణచ్ఛాయా కలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కంజెక్కుచు, జక్కవ

గిబ్బలఁబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తా తారకంబుల నఖకోరకంబులం గీటితీరువడం జేయుచుఁ బతిత వనతరు కుసుమ కేసరంబులు దాల్చు నెపంబునఁ బయ్యెద విదిల్చి చక్క సవరించుచు ......"(మ.చ 2-61 వసుచరిత్రలో రామరాజభూషణుడీ శైలి ననుకరించుచు కోలాహలుడు శక్తిమతిని బలాత్కరించుట నిట్లు వర్ణించినాడు-

"చెంగల్వతావులు చెదరవేణిఁ దెమలించుచు, మకరికలు నులియ గండ పాళి నొక్కుచు, మధురామృతంబులు వడయుం బలు దెరసొబగులానుచు మౌక్తికంబులు జడియం బయోధరంబులం బట్టుచు, విశదాంశుకాంతస్థితి దొరలంగ నతి విపుల పులిన జఘనారోహంబుల నుత్పలపత్రంబుల నెరపుచు..." (వ.చ 2-140).

పై వచనములందు వర్ణితవిషయము భిన్నమైనను రచనావిధానము నం దలి భాషాశైలులందలి సామ్యము స్పష్టముగా గోచరించును. "అంతంతం బొలయు చెలులం దలచూపకయుండం దత్తఱంబునఁజేసి బొమముడిపాటుతో మగిడి మగిడి జూచుచుఁ జిడిముడి పాటుచూపుల నంకురించు జంకెనలవారించుచు" (మ.చ. 2-61) అని వరూధిని తన చెలులను సమీపమున కనబడకుండుడని జంకెనలచేత వారించుచు ప్రవరుని సమీపించుట వర్ణించబడినది. దీని ననుస రించి, కోలాహలుడు చక్రబాలికలను, కీరకిన్నెర మిథునాదులను, దూరముగా తోలుటను రామరాజభూషణుడు చమత్కారముగా వర్ణించెను- "రాకపోకలం బైకొను కోకారి సెకసోకులం ప్రాకిన యాకార సౌండిమంబు నలువునం జెలు పలరుకలువచెలి చలువ వెన్నెల నెలకొన్న వెన్నెల వెల్లువల నుల్లోల కల్లోల మాలికా డోలికా కేళికా చతురచక్రచాలికా జాలంబుల మేలంబులఁ దూలిం చుచుం దమిఁ గొలుపు నగ్గలపు వలపునం గల యలపునం బొడము దగ్గుత్తికఁ దడబడ నుడువు నుడువుల వడువున మెఱయు సరయ చంక్రమణ చలదుపల ఫలకమిళదలఘుతర ఘుమఘుమార్భటి నికట తట విటపివిటప చ్ఛటా రటదపారకీర కిన్నర మిథునాదుల జదల మెదలంజేయుచు..." (వ.చ 2-140).

ఈ విధముగా మనుచరిత్రలోని ప్రవరవరూథినీ సంవాదఘట్టము నాధా రముగా గ్రహించి మూలమున నామమాత్రముగా చెప్పబడిన వృత్తాంతమును రామ

రాజభూషణుడు పెంచి శక్తిమతీ కోలాహలుల సంవాదఘట్టమును గొప్పగా తీర్చి దిద్ది వసుచరిత్రకు మెరుగులు పెట్టినాడు. తరువాత పెద్దన రామరాజభూషణుల ప్రవరవరూథిని, శక్తిమతీకోలాహలుల సంవాదఘట్టముల ననుకరించుచు చేమకూర వేంకటకవి విజయవిలాసమున ఉలూచీ అర్జునుల సంవాదను పెద్దాడ నాగరాజామాత్యుడు శకుంతలాపరిణయమున మేనకావిశ్వామిత్రుల సంవాదములను రచించినారు.

5. మనుచరిత్రలో పెద్దన మూలమున లేని సఖులను వరూథినికి కల్పించినట్లుగానే రామరాజభూషణుడును మూలమునలేని సఖులను గిరికకు కల్పించినాడు. ప్రబంధ నాయికలకు సఖులున ట్లుగా ననేక కవులు వర్ణించినారు. విరహవేదనచెందు వరూథినిని ఆమె సఖులు సమాశ్వాసించినట్లుగానే, విరహ వ్యథతోవేగుచున్న గిరికను సైతము ఆమెసఖులు సమాశ్వాసింతురు.ఇదిమాత్రము పెద్దన ననుసరించి వసుచరిత్రకారుడు చేసిన కల్పన అని స్పష్టముగా చెప్పవచ్చును ఊరడించుతీరులో, మాటలలో పదభావసామ్యము లు చాల కలవు. వరూథిని విరహబాధ నోర్వలేక మరణప్రయత్నమును కావించును. అది క్రింది సీసపద్యమున వర్ణించబడినది.

"చనుగప్పు దొలగ వాసన గాలి కెదురేగు
బరువొప్పు నలుగులబాయి కరణి..." మ.చ. 3-31

మరణము దశవిధ మన్మథావస్థలలో నొకటి మరియు చిట్టచివరి యవస్థ. మరణము అమంగళ మగుటచే, ఆలంబన విచ్ఛేదకారకమగునని మరణప్రయత్నము మాత్రమే వర్ణించబడుచున్నది. పెద్దన వర్ణించిన అట్టి దశమావస్థయగు మరణ ప్రయత్న వర్ణన ననుసరించుచు రామరాజభూషణుడును గిరికా మరణ యత్నమును–

"పవమాన మానవ ప్లవమాన కైరవ
చ్యవమాన రజము మైనంటc దివురు..." వ.చ 3–118

అని సీసపద్యముననే వర్ణించినాడు. మన్మథు డనెడి భూతముచేత పరాభవ మొంది గిరిక తన దేహస్థిత పంచభూతాంశములను పంచభూతములందు కలుపు విధముగ పొదరిండ్లలో తిరుగసాగెను మన్మథసామాగ్రులైన అయా వస్తువులలో

పంచభూతముల లక్షణములుకలవు అనగా పుష్పరాగమున పృథ్వీతత్త్వము,మక రందరసమున జలతత్త్వము, ఆమ్రకిసలయమున తేజస్తత్త్వము, మలయానిల మున వాయుతత్త్వము,తుమ్మెదల ఝుంకార ధ్వనిలో ఆకాశతత్త్వములు కలవు. అట్టి పంచభూత లక్షణములు గల వస్తువులందు గిరిక తన శరీరమున గల పంచభూతములను కలిపి పంచత్వమును పొందదలచినది. ఇదియే ఇందలి చమత్కారము. ఇట్టి సమాలంకారవైచిత్రి పెద్దన పద్యములో లేదు.

వరూథిని మరణప్రయత్నమును కనిపెట్టి సఖులు ఆమెను వారించి యిట్లు సమాశ్వాసించుచు పలికిరి.

"పూతపసిండి వంటి వలపుం బచరించుచు కులంబు నీతికిన్
లేఁత గతమ్మ యిత్తెఱఁగు లేమ! సురాంగన లెల్ల నిట్టి నీ
చేతకు మెత్తురమ్మ దయసేయక తిన్నని మేను వెన్నెఁలన్
వేతురటమ్మ యింత కనువేదుఱు సెల్లునటమ్మ యింతికిన్"

"ఉడుపతి బారికిన్ వెఱచి యూరటయౌనని పేరటామనిన్
ముడివడు కంతుసేనలకు ముయ్యేల గుట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని హరిణేక్షణ ముల్లువుచ్చి కా
ల్దడఁచిన చందమయ్యెఁ బదమా యెలదోటఁ జరింపకింటికిన్"

మ.చ. 3:33, 34

ఈ సందర్భమున సఖులు వరూథినిని రెండుపద్యములలో నూరడించగా. రామరాజభూషణుడు పది పద్యములలో గిరికను సఖులచే నూరడింపజేసెను, అందు రెండు పద్యములను పైపెద్దన రెండుపద్యముల ననుకరించి రచించినాడు-

"కటకట మమ్ము నొక్క త్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ చెలి యిచ్చటి ప్రేఁకవుఁ దేనెవాఁకలీ
వెటువలె నీఁది తమ్మ తెరువెల్లను పుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ తరుణి తగునమ్మ కడింది చెయ్దముల్"
ఇచ్చ హితాహితంబు గణియింపని గోలవు గానఁగానకున్
వచ్చితి గాకయో పథికవర్గము నొంటిఁ జరింప నిచ్చునే

యిచ్చటి యన్య పుష్టచయ మిచ్చటి మత్త మధువ్రత వ్రజం
బిచ్చటి పల్లవోత్కరము లిచ్చటి పాంసుల పంకజావళుల్"

వ.చ. 3:121, 122

పెద్దన పద్యములోని 'అమ్మ' శబ్దమును గ్రహించి వసుచరిత్రకారుడును అట్లే క్రియాపదములను ముగించినాడు. వరూధినీ సఖులు "ఇంత కనువేదులు సెల్లునమ్మ" అని యనఁగా గిరికాసఖులు "తగునమ్మ యిట్టి కడింది చెద్దయముల్" అని మందలించిరి.

వసుచరిత్రలో నాయకుడు విరహార్తుడు కాగా ఆతనిని నర్మసఖు డూరడించును. నర్మసఖుని సమాశ్వాసన, వరూధినిని సఖులు సమాశ్వాసించిన విధము ననుకరించుచున్నది. మనుచరిత్రలో సఖుల సమాశ్వాసన మిట్లు కలదు-

"ఇందు నిభాస్య! వాఁడనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యా యుపేంద్రుఁడో
యిందులకై వగంబొగుల నేటికి నందుఁ బోద మా
నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోడు రమ్మ నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే"

"ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మిదక్కి మే
లేల లతాంగి యెంతపని లెమ్మిది విప్రవరుండు గోలయున్
బాలుఁడు గాననప్పటికిఁ బైబడఁ గొంకెనుగాని వానికిన్
గాలొకచోట నిల్చునె వగన్ మగుడన్నినుఁ జూచునంతకున్"

మ.చ. 3:63, 64

ఈ పద్యములలోని భావమును కొంతవరకు గ్రహించి రామరాజభూషణుడు, నర్మసచివుడు వసురాజును సమాశ్వాసించుట నిట్లు రచించెను-

"జనపతి యిట్లు పంచశర శాత శరాహతిఁ జంచలింపఁగాఁ
గని హితమంత్రి పల్కు మహికాంత నిరంతర చింత నింత విం
తనెగులు పూననేల లలనా నలినాస్త్రుఁ డీవు నిన్నుఁ గ
న్గొనిన లతాంగి యీలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే"

ఆతివ గురుండు తావక పదానతుఁ డంగన గన్నతల్లి య
ద్భుత భవదీయ శౌర్య రసపోషిత జీవన కొమ్మనెచ్చెలు
ల్సతతము నీ కథల్వొగడ జాణలు బాల భవద్విలాస మో
హిత హితకార్య సంగతికి నియ్యెడ సందియమంద నేటికిన్"

వ.చ. 3:87,88

వరూథినిని సఖులు "నీచందము సందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱి జేయదే" అని పల్కగా వసురాజును నర్మసఖుడు "లలనా నలినాస్త్రుడ వీవు నన్ను గన్గొనిన ఆతాంగి యీలువు మనోభవుఁ డింతకు గొల్లలాడడే" అని యూరడించినాడు "వాఁడనఁగ నింద్రుఁడొ, చంద్రుడొ యాయుపేంద్రుఁడో" "వానికిన్ కాలొకచోట నిల్చునె పగన్ మగుడన్ నినుఁ జూచునంతకున్" అను పెద్దన భావనుల ననుసరించి రామరాజభూషణుడు పై 3-88 పద్యమును రచించినాడనిపించును. "ఏల దురంత వేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కి" యని పెద్దన అనగా రామరాజభూషణుడు "నిరంతర చింత నింత వింతనెగులు పూననేల"అని యనిపించినాడు. పెద్దన విప్రవరుని 'గోల' అని సఖులచే ననిపించగా, రామరాజభూషణుడు 3-12 పద్యమున సఖులచే గిరికను 'గోల' అని యనిపించెను ఇట్లు ఈ శబ్ద, భావసామ్యములను పరిశీలించిన పెద్దన రచించిన సఖుల సమాశ్వాసన పద్యముల నాదర్శముగా చేసికొని గిరికాసఖులు గిరికను, నర్మసఖుడు రాజును సమాశ్వాసించిన పద్యములను రామరాజభూషణుడు రచించె ననుట స్పష్టము. ఒకవైపు పెద్దన ననుకరించుచు మరొకవైపు తన రచనాముద్రనువేసి చెలుల ఊరడింపుమాటలను రామరాజభూషణుడు చమత్కారముగా రచించినాడు–

"ఫలభంగములు సేయు చిలుకలకు సొంగమై
క్రోధరసంబు ముక్కుననె యుండు..."

"సకలాగమాంత వాసనలు గాంచి విముక్త
కాంచనంబగు మాధుకర కులంబు...."

"సారస కైరవంబులకుఁ జంద్రదినేంద్రవిరోధమంచ కుం
బాసములేని మందగతి భారము...." వ.చ 3:123, 128, 129

ఇత్యాది పద్యములలో శ్లేషవక్రోక్తి చమత్కృతులను ప్రదర్శించి రచనాశిల్పమున కొత్తదనమునుచూపుచు అల్లసానిపెద్దనను రామరాజభూషణుడుమించినాడు.

# పద్య శిల్ప, భావ సామ్యములు

సన్నివేషము లందేగాక మను,వసుచరిత్రలలో పద్యశిల్ప భావసామ్యములు కూడ కనవచ్చుచున్నవి. సమాన సన్నివేశములలోని భాష,శబ్ద, ఛందః సామ్యములను పరిశీలించియుంటిమి. అవిగాక అటనట సన్నివేశసామ్య ప్రసక్తి లేకుండ, వసుచరిత్రకారుడు మను రిత్రలోని భావ, శబ్ద, ఛందోనుకరణలు కావించియున్నాడు. అట్టివానిని పరిశీలింతము.

"వైకుంఠాంగద హేమ మాతత వలద్వ్యాతాశ నాకృష్ట రే
ఖాకారంబులఁ జుట్టు నంటి మొలనూలై మేటి యొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంఠియై శిఖరిరాట్సింహోల్ల సత్పటమై
యీ కొండం గనుగొంటె మాయదిపుడున్ హేరాళపుం గాంతులన్"

మ.చ 5-48

ఇది మందరగిరి వర్ణన. సముద్ర మథనసమయమున పామును చుట్టుటచే దానిమీదరేఖ లేర్పడినవి. ఆరేఖలలో విష్ణువు భుజాంగదకాంతి ప్రతిఫలించి మందరపర్వతమునకు మొలనూలుగా, ఒడ్డాణముగా, కంఠిగా, ఫాలస్థల పట్టముగా నొప్పినవట నేటికిని ఆకాంతులు మాయక కనిపించుచున్నవట. విష్ణువు యొక్క చతుర్భుజాంగదములకాంతి మందరగిరికి వివిధాలంకారములుగానొప్పినదన్న భావమును గ్రహించి రామరాజభూషణుడు గిరికను వర్ణించినాడు- గిరికను వధువుగా నలంకరించినారు. ఆమెకు దివ్యదుకూలమును కట్టబెట్టిరి.ఆ దుకూలము జలతారుపనితో కూడినది. అది గిరిక నడుమునకు గంటల మొలనూలై,పాదములకు రత్నభూషణములై, వక్షఃస్థలముపై ముక్తాహారమై, శరీరమున మైపూతయై ఒప్పియున్నదట-

"కళుకు మెఱుంగు క్రొంబడిసి కాంచికయై కటి మించఁజాలు నం
చుల మణి లంఘ్రిభూషలయి శోభిలఁజాలుఁ జెఱుంగు ముత్తియం

బులె యెదనుంపఁజాలు సరముల్పట్టు వాసక సౌరభంబె మైఁ
గలపము నింపఁజాలుననఁ గట్టిరి దివ్యదుకూల మింతికిన్"

వ.చ. 5–113

పెద్దన ననుసరించి రామరాజభూషణుడు ప్రసంగాంతరమైనను చక్కని రూపకల్పన కావించినాడు. ఉల్లేఖాలంకార శోభ రెండుపద్యము లందును సమానము. విజయనగరరాజుల కాలమున జలతారు, ముత్తెములు, రత్నము లను వస్త్రములకు కుట్టుకొనుట కలదనియు, వస్త్రమునకు సౌరభము కలుగు నట్లుగ పరిమళద్రవ్యములను వాడుచుండిరనియు పై వసుచరిత్ర పద్యము వలన తెలియుచున్నది.

2. "అకటి నిర్దయబుద్ధివని దూఱెఁ గడు రంభ
యాహా వివేకి వౌదనియె హరిణి
చేదు ద్రింగెదవంచు జికిలి నవ్వె ఘృతాచి
మాయలాడని తిట్టె మంజుఘోష
న్యాయ నిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి
జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలి నేఁచితని దిసంతులు కొట్టె మేనక
విడుపుమాయ లటంచు నొశివె హేమ

గొంట వనియెఁ దిలోత్తమ గూర్మి గొసరె
ధాన్యమాలిని, పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ దిరుగువారి
గువ్వ కోల్గొంచుఁ దమలోన నవ్వుకొంచు" మ.చ. 3–109

పెద్దన సీసపద్యము ననుకరించుచు, రంభాద్యప్సరలు గిరికా సౌందర్య మును చూచి యామె అందము ముందు తమ అందమెంతటిదని సిగ్గుపడిన తీరు నిట్లు రామరాజభూషణకవి సీసముననే ఇట్లు వర్ణించినాడు—

"తల యెత్తదయ్యెఁ గేవల జడస్థితి రంభ
జళుకుజూపులఁ జూడసాగె హరిణి

కుందు కుందునఁజెంది కౌదఁదెల్పె శశిరేఖ
పలపలనై వెలవాతెఁ దార
యుచితకార్య వివేకముడిగె మదాలస
మానె నుద్ధత భాష మంజుఘోష
మఱవక పూనె మైమఱువు వరూథిని
చెయ్వు లన్నియుఁదక్కె చిత్రరేఖ

తాపడియె సానుమతి సాంద్ర తాపమునఁ గ
రంగె హేమాభిధాన నిర్ఝర లతాంగు
లిట్లు దనుఁజూచి సిగ్గుపాటెనయ వినయ
వినతయైయున్న నగరాజ తనయఁజేరి "వ.చ. 5-14

ఇందు రామరాజభూషణుడాయా అప్సరసలు సిగ్గును వివిధరూపముల వ్యక్తీకరించుటయే గాక తమతమ పేర్లకున్న అర్థము ననుసరించి ఆయాస్థితిని బొందిరని అర్థాంతరమున స్ఫురింపజేయుచు పెద్దన పద్యమునలేని చమత్కారమును సృష్టించెను.

2. మనుచరిత్రలో ఇందీవరాక్షుడు రాక్షసుడుగా మారునపుడు ఆతని యనుభవముల నిట్లు పెద్దన వర్ణించెను.

"అభ్రమండలి మోచునందాక నూరక
పెరిగినట్లౌ మేను నరవరేణ్య
యవధి భూధర సానువందాక నూరక
పఱచినట్లౌ మేను పార్థివేంద్ర
యబ్జ భూభువనంబు నందాక నూరక
యెగసినట్లౌ మేను జగధీశ
యహిలోక తలమంటు నందాక నూరక
పడన యట్లవు మేను ప్రభువతంస

యఖిల జగములు మ్రింగుసంతాకలిఁగొను
నబ్ధులేడును జెడఁ గ్రోలునంత తృషయు

నచల చాలనచణమైన యదటుఁ గలిగె
నసురభాషంబుననుఁజెందు నవసరమున"

మ.చ 5-24

ఈపద్య శిల్పభావముల ననుసరించుచు రామరాజభూషణుడు మంజువాణి ఆకాశమున కెగురునప్పటి యామె అనుభవము నిట్లు వర్ణించినాడు-

"బడివాయకిల నగ ప్రతితోఁ జివ్వున
నెగిరినట్లై తోఁచు మగువలార
పైపై సమీరణార్భటి నింగి భోరున
నరచినట్లైతోచు నతివలార
నిఖిల భూములు జవనిక వాప దారున
నెదరినట్లై తోచు నింతులార
చనఁజన వెడఁదయై శశిమేను గ్రక్కునఁ
బెరిఁగినట్లై తోఁచుఁ దరుణులార

గొండలచ్చన గండ్లయి నిండు చెరువు
లెల్ల నద్దంపుబిళ్ళలై యేర్లు ముత్తి
యంపు సరులై యరణ్యంపు గుంపులెల్ల
నారులై తోఁచుఁ బొడవున నారులార" వ.చ. 4-59

ఈ రెండు పద్యములలోని విషయసందర్భములు భిన్నములు. ఇట్లు సందర్భములు భిన్నములైనను పద్యముల ఎత్తుగడ, పాదముల ముగింపు మరియు భావప్రకటనము నందుగల సామ్యములు స్పష్టము.

4 మనుచరిత్రలో ప్రవరుడు హిమాలయమున కేగి యచట వివిధ పుణ్యప్రసిద్ధయాత్రాస్థలములను కాంచినట్లుగా పెద్దన ఇట్లు వర్ణించెను-

"నిడుద పెన్నెఱిగుంపు జడగట్టు సగరు ము
మ్మనుమండు తపము గైకొనినచోటు

జరఠ కచ్ఛప కులేశ్వరు వెన్నుగాన రా
జగతికి మిన్నేఱు దిగినచోటు
పుచ్ఛడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁగొల్వ నాయాసపడినచోటు
వల రాచరాచపాఁడలికాక్షు కసు వెచ్చఁ
గరఁగిన యల కనికరపుఁజోటు

తపసి యిల్లాండ్ర చెలువంబుఁ దలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁ గొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్నచోటు
హర్షమునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన" మ చ. 2-9

పై సీసపద్యమును, అందలి రచనాశిల్పము ననుకరించుచు వసుచరిత్ర కారుడు ఒక్క మన్మథాకరమగు పద్మాకరము నిట్లు వర్ణించెను.

"తనయిల్లు దామరతంపమై మెఱయ సం
పన్నలినాక్షి గాపున్నచోటు
వలరాజు ముజ్జగంబులు గెల్చి దర్పమే
ర్పడ సిజాంకశరంబు లిడినచోటు
వలిగాలి పన్నగావలి గాహిత గరాగ్ని
ఘోర సంజ్వరము వీడ్కొనినచోటు
తొగకొమ్మ దమి గ్రమ్మఁదగు రాజు కరమంటి
యెండ కన్నెఱుఁగక యెసఁగుచోటు

ఇందుముఖులార! యిది సుడీ యిందు గ్రుంకి
మదనుఁ బూజింపఁ గోర్కులు పొదలు ననుచు
దొడవులటువెట్టి వలిపె పావడలు గట్టి
శృంగములు పట్టి నీరాడఁ జేరునపుడు" వ.చ. 3-155

కొలనులోనున్న సామగ్రులు మన్మథుని సామగ్రులు. అట్టి మన్మథ సామగ్రులు గల కొలనులో స్నానముచేసి మన్మథుని పూజించిన, కోరికలు

ఫలించును. సందర్భము వేరైనను వసుచరిత్రకారుడు, పెద్దన పద్యము ననుసరించు ప్రీతితో నిట్లు భావ,శబ్ద, పద్యశిల్పానుకరణ చేయుచు పైపద్యమును రచించెను.

5 మనుచరిత్రలో వనదేవత స్త్రీరూపమును ధరించుటను పెద్దన అపూర్వముగ నిట్లు వర్ణించెను.

"వల్లీమతల్లి లావణ్య సర్వస్వంబు
విమలాంగరేఖ నావిర్భవింప
మంజుల మంజరీ మహిత సౌభాగ్యంబు
పరివృత్త కుచవృత్తిఁ బరిణమింప
బల్లవచ్ఛద చారు భావానుభావంబు
మృదుహస్తలీల మూర్తీభవింప
రమణీయ ముకుళ విభ్రమ భాగధేయంబు
కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింప

జేసి మృగియై వహించు నక్షిద్వయంబు
భాసురంబుగఁ దనయంక పాళిలోన
మించు గ్రొమ్మించు నుపమించు మెలత యగుచు
నిలుచు న వ్వనదేవత నృపతి సూచి" మ.చ. 6—96

వసుచరిత్రకారుడు వసురాజు నర్మసఖుడు వనములో లభించు వస్తుసామగ్రితో నెట్లు యతివేషమును ధరించెనో, పై పెద్దన పద్యము ననుకరించుచు వర్ణించినాడు. రెండు పద్యములందును అతాదులు రూపధారణమున నుపయోగించబడినవి. పూలగుత్తులు, పల్లవములు, స్త్రీ వర్ణనలో ఉపమాన ద్రవ్యములు. ఈ సామగ్రి స్త్రీరూపమును ధరించినపుడాయా అంగములుగా రూపుధరించినట్లు పెద్దన వర్ణించెను. రామరాజభూషణుడు తరుణపల్లవములు, ఫల రసాసారము మొదలగునవి యతివేషధారణమున నర్మసఖున కాయా గుణసామ్యములు గల వస్తువులుగా నెట్లు భాసిల్లినవో ఇట్లు వర్ణించినాడు.

"కనకవల్లి మతల్లికల పెంపు జడగుంపు
పుష్పపరాగ సంభూతి భూతి
కమనీయ శాఖా ప్రకాండంబు దండంబు
తరుణపల్లవకోటి ధాతుశాటి
వల్కల ఘట్టంబు వరయోగ పట్టంబు
జాలక విసరంబు జపసరంబు
ఫలరసాసారంబు పాత్రాంబు పూరంబు
కింజల్కముల చాలు మౌంజినూలు

సేయఁజాలిన యమ్మహాశిఖరి శిఖర
రుచిర సుర భూజరాజిచే నుచితవేష
మెనసి నరపాల నిరపాయ హితవిహార
హారి గడిదేరి యొక జడదారి యయ్యె" వ చ. 2-79

వసుచరిత్ర పంచమాశ్వాసమున పర్వత ప్రాంతము పురముగా మారిన వర్ణన కలదు. పర్వతముపై నుండు ఆయా వస్తువులు పట్టణములలో నుండు ఆయా సామగ్రులుగా నెట్లు మారినవో రామరాజభూషణుడు పది పద్యములలో వర్ణించినాడు. శ్లేషసహాయమున ఆతడు పర్వతగత పృథుగండములు, ఘన సార తటములు, పశుపక్ష్యాదులు, ఎట్లు పట్టణమున గల భద్రగజములుగా, అంగళ్ళుగా, అశ్వభటాదులుగా, వాద్యధ్వనులుగా నమరెనో చమత్కారముగా వర్ణించినాడు. వనదేవతస్త్రీగా మారునట్టి వర్ణనకల పెద్దన పద్యమును దృష్టిలో పెట్టుకొని దానిని మించవలెనని రామరాజభూషణుడు పది పద్యములలో నిట్టి వర్ణనచేసి యుండును.

6. కౌగిలించుకొనిన వరూథినిని ప్రవరుడు నిష్ఠురముగా త్రోసివేయగా నామె ఏడ్చిన తీరును పెద్దన ఇట్లు వర్ణించెను—

"పాటున కింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోటు భవన్నఖాంకురము సోకె కనుంగొనుమంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁగల స్వనంబుతో

మిటిన విచ్చు గుబ్బ చను మిట్టల నశ్రులు చింద వాందగన్"
మ.చ. 2-70

శ్రీనాథుని నైషధములోని దమయంతి, కాశీఖండములోని సుశీల యేడ్పుల ననుసరించి (శృం. నై. 4-87, కా. ఖం. 5-167) పెద్దన వరూధిని యేడ్పును వర్ణించెను. పెద్దన వలెనే పారిజాతాపహరణకర్తయు సత్యభామ ఏడ్పును వర్ణించెను. (పా.హ. 1-133). గిరిక విరహానలజ్వాల కోర్వలేక ఏడ్చినట్లు వర్ణించు వసుచరిత్రకారుని పద్యము పై పెద్దన పద్యమునకు పోటీగా రచించ బడినట్లు స్పష్టముగా గోచరించును-

"ఆజాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్‌లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చె గిన్నర వధూరాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధా పూరంబు తోరంబుగాన్" వ.చ. 4-52

వరూధిని అశ్రువులు చిందువాదగ కలస్వరముతో నేడ్చెనని పెద్దన సహజసుందరముగా చెప్పగా, సంగీతప్రియుడగు రామరాజభూషణుడు గిరికాదేవి, కాంభోజరాగమేళముతో కూడిన వీణాస్వనము ననుసరించుచు ఏడ్చెనని వర్ణించినాడు. కాంభోజరాగము దీనస్వరము కలది వియోగదుఃఖముతో గిరిక కాంభోజరాగస్వనమున ఏడ్చుట ఉచితము. రాజీవానన గాన చంద్రుని కాంతి కోర్వలేక ఏడ్చిన దనుట సముచితము. ఈ వింత ఊహలతో కూడిన రామరాజభూషణుని పద్యము శ్రీనాథ, పెద్దనల పద్యములను మించినది. నాయికల ఏడ్పును తరువాతి తెలుగుకవులు తమ కావ్యములందు వర్ణించిరి. తపతీ సంవరణోపాఖ్యానాది కావ్యకర్తలు వసుచరిత్రకారు ననుకరించిరి కాని వసుచరిత్రకారుని పద్య సౌందర్యమును ఇతరకవులు సాధించలేకపోయిరి.

7. మనుచరిత్రపీఠికలో కృతిపతి వంశావతారవర్ణనా సందర్భమున చంద్రుని వర్ణనను పెద్దన ఇట్లు చేసినాడు-

"కలశపాథోరాశి గర్భవీచిమ తల్లి
కడుపార నెవ్వాని గన్నతల్లి
యనలాక్షు ఘన జటా వనవాటి కెవ్వాడు
వన్నె వెట్టు ననార్తవంపుఁ బువ్వు..." మ.చ. 1-18

రామరాజభూషణుడు వసుచరిత్రపీఠికలో కృతిపతి వంశవర్ణనను చంద్ర వర్ణనతో నారంభించి పెద్దన ననుకరించుచు ఒక సీసము నిట్లు చెప్పెను.

"జనకనేత ఫలంబయిన పాలపాపఁడు
    పరివృద్ధిఁగాంచు జైవాతృకుండు
శ్యామాభిరాముఁడె! యలరు రేఖాశాలి
    రహిఁ కళల్యాను సర్వజ్ఞమౌళి ...." వ చ. 1-21

ఈ పద్యమున రామరాజభూషణుడు శ్లేషచే, చంద్రుని ఒక మహాపురుషుని గాను, మరియు పాలసముద్రమున పుట్టి యాకసమున వెల్గుచంద్రునిగాను స్ఫురింప జేయుచు రచించెను. అంతేగాక ఒకవ్యక్తి బాల్యయౌవనాది వృత్తాంతములను, గుణీభూత వ్యంగ్యముద్వారా స్ఫురింపజేసెను రచనాచమత్కృతిచే పెద్దన పద్యము ను మించిన పద్యమిది.

8. "చూచి ఝుళంఝుళత్కటక సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుములే నడుమల్లలనాడ నయ్యెడన్
బూచినయొక్క పోఁకనును బోదియఁజేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్" మ.చ. 2-29

అని వరూధిని లజ్జాభరయై ప్రవరుని చూచుటను పెద్దన వర్ణించినాడు. వసుచరిత్రకారుడును అట్లే లజ్జాభరయై, సఖుల పరిహాసమును భరించలేక తెరమాటునకేగు గిరిక నిట్లు వర్ణించినాడు–

"సొలసి తటిల్లతాంగి జిగి సూపు వెలుంగులచేఁ గల ధ్వను
ల్గలకలకంఠులం గదిమి గాటపు సెమ్మె నటింప హంస కం
బులు ఆడియం బయోధర సమున్నతి భంగుర మధ్య పుష్కరాం
చల మరదోఁపగా నరిగె జారు ఘన ప్రతిసీర చెంతకున్" వ.చ. 3-67

ఇందు గిరికయు వరూథిని వలెనే అందెలు మ్రోయుచుండ వక్షోజభార ముచే నడుమల్లల నాడుచుండ, జిగిచూపులచే సఖులను బెదిరించుచు తెరమాటున

కేగెను అంతేగాక ఈ పద్యమున రామరాజభూషణుడు గిరిక తెరమాటున కేగుటను తటిల్లత నీలమేఘమును చేరుటలోగల పోలికను శ్లేషమూలక వ్యంగ్యమున సాధించినాడు. రామరాజభూషణుడు పెద్దన పద్యము ననుకరించుచు దానిని మించిన వ్యంగ్యభావాన్వితమైన పద్యము నిట రచించినా డనవచ్చును.

9. "అటఁ జని గాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సర ఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
కటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్" మ.చ.2-8

అను మనుచరిత్ర పద్యములో వర్ణములు నాట్యమాడుచున్నట్లున్నవి. ఇది ఔదార్య గుణమున కుదాహరణ పద్యము. ఇందలి బిందుపూర్వక ఝకారము, బిందు పూర్వక గకారము, లకార టకారావృత్తులు ఆకాశము నంటు శిఖరములను, పొరలునట్టి యలలు మృదంగధ్వనుల ననుకరించుటను, పురివిప్పిన నెమళ్ళ నృత్యములను అక్షిగోచరము లగునట్లు చేయుచున్నవి. ఇది పెద్దన ప్రసిద్ధ పద్యములలో నొకటి. దీని ననుకరించి మించవలయునను ప్రయత్నము రామరాజభూషణుడేల చేయకుండును! దీని ననుకరించుచు గిరికాసఖులు సరోవరమును కాంచుట నాతడిట్లు వర్ణించినాడు.

"వనజముఖుల్గనుంగొని రవారితవారి తరంగరంగ న
ర్తన సలిలభ్రమద్భ్రమణ రంగదభంగ రథాంగధామమున్
మనసిజహోమకుండ నిభ మంజుల కంజగతాళి ధూమమున్
ధనద సరోజధామ సమధామము నొక్క సరోలలామమున్"
వ.చ. 3-153

ఇందలి బిందుపూర్వక గకార, రకారముల ఆవృత్తి అంత్యాను పాసలు అవారితవార తరంగములను, చక్రవాకముల తుమ్మెదల సందడిని ప్రకటించుచున్నవి. ఈ పద్యమున రామరాజభూషణుడు పెద్దన వికటత్వము, ఔదార్యగుణములతో కూడిన శైలిని అనుకరించినా డనవలయును.

10. ప్రవరుని హిమాలయసందర్శన సమయమున పెద్దన అచట వీచిన మరుదంకురముల నిట్లు వర్ణించియున్నాడు.

ఉల్లల దలకాఙల కణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద ఝంకర
మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్ మ చ. 2-6

ఇందలి ద్విత్వలకార ప్రాస మరియు లకారావృత్తి చెవులకింపై శైత్య పవనములు వీచుటను ప్రకటించుచున్నవి. అట్లే రామరాజభూషణుడు మందానిలమును ఇట్లు వర్ణించెను-

"మందార ముకుళ కుహళీ
కందళిత మరంద తుందిక మిళింద వధూ
బృందాభి నందితంబగు
మందానిల మొలయ విజితమార్గ క్రమలై వ చ. 3-152

పెద్దన కదంబముకుళములను గ్రహించగా రామరాజభూషణుడు మందార ముకుళములను గ్రహించినాడు. పెద్దన 'లహరీ'కి మారుగా 'కుహళీ' అని రామరాజభూషణుడు ప్రయోగించెను. పెద్దన ద్విత్వలకార ప్రాసను ప్రయోగించి మరుదంకురములు మెల్లమెల్లగా వీచుటను సూచించగా నితడు బిందు పూర్వక దకార ప్రాసద్వారా మందానిలముల మందత్వమును సూచించినాడు. పెద్దన పద్యము లకారావృత్తి కలదికాగా, నీతని పద్యము బిందుపూర్వ దకార యుక్తమేగాక,ళకారావృత్తి కలిగి మాధుర్య గుణయుక్తమై యున్నది. ఈ పద్యము పెద్దన పద్యము ననుకరించు ఉద్దేశ్యము తోడనే వ్రాయబడినదేమో! సందర్భములు వేరైనా వర్ణ్యవస్తు వొక్కటే.

11. "తన యశోవిశద ముక్తా సౌధపాళికి
నంబుదాయనము వాతాయనముగ

వ.చ 1-116

అను వసురాజును వర్ణించు పద్యమున మనుచరిత్ర అవతారికలోని నరసింహ రాయల వర్ణనా పద్యచ్ఛాయలు కన్పించుచున్నవి-

"అంభోధి వసన విశ్వంభరావలయంబుఁ
బాహు పురి మరకతముఁ జేసె"

మ చ. 1-30

ఈరెండు పద్యములలోని అలంకారవైచిత్రి ఒక్కటే. వసురాజు యొక్క కీర్తి భవనమునకు ఆకాశము నంబుదాయనము గ, సైన్యముచేత ఎగురగొట్టబడిన ధూళి వలన ఏర్పడిన కృత్రిమభూమికి తారాగ్రహములను గర్భరత్నములుగా, దాన ధారాజలమనెడి సముద్రమునకు ఆకాశగంగను ఎగిసిన నీటికణముగా నూహించుపట్ల రామరాజభూషణుని యూహాలత చాల పైకి ప్రాకిన దనవలయును.

12. "స్తనగుళుచ్ఛ వధూదేహ దాడిమీల
తామతల్లికపై హోమ ధూమ మడరె
భర్త నభిమతరతి మహాఫలవిపాక
మగుటఁగోరి ఘటించు దోహదమనంగ" మ.చ. 5—92

స్తనములు అను పూలగుత్తులతో కూడిన మనోరమ అను దాడిమీలతకు, వివాహ సమయపు హోమధూమము దోహదధూపధూమమువలె ఒప్పుచున్నదని పెద్దన ఉత్ప్రేక్షించినాడు. రామరాజభూషణుడు ప్రథమాశ్వాసమున చేసిన వనవర్ణనా సందర్భమున దాడిమీలతకు చేయు దోహదక్రియ నిట్లు వర్ణించినాడు.

"చలితలతాంతకాంతియను చందురు కావిచెఱంగు దాటి స
మ్మిళిత పయోవిలాసముల మీటిన విచ్చు ఫలస్తనాగ్రముల్
వెలువడ గప్పె తత్క్షణమ వేల్లిత దోహద ధూపధూమకుం
తలములు విప్పిదాడిమలతాలలితాంగి నృపాలు చెంగటన్"వ.చ. 1—157

మనోరమ అను పూలగుత్తులుగల దాడిమలతకు హోమ ధూమము దోహద సమయమున చేయబడు ధూపధూమమువలె నున్నదని మనుచరిత్రలో పెద్దన ఉత్ప్రేక్షించగా నిట ఫలములతో కూడిని దాడిమ లతకు చేయబడిన ధూప ధూమములను లలితాంగి యొక్క కుంతలములతో రామరాజభూషణుడు ఉత్ప్రే క్షించినాడు. మంచి ఫలములు వచ్చుటకై పూలగుత్తులుగల దాడిమీలతకు, ఫల ములు వచ్చుటకై పండ్లుగల దాడిమీలతకు ధూపధూమమును దోహదక్రియ చేయట కలదు.

13. "తల్లియుఁ దండ్రియున్ బహువిధంబుల గామితముల్ఘటింపఁగా
నుల్లము చల్లనై సిరుల నొందు సుపర్వ నరాహిరాట్పురీ

హల్లకపాణులందొకతెనై జనియింపక నొడ్లనొంచు పె
న్వెల్లికి జాతికిం బొడమి వేఱిడినైతి దలంపులేటికిన్" వ.చ 3–115

ఇందు గిరిక, తాను పెద్దవెల్లువకు, జాతికి జన్మించి కొఱమాలిన దాననైతి నని విచారించును.

ఎంతతపంబు సేసి జనియించిన వారొకొ మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞ చేసినను కాయము వాయుదు రే నమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గఱితిన్ మృతిలేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపిక యయ్యెనక్కటా"

మ.చ. 3–8

అని వరూథిని, తాను మర్త్యభామినియై యుండిన బాగుండెడిదికదా యని విచారించును. గిరిక పై పద్యమున "తలిద్రుడులనేకవిధములుగ తమకోరికలను నెరవేర్చుచుండగా మనసుచల్లనై జీ.ంచు సుర, నర, అహిలోకము లందొకతెనై పుట్టనైతి" నని విచారించినది. వరూథిని యేమో "ప్రాయము, సోయగము కలిగిన ప్రియుడు వశ్యుడై కోర్కెలు తీర్చుచు, అక్కునజేర్చిగారవించు యింతి భాగ్యమే భాగ్యము నాచక్కదనము యౌవనము, ప్రాణములువ్యర్థము" లయ్యెగదాయని విచారించును. ఇట్లుగిరికావరూథినుల విరహదుఃఖము వారివారి పాత్రభేదములను బట్టియున్నను కొంతసామ్యము కన్పించుచున్నది.

14. "అప్పుడు తూర్యముల్మొరయ నమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁదేల వంపబడు తెల్లని చీర తెరం గ్రమంబునం
గొప్పుమొగంబు నట్టు జనుగొండలుఁ దోపలతాఁగిపోలెఁజె
ల్వుప్పతిలన్ సుధారస పయోనిధి పెందెర బుట్టునిందిరన్"

మ.చ. 6–80

వధూవరుల నడుమగల తెరను మెల్లమెల్లగా క్రిందకు దింపుచుండగా వధువైన మనోరమ యొక్క కొప్పు, మొగము, మెడ, వక్షోజములు, క్రమముగా గోచరించెను. అట్టి మనోరమను పాలసముద్రపు కెరటముల మధ్యనుండి పుట్టుచున్న లక్ష్మీదేవితో కవి పోల్చినాడు. ఈ పద్యములోని భావమును దృష్టిలో నిడికొని రామరాజభూషణుడు రాత్రినొక శైలూషిగను, చంద్రుని శైలూషిముఖముగను,

ఆకాశమును రంగస్థలముగను, చీకటి మెల్లమెల్లగా తొలగుటను తెరతొలగుట గను, భావించి చక్కని చంద్రోదయవర్ణన కావించినాడు.

"హరిదంభోరుహ లోచనల్గగన రంగాభోగ రంగత్తమో
భర నేపథ్యము నొయ్యనొయ్యసడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్మౌక్తిక పట్టమున్నిటలమున్ వక్త్రింబునుందోచెనా
హరిణాంకాకృతి వొల్చెరేకయి, సగంబయి, బింబమై తూర్పునన్"

వ.చ. 4-17

తెర తొలగించునపుడు క్రమముగా శైలూషియొక్క మౌక్తిక పట్టము, నిటలము, వక్త్రము, కనబడునట్లుగా చంద్రుడుదయించునపుడు రేఖాకారమై, సగమై, పూర్ణబింబమై క్రమముగా కనబడెనట. నాటకప్రీతిగల రామరాజభూష ణుడు పెద్దన పద్యభావమును గ్రహించి, నాటకములలో, ముఖ్యముగా వీథినాట కములలో తెరను పట్టి ముఖ్యమైన పాత్రను రంగస్థలము పైకి తెప్పించి యా తెరను మెల్లమెల్లగా తొలగించు ఆచారమును ఆధారముగా చేసుకొని సుందరమైన రూపకల్పనను కావించినాడు.



# శబ్ద సామ్యములు

సన్నివేశ ప్రసక్తి లేకయే పెద్దనపద్యములోని శబ్దములను, జాతీయము లను, సమాసము లను రామరాజభూషణుడు అనుకరించినాడు.

1) పెద్దన మనుచరిత్రారంభమున పురవర్ణనావసరమున అరుణాస్పద పురములోని "చిగురుఁగొమ్మైనచేవ" అని సామెతగాచేసి చెప్పినాడు. ఇది రామ రాజభూషణుని మిక్కిలి యాకర్షించియుండెను. పెద్దనవలె రామరాజభూషణు డును రాయలసీమవాడేకదా! వసుచరిత్రలో రెండుమార్లు ప్రకరణాంతరము లందు కవిదీనిని ప్రయోగించినాడు—

"స్వామీ యేమనిపొగడెద
మామనికిన్ మనికియైన యారామమునం
గాము నిశితాస్త్రములు ద
త్కోమలతరలతలు చిగురుగొమ్మలచేవల్"    వ,చ. 1-135

ఈపద్యమున సుకుమార పుష్పములు కాముని కఠోరబాణములని చెప్పుట, చిగురుకొమ్మలందు చేవలని చెప్పుట విరోధము ఉద్దీపములనియు దినదిన ప్రవర్ధమానములనియు విరోధపరిహారము. విరోధాభాసాలంకార చమత్కృతిని కవి యిటచూపెను. మరొక పద్యమున నీశబ్దభావమును రామరాజభూషణుడిట్లు ప్రయోగించినాడు.

"బలవన్మేరు శరాసనంబును, బరబ్రహ్మాస్త్రముంగల్గు బ
ల్విలుకానిం దృణమైన చాపమున గాలింబోవు లేయల్గులం
జలమూనించి సగంబుచేసి తవునౌ సంకల్పసిద్ధుల్గొనం
బలుమేరున్ నిరసింప లేఁజిగురుఁగొమ్మంజేవ గాకుండునే
వ చ. 3-173

ఇట్లు రామరాజభూషణుడు "క్రియాసిద్ధిస్సత్వే భవతి మహతాం నోప కరణే" అను సంస్కృతోక్తిని స్ఫురింపజేయునట్లు "లేజిగురుకొమ్మం జేవ గాకుండునే" యని చెప్పి చక్కని చమత్కారమును సృష్టించెను

2) మనుచరిత్రలో ప్రవరుడు ప్రక్షాళితపాదలేపనము గలవాడై స్వగ్రామమునకు పోవుదారి కానక విచారించుచు".. దైవంబ కినుకనిట్లు, పాఱవైచితె మిన్నులు వడ్డచోట." అని(మ చ. 2- 7) అనుకొనును ఈ "మిన్నులువడ్డ" అను జాతీయమును రామరాజభూషణుడు గ్రహించి అర్థాంతరమున నిట్లు ప్రయోగించినాడు.

"ఏమనిచెప్పవచ్చు ధరణీశ్వర! యాబలు సేగితన్మహా
భూమిధరోపరోధమునఁ బొంగున భంగ సరిజ్ఝరంబుపై
పైమహియెల్ల నల్లుకొన బల్విడి నందను బింబితాభ్ర రే
ఖామహిమంబు గాననగు గ్రక్కున మిన్నులువడ్డకైవడిన్"

వ.చ. 2-148

ఇచట రామరాజభూషణుడు 'మిన్నులువడుట' ను జాతీయముగా కాక ఆకాశము విరిగి పడుటయను వాచ్యార్థములోనే గ్రహించినాడు. కోలాహలపర్వతము నదిలో పడుటను, ఆకాశము పడుటగా నుత్ప్రేక్షించుట సుందరముగా నున్నది. ఈపద్యములోని "అభంగసరిజ్ఝరంబు" పెద్దన ప్రసిద్ధపద్యమగు "అటజని కాంచె..." లోని "శిరస్సరజ్ఝరీ" యను సమాసమును తలపించుచున్నది

3) మనుచరిత్రలో వరూథిని పరబ్రహ్మానందస్వరూపము నిట్లు నిర్వచించినది- "...కుంభగత ప్రదీపకళికాశ్రీ దోప నెందెందుఁబోకెందే నింద్రియముల్ సుఖంబుగను, నాయింపే పరబ్రహ్మ"ము (మ చ. 2-62). రామరాజభూషణుడు వసురాజు చూపులను వర్ణించుచు-

"కుంభగత దీపశోభా నిగుంభలీలఁ
గుంభకుచమేనఁ జూడ్కులాగుబ్బుకొనఁగఁ
గాంచు విభుఁడంగనా ప్రసంగంబు కతన
మంత్రివరు నెట్టకేలకు మఱలి చూచి" వ.చ. 2-77

యని పూర్తిగా ప్రసంగాంతరమైనను పెద్దన ఉపమను గ్రహించి ప్రయోగించి నాడు.

4) వరూథిని "....యేడ్చెఁ గలస్వనంబుతో, మీటిన విచ్చుగుబ్బచను మిట్టల నశ్రులు చిందువందగన్" (మ చ. 2-70) రామరాజభూషణుడీ "మీటినవిచ్చుగుబ్బచను" లను గ్రహించి దాడిమలతాలలితాంగిని వర్ణించుచు ఫలములు అనెడి స్తనముల పరముగా నిట్లు చెప్పెను.

"చలితలతాంత కాంతియను చందురు కావిచెఱంగుదాటి స
మ్మిళిత వయోవిలాసముల మీటినవిచ్చు ఫల స్తనాగ్రము
ల్వెలువడఁగప్పె తత్క్షణము వేల్లిత దోహద ధూపధూమకుం
తలములు విప్పి దాడిమలతాలలితాంగి నృపాలు చెంగటన్"వ.చ.1-157

5) "సందుసుడిమాయలుగా మగవారికృత్యముల్" (మ.చ. 3-82) అనిపెద్దన మగవారిని నుపాలంభించగా రామరాజభూషణుడాతనికి ప్రత్యుత్తర మిచ్చినట్లుగా "మగవారిన్ నమ్మగవచ్చునే" (వ చ. 4-90) అని మంజు వాణిచేత పలికించెను.

6) మనుచరిత్ర పంచమాశ్వాసమున ఇందీవరాక్షుడు స్వరోచినిగాంచి "గారాపు మీతల్లి కడవాఁడఁగాని నే, గణుతింపఁగడవాఁడ గాఁజుమయ్య" (మ.చ. 5-4) అని నుడువును. రామరాజభూషణుడు, వసుచరిత్రలో మంజు వాణి వసురాజునకు స్వాగతము పల్కుచు నిట్లు చెప్పినట్లుగా గ్రహించినాడు.

"అనయము నీమహావనము నందిన వారముగాని సజ్జనా
వనగుణధుర్య ! యేము కడవారముగాము సుమయ్య" వ.చ. 3-56

7) "తొంగలి ఱెప్పలందొలఁగఁ ద్రోయుచు" (మ.చ 2-32) వరూథిని ప్రవరుని చూడగా, గిరికాదేవిచూపులు "తొఱఁదొలుతన్ విలోలగతిఁదొంగలి ఱెప్పలనాని" (వ.చ. 3-49) వసురాజుపైకి ప్రసరించినవి.

8) సూర్యకిరణములు అను అగ్ని అంటుకొనగా కుముదాలయముల నుండి పుష్పరాగమనెడి ధాన్యమును "మిళిందబృందములు పీపుపిశంగిమ కైతవంబునన్"

(మ.చ. 261) మోసుకొనిపోవుచున్నవని పెద్దన వర్ణించెను. రామరాజభూషణ కవి "తుమ్మెద క్రిమ్మరీడుపయిఁ దోచు పిశంగిమ పద్మినీ నిశాంక" (వ.చ. 3-128) మగా నూహించినాడు. ఇద్దరును తుమ్మెదలు వానికంటుకొనిన పసుపుపచ్చని పుప్పొళ్ళను వర్ణించినారు. పెద్దన ధాన్యముగా నుత్ప్రేక్షించగా, రామరాజభూషణుడా 'పిశంగిమ'మును తుమ్మెద అను విటుని కంటుకొనిన పద్మిని నిశాంకముగ చెప్పినాడు.

9. "పవమాన ప్లవమాన పంకజరజఃపాళీ పిశంగచ్ఛవీ" (మ.చ.3-74) అనిపెద్దన మత్తేభవృత్తపు ఎత్తుగడలోని "పవమాన ప్లవమాన" అను సమాసము గ్రహించి రామరాజభూషణుడు సీసపద్యమున ఎత్తుగడలో

"పవమాన మానవప్లవమానకైరవ
చ్యవమానరజముమైనంటఁ దివురు..."

వ.చ. 3-118

అని ప్రయోగించినాడు. పెద్దన సమాసములో నదనముగా 'మానవ' అను పదమును చేర్చి ప్రయోగించెను. పెద్దన-గాలివలన ఎగురుచున్న తామర పుప్పొడుల సమూహమును గూర్చి చెప్పగా వసుచరిత్రకారుడు మందమారుతముచేత ఎగురుచున్న కలువల పుప్పొడులను గూర్చి ప్రసంగించినాడు.

10 మనుచరిత్రలో ఇందీవరాక్షుడు తన శాపవృత్తాంతమును చెప్పుచు ఇట్లు ఎత్తుకొనెను-"కలదుల్లోక యశః పురంధ్రి జగతిన్ గంధర్వ వంశంబు నన్" (మ.చ, 5-7). వసుచరిత్రలో మంజువాణి కపటయతితో గిరికా జన్మ వృత్తాంతమును చెప్పుచు ఇట్లు ఎత్తుకొనెను-

"కలఁడుల్లోక మహామహోగ్ర హుత భుగ్జ్వాలావళీ నిర్జల
స్థల దంభోనిధి లక్ష్య హైమవత పక్షక్షోద దక్షోరు ది
గ్వల భీ మర్బర భేరికా భయద భాంకారైక సంప్రీణి తా
చల వైరి స్తుత కీర్తిసాంద్రుడు వసుక్ష్మాపాల చంద్రుండిలన్"

వ.చ. 2- 02

ఎత్తుగడ పెద్దనదే అయినను రామరాజభూషణుడు పద్యమునంతటి నొకే సమాసముగా రచించి తన ప్రౌఢశబ్ద రచనా నైపుణిని ప్రదర్శించెను.

11. "ఓ చతురాస్య వంశకలశోదధి పూర్ణశశాంక" (మ.చ.1-70) అని సిద్ధుడు ప్రవరుని సంబోధించెను. ఈ సంబోధనను దృష్టిలో నిడుకొని రామరాజభూషణుడు "ఓ వలమాన మీన మిథునోపమలోల విలోచనాంచ కాంతా!" (వ.చ.2-92)యని నర్మసచివునిచే మంజువాణిని సంబోధింపజేసెను. శ్రీనాథుని "ఓ మిహికాంశువంశకలశోదధి కౌస్తుభరత్న!" (శృం. నై 3-33) యను నలుని గూర్చిన సంబోధనననుసరించి పెద్దన సిద్ధునిచే ప్రవరుని సంబోధింపజేయగా, దాని ననుకరించుచు,దాని కన్నను పెద్ద సమాసమును రామరాజభూషణుడు ప్రయోగించినాడు.

12. స్వరోచి మనోరమల వివాహవేళ "అప్పుడు తూర్యనాదము లొర్మి ఉయ నమ్మిథునమ్ము విలోకన స్పృహం దెప్పలఁదేల ..." (మ.చ 5-80) అని మంగళవాద్యములు మ్రోగుచుండగా దంపతులు పరస్పర దర్శనమునకై "ఉవ్విళ్ళూరుచుండ" ననుటకు 'తెప్పలదేలు'నను జాతీయమును పెద్దన ప్రయోగించినాడు. ఆ జాతీయమునే గ్రహించి రామరాజభూషణుడు-

"వెలవెలఁ బాఱి శుక్తిమతి వె-డియుఁ గొండలఁజేనిఁ బల్కె న
గ్గలమగు పంచసాయక వికారమునన్ నిజ గౌరవోన్నతుల్
దలపవుగాని మాదృశ జడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరి కోటిలోఁ గడు లఘుత్వముగాదె తలంచిచూడుమా"

వ చ. 2-135

అని కోలాహలుని శుక్తిమతి హెచ్చరించినట్లుగా ప్రయోగించినాడు.ఇట "తెప్పలఁ దేలు" అనగా నావంటి జడులచేత ఆనందమును పొందిన మీ అభిజాత్యమునకు లఘుత్వము కలుగుననియు, నా నీటి యలలపై పర్వతమైన నిన్ను మునుగకుండ తేల్చిన నీకు లఘుత్వము కలుగును కదా అనియు రెండు అర్థములు. ఇది రామరాజభూషణుని పదార్థప్రయోగ నైపుణిని చాటుచున్నది.

13. వరూధిని విరహములో- "ఇఁక నీ కౌఁగిలినోములు నోఁచినట్టి నే నెక్కడ వాని కౌఁగిలది యెక్కడ" (మ.చ. 3-5) యని దుఃఖించును. గిరికయు వసురాజునకు పంపు సందేశములో "జగతిఁ గౌఁగిలినోము నోచిన జలజముఖులఁ గూరిమి గణించి యతఁడేల గారవించు....'' (వ.చ. 4-111) నని తనను గూర్చి చెప్పుకొనును.

# సారాంశము

పెద్దన మనుచరిత్రలోని కొన్ని వర్ణనాక్రమములను, సన్నివేశములను, సమాసములను, పదములను, భావనులను రామరాజభూషణుడు వసుచరిత్రలో గ్రహించినను అది కేవలానుకరణమో, అనుసరణమో కాదు. అట్లు గ్రహించిన వానిని రామరాజభూషణుడు తన అప్రతిమానమైన ప్రతిభాశక్తిచే మరియు పాండిత్యశక్తిచే నలంకరించి నవ్యమును, భవ్యమునుగా తీర్చిదిద్ది స్వకీయములు కావించుకొని స్వీయకావ్యము నందు వానికి చిరస్థాయి రూపమును కల్పించినాడు.

"సఏవ పద విన్యాసః తాఏవార్థ విభూతయః
తథాపి నవ్యమ్ భవతి కావ్యమ్ గ్రథన కౌశలాత్"

అని లాక్షణికు లన్నట్లుగా రామరాజభూషణుడు పెద్దనననుసరించినను తనగ్రథన కౌశలము ద్వారా నవ్యతను సంపాదించి తరువాతికవులకు పెద్దన వలెనె తానును ఆదర్శుడయ్యెను.

పుర, ఋతు, జలక్రీడ, వనవిహార, వివాహవర్ణనలను రామరాజభూషణుడు పెద్దన కన్నను విస్తరముగా చేసినాడు. ముఖ్యముగా రామరాజభూషణుని పురవర్ణన సాంగోపాంగము. దౌత్యము, కన్యాంగసౌందర్య కథనము, నాయక, వనవిహార వర్ణనల నదనముగా వసుచరిత్రకారుడు ప్రవేశపెట్టెను. పెద్దనలోని వేట, యుద్ధ వర్ణనలు వసుచరితలో లేవు. కావ్యవర్ణ్యవస్తువులలో నాలంకారికులు చెప్పిన సముద్ర, ద్యూత, మున్యాశ్రమ వర్ణనలను ఇరువురు కవులును సందర్భము లేకపోవుటచే కాబోలు విడిచిపుచ్చిరి. ఆలంకారికులు కొందరు దౌత్యమునకు మారుగా ద్యూతమును చెప్పిరి. అట్టి ద్యూతవర్ణనయు మను, వసు చరిత్రలలో లేదు. సూర్యాస్తమయ, సంధ్య, రాత్రి, చంద్రోదయ, చంద్రిక, సూర్యోదయ, పుష్పాపచయ, విరహ, మన్మథోపాలంభనము మొదలైన వర్ణనలను రామరాజభూషణుడు పెద్దన వలెనె క్రమముగా రచించెను. చక్షుః ప్రీతిని పెద్దనకన్న రామరాజభూషణుడు విస్తారముగా వర్ణించినాడు. పెద్దన ననుసరించి రామరాజభూషణుడు ప్రబంధవర్ణ్యములలో లేని కోనవర్ణనను చేసెను.

రామరాజభూషణుని పుర శైల, ఋతువర్ణనలు పెద్దన వర్ణనల కన్న పాండితీ స్ఫోరకములు, ప్రతిభావంతములు. కొన్ని సందర్భములందు రామరాజభూషణుడు సీసపద్యముల నెక్కుడుగా రచించి విషయవిస్తరణను కావించెను. కొన్ని చోట్ల విషయవిస్తరణమున, చమత్కారమున, పాండిత్యవైభవమున రామరాజభూషణుడు పెద్దనను మించినాడు. కొన్నిచోట్ల పెద్దన సహజవర్ణనావైభవమున కీడుగా నిల్చినాడు. మరికొన్నిచోట్ల పెద్దన ప్రసన్న మాధుర్యముల ముందు నిలువలేకపోయినాడు.

పెద్దన "పూఁత మెఱుంగులుం బసరు పూఁప బెడంగులు సూపునట్టి...." యను ఉత్పలమాలికకు ప్రతిగా రామరాజభూషణుడు– "లొట్ట యిదేటి మాట పెనులోభులతో మొగమాటయేలఁ..." యను ఉత్పలమాలికను చెప్పినవాడే రామరాజభూషణునకు పెద్దనతో గల కవితాస్పర్ధ స్పష్టమైనది పెద్దన ఉత్పలమాలికననుసరించి రామరాజభూషణుడును ఉత్పలమాలికనే చెప్పుట గమనార్హము. అందుచేతనే రామరాజభూషణుడు మనుచరిత్రలో వలెనే సన్నివేశములు,వర్ణనలు మున్నగునవి కల్పించుట కవకాశమున్న వసురాజుచరిత్రను గ్రహించినాడు. ప్రవరవరూధినీ సంవాదఘట్టమునకు దీటుగా శుక్తిమతీకోలాహల సంవాద ఘట్టమును పెంచి వసుచరిత్రకారుడు రచించెను. మనుచరిత్రలో లేని శ్లేషమూలక వ్యంగ్యములను, అనుప్రాసాది శబ్దాలంకారములను, సంగీతగుణమును కల్పించి విశిష్టనాటక ధర్మములను కావ్యమున ప్రదర్శించి, విభూషించి మనుచరిత్ర కన్న వసుచరిత్రను గుణాధిక్యము కలదిగా రచించెననుట స్పష్టము ఈ గుణాధిక్యమును సాధించిచూపుటకై కవి మనుచరిత్రనే చాలచోటుల అనుకరించెననుటయు స్పష్టము.

ఈ అనుకరణము కేవలానుకరణము కాదు. కేవలానుకరణ మసమర్థులు, అప్రతిభావంతులు చేయుపని. రామరాజభూషణుడు వసుచరిత్ర పీఠికలో "పరార్థ వంచనంచే దీపించి..." (1–11) అని కవితాచోరులను నిందించినాడు. అట్టివాడు కవితాచౌర్యమునకు గాని కేవలానుకరణమునకు గాని యెట్లు పూనుకొనును? రామరాజభూషణుడు పెద్దన ననుకరించినపుడే అతనిని మించుటకు చేసిన ప్రయత్నము స్పష్టముగా గోచరించును. స్వీయప్రతిభను చూపించుటకై పెద్దనతోడి కవితాస్పర్ధతో చేసిన అనుకరణమే గాని యది వైరమూలకమైనది కాదు. కావున నిది గుణమే యగుచున్నది గాని వేరుకాదు.

అళియరామరాజు తమ ప్రాపున గల రామరాజభూషణునిచే కృష్ణదేవరాయల ఆస్థాని యగు పెద్దన కావ్యవైభవమును మించు వైభవముగల ఈ కావ్యరచనకు ప్రోత్సహించి యుండును. అళియరామరాయలు తన మామగారి కాలమునాటి రాజ్యవైభవమునేగాక కవితావైభవమును పునః ప్రతిష్ఠించవలయునను ప్రయత్న ఫలితముగా వసుచరిత్రసృష్టి జరిగియుండును. ఇట్టి ప్రయత్నమున క్షుద్ర వైరబీజములు లేవనుట తెల్లము.

'సోయం భణితి వైచిత్ర్యాత్సమస్తో వస్తు విస్తరః
నటవద్వర్ణికా యోగాదన్య థాత్వమి వార్చతి' కా.మీ. పుట 180

ఒక నటుడు ఒకే వ్యక్తియై యుండి భిన్నభిన్న భూమికలను గ్రహించి నానావిధములుగా క్షణక్షణము నూతనముగా నెట్లు కనిపించునో అదేవిధముగా ఒకే విధమగు కావ్యార్థము ఉక్తియొక్క వైచిత్రిచే వివిధరూపములను ధరించి సహృదయుల నాకర్షించుచుండును.

"కవిత్వస్య బీజం కవిత్వబీజమ్
జన్మాంతరగత సంస్కార విశేషః కశ్చిత్
యస్మాద్వినా కావ్యం న నిష్పద్యతే
నిష్పన్నం వా హాస్యాయతనం స్యాత్" కా.సూ.వృ. 1-3-16

ప్రతిభ లేనిదే కావ్యసృష్టి జరుగదు. ఒకవేళ జరిగినను ప్రతిభారహిత మైన కావ్యరచన హాస్యము పాలగునని వామను డనెను. అట్లే ప్రతిభారహిత మైన కేవలానుకరణ నీరసమై నవ్వులపాలగును. పెద్దన ననుకరించిన రామరాజ భూషణుడు కేవలానుకరణ మాత్రము చేయక తన ప్రతిభచే మించ ప్రయత్నించి సాహిత్యమున ప్రత్యేకస్థానము నలంకరించి నట్టివాడు. కేవలానుకరణ కావించిన యెడల ఆతని పేరును మనము వినియుండెడివారమే కాదు.

రాజశేఖరుడు కావ్యార్థహరణమును రెండు విధములుగా గుర్తించెను- 1. ప్రతిబింబ కల్పము 2. ఆలేఖ్య ప్రఖ్యము.

"అర్థస్స ఏవ సర్వోవాక్యాంతర విరచనాపరం యత్ర
తద పరమార్థ విభేదం కావ్యం ప్రతిబింబ కల్పం స్యాత్"
కా. మీ. పుట 611

ప్రతిబింబకల్ప మన ప్రాచీనకావ్యార్థములనే భేదములేకుండ కవి తన కావ్యమున చెప్పుట. దీనిలో కేవలము వాక్యాంతర రచనయే కనిపించును.

"కియతాపి యత్ర సంస్కార కర్మణా వస్తుభిన్న వద్ భాతి
తత్కథిత మర్థ చతురైరాలేఖ్య ప్రఖ్యమితి కావ్యమ్" కా.మీ పుట162

అన్య కవి వర్ణితమైన అర్థమును నూత్నమార్గమున అలంకరించి చెప్పుటయే ఆలేఖ్యప్రఖ్యము. దీనివలన అన్యకవి వర్ణిత విషయసంస్కారము జరిగి మౌలికకావ్యము వలెనె శోభావంతమై భాసించుచు, ప్రత్యేకాస్తిత్వమును సంపాదించుకొనును.

మాఘుడు శిశుపాలవధ కావ్యమున భారవి కిరాతార్జునీయకావ్యానుకరణను చేసెనని చెప్పబడుచున్నది. ఈ అనుకరణ చౌర్యము గాని నకలు గాని కాదు. అది ఆలేఖ్య ప్రఖ్య మార్గము. సంస్కృతసాహిత్యమున భారవి కెంత గౌరవము కలదో మాఘున కంతయే గౌరవము కలదు-

నైతచ్చిత్ర మహం మన్యే మాఘమాసాద్య యన్మహుః
ప్రౌఢతాతి ప్రసిద్ధాపి భారవే రవసీదతి"

హరిహరుని సుభాషితావళి 34శ్లో.

మాఘమాస ప్రవేశమున సూర్యుని తేజస్సు ఎట్లు సన్నగిల్లునో అట్లే మాఘుని కవిత్వము ముందు భారవి కవిత్వప్రౌఢిమ సన్నగిల్లెననుటచే భారవి కవిత్వము కన్న మాఘుని కవిత్వ ప్రౌఢిమ పండితలోక మాన్యత నందుకొనెనని చెప్పవచ్చును. మాఘుడు వివిధశాస్త్ర పాండిత్యము కలవాడు. తన పాండితీ మహత్త్వముచే తాను అనుకరించిన భారవి కవితకు మెరుగులు దిద్దినాడు. అదే విధముగ రామరాజభూషణుడు వివిధశాస్త్ర పాండిత్యము కలవాడు. శ్లేష కవితా దక్షుడు. శబ్దాలంకార ప్రయోగ నిపుణుడు. పెద్దన పద్యములను, భావములను, పదములను, సన్నివేశములను గ్రహించి మెరుగులు దిద్దినాడు. ఉక్తి వైచిత్రిని ప్రకటించినాడు. రచనాప్రౌఢిమ, చమత్కారములచేత నగిషీలు చెక్కినాడు. ధ్వని విశేషము, అలంకార వైచిత్రి వీనిచే పెద్దనను మించినాడనవలయును. ఈ విషయమును కవి "సతి సాహిత్య మీశ వలనన్..."

(6 ఆశ్వా 94) అను ప్రబంధాంత పద్యమున భంగ్యంతరమున చెప్పుకొనుటను పరిశీలించియే యుంటిమి. ఈ విధముగా రామరాజభూషణుడు పెద్దన ననుసరించినది మాఘుడు భారవి ననుసరించిన మార్గము. అదే ఆలేఖ్యప్రఖ్య మార్గము. సంస్కృతమహాకావ్య సాహిత్యాకాశమున మాఘభారవులు సూర్యద్వయము. ఆంధ్రప్రబంధ సాహిత్యాకాశమున పెద్దన,రామరాజభూషణులు సూర్యద్వయము.



# శైలి

శైలి అనంతమార్గములుగా నడచును. మనుష్యులకు ముఖాద్యవయవములు భిన్న భిన్నములుగా నుండి వారి స్వరూపములను వేరుపరచువిధముగా శైలి ఒక కవిని మరొక కవి నుండి పృథక్కరించును "కవి స్వభావ భేద నిబంధనత్వాదనంత భేద భిన్నత్వ మనివార్యమ్"[1] – కవి స్వభావభేదమున బట్టి కావ్యనిబంధనమందు అనంతభేదము లుండునని కుంతకుని యభిప్రాయము. అట్లే దండి, శైలులు అనంతమైనవని పేర్కొనుచు లోకములో ఇక్షురస, క్షీర, గుడాదుల మాధుర్యము నందు భేదమున్నట్లే కవుల శైలులందును భేదములు కలవనియు, వాని భేదములను తెలియజెప్పుటకు సరస్వతికి కూడ శక్యము కాదనియు వచించెను.[2] స్వకీయమగు ఒక ప్రత్యేకశైలి లేనివాడు కవియే కానేరడు. శైలి కవియొక్క వ్యక్తిత్వమును ప్రతిబింబింపజేయు గీటురాయి వంటిది.

భారతీయ లాక్షణికులు రీతులు, గుణములు, వృత్తులను పేర్లతో కవిత్వము యొక్క పదసంఘటన, అర్థసంఘటన, రససంఘటనలను గూర్చి చర్చించిరి. "విశిష్ట

---

1. వక్రోక్తి జీవితమ్. పుట 102

2. ఇతి మార్గద్వయం భిన్నం తత్స్వరూప నిరూపణాత్
   తద్భేదాస్తు న శక్యంతే వక్తుం ప్రతికవి స్థితాః
   ఇక్షు క్షీర గుడాదీనాం మాధుర్యస్యాంతరమ్ మహత్
   తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే.

   కావ్యాద. 1–101, 102

ప రచనారీతిః" అని వామనుడు "వచన విన్యాసక్రమోరీతిః" అని రాజశేఖరుడు రీతిని నిర్వచించిరి అనగా కవులు ప్రయోగించు పదముల కూర్పు, వాగ్విన్యాసములు రీతులని లాక్షణికుల మతము. పదరచనలో విశిష్టత గుణముల వలన సంభవించును కావున రీతులు గుణాశ్రయములైనవి మరియు రసోపకారకములైనవి. "రసభావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతులిమ్ముగ" కూర్చవలయునని పింగళి సూరన మాట. కావున విశేష పదసంఘటనలతో కూడి రసాభివ్యంజనమును గావించునట్టివి రీతులు. దండి, కుంతకుడు రీతిని మార్గమనియు పేర్కొనిరి. అట్టి రీతి లేక మార్గమునకు మారుగా స్వభావము, ప్రకృతి, చరిత్ర అను అర్థములు గల 'శీల' పదభవమైన 'శైలి' యను పదము విస్తృతముగ ఈనాడు వాడబడుచున్నది. ఇంగ్లీషులో గల '**Style**' పదమునకు సమానార్థకముగ'శైలి'యే వాడబడుచున్నది కావున style లేక శైలియనిన ప్రాచీనాలంకారికులు చెప్పిన రీతులు లేక మార్గములను గూర్చియే చెప్పుకొనవలయును.

భరతుడు మొదట పది గుణములను పేర్కొనెను తరువాత భామహుడు మూడు గుణములనే (ఓజః ప్రసాదమాధుర్యములను) గ్రహించెను. వామనుడు భరతు ననుసరించి పదిగుణములను పేర్కొనెను. ఆ తరువాత భోజుడు, విద్యానాథుడు ఇరువదినాలుగు గుణములను గూర్చి ప్రస గించినను భరతుని దశవిధ గుణములే సర్వసమ్మతములైనవి తెలుగున కావ్యాలంకార సంగ్రహకర్తయు పదిగుణములనే పేర్కొనెను. మనుష్యులకు అలంకారముల కన్న గుణములెట్లు శోభాహేతుకములో అట్లే అలంకారముల కన్న గుణములు కావ్యమునకు మిక్కిలి శోభాదాయకములు. "రీతిరాత్మా కావ్యస్య" అని రీతులను కావ్యాత్మగా గ్రహించిన వామనుడు గుణములు కావ్యమునకు శోభను కూర్చుననియు, అలంకారములు తదతిశయమును కలిగించుననియు చెప్పుచు, అందు గుణములు నిత్యములనియు అలంకారము లనిత్యములనియు అభిప్రాయపడినాడు-

కావ్య శోభయాః కర్తారో ధర్మాగుణాః
తదతిశయ హేత వస్త్వలంకారాః
పూర్వేనిత్యాః :- కా.సూ.వృ. 3-1-1-3

రీతుల కాధారభూతములగు గుణప్రయోగములను గూర్చి మొదట పరిశీలించి పెద్దన, రామరాజభూషణుల కవిత యే రీతి నాశ్రయించినదో చూతము.

## గుణములు

ప్రసాదము— ప్రసిద్ధములై సులువుగా నర్థమును స్ఫురింపజేయు పదములు కలిగియుండుట ప్రసాదమని ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము.

"ప్రసాద వత్ప్రసిద్ధార్థమ్" అని దండి.

"ప్రసిద్ధ పదంబుల
నలఘూక్తి ప్రసాదమయ్యె" అని కావ్యాలంకార సంగ్రహకర్త మనుచరిత్రలో ప్రసాదగుణము దాదాపుగా పద్యము లన్నింటిలోను కనిపించుచున్నది.

వసుచరిత్రలో ముఖ్యముగా వర్ణనా సందర్భము లందు (కథా భాగములు గాక) ప్రసాదగుణము లోపించినదని విమర్శకుల అభిప్రాయము.

మాధుర్యము – "పృథక్పదత్వమ్ మాధుర్యమ్" అని వామనుని యభిప్రాయము "చక్కని విడివిడి పదములతో విలసిల్లు వాక్య"మని ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.

"సరసములగు వాక్యంబులు
వరుసను వేర్వేఱ మించు వగ మాధుర్యంబు" అని కావ్యాలంకార సంగ్రహకర్త.

"కృతి రచింపుము మాకు శిరీష కుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య"

అను కృతిభర్త మాటలను బట్టి పెద్దన కవితలో శిరీషకుసుమము వంటి సుకుమారత్వము, అమృతముతో సమానమైన మాధుర్యము కలదనుట స్పష్టము. మాధుర్యగుణము శాంత, శృంగార, కరుణరసముల ఆస్వాదనమున మిక్కిలితోడ్పడును. శాంత, శృంగార ప్రధానమగు మనుచరిత్రలో నీ గుణము కోకొల్లలు. "ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ...."

"అక్కట వాడు నాతగుణ మారడిచేసి దయావిహీనుడై ...."

"ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కి..."
"చిలుకలు ముద్దుఁబల్కులకుఁ జేరఁగ రా నెఱివేణి కాంతికిన్...."
మ.చ. 2-68, 3-4, 64, 6-24

అను అనేక పద్యములందీ మాధుర్యగుణము ప్రస్ఫుట మగుచున్నది.

వసుచరిత్రలో విడివిడి పదముల కూర్పు, మనుచరిత్రతో పోల్చిన చాల తక్కువ. వసుచరిత్రలో వెతికిన మాధుర్యగుణమునకు కొన్నిఉదాహరణములు దొరకకపోవు-

"శైలకులేంద్రు డిట్లు మదశాలి శుకాలి పికాలి శారికా..."
"సొలసి తటిల్లతాంగి జిగిసూపు వెలుంగులచేఁ గల ధ్వను..."
"డించఁ బ్రొద్దులేకెద ఘటించిన రత్నవిపంచితో..."
వ.చ. 2-117, 3-67, 6-12

రామరాజభూషణుడు కరుణరస ఘట్టమున నీ మాధుర్యగుణమును పాటిం చలేదు ఉదాహరణకు శుక్తిమతి పొంగి భూమండలము నంతను ముంచినది. మనుష్యులు, పశుపక్ష్యాదులు నిరాశ్రయులైనారు. ఇది కరుణరసాశ్రితఘట్టము. క్రింది పద్యమున మాధుర్యగుణాభావమును చూడుడు-

కలగుండై నెలవేది యిట్లు వరటాకారండవాది ద్విజా
వళి ఘోషించుట కన్న మున్న గిరిరాడ్వ్యావిద్ధ కల్లోలినీ
సలిలోప ప్లుత భూజనుల్నిజ నివాస స్థేమ సంశూన్యులై
కలఁకన్ ఘూర్ణిలు ఘోషమొక్క మొగి దిక్చక్రంబులం గ్రమ్మినన్
వ.చ. 2-142

ఈ పద్యము నందలి డకార, ఘకారముల ఆవృత్తిచేత, "గిరిరాడ్వ్యా విద్ధ కల్లోలిని, సలిలోప ప్లుత భూజను"లను సమాసముల చేతను ప్రసాద మాధుర్య గుణములు లుప్తమైనవనవలయును. కరుణరసాత్మకమైన మనుచరిత్రలోని పద్యమిది-

ఎంత తపంబుసేసి జనియించిన వారోకొ మర్త్యభామినుల్
కాంతుదవజ్ఞ చేసినను కాయము వాయుదురే నమర్త్యనై

చింతల వంతలం జివికి సిగ్గఱితిన్ మృతిలేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపిక యయ్యె నక్కటా
మ.చ. 3-8

ఇందలి తకారావృత్తి, అసమస్త పదములు, అర్థకాఠిన్యము లేని రచనచేత మాధుర్యగుణము ప్రస్ఫుట మగుచున్నది.

సుకుమారము :– "అపౌరుషమ్ సౌకుమార్య"మ్మని వామనుడు. "కోమలములును సానుస్వరములునగు అక్షరములు గల పదముల కూర్పు" సౌకుమార్యమని ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.

"అరయగ బొట్లు పిఱుందల

నరుదగు నది సౌకుమార్యమగు"నని కావ్యాలంకారసంగ్రహకర్త. వామనుడు "అపౌరుష్య"మని చెప్పుటవలన సానుస్వారములేగాక పరుషములు కాని పదముల కూర్పు సర్వమును సౌకుమార్యమగును. శిరీషకుసుమ పేశలమైన రచనతో కూడిన మనుచరిత్రలో నీ సుకుమారగుణము విరివిగా కలదు.

"ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం..."
"కమ్మని కుందనంబు కసుగందని మే నెలదేఁటి దాఁటులన్..."
"అలకని జీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁపఁ గొప్పు చెం..."
"తలకొని దాని తమ్ములపుఁ దావియుఁ గౌనుమేను...."
మ చ. 2-62, 3-6, 6-31,33

మొదలగు అనేక పద్యముల నుదాహరించవచ్చును అనుప్రాస, యమకాలంకారములు విరివిగాగల వసుచరిత్రలో అటనట ఈ సుకుమారగుణము గోచరించును–

"ఏమంద యేమి సేయుద...."
"నాదంబొక్కటి పిక్కటిల్లె దిశలన్ నవ్యామృతావ్యాహతా..."
"కాంతాకలాప రూపజిత కంతుజయంతున కీ వసుంధరా..."
వ.చ. 3-181, 2-15, 6-68

అను మొదలగు పద్యములలో సౌకుమార్యము కలదు. "భట్టుమూర్తి యొక్క శైలి పొందిన యొక అనిర్వచనీయమైన మాధుర్యము, సౌకుమార్యము, శబ్దశ్లిష్టత కలిసిన యొక గుణము మరియొకచోట లే"దని శ్రీ విశ్వనాథవారు అభిప్రాయ పడినారు.[1] కాని వసుచరిత్ర మనుచరిత్రకువలె సౌకుమార్య, మాధుర్య బహుళము మాత్రము కాదనవలయును.

<u>అర్థవ్యక్తి</u>– ''అర్థవ్యక్తి హేతుత్వ మర్థవ్యక్తిః'' అని వామనుడు. "నిరాకాంక్షమై సంపూర్ణార్థము నిచ్చు వాక్య"మని ఆంధ్రప్రతాపరుద్రయశో భూషణము.

''ఇల నర్థము వ్యక్తంబై
నలువొందిన నర్థదీపనంబు...." అని కావ్యాలంకారసంగ్రహకర్త.

''అర్థవ్యక్తిః పదానామ్ హి ఝటిత్యర్థ సమర్పణమ్"–అనగా ఝట్టున అర్థస్ఫురణము కలుగుట అర్థవ్యక్తి యని విశ్వనాథుని మతము. ప్రసాద గుణము మనుచరిత్రాద్యంతము గోచరించును. నిజమునకు "అర్థవ్యక్తేః ప్రసాదాఖ్య గుణేనైవ పరిగ్రహః''– అర్థవ్యక్తి ప్రసాద గుణాంతర్గతమగుటచే దీనిని వేరుగా చెప్పనవసరము లేదని సాహిత్యదర్పణకారు డభిప్రాయపడినాడు. "చిత్తమ్ వ్యాప్నోతి యఃక్షిప్రమ్ శుష్కేంధన మివానలః'' అనగా శుష్కేంధనమందు అగ్ని వ్యాపించినట్లుగా ప్రసాదగుణము సహృదయ హృదయము లందు త్వరగా వ్యాపించి యర్థస్ఫురణమును, తద్ద్వారా రసవ్యక్తిని కలిగించునని సాహిత్యదర్పణకారుని మతము. అట్టిదే అర్థవ్యక్తి. ప్రసిద్ధ పదముల కూర్పు, భావాక్లిష్టత అర్థవ్యక్తికి తోడ్పడును. భావక్లిష్టత్వము వసుచరిత్రలో కల దనుట సర్వసువిదితము. రామరాజభూషణుని సంగీత రత్నశాస్త్రాదుల పాండిత్యప్రకటనము మరియు ఆతని శ్లేషాద్యలంకారముల సంసృష్టియు భావ క్లిష్టతకు దోహదములయ్యెను.

---

1. కావ్య పరిమళము పుట 108

"సుత్రామ ప్రియమిత్ర పాణియుగళిన్ శోభిల్లెఁ జిత్ర ప్రభా"
"అత్రాస వృత్తిఁ జెన్నలరి నూతన రాగ
మహిమఁ గుల్కెడు కల్కి మానికములు"

వ.చ. 5-92, 6-72

అను కొన్ని పద్యములలోని చమత్కృతిని అర్థముచేసుకొనవలయునన్న రత్న శాస్త్ర పరిచితి యవసనము. అట్లే-

కమ్మని వింటిజోదు నెఱకైదువులైన మిటారి తమ్మి లీ
తమ్ముల నెట్లు వోలు సతతమ్ము లతాంగుల మాన యుక్త చి
త్తమ్ములఁ గూడఁ బాఱునవి తమ్ముల సన్మహితా మనోంబుజా
తమ్ములు గూడి మోహ సహితమ్ములుగా నివి మించు మించులన్

వ.చ. 5-100

మరియు-

"నా కుల దైవతంబు లలనాకుల భూషణ మీ లతాంగి మే
నాకుల భూధరేంద్రుల యనాకుల నిర్మల భాగ్యరాశి..."

వ.చ. 5-12

అను అనేకపద్యములు వెంటనే అర్థ స్ఫురణను గావించునట్టి పద్యములు కావు. ఇట్టి పద్యము లెన్నియో వసుచరిత్రలో కలవు.

కావ్యాలంకార సంగ్రహమున శిరోమణి సన్నిధానమువారు- "కలదుల్లోక............వసుక్ష్మాపాల చంద్రుడిలన్...." (వ చ. 2-102)అను వసుచరిత్రలోని పద్యమును అర్థాస్ఫుటత్వమున కుదాహరణగా నొసంగినారు. అదే ఎత్తుగడతో గల

"కలదుల్లోక యశఃపురంధ్రి జగతిన్ గంధర్వ వంశంబునన్..."

మ.చ. 5-7

అను మనుచరిత్రపద్యము అర్థవ్యక్తి గుణముతో కూడినట్టిది. అదేవిధముగ

"తత నితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగు వలన" మ.చ. 2-27

అను మనుచరిత్రలోని పద్యము అర్థమైనంత సులువుగా, వరూథిని వలె వీణ వాయించుచున్న గిరికాదేవి వర్ణనగల-

"వలఁదగ గుబ్బలు ప్రసేవక వృత్తిఁ దగు గుబ్బ
కాయల కపరంజి చాయ లొసఁగ...." వ.చ. 2-30

అను పద్యము అర్థము కాదు. ఇందలి సంపూర్ణ సౌందర్యము నవగాహన కావించుకొనవలయుననిన సంగీతశాస్త్ర పరిచితి కావలయును.

"వాలారుం గొనగోళ్ళ సి వలసతన్ వాయించుచో...." మ.చ.3-57

అను పద్యమున పెద్దన రాగపరిచితి పాఠకులకు బోధపడినంత సులభముగా—

"అరిగాఁ బంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళవై ...."
వ.చ. -130

అను పద్యమున గల రామరాజభూషణుని రాగపరిచితి పాఠకులకు బోధ పడుటలేదు. చదివిన వెంటనే సంపూర్ణ అర్థస్ఫురణ కలుగుట లేదు.

"ఓరఁగయి ప్రాలిన నమేరువు పుప్పొడుల
సారువుల వెంట సహకార మిళదేలా...." వ.చ. 2-22

అను విదూషకుడు కోనలోనికి ప్రవేశించు వర్ణన గల పద్యము—

నికట మహీధరాగ్ర తట నిర్గత నిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దల్రిందుగా మలఁకలై దిగు కాలువ వెంటఁబూచు...."
మ.చ. 2-21

అను ప్రవరుడు లోయలోనికి దిగు వర్ణనగల పద్యము వలె అర్థవ్యక్తి, ప్రసాద గుణములచేత కూడిలేదు.

రామరాజభూషణుని పద్యములు క్లిష్టములై ఆతని వైదగ్ధ్యమును చాటు చున్నవి కాని అర్థవ్యక్తి, ప్రసాదగుణములు కలిగి శుష్కేంధనమందు అగ్ని వ్యాపించినట్లుగా నర్థము మనుచరిత్రలో వలె సరసహృదయవ్యాప్తిని తొందరగా పొందుట లేదు.

<u>ఔదార్యము</u>— "వికటాక్షరముల బంధము ఔదార్య"మని ఆంధ్రప్రతాప రుద్ర యశోభూషణము "వికటత్వ ముదారతా" అని వామనుడు "ఉదారతా వికటత్వ లక్షణా. వికటత్వం పదానాం నృత్యత్ప్రాయత్వమ్" అని విశ్వనా థుడు.

"కతిపయ సంయుక్తాక్షర

వితతం ఔదార్యమయ్యే"అని కావ్యాలంకార సంగ్రహకర్త. ఏకూర్పు నంచు వర్ణములు నర్తించునట్లు వినువారికి గోచరించునో ఆకూర్పు ఔదార్య మని శ్రీ సన్నిధానము వారు ఔదార్యలక్షణమును విశదపరచుచు మనుచరిత్రలోని- "...పిం జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ...."(మ.చ. 2-3, అను పద్యము నుదాహరణముగా నొసంగిరి. ఇందు గిరులు ఆకసమును చుంబించుచున్నవను చుంబన వ్యాపారమున కనుకూలముగా బిందుపూర్వక బకారము, మృదంగధ్వని స్ఫోరకముగ బిందుపూర్వక గకారము, మయూర నటనానురూపముగ బిందుపూర్వక టకారము కలదనియు. ఇట వర్ణములు నర్తించుచున్నటులే గాక ఆయా అర్థములను స్ఫురింపజేయుచున్నవనియు, ఇట్టిదే వికటబంధత్వమనియు వారు వివరించిరి. ఈపద్యమును కొద్దిగా మార్చినను వికటత్వము చెడిపోవును. శబ్ద మర్థమునకు ప్రతిధ్వనిగా నుండవలయునను ఉద్దేశముతో నౌదార్యమును ప్రాచీనాలంకారికులు కావ్యగుణముగా గణించిరనియు వారు తెలిపినారు. ఇట్టి ఔదార్యగుణము వసుచరిత్రలో కొంత కనిపించుచున్నది-

"అక్కట మిక్కుటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో
యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహము
ల్వ్రక్కలిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీ స్రవంతి పే
రక్కున వ్రాలి యాఁగె భువనావళి నుద్భుట వింధ్యవైఖరిన్

వ.చ. 2-146

ఇట ద్విత్వ కకార, లకార, దకారములు, భ వర్ణము కోలాహల పర్వతపు అతి రయమును, ఔద్ధత్యమును ప్రకటించుచు, పాఠకుల మనములందు నింపుచున్నవి. అట్లే-

"వనజముఖు ల్గనుంగొని రవారిత వారి తరంగ రంగ న
ర్తన సలిల భ్రమ భ్రమణ రంగదభంగ రథాంగ ధామమున్..."

వ.చ. 3-153

అను పద్యము నందలి బిందుపూర్వక గకారములు, రకార,మకారావృత్తులు సరో

వరము యొక్క తరంగ నర్తనములను,మంజుల నినాదములను మరియు భ్రమ యొక్క పదావృత్తి సలిల భ్రమణములను స్ఫురింపజేయుచున్నవి.

"నాళీకాకర తీరసార కదళీ నారంగ పూగావళీ..."
"కొలకుల పజ్జ సజ్జకపు గొజ్జఁగి పూఁ బొదరిండ్ల బోరునం
జిలుకు హిమాంబు పూరములు శీతకరోపల పట్టికాతటం..."

"వీనుల విందై యమృతపు
సోనల పొందై యమంద సుమదళ దళినీ...."

వ.చ. 2-29, 12, 14

మొదలగు పద్యములలోను వర్ణములు అర్థస్ఫురణ చేయగలట్టివి. ఔదార్య గుణము మనుచరిత్రలో కన్న వసుచరిత్రలో కొంతవరకు అధికముగా కనబడు చున్నది.

కాంతి- "ఉజ్జ్వలమగు బంధము కలిగియుండు వాక్య"మని ఆంధ్రప్రతాప రుద్ర యశోభూషణము.

"........విమల విచిత్రా
యత వర్ణావృత్తులు గల
యతి మృదు బంధంబు కాంతి........" అని కావ్యాలంకార సంగ్రహ కర్త. అనుప్రాసాద్యలంకారములచే నేర్పడు శ్రుతిపేశలత్వమే కాంతి యను గుణము. దానిని విశ్వనాథుడిట్లు చెప్పినాడు. "గ్రామ్య దుఃశ్రవతా త్యాగా త్కాంతిశ్చ సుకుమారతా" అనగా గ్రామ్యత్వము, దుఃశ్రవత్వమను దోషములు లేనిది కాంతి. అట్లనుటచే శ్రవణసుభగత్వము గల, కర్కశము కాని సుకుమార బంధమే కాంతి యగును. విశ్వనాథుడు కాంతి సుకుమారముల కభేదము చెప్పుటచే కాంతి యను గుణము మృదుబంధయుక్తమైనదని యొప్పుకొని నట్లే ఆ మృదుబంధము వర్ణావృత్తుల ద్వారా కలిగినట్టిదని కావ్యాలంకార సంగ్రహకర్త అభిప్రాయము.

"అల్లసాని వాని అల్లిక జిగిబిగి" యని ప్రసిద్ధి కలదు. జిగి యను శబ్దమునకు కాంతి,స్నిగ్ధత అను అర్థము లుండుటచే నిట జిగి యన కాంతి యను

కవితాగుణముగానే గ్రహించవలెను. వర్ణావృత్తులు, మృదుబంధముల చేత కవితలో కాంతి, స్నిగ్ధతలు ఏర్పడును. మనుచరిత్రలోని-

"ఇందునిభాస్య! వాఁడనఁగ నింద్రుడొ చంద్రుడొ యాయుపేంద్రుడో...

"కాంచి కలక్వణత్కనక కాంచికయై యెదురేగి యప్పుడ...."

"ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బా
ష్పాకుల కోణ శోణ రుచుల గ్రమునం జనఁజూచు చూపు తీ...."

"హిందోళంబునఁ బాడిరి
బృందారక సతులు విరహి బృందార్తిగఁ...."

మ.చ. 3–63, 89, 90, 6–28

అను అనేకపద్యములు శ్రవణసుభగత్వముచే నలరించు చున్నవి

కాంతిగుణ యుతములైన పద్యము లెన్నియో వసుచరిత్రలోను కనిపించుచున్నవి. రామరాజభూషణుని దాదాపు సీసపద్యము లన్నియు ఈ కాంతి గుణయుక్తములని చెప్పవలయును—

"తలిరుఁ బ్రాయము వాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగము వాని...."

"ఒక చాయ ననపాయ పికగేయ సముదాయ
మొక సీమ నానామయూర నినద...."

"ఇమ్ములై మరుహజారమ్ములై పొదలుండ
బూఁజవికలు వేజె పూనవలదు"

వ చ. 3–46, 2–6, 1–141

మొదలగు సీసపద్యములు కాంతి కుదాహరణలు. అనుప్రాస, యమకాద్యలంకారములచే కూడిన వసుచరిత్రలోని కవిత్వమున నీ వర్ణావృత్తులు గల మృదుబంధము ఎక్కువగానే కలదు.

ఓజస్సు– "సమాస భూయిష్ఠమగు రచన" అని ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము.

"విలసిత సమాస భరితో
జ్జ్వల బంధంబోజమయ్యె...." అని కావ్యాలంకార సంగ్రహకర్త.

"గాఢ బంధత్వమోజః" అని వామనుడు. సంయుక్తాక్షరముల ప్రయోగము, రేఫయుక్త వర్గ ప్రథమ ద్వితీయాక్షరముల సంయోగము- (ర్క, ర్ఖ, క్ర ఖ్ర మొ॥వి) వర్గముల తృతీయ చతుర్థ వర్ణముల సంయోగము— (గ్ఘ, జ్ఝ మొ॥వి), వర్గ ప్రథమ వర్ణ సంయోగము- (క్క, చ్చ, ట్ట మొ॥వి) వర్గతృతీయ వర్ణ సంయోగము గ్గ, జ్జ; బ్బ మొ॥వి) విసర్జనీయ, జిహ్వామూలీయ ఉపధ్మానీయ ప్రయోగము, తుదియందు గురువులుండుట, సమాసములు కలిగియుండుట- మొదలగువానిచే గాఢబంధత్వము కలుగునని యాలంకారికుల మతము.[1]

ఓజశ్చిత్తస్య విస్తారరూపం దీప్తిత్వముచ్యతే
వీర బీభత్స రౌద్రేషు క్రమేణాధిక్య మస్యతు సా ద 4-4

అను విశ్వనాథుని యభిప్రాయముతో సమ్మతించి పెద్దన మనుచరిత్రలో వీర బీభత్స రౌద్రరస సందర్భములందు మాత్రము ఓజోగుణమును ప్రదర్శించినాడు:

"గళగర్త క్రోడ నిర్యత్కహ కహ నినదోద్గాఢ హాసంబు భూభృ...."
"దానవుదద్దరా రమణుఁ దాకె నుదగ్ర పదాగ్ర ఘట్టన..."
"అని బాహాస్ఫోట రావాహత పతగ కులంబవ్వనీ శాఖి శాఖా...."
ఆశూలం బవనీశ మౌళి కులిశాహంకార హుంకార కృ
న్నైష్ఠికత్యంబలి నుత్యమై నెగడు బాణశ్రేణిఁ జెండాడి...."
"పక్క పక్కన నంఘ్రి పాశముల్ వెసఁద్రెంచి
దేగ తండముల మింటికిని విడిచి...."
మ.చ. 4-95, 96, 99, 101, 103

మొదలగు స్వరోచిరాక్షసుల యుద్ధవర్ణనా సందర్భమున నిట్టి ఓజోగుణయుక్త బంధము కనిపించును.

"ఓసి దురాత్మురాల! గృహమొల్లక సర్వసుఖంబులున్...."
"అనినం గన్నులు జేవుఱింప నధరంబల్లాడ వేల్లత్పునః...."
"నీ వైశిష్ట్యము తిట్టులన్ మొఱయునే నీకంటె నేఁ దక్కువే..."
మ.చ. 4-82, 5-8, 6-49

---

1. కావ్యాలంకార సంగ్రహము పుట 582

అను రౌద్రరస సందర్భములందును ఈ గాఢబంధత్వగుణము కనిపించును.

సమాసభూయిష్ఠమగు, గాఢబంధత్వము గల రచన వసుచరిత్రలో నాద్యంతము కనబడుచున్నది. సమాసభూయిష్ఠత వసుచరిత్రలో మనుచరిత్రలో కన్నను అధికమే.

"నటదీశాన శిరస్తట త్రుటిత రత్నచ్ఛాయఁ గల్లోలినీ .."
"మొక్కల్ వోయిన తెక్కు మొక్కు గమితో మూర్ఛాలసత్వాంబుతో
........"

"పోటన బంతి మీటుగతి భూవరుఁ డంఘ్రి నఖాంచలంబునన్
మీటిన గట్టు బిట్టెగసి మేదిని వ్రాలు......."
"ఆ కోలాహల శైలసంభవ రసవ్యాకృష్ట నాలి ప్రయ
త్నైక ప్రస్థితయై ప్రతిక్షణ సభంగారాళ సంచారయై..."
వ.చ. 4-10, 5-47, 2-156, 6-75

మొదలగు పద్యములందు ఓజోగుణ ప్రసరణము కనిపించును. మరియు-

"మన ఘోషార్భటియున్ సమీరణ మఖాఘూతాహితానాహత...."
నట దీశహాస విస్ఫుటిత వేదోండ రే
ఖలఁ దోఁదు వరణాంబు కణికలనఁగఁ...."
"సరసదరీ ఝరీ వికచ సారస సౌరభసార పూరితాం
బరమగు......... "
"కలికి ముఖేందు కాంతి కరకాంత వయోజలదాంతవేళ...."
"పటుతా పటఖండ మండిత నిజప్రాగంశు ధారా పరి
స్ఫుట సూత్రంబుల......... "
వ.చ. 5-47, 4-15, 2-95, 4- 9

మొదలగు అనేక పద్యములందు నాతిదీర్ఘ, దీర్ఘ, అతిదీర్ఘ సమాస భూయిష్ఠరచన కాననగును. మనుచరిత్రలోని వచనములకన్న వసుచరిత్రలోని వచనములు దీర్ఘసమాసభూయిష్ఠములై ఓజోగుణ భరితములై యున్నవి. పెద్దన రౌద్ర, వీరరస సందర్భములందే ఓజోగుణభరిత కవిత్వమును చెప్పినాడు. వసు

చరిత్రకారుకు తన ప్రబంధము నంతటను ఈ ఓజోగుణమును ప్రదర్శించినాడు. మనుచరిత్రలోని "కలడుఃల్లోక యశఃపురంధ్రి...." అను ప్రసాదగుణముతో కూడిన పద్యపుటెత్తుగడను గ్రహించి రామరాజభూషణుడు

"కలడుల్లోక మహోమహోగ్రహుత భుగ్జాలావళీ సిర్జల
స్థల దంభోనిధి లక్ష్య హైమవత పక్షక్షోద దక్షోరు ది
గ్వలభీ దుర్భర భేరికా భయద భాంకారైక సంప్రీణితా
చల వైరి స్తుతకీర్తిసాంద్రుఁడు వసుక్ష్మాపాల చంద్రుండిలన్

వ చ. 2–102

అని దీర్ఘ సమాయుక్తమై ఓజోగుణసాంద్రత గల పద్యముగా ననుకరించుట ఆతని సమాసభూయిష్ఠ గాఢబంధత్వప్రీతికి చక్కని యుదాహరణ వసు చరిత్రలో కాంతిగుణాన్వితములైన ఓజోగుణభరిత పద్యము లనేకములు కలవు- "విని యాఁతంతు దురంతశైల మథనావిర్భూత సింధూద్ధత..."

"పవమాన మానవ ప్లవమాన కైరవ
చ్యవమాన రజము మైనంటఁ టవురుఁ
గరసారసాగ్రతామరసాలి సాంద్ర సీ
ధు రసా ప్తిఁ గన్నీరుఁ దుడువఁగోరు...."

"హేమలతాసిభాంగికి నధీశనివేశనవ ప్రవేశ దీ
క్షామహనీయ మంగళము సర్వము సాంగముగా ఘటించి...."

"అభిరామ నవపల్లవారామ కుంజ వా
టికలఁ గీరముల నాడించుకొనుచుఁ
బర్మ్మలయోదర ప్రౌఢసారస వీథి
నంచల వేడంబు లరసికొనుచు...."

మందార్ధ ముకుళ కుహళీ
కందళిత మరంద తుందిక మిళింద వధూ
బృందాభినందితంబగు
మందానిల మొలయ విజిత మార్గశ్రమతై

వ.చ. 2-143, 3-118, 6-54, 97, 3-152

పైపద్యములు దీర్ఘ సమాసఘటితములై వర్ణావృత్తిచే కాంతి గుణాన్వితములై యొప్పుచున్నట్టివి.

శ్లేష– "పెక్కు పదము లొండొంటితోఁ గలిసిమెలిసి యొక పదమువలె భాసిల్లుట" శ్లేషయని ఆంధ్రవతాపరుద్రయశోభూషణము.

"ఇల సంధిఁగూడి పదములు

నెలకొని యొకపదము రీతి నిలిచిన శ్లేష .." అని కావా లంకారసంగ్రహ కర్త.

"మసృణత్వం శ్లేషః" అని వామనుడు. "శ్లేషోబహూనామాపి పదానామేక పదవద్భాసనాత్మా" అని సాహిత్యదర్పణకారుడు సంధితో కూడి పదములన్నియు ఏకపదాకారముగా భాసిల్లినచో మరియు ఏకస్థానీయములగు వర్ణములు బహుళముగానుండుట వలన ఏకాకారముగా భాసిల్లినచో శ్లేష యగును. దీనినే వామనుడు మసృణత్వ మనెను. ఈ శ్లేషగుణము మనుచరిత్రలో నరుదుగా కనబడునని శ్రీ వెంపరాల వారి యభిప్రాయము.

సహసా నఖంపచ స్తన దత్త పరిరంభ
మామూల పరిచుంబి తాధరోష్ఠ..."

మ.చ. 3-116

అను ఉదాహరణమును మనుచరిత్రనుండి శ్లేషగుణమున కొసంగిరి.[1] సంధితో కూడి ఏకపదాకారముగా భాసిల్లుట,ఏకస్థానీయములగు వర్ణముల కూర్పు మనుచరిత్రలో ననేక పద్యములందు కలదు. వామనుడు మసృణత్వముతో కూడినది శ్లేషమనినాడు. మసృణత్వమునకు మోనియర్ విలియమ్స్ **soft, tender, smooth,** అను అర్థముల నొసంగినాడు–అనగా మసృణత్వమునకు స్నిగ్ధత్వము, కోమలత్వములని యర్థములు. ఏకస్థానీయములగువర్ణావృత్తులు, శ్రవణ సుభగత్వము, సౌకుమార్యము గల పెద్దన కవిత్వములో శ్లేషగుణమునకు చెప్పబడిన 'మసృణత్వము' అధికముగ కలదనియే చెప్పవలయును.

వసుచరిత్రలో సంధితోకూడి పదములన్నియు ఏకపదాకారముగా భాసిల్లుట ఎక్కువగ కనిపించును. సంధితోకూడిన పదములన్నియు ఏకపదాకార

---

1. మనుచరిత్ర పీఠిక. పుట 108

ముగా భాసిల్లుటకు ఏకస్థానీయములగు వర్ణములు ప్రయోగింపబడవలెను తద్ద్వారా మసృణత్వమేర్పడును. అట్టి మసృణత్వము వసుచరిత్రలో పరిస్ఫుటమై యంతట గోచరించుచున్నది—

"జీవనమెల్ల సత్కవినిషేవిత మాశయమెల్ల నచ్ఛతా...."
"ఆశారోధక మావృతాంబర మనూధాలోక ముచ్చైస్తనో
ద్దేశ ప్రావరణంబునై ..."

అను పద్యములందును మరియు—

"కలదుల్లోక మహోగ్రహుత భుగ్జ్వాలావలీ "

వ.చ. 2-105, 6-81. 2-102

అను పద్యమున ఓజోగుణయుక్తమైన శ్లేషగుణము కలదు.

సమత— "పాదము లన్నింటను వైషమ్యము లేకుండుట" సమత అని ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము

"లలితార్థ భంగిఁబాదం
బులు నాల్గిట నేక సరణిఁ బొదువ సమతయౌ" అని కావ్యాలంకార సంగ్రహకర్త.

"మార్గాభేదస్సమతా" అని వామనుడు. ఏ మార్గమున నుపక్రమించ బడునో ఆ మార్గము పద్యాంతము వరకు నిర్వహించబడుట సమత.

మను, వసుచరిత్రలలోని సీసపద్యములందీ సమతాగుణము చక్కగా ప్రదర్శించబడినది.

సమాధి— "ఒక వస్తువు ధర్మములు వేరొక వస్తువునందారోపించుట" సమాధి యని ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము.

"... అన్యగుణం
బులు మఱి వేఱొక్కటి పై
నలరిఁప సమాధియయ్యె..."నని కావ్యాలంకార సంగ్రహకర్త.

"చలిగాలి బొండు మల్లెల పరాగము రేచి
సబిడంబు సేసె వెన్నెల రసంబు...."
"కోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁగేరె
వారాశి గర్వంబు మేర మీఱెఁ..."

మ చ. 6–29, 3–23

అను మనుచరిత్ర పద్యములలో సమాధిగుణము కలదు. అట్లే వసుచరిత్ర లోని–

"పటు హీరమై లె చాలుఁ బాల సున్నమొఁర్వ
శక్రాశ్మములె చాలు జామపూయ..."
"మును సుమనోరాగమున వసంతము సూపెఁ
గాన సేందిర యశోకంపుఁ గొమ్మ..."

వ.చ. 4–71, 1–129

అను పద్యములలో సమాధి గుణము కలదు. "ఆరోహావరోహక్రమ స్సమాధిః" అని వామనుడు దీర్ఘాదిగుర్వక్షరము లధికముగ నుండుట ఆరోహము, లఘ్వక్షరము లధికముగ నుండుట అవరోహము[1] ఇట్టి ఆరోహావరోహక్రమములతో కూడిన పద్యములు మను, వసుచరిత్రలలో కలవు.

ఇతర గుణములు– పై గుణములేగాక భోజుడు, విద్యానాథుడు పేర్కొనిన ప్రౌఢి, ఉక్తి, గాంభీర్యము, భావికములను గుణములు మను, వసుచరిత్రలలో అగణితములుగా కనిపించును. ప్రౌఢి యన ఉక్తి వైచిత్ర్యం. విదగ్ధ ఫణితి ఉక్తి– అనగా పైకొక అర్థమును తోపింపజేయుచు అంతర్యమున వేరొక అర్థమును స్ఫురింపజేయుట, దీనిని విదగ్ధులైనవారే ప్రయోగించగలుగుదురు కాన విదగ్ధఫణితి యని చెప్పబడుచున్నది. గాంభీర్యమన ధ్వని కలిగియుండుట ఈ మూడు గుణములు ముఖ్యముగా వసుచరిత్ర ప్రబంధమున విస్తృతముగా కనబడుచున్నవి,

"ఫలభంగములు సేయు చిలుకకు సొంగమై
క్రోధరసంబు ముక్కుననె యుండుఁ..."

వ.చ. 3–123

1. కావ్యాలంకారము పుట 534

అను పద్యమున చిలుకయొక్క ఎఱ్ఱని ముక్కును క్రోధరసము గాను, మరాళి ముఖమునందలి ఎఱుపును ముఖరాగముగాను, కోకిలయొక్క నేత్రారుణిమను వహ్నిజ్వాలగాను, తుమ్మెదశరీరము యొక్క నలుపును మలినముగాను కవి చమత్కరించి తన ఉక్తివైచిత్రిని ప్రదర్శించినాడు.

"తన కూటంబులఁ బ్రోదిఁ దాల్చు రంభాదులు
సరసభావముఁ దప్పి శిరము వంప..."

వ.చ 2-113

అను పద్యమున రంభాదులు, కలకంఠులు, పద్మినులు, భోగినులు అను పదములకు రంభావృక్షాదులు, కోకిలలు, పద్మములు, సర్పములు అను అర్థములు పర్వతపరముగాను, రంభాద్యప్సరసలు, మధురకంఠములు గల స్త్రీలు, పద్మినీ జాతి స్త్రీలు, భోగినులైన స్త్రీలు అను అర్థములు పురుషపరముగాను స్ఫురించుచున్నవి. అపుడు పర్వతమున పురుషత్వమారోపించబడి అచేతనమగు పర్వతము నుండి చేతనమగు మానవరూపము పాఠకుల ముందు నిలుచుచున్నది. ఇందు రామరాజభూషణుని విదగ్ధఫణితి సుస్పష్టముగా గోచరించుచున్నది. వసుచరిత్ర నుండి యిట్టి యనేక పద్యముల నుదాహరించవచ్చును. ఇక గాంభీర్యగుణము వసుచరిత్ర పద్యములలో కలదని వేరుగా చెప్పనవసరము లేదు.

"ఆకోలాహలశైల సంభవ రసవ్యాకృద్ధ్వనాలి ప్రయ
త్నైక ప్రస్థితయై ప్రతిక్షణ సభంగారాళ సంచారయై
వ్యాకీర్ణాంబర ఫేనయై విహిత వక్త్రాబ్జస్ఫురద్వేణియై
శ్రీ కళ్యాణ గుణార్ణవుం దలరవచ్చె రాగంబునన్"

వ చ. 6-75

గిరికాదేవి కోలాహల పర్వతమునకు, శుక్తిమతీనదికి జనించినట్టిది. కావున పర్వతముపై జనించు సెలయేటిగుణములతో కూడినదై యున్నదని కవి శబ్దశక్తి మూలకముగ ధ్వనింపజేసెను.

"అభిరామ నవపల్లవారామ కుంజవాటికలఁ
గీరముల నాడించికొనుచుఁ..." వ.చ. 6-97

అను పద్యమున రామరాజభూషణుడు, గిరికావసురాజులు వసంత, శరత్, వర్ష, హేమంత ఋతువుల కనుగుణ క్రీడాలోలురై సుఖించిరని కవి ధ్వనింపజేసెను. ఇట్టి పద్యములను సైత మెన్నిటినో వసుచరిత్రనుండి యెత్తిచూపవచ్చును.

"భావములను బట్టి వాక్యమునఁ బదముల కావృత్తి కలిగి శోభావహ మగుట" భావికమని ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము-

"ఓ రాజన్య మహేంద్ర! యో మణిగణ ప్రోతాసివాతాశన
ప్రారజ్యత్కుటి చక్ర! యోముఖర శార్ఙ్గ కూర బాహార్గళా!
యో రుక్మాచల కల్ప! యో కవచిత వ్యూఢాంగ కావంగదే
యో రాహుత్త శిరోమణీ! నిరవధిప్రోద్యత్ప్రితాపారణీ! మ.చ. 4-71

అను పద్యమున మనోరమ నానావిధములుగ స్వరోచిని సంబోధించుటలో నామె కాతరభావము పాఠకుల కవగతమగుచున్నది. ఇట సంబోధనములు వేరైనను అవి యన్నియు స్వరోచిని గూర్చి చేసినట్టివే. అట్లే 6 ఆశ్వా. 104పద్యమున స్వారోచిషుడు విష్ణువు యొక్క వివిధనామముల నావృత్తి చేయుటలో, భక్తి భావము స్ఫుటమగుచున్నది.



## మను, వసుచరిత్రలలోని శైలీ భేదము

మనుచరిత్రలో దాదాపు అన్నిగుణములు అటనట కనిపించుచున్నను ప్రధానముగా ప్రసాద, మాధుర్య, సౌకుమార్య, అర్థవ్యక్తి యను గుణములుండు టను పైన పరిశీలించి యుంటిమి. వైదర్భీరీతి సమగ్ర గుణగుంఫితమైయుండ

వలయునని యాలంకారికులు కొందరు చెప్పినను (కా.సూ.వృ 1-2-11) అది ప్రసాదమాధుర్య గుణప్రధానమని సర్వసమ్మతము. ప్రసన్నత్వము, వక్రోక్తి రహితము, కోమలత్వము, శ్రుతిపేశలత్వము వైదర్భీరీతి యొక్క లక్షణములని భామహుడు–

అపుష్టార్థ మవక్రోక్తి ప్రసన్న మృజు కేవలమ్
భిన్నం గేయమివేదం తు కేవలం శ్రుతి పేశలమ్

కావ్యా. 1–34

కోమల బంధత్వము కలిగి పరుషశబ్దము, దీర్ఘ సమాసములు లేక అల్పసమాస భూయిష్ఠమై కర్ణ పేశలత్వము గల రచన వైదర్భి యనబడునని వామనుడును పేర్కొనెను. (కా సూ. వృ. 1-2-11). ఇట్టి లక్షణములన్నియు మను చరిత్రలో అడుగడుగునను పాఠకులకు కనిపించుచున్నవి. కావున శిరీష కుసుమ పేశలత్వము, సుధామయోక్తులతో కూడిన పెద్దన రచన వైదర్భీరీతికి చెందినదనుట తెల్లము.

వైదర్భీరీతినే కుంతకుడు సుకుమార మార్గముగా పేర్కొనినాడు. ఆతడు సుకుమారమార్గలక్షణము నీరీతిగా చెప్పినాడు–

అమ్లాన ప్రతిభోద్భిన్న నవ శబ్దార్థ బంధురః
అయత్న విహిత స్వల్ప మనోహారి విభూషణః
భావ స్వభావ ప్రాధాన్యక్కృతాహార్య కౌశలః
రసాది పరమార్థజ్ఞమనః సంవాద సుందరః
అవిభావిత సంస్థాన రామణీయక రంజకః
విధి వైదగ్ధ్య నిష్పన్న నిర్మాణాతిశయో సమః

వ.జీ. 1:25-27

నవనవోన్మేష శాలినియైన ప్రతిభ నుండి జనించిన నవీన శబ్దార్థముల చేత మనోహరమై, అనాయాసముగా రచించబడి పరిమిత సుందరాలంకారముల చేత భూషించబడుచు రసాది రహస్య తత్త్వజ్ఞులైన రసికహృదయానుకూల రచన చేత సుందరమైనది సుకుమారము. ఇట్టి సుకుమార మార్గరచనకు కుంతకుడు, వాల్మీకి, కాళిదాసాదుల నుదాహరణముగా పేర్కొనినాడు. ఆంధ్రసాహిత్యమున ఈ

మార్గము ననుసరించినవాడు ఆదికవి నన్నయ. నన్నయ మార్గము ననుసరించి సుకుమార కవిత నల్లినవాడు పెద్దనార్యుడు.

రామరాజభూషణుని కవిత ఓజః కాంతిగుణ ప్రధానమైనదిగా పైన గుర్తించియుంటిమి ఓజఃకాంతి ప్రధానమైనది గౌడీరీతి. ఉద్భట పదయుక్తము, దీర్ఘసమాసములు, బహుళాలంకారత్వము గలది గౌడీరీతి (కా.సూ వృ. 1-2-12). ఈ లక్షణములు వసుచరిత్రలో స్పష్టముగా కనిపించుచున్నవి. కావున రామరాజభూషణుని కవిత గౌడీరీతికి చెందినదని చెప్పవలయును. దీనినే కుంతకుడు విచిత్రమార్గముగా గుర్తించినాడు. ఆతడు విచిత్రమార్గలక్షణముల నిట్లు పేర్కొనెను:-

ప్రతిభా ప్రథమోద్భేద సమయే యత వక్రతా
శబ్దాభిధేయయోరంతః స్ఫురతీవ విభావ్యతే
అలంకారస్య కవయో యత్రాలంకరణాంతరమ్
అసంతుష్టా నిబధ్నంతి హారాదేర్మణి బంధవత్
విచిత్రోయత్ర వక్రోక్తి వైచిత్ర్యమ్ జీవితాయతే
పరిస్ఫురతి యస్యాంతః సా కాప్యతి శయాభిధా
సోఽతి దుస్సంచరో యేన విదగ్ధ కవయో గతాః
ఖడ్గధారా పథేనేవ సుభటానాం మనోరథాః

వ.జీ. 1-34, 35, 42, 43

విచిత్రమార్గము వక్రోక్తి ప్రధానమైనది. ఆహార్య శోభ అందు ముఖ్యము. కవి ప్రతిభ కంటె పాండిత్య ప్రాభవమే అంతటను గోచరించును. అర్థవ్యక్తతలో క్లిష్టత్వముండును. కల్పనాచాతుర్యము మెండు. పదాడంబరము, అలంకారాతిశయత్వము కనిపించును. హృదయముకన్న మనసున కానందము కలిగించును. ఆనందముకన్న ఆశ్చర్యమును పుట్టించును. ఈ మార్గము కఠినతరమైనది. ఇది పండితకవులకు మాత్రమే సాధ్యమైనది. విదగ్ధులైన కవులు సుభటులవలె దుర్గమమైన ఖడ్గధార వంటి యీవిచిత్రమార్గమున సంచరింతురు కుంతకుడీ విచిత్రమార్గమున కుదాహరణముగా బాణభట్టాదులను పేర్కొనెను. రామరాజభూషణుడును ఈ విచిత్రమార్గమునకు చెందినవాడే. శ్రీహర్షుని నైషధానువాదముతో శ్రీనాథుని ద్వారా ఈ విచిత్రమార్గము తెనుగు

సాహిత్యమున ప్రవేశించినదని చెప్పవచ్చును. దానినే శ్రీనాథుడు- "హర చూడా హరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా, పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యము"(భీ. ఖం. 1-11) గా ప్రశంసించియున్నాడు. ఆ అడుగుజాడలలో నడచి మించినట్టి పండితకవి రామరాజభూషణుడు.

## వైదర్భీ, గౌడీ రీతులలో నేది యుత్తమమైనది

దండి వైదర్భీ గౌడీరీతులను పేర్కొని, అందు వైదర్భీరీతి యుత్తమ మైనదని యభిప్రాయపడెను. రాజశేఖర. అభినవగుప్తాదులు సైతము రసవ్యం జకతకు వైదర్భీరీతిని యుత్తమమార్గముగా పేర్కొనిరి. కాని రీతులలో నొకటి యుత్తమమైనది మరొకటి కాదనుట సమంజసము కాదని భామహ, వామన,కుంత కాదుల అభిప్రాయము. విద్వాంసులు కొందరు వైదర్భీరీతి శ్రేష్ఠమని, సుందర మనియు ఇతరము కాదనియు భావింతురు. కాని యలంకారయుక్తము, గ్రామ్యతారహితము, న్యాయసంగతము, అనాకులమునైన గౌడీమార్గము కూడ ఉత్తమమైనదని భామహుడు వచించెను.

వైదర్భమన్యద స్తీతి మన్యంతే సుధియోఽపరే
తదేవ చ కిల జ్యాయః సదర్థ మపి నా పరమ్.
అలంకార వదగ్రామ్యమర్థ్యం న్యాయ్య మనాకులమ్
గౌడీయమపి సాధీయో వైదర్భమితి నాన్యథా.

కావ్యా. 1-31, 35

వామనుని యభిప్రాయమును శ్రీ వి. రాఘవన్ గారు ఈ విధముగా క్రోడీకరించిరి-

"The Gaudi in Vamana is not the bad style as in Dandin. It is a good style in which all the Gunas of the Vaidarbhi are present, only it sheds some sweetness and delicateness and attains vigour and forcefullness. The Madhurya and Saukuma-

rya of the Vaidarbhi are replaced by Samasabhahulya and Ulbanapadas with a greater degree of ojas and Kanti".[1]

వైదర్భి, గౌడి, పాంచాలీ రీతులను ఉత్తమ, మధ్యమ, అధమ మార్గము లనుగా గుర్తించుటను కుంతకుడు ఆక్షేపించి, గౌడి పాంచాలీ రీతులుత్తమమైనవి కానపుడు వానికి అలంకారశాస్త్రములందు లక్షణములను చెప్పనేల అని ప్రశ్నించెను. కుంతకుని యభిప్రాయములను శ్రీ వి. రాఘవన్ గారిట్లు పేరొ్కనిరి-

"The Sukumara is the style of certain poets of a similar temperament and it is suited to certain situations. Similarly the third combines the features of both the styles. All the three are beautiful and have their own charm. It is absurd to suppose that one is good, the other bad or the passable".[2]

కావున వైదర్భ మార్గముతో కూడిన మనుచరిత్ర ఉత్తమమైనదనియు, గౌడీమార్గముతోకూడిన వసుచరిత్ర అనుత్తమమైనదనియు చెప్పుటకు వీలులేదు. రెండు కావ్యములును వానివాని మార్గములలో నుత్తమమైనవి. సహజకవియగు పెద్దనను అనేకవిషయములందనుకరించబూనుకొనిన రామరాజభూషణుడు అతని శైలిని మాత్రము అనుకరించక తన పాండిత్య ప్రతిభచేత నూతనమైన, తనదైన రచనామార్గమును సృష్టించినాడు. చేమకూర వేంకటకవి మను, వసు చరిత్రకారుల మార్గద్వయమును జీర్ణించుకొని, పెద్దన కవితలోని సౌకుమార్య మాధుర్యములను, రామరాజభూషణుని కవితలోని వైచిత్రి, వక్రోక్తులను మేళవించుకొని మూడవది, మధ్యమమార్గమగు పాంచాలీరీతిలో విజయవిలాసమును రచించినాడు.



1. Some conceyts of Alankara Sastra. page 144
2: Some concepts of Alankara Sastra. page 165

# మనుచరిత్రలోని స్వభావోక్తి మార్గము

దండి వాఙ్మయము నంతటిని రెండుగా విభజించినాడు. ఒకటి స్వభావోక్తి రెండు వక్రోక్తి-"భిన్నం ద్విధా స్వభావోక్తిర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్" (కావ్యాద 2-363). సహజవస్తు స్వరూపవర్ణనగల మార్గము స్వభావోక్తి మార్గము. దండి స్వభావోక్త్యలంకారము నిట్లు నిర్వచించినాడు-

నానావస్థం పదార్థానాం రూపం సాక్షాద్వివృణ్వతీ
స్వభావోక్తిశ్చ జాతిశ్చేత్యాద్యాసాలంకృతిర్యథా

కావ్యాద. 2-8

నానావస్థలతో కూడిన ఒక వస్తువుయొక్క స్వరూపమును ప్రత్యక్షమగునట్లు వర్ణించునదే స్వభావోక్తి ఇందు సజీవస్వాభావిక వర్ణన ఉండును.తద్వారా వర్ణ్యవస్తు సందర్శనము జరుగును. ఇట్టి స్వాభావిక వర్ణనగల మార్గమే స్వభావోక్తి మార్గము. పెద్దన ఏవస్తువును వర్ణించినను పాఠకుల హృదయమంచముపై సాక్షాత్కారమగునట్లు వర్ణించును. వస్తువర్ణనకు ఆతని నిరాడంబరశైలి దోహదమొసగి స్వభావోక్తి మార్గమున నడపించినది. ఈ మార్గమే మనుచరిత్రలో రసాభివ్యక్తికి తోడ్పడినది.

"తొలుదొల్త వానిఁ గనులఁ గాంచినప్పుడ
పల్లవాధర గుండె జల్లుమనియె..."
"కానసాఁగి కామినీ గోష్ఠిఁ బ్రౌఢములైన
యదుటుఁ జూపుల తెప్పతుదల నాచి...."

మ.చ. 3-91, 3-97

అను పద్యములలో వరూథిని అవస్థాక్రమమును,మాయాప్రవరుని చేష్టాక్రమములను కవి సహజముగా,కనులకు కట్టునట్లుగా వర్ణించినాడు.పెద్దన అన్ని యలంకారముల కన్న స్వభావోక్తిని యెక్కువగా నాదరించెను. పాత్రల స్వరూప వేషభాషాది వర్ణన, పాత్రల చేష్టావర్ణన, యుద్ధ, మృగయావర్ణనల సందర్భములందు సంభాషణారచనలందును స్వభావోక్తి మార్గమును కవి యనుసరించినాడు

ఉత్ప్రేక్ష రూపకోపమలను సైతము కవి వస్తుప్రదర్శన ప్రయోజనకారిమాత్రము గానే ప్రయోగించెను. సమాధి, సమాసోక్తి. విరోధాభాసాది క్లిష్టాలంకారముల నాతడాదరించలేదు. దండి ప్రోక్తమైన స్వభావోక్తి మార్గమున పెద్దన కవిత సాగినది.



## మనుచరిత్రలో వక్రోక్తి లేదా?

సైషా సర్వైవ వక్రోక్తిరన యార్థో విభావ్యతే
యత్నో౽స్యాం కవినా కార్యః కో౽లంకారో౽నయా వినా
గతో౽స్తమర్కో భాతీందుర్యాంతి వాసాయ పక్షిణః
ఇత్యేవమాది కిమ్ కావ్యం వార్తామేనాం ప్రచక్షతే

కావ్యా. 2-85, 87

అని భామహుడు వక్రోక్తిలేని యలంకారమే లేదనియు, వక్రోక్తిలేని ''సూర్యుడస్తమించెను, చంద్రుడు ప్రకాశించుచున్నాడు, పక్షులు గూళ్ళకు చేరుకొనుచున్న''వను మాటలు వార్తామాత్రములగునే కాని కవిత్వము కానేరవని వచించెను. స్వభావోక్తిని విశేషముగా నాదరించిన దండి స్వభావోక్తిలో సైతము అలంకార సామాన్యాపేక్షితమైన చమత్కారముండవలయునని యభిప్రాయపడెను. కావ్యాదర్శ వ్యాఖ్యానమున ఆచార్య రామచంద్రమిశ్రగారు ఇట్లు నుడివినారు- "వస్తునో యథావత్ స్వరూపస్ఫుటీకరణ సమర్థ మసాధారణ ధర్మ వర్ణనం స్వభావోక్తిరితి లక్షణం ఫలితమ్. అలంకారసామాన్యేపేక్షితం చమత్కారకత్వం త్వత్రాపి నిశ్చయేనాపేక్షితమ్...." (కావ్యాద. పుట 77). కావున పెద్దన యొక్క స్వభావోక్త్యలంకారయుక్తమైన శైలి వక్రోక్తి,ఉక్తి వైచిత్రిరహితమని చెప్పుటకు వీలులేదు. కాని రామరాజభూషణుని శైలిలోని విదగ్ధత, శ్లేషవైచిత్రి, అలంకార సంసృష్టి, తద్ద్వారా ఏర్పడిన భావచమత్కారములు పెద్దనలో నంతగా

కనిపించవు. వాల్మీకి కాళిదాసుల కవిత్వము వలె పెద్దన కవిత్వము స్వభావో క్తి సుకుమార మార్గమున సరళసుందరముగా, రసస్ఫోరకముగా నడచినది.



## మనుచరిత్రలో ధ్వనివైభవము లేదా?

పెద్దన రసవాదియైన కవి. ఆతని కవిత్వము రసభరితమైనది. కవిత్వము కేవలము వాచ్యార్థ ప్రధానమైయున్నరసవ్య క్తి కలుగదు. ఇట శృంగారమున్నది, యిట వీరరసమున్నదని వాచ్యముగా చెప్పినంత మాత్రమున శృంగారవీరాదులు పాఠకుల హృదయగోచరములు కావు. విభావానుభావ వ్యభిచారుల వర్ణనల వలన రసము వ్యంగ్యమగును. "యద్యపి రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవభవతి న వాచ్యఃకదాచి దపి" అని లోచనకారుడు. రసభావాద్యర్థము ధ్వన్యమానము కావలయునే కాని యెన్నడును వాచ్యము కారాదు.

పెద్దన సహజవర్ణనలు, ప్రసిద్ధ శబ్ద ప్రయోగములు భావములను ఝుట్టున స్ఫురింపజేయునట్టివి. ఆతని కవితలో అనావశ్యక పదజాలముండదు. పదముల పొందిక, పాత్రానుగుణమైన శబ్దముల కూర్పు, పాత్రల బహిరంతర చిత్రణ, సహజసుందర సంభాషణలు, అనావశ్యక దీర్ఘవర్ణనలు లేకుండుట పెద్దనార్యుని ప్రత్యేకత. ఈ గుణముల వలననే ఆతని కవిత పాఠకుల హృదయములను రసప్లావిత మొనరించుచున్నది. చదివినకొలది మరీమరీ చదివించి పాఠకుల చిత్తముల నలరించు ఉత్తమకావ్యము మనుచరిత.

త్రివిధ వ్యంగ్యములలో రసధ్వనియే శ్రేష్ఠమైనదని అభినవగుప్తాదుల మతము. కావున రసధ్వని ప్రధానమై మనుచరిత్ర ఆంధ్రసాహిత్యమున ఉత్తమ గ్రంథముగా పరిగణించబడుచున్నది.

మనుచరిత్రలో రసధ్వనియేకాక అటనట వస్తు, అలంకార ధ్వనులును కలవు.

"ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర...." (మ చ. 2-4)అను పద్యమున గల నిరాడంబరపదములలోని వ్యంగ్య వైభవము విపశ్చిత్ విదితమే.

"వాని చక్కఁదనము వైరాగ్యమునఁజేసి..." మ.చ. 1-52

అను పద్యములోని భావికభావ్యంజకత్వమందలి రామణీయకత సరసులకు విదితము. మనుచరిత్రలో అటనట గల ఉపమాద్యలంకార ధ్వనులను వ్యాఖ్యాతలు బయట పెట్టియేయున్నారు. మరియు వరూథినీ ప్రవర సంవాదఘట్టమున సంభాషణల, చేష్టాదుల వర్ణనలందు ఆ పాత్రల గుణశీలముల నెన్నింటినో వ్యంగ్యరూపమున కవి స్ఫుటీకరించి కావ్యమునకు వన్నె పెట్టినాడు. ఇట చిలుకూరి వీరభద్ర రావుగారి యభిప్రాయము స్మరించదగియున్నది- "పాత్రచిత్రణములలో, భావ భావనలలో, ప్రకృతి నిరూపణలో, పలికెడి పలుకులలో, నుడికారపు సొంపులలో, సంబోధన రామణీయకములలో,వ్యంగ్యార్థపరిపాటిని పాటించుటలో సర్వకార్తయై మెలంగె"నని పెద్దనను స్తుతించుచు "వెనుకటి కవులింతగా వ్యంగ్యమర్యాదను పాటింపలేదనియె యనిన సాహసము కాదేమో"నని తలంచిరి. [1]

-o-

## మనుచరిత్రలో భావికత్వము

భావికమును ప్రబంధగుణముగా గ్రహించినవారిలో భామహుడు మొదటి వాడు. భావికత్వమును గూర్చి యాతడిట్లు చెప్పినాడు-

భావికత్వమితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థా భూతభావినః

1. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటము. 45 సంచిక 1-2.

చిత్రోదాత్తాద్భుతార్థత్వం కథాయాః స్వభినీతతా
శబ్దానాకులతా చేతి తస్య హేతుం ప్రచక్షతే

కావ్యా. 3–53, 54

చిత్రమయమైన ఉదాత్తాద్భుతార్థములు, కథలో స్వభినీతత అనగా సుబోధకత్వము మరియు శబ్దముల అనాకులత ఇవి భావికత్వమునకు తోడ్పడును. ఉద్భట, రుయ్యకాదులీ భావికత్వము నొక అలంకారముగా గుర్తించి లక్షణములను చెప్పిరి. స్వభావోక్తి లోకవృత్తమును బోధించునట్టి యలంకారము కాగా భావికత్వము భూతభవిష్యద్విషయములను పాఠకుల మనసులందు నిలుపునట్టి యలంకారమని భామహుని తర్వాత అలంకారికులు అభిప్రాయపడిరి.[1] భామహుని దృష్టిలోకూడ భావికత్వమనగా భూతభవిష్యత్తులలో జరిగిన, జరగబోవు విషయములను పాఠకుల కనులయెదుట జరుగుచున్నట్లుగా వర్ణించుట. కాని అది ఉపమాద్యలంకారములవలె కావ్యమున ఏదైననొక్క పద్యమున నుండునట్టిదికాక సంపూర్ణ ప్రబంధమందు కన్పట్టునట్టి గుణము. భామహుని తర్వాత ఉద్భటుడు భావికత్వమునకు అలంకారమాత్ర స్థానము నిచ్చి తన కావ్యాలంకారసారసంగ్రహమున సోదాహరణముగా వివరించినాడు. ఆతరువాత అలంకారికులందరును దీనిని అలంకారమాత్రముగానే వివరించిరి భామహునివలె దండి కూడ భావికత్వమును ప్రబంధవిషయగుణముగా పేర్కొనుచు భామహునివలెనే అలంకారముల సరసన వివరించినాడు (కావ్యాద 2-364). అందుచేతనే తరువాత ఆలంకారికులు భావికత్వమును కేవలము అలంకారముగా గ్రహించు ప్రమాదమేర్పడినదేమో. ప్రబంధమంతట వ్యాపించిన గుణముగా గ్రహించుటచేత దండి, భామహులు లక్షణమునుచెప్పి యుదాహరణ నొసగక విడిచిపుచ్చినారు ఉద్భటాదులచే అలంకారమాత్రముగా గుర్తించబడిన భావికత్వము తన ప్రాధాన్యమును కోల్పోయి విమర్శకుల దృష్టినుండి మరుగుపడిపోయినది.

దృశ్యకావ్యములో వలె శ్రవ్యకావ్యమున నాయకాదులు ప్రత్యక్షముగా కానరారు. అపుడు రూపకసందర్శన సమయమున రంగస్థలముపై కల్పించు విభావానుభావసాత్త్వికభావాదుల ద్వారా కలుగు రసాస్వాదన శ్రవ్య కావ్యమును పఠించు పాఠకులకెట్లు కలుగును ? అనిన నట వర్ణితములై నాయకాది రూపములు, విభావానుభావసాత్త్వికభావాదులు పాఠకులకు రంగస్థలముపై వలె మనో

1. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము. పుట 524.

నేత్రమునకు కనిపించును, తద్ద్వారా రససాక్షాత్కారము కలుగుట సులభమగును. పాఠకులకు ప్రత్యక్షముగా కావ్యార్థవర్ణ్యములను గోచరింపజేయు శక్తిగలవాడు మహాకవి. దీనికి ప్రసాద, అర్థవ్యక్తి గుణము లత్యావసరములు. అలంకార సర్వస్వవ్యాఖ్యాత జయరథుడు భావికత్వమునకు శబ్దానాకులత్వము కలిగి వెంటనే అర్థస్ఫురణను కావించు ప్రసాదగుణము అత్యవసరమని చెప్పెను.[1] భామహుడును నిట్టి గుణ మవసరమనుటను పైన పరిశీలించియుంటిమి.

భావికత్వమును వివరించుచు శ్రీ వి. రాఘవన్ గారు ఇట్లు నుడివిరి–

"Ideas should be exalted, expression transparent and emotion graphically presented-when these are there the Sahrudaya's mind realises completely the poet's mind mirrored in his poetry" మరియు–"As one read the poem, it should begin to live before his eyes, that is, it should apper before the mind's eye of the reader that the story is happening in his very presence ... "It is this Pratyaksayamanatva which the Arsha Sahrudayas who listened to the inagural recitation of Valmiki epic said that the Adikavya posessed".

"చిర నిర్వృత మప్యేతత్ ప్రత్యక్షమివ దర్శితమ్"[2]

దీనే శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిట్లు పేర్కొనిరి– "పాత్రోచితము లైన మాటలం బ్రయోగించియు, విషయమునకుం దగినరీతిని సొగసైన వర్ణనములంజేసియు, వృత్తములు సాక్షాత్తుగ నెదుటం గనులకుం గట్టునట్లుచేయుట, యిదియే అన్నింటిని మించిన కవితాలక్షణము"........" ఈ మహేంద్రజాల కౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి"[3]

మనుచరిత్రతో "ప్రత్యక్ష మివదర్శితమ్"అయిన భావికత్వము ప్రబంధాద్యంతము కలదు. చిత్రమయమైన (చమత్కారజనకమైన) ఉదాత్తాద్భుతా

---

1. "నాప్యయం శబ్దానాకులత్వ హేతుకాత్ ఝటిత్యర్థ సమర్పణాత్ ప్రసాదాఖ్యో గుణః" అట్టి ప్రసాదగుణముతో కూడినది భావికత్వము– అలంకారసర్వస్వ వ్యాఖ్య. పుట 228

2. Some concepts of Alankara Sastra page 124, 118

3 కవితత్త్వ విచారము. పుటలు 3,4

ర్థములు ఉండవలెననుట భామహాదులు అంగీకరించిన, భావికత్వమునకు హేతుభూతమైన మొదటి విశేషము మనుచరిత్రలోని యితివృత్తము ఆద్యంతము ఉదాత్తమైనది. ప్రవరుని వంటి ఉదాత్తపాత్ర వర్ణనతో నారంభమై స్వారోచిషుడను మనువు పుట్టుకతో కథ ముగిసినది. ప్రవరవరూథినీ సంవాదమున ప్రవరునికే విజయమును చేకూర్చి ఐహికభోగములపై మోక్షకాంక్ష విజయము సాధించుటను పెద్దన ఉదాత్తముగా చిత్రించినాడు మనుచరిత్రలో కథయేగాక భావోక్తులు కూడ చిత్రమయములైనవి, ఉదాత్తములైనవి

కథను సుబోధకముగా (కథయాః స్వభినీతతా) నడపుట భావికత్వమునకు హేతుభూతమైన రెండవవిశేషము. దీనినే నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తిగా పేర్కొనినాడు. నన్నయ వలెనే పెద్దనయు ప్రసన్న కథాకలితార్థయుక్తికి ప్రసిద్ధుడు. సరసమైన సన్నివేశముల కూర్పుతో పెద్దన కథను ప్రసన్నమార్గమున నడపినాడు.

ఉదాత్తార్థములను అనాకులమైన పదములతో వర్ణించుట భావికత్వమునకు హేతుభూతమైన మూడవ విషయము. అనాకులమైన పదములు అనగా ప్రసిద్ధములైన, ఝటిత్యర్థస్ఫురణ చేయగల పదములని యర్థము. శిరీషకుసుమపేశలమైన, వైదర్భీరీతిలో నడచిన పెద్దన కవిత్వములో శబ్దాకులతత్వమునకు తావులేదు ఆతని కవిత్వములోని ప్రసాద, అర్థవ్యక్తి, మాధుర్యగుణములు, స్వభావోక్తులు ప్రబంధ భావికత్వమునకు విశేషదోహదకారులయ్యేను. ప్రవర సిద్ధ, వరూథిని, మనోరమ, దేవాపి మొదలైన పాత్రల సహజస్వరూప వర్ణనలు ఆ పాత్రలను పాఠకుల ముందు ప్రత్యక్షముగా నిలుపుచున్నవి. సిద్ధ–ప్రవర సంవాదమున, ప్రవర–వరూథినీ సంవాదమున గల సహజసుందర సంభాషణలు. వారి సాత్త్వికాది భావవర్ణనలు, అంగచేష్టాదుల వర్ణనలు రూపక దర్శనానందమును కలిగించుచున్నవి. వరూథిని, మనోరమ, పుంజికస్థల మొదలగు స్త్రీల రూపవిలాస, మౌగ్ధ్యాదులను పెద్దన కనులకు కట్టునట్లు ఆంగికాభినయ వర్ణన ద్వారా వ్యంగ్యీకరించినాడు. వేట, యుద్ధము, ఇందీవరాక్షుని వృత్తాంతము మొదలగునవి సహజములై పాఠకుల నలరించును. స్వారోచి వివాహము నకై తరలిపోవు వైభవము, ఇందీవరాక్షుడు రాక్షసునిగా మారుట, వనదేవత స్త్రీగా మారుట మొదలగు అనేక విషయములు సహృదయ హృదయములకు

ప్రత్యక్షమానములై కన్పట్టును మనుచరిత్రలో గల ఈ భావికత్వగుణము పాఠకుల నలరించుచు, రూపక సందర్శనానందము నొసగుచు, ప్రబంధమున నాటకధర్మములను పెంపొందింపజేయుచు, రసవ్యక్తికి ప్రధానదోహదకారియై యొప్పుచున్నది.



## వసుచరిత్రలో భావికత్వము

వసుచరిత్ర ప్రబంధమున భావికత్వగుణము అంతగా గోచరించదు. రామరాజభూషణునిలో నర్థవ్యక్తి, ప్రసాదగుణముల అభావము చాలావరకుండుటచేత భావికత్వమునకు బాధ యేర్పడినది. వసుచరిత్రలోగల వివిధ శాస్త్ర పాండిత్యముపై నాధారపడిన ఊహౌన్నత్యము, శబ్ద భావగత చమత్కారములు పాఠకహృదయములను ముంచివేయుచున్నవి.

వసుచరిత్రలో భావికత్వము ప్రౌఢశైలిలో నంతర్గతమైయుండుటచే కావ్య వర్ణ్య వస్తు, దృశ్యములు, పాత్రలు సాక్షాత్కారమగుటకు విలంబమగుచున్నది



## వసుచరిత్రలోని వక్రోక్తి మార్గము

శబ్దార్థముల యొక్క వక్రతను భామహుడు వక్రోక్తిగా పేర్కొనెను. ఆతడు వక్రోక్తిని మిక్కిలి యాదరించి వక్రోక్తిలేని శబ్దార్థ రచన వార్తామాత్ర

మగును కాని కవిత్వము కానేరదని చెప్పెను (కావ్యా. 2-87). గౌడీరీతిలో వక్రోక్తికి ప్రాధాన్యము కలదు. వైదర్భిని వక్రోక్తి రహితముగాను గౌడిని వక్రోక్తి ప్రధానముగాను భామహుడు గుర్తించెను. కుంతకుడు గౌడీరీతినే విచిత్ర మార్గముగా పేర్కొని శబ్దార్థములందు వక్రత, ఉక్తివైచిత్రి కలిగిన విచిత్రమార్గము విదగ్ధ భణితి యనియు, దుర్గమమైనదనియు అభిప్రాయపడెను.1 వక్రత, ఉక్తివైచిత్రులు బాణభట్టు, సుబంధాదుల కవితలో విరివిగా కనిపించుచున్నవి. బాణుడు కాదంబరిలో ''వక్రోక్తినిపుణేన ఆఖ్యాయికాఖ్యాన పరిచయ చతురేణ....'' అని తాను వక్రోక్తినిపుణుడనని పేర్కొనియున్నాడు. బాణుని దృష్టిలో వక్రోక్తియన అక్లిష్టశ్లేష, నవీనార్థద్యోతనము, రసవ్యక్తి, వికటాక్షర బంధము— వీనియేకత్ర సమాహారము గల శైలి.2 సుబంధుడు "ప్రత్యక్షర శ్లేషమయ ప్రబంధ విన్యాస వైదగ్ధ్యనిధిం ప్రబంధమ్, సరస్వతీ దత్త వరప్రసాదాత్ చక్రే సుబంధు సుజనైక బంధుః' అని తన కవిత్వము ప్రత్యక్షరశ్లేషకును, పాండిత్యప్రకర్షకును నిలయమైనదని చెప్పుకొనినాడు ఈ విధముగా వక్రోక్తి శ్లేషయొక్క సంయోగము కలదని స్పష్టమగుచున్నది. అందుచేతనే దండి''శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్''(కావ్యాద 2-363) అని వక్రోక్తిలో శ్లేషకు గల ప్రాధాన్యమును గుర్తించినాడు

రామరాజభూషణుని కవిత అట్టి వక్రోక్తిమార్గమున నడచినది. వక్రోక్తి మార్గము శ్రీనాథుని నైషధానువాదముతో తెలుగు కావ్యప్రపంచ లో ప్రవేశించి నదని చెప్పవచ్చును. ఆమార్గము పిల్లలమర్రి పినవీరనాదులలో నాతిగా భాసించినది. రామరాజభూషణునిలో నీ మార్గము పరిణతి నందుకొన్నది.

వసుచరిత్ర ప్రారంభమున కవి సూతునిచేత- ''తచ్చరిత్రంబు (అనగా వసురాజు చరిత్ర) నిర్వక్రప్రౌఢిమ విన్నవింతునని వాగ్వైచిత్రితో నిట్లనున్" (1-93) అని పలికించి తన కవిత్వము వాగ్వైచిత్రితో కూడినదని

1. వక్రోక్తి జీవితమ్. 1-34, 45, 42, 43.
2. నవోర్థో జాతిరగ్రామ్యా శ్లేషోక్లిష్టః స్ఫుటో రసః
 వికటాక్షర బంధశ్చ కృత్స్నమేకత్ర దుర్లభమ్.

హ.చ. 1-8

వ్యంగ్యరూపమున వెల్లడించియున్నాడు "చతురాస్యుఁడ వరుదే వచసప్రౌఢి నీకుఁ "(4-1 గీ) అని వసురాజును మంజువాణిముఖమున పొగడించిన క్రమము రామరాజభూషణుని యెడలను సత్యము. ఈ రెండుచోటులందు కవి పేర్కొనిన వాగ్వైచిత్రి, వచప్రౌఢి బాణ శ్రీహర్షులలో కనిపించు కవితాగుణములే. రామ రాజభూషణునిలో బాణుని వంటి శ్లేషపుష్టమైన అలంకారవైచిత్రి శ్రీహర్షునివంటి భావవైచిత్రి ఊహౌన్నత్యములు కనిపించుచున్నవి.

> "వర సుమనోభవ్య తరుల కావాల మ
> త్యలఘు కలాపాలికలకు భరణి...."
>
> "పగలైనఁ దెల్పఁ గోల్పడని రాజులు శరం
> బులు చన్న వెలవెలఁబోని ఘనులు..."
>
> "సర్వం సహాచక్రంబు జడమయ్యె
> గ్రామముల్ భంగసంగతము లయ్యె..."
>
> "వరగుణజాల సంవనన సామ్రగితోఁ
> బాశంబు బాశలఁ బాదుకొల్పి...."

వ.చ. 1-94, 98, 2-149, 3-111

మొదలగు అనేకపద్యములందును, 1-48వచనమున వసురాజుపరముగను ఇందుని పరముగను శ్లేష చమత్కృతులుకలవు మరియు శ్లేషానుప్రాణితఉపమ, రూపకాదు లెన్నియోకలవు. అనుప్రాస, యమకాద్యలంకారముల చమత్కృతులుసుఅనేకములు కలవు. గిరికా సౌందర్యవర్ణనలందు, వనవిహారాది సందర్భములందు ఊహౌన్నత్యము, భావవైచిత్రులెన్నియో కలవు. శుక్తిమతీ కోలాహల సంవాద ఘట్టమున, మాయాయతి మాటలలో గుణీభూత వ్యంగ్యము పోషించబడినది. ఇంద్రుడు అమ్లాన పద్మమాలికను, వేణుయష్టిని వసురాజునకు కానుకగా నొసంగి వాని మాహాత్మ్యములను వర్ణించుపట్ల శ్లేష, యమకాలంకార చమత్కృతులు, భావవైచిత్రులును కలవు.

శబ్దార్థములందు వక్రత, ఉక్తివైచిత్రి, అలంకార బహుళత, భావౌన్నత్యములు కలిగిన రామరాజభూషణుని విదగ్ధఫణితిని కేవల శబ్దవైచిత్రితో కూడిన ప్రబంధముగానే కొందరు విమర్శకులు ఎంచిరి. కాని శ్రీ పుట్టపర్తి నారాయణా

వాక్యాల పంటివారు– "సంస్కృతమున భట్టబాణుల పలుకుబడి యింతింతగాదు. బాణోచ్ఛిష్టం జగత్సర్వం'అని పండితులాయనకు బ్రహ్మరథమును బట్టిరి. ఆతడు తడవిచూడని విషయమే లేదు. వాగ్దేవి యా మనస్విని వలచినది. ఆతని కనుసన్నల నాడినది. ఆతని తరువాత సంస్కృతమున నంతటివాడు పుట్టలేదు. అట్లే తెలుగునకు భట్టుమూర్తి. భాషతో నాతడాడినది యాట పాడినది పాట ఆతనినోట నేమాట వెడలినను నందొక శ్లేష–యొక వైచిత్రి నవ్వుచుండు"నని అభిప్రాయపడినారు.[1]

—○—

## వసుచరిత్రలో ధ్వని

ప్రబంధారంభమున వసురాజును వర్ణించుపట్ల శ్లేష కలదు. ఉద్యానవనమును వర్ణించుపట్ల ఊహావైచిత్రి కలదు.

"అవటి సానులు రత్న రుచిరంబులన నేల
వాని వంశములెల్ల నీను మణులు...."

వ.చ. 2–5

అను మొదలగు కోలాహలపర్వత వర్ణనలో, గిరికాదేవి నఖశిఖపర్యంత సౌందర్య వర్ణనలో శ్లేష, భావవైచిత్రులు కలవు. గిరికాదేవి సఖుల వనవిహార, జలక్రీడాదుల వర్ణనాసందర్భమున భావచమత్కారము కలదు.ఇంద్రకోలాహల సంభాషణలలో యమకాలంకార చమత్కృతి,నదులు, పర్వతములు వివాహమునకై తరలి వచ్చు వర్ణనలో శ్లేషచమత్కారము,వసురాజు గిరికల నలంకరించుపట్ల, కేళీగృహ వర్ణనలలో శాస్త్రపాండిత్యముతో కూడిన భావచమత్కారములు కలవు. ఈవిధముగా వసుచరిత్రలో శబ్దార్థాలంకారములు, వైచిత్రులు కనవచ్చుచున్నవి. వీనికి ఆధారముగా, జీవమంతము (న్యూక్లియస్)గా శ్లేష యుపయోగించబడినది.

1. సారస్వత వ్యాసములు. పుట 289.

## విదూషకుని మాటలలో శ్లేషయా? వ్యంగ్యమా?

విదూషకుడు మాయాయతి రూపమున గిరికాదులున్నచోటునకు పోయి, వారి సమ్ముఖమున వసురాజు పరముగను, సూర్యునిపరముగను అర్థము వచ్చునట్లు మాట్లాడినాడు. కాని విదూషకుని మాటలలోని సూర్యపరమైన అర్థమునే మంజువాణ్యాదులు గ్రహించగలిగిరి. విదూషకుడు యతివేషమును తీసివేసి తిరిగి ప్రవేశించినపుడు అంతకుముందు ఆతని మాటలలో గల వసురాజు పరమైన అర్థమును గ్రహించి వారు "మందాక్ష మంద మందాక్షలగుచు, నగుచు భావించి రతని వాఙ్నైపుణములు". అపుడిట విదూషకుని మాటలలో శ్లేషయా? వ్యంగ్యమా యను ప్రశ్న ఉదయించుచున్నది. విదూషకుని మాటలలోని రెండర్థములను పాఠకులు మొదటి నుండియే గ్రహింతురు. వారికి వసురాజు పరమైన అర్థము ముఖ్యార్థముగను, సూర్యపరమైన అర్థము గౌణము, చమత్కార జనకముగను గోచరించును. మంజువాణ్యాదులు మాత్రము సూర్యపరార్థమును ముందుగ, వసురాజు పరార్థమును తరువాత గ్రహించగలుగుదురు. అట్లు గ్రహించిన తరువాత పాఠకులకు వలె వారికిని వసురాజు పరమైన అర్థము ప్రధానమై, సూర్యపరమైన అర్థము అప్రధానమై, చమత్కార హేతుకమై గోచరించును. అందులకే వారు నవ్వుదురు. ఇక్కడ అర్థాంతరస్ఫురణము చమత్కార హేతువగుటచే దానిని గుణీభూత వ్యంగ్యముగానే గ్రహించవలయునని శ్రీ వజ్ఝలవారి యభిప్రాయము.[1] ఎచట వ్యంగ్యార్థమప్రధానమో అది గుణీభూతమగును. విదూషకుని మాటలలోని వ్యంగ్యార్థము వసురాజు పరమగు వాచ్యార్థమును చారుతరమొనర్చుటకై తోడ్పడుచున్నదే గాని దానికది చమత్కార హేతుకమై లేకపోవుటచే దానిని గుణీభూతవ్యంగ్యముగా గ్రహించవలయును.

అనేకవర్ణనల సందర్భములలో రామరాజభూషణుడు శ్లేష, శ్లేషానుప్రాణిత రూపకోపమాద్యలంకారములను, సమాసోక్తి, పర్యాయోక్తి, ఉత్ప్రేక్షాతిశయోక్త్య

1. వసుచరిత్ర విమర్శనము పుట 89

లంకారములను ప్రయోగించినాడు. ఈయలంకారము లన్నింటిలో వ్యంగ్యస్పర్శ కలదు ధ్వన్యాలోకకారుని మతానుసారముగా రూపకాద్యలంకారములు గుణీభూత వ్యంగ్యత్వము కలవి- "తదేవం వ్యంగ్యాంశ సంస్పర్శే సతి చారుత్వాతిశయ యోగినో రూపకాదయోఽలంకారాః సర్వ ఏవ గుణీభూతవ్యంగ్యస్య మార్గః(ధ్వన్యా 503 పుట)." మహాకవుల అలంకారయుక్తవాణిలోని ప్రతీయమానస్మృత ఛాయ స్త్రీలకు లజ్జవలె అతిముఖ్యమైన భూషణము-

ముఖ్యా మహాకవి గిరామలంకృతి భృతామపి
ప్రతీయమానచ్ఛాయైషా భూషా లజ్జేవ యోషితామ్

ధన్యా. 3-37

గుణీభూత వ్యంగ్యము కూడ రసభావాదుల తాత్పర్య పర్యాలోచనానంతరము ధ్వనిగానే పరిణమించునని ధ్వనికారుని యభిప్రాయము-

ప్రకారోయం గుణీభూత వ్యంగ్యోఽపి ధ్వనిరూపితామ్
ధత్తేరసాది తాత్పర్య పర్యాలోచనయాపునః

ధ్వన్యా. 3-40

జగన్నాథాదులు కూడ వక్రోక్తిభరితమైన గుణీభూతవ్యంగ్యమునకు ఉచితస్థానమును ఏర్పరచియుండిరి.



## శుక్తిమతీకోలాహల వృత్తాంతమున శ్లేషయాః ధ్వనియాః

ఈ వృత్తాంతమున అచేతనములగు నదీపర్వతములను సచేతనములగు స్త్రీపురుషులనుగా కవి చిత్రించుటకు పూనుకొనినాడు. ప్రాచీనకవులు, ఆధునిక కవులును ప్రకృతియందు మానవత్వము నారోపించుట కలదు. రామరాజభూషణుడే వసుచరిత్ర ప్రథమాశ్వాసమున జడప్రకృతిలో చేతనత్వము నారోపించి చమత్కరించియున్నాడు. అట సమీరణము నందు దక్షిణనాయకత్వము, అత

లందు స్త్రీత్వము నారోపించి భావవైచిత్రి, ఉత్ప్రేక్షాద్యలంకార చమత్కృతిని ప్రదర్శించినాడు. శుక్తిమతీ కోలాహల వృత్తాంతమున శబ్దములకు రెండర్థములు కలవు. కావున నట శ్లేషయా? ధ్వనియా? యను ప్రశ్న ఉదయించును—

శుక్తిమతీ కోలాహలులు కావ్యనాయిక గిరికకు తలిదండ్రులు. శుక్తిమతి నది కోలాహలుడు పర్వతము. నదుల యందు స్త్రీత్వమును, గిరులయందు పురుషత్వము నారోపించుట ప్రాచీనాచారమే. వసుచరిత్రకథలో కోలాహలుడు శుక్తిమతిని మోహించి, బలాత్కరించును. అపుడు కోలాహలుని శిక్షించి వసురాజు శుక్తిమతిని రక్షించుట చేత వానికథతో నాయకునకును సంబంధము కలదు. కాళిదాసు కుమారసంభవమును, కావ్యనాయిక యగు పార్వతి తండ్రి హిమవంతుని వర్ణనతో నారంభించినాడు. అట హిమవంతుని పర్వతస్సంబంధ దివ్యవైభవమును మాత్రమే కవి గ్రహించెను. కాని జంగమరూపమును చెప్పుటకు గాని సూచించుటకుగాని కవి ప్రయత్నించలేదు. ఆ హిమవంతుని కుమారుడే కోలాహలుడు. ఆ కోలాహలుని యందు వసుచరిత్రకారుడు మానవత్వము నారోపించినాడు, అట్లే శుక్తిమతియందు స్త్రీత్వము నారోపించినాడు

"సుమనోవాస భాసుర శిఖోన్నతి వాడు
ఘనసార తిలక వాసనలవాడు...."
"తన కూటములఁ బ్రోదిఁ దాల్చి రంభాదులు
సరసభావముఁ దప్పి శిరమువంప...."

వ.చ. 2-108, 113

అను పద్యములలో రెండర్థములు కలవు- ఒకటి పర్వతసంబంధి, రెండవది పురుష సంబంధి. కోలాహలుడు పర్వతము కావున పర్వతార్థమును మొదట గ్రహించవలయును. ఆ పర్వతార్థము ననుసరించుచు పురుషసంబంధి యర్థము శబ్దశక్తి సహాయమున పాఠకులకు స్ఫురించుచున్నది. అదేవిధముగ

"జీవనమెల్ల సత్కవి నిషేవిత మాశయమెల్ల నచ్ఛతా...."
"అనుకూల భేలనాయత్త జీవనమైత్రి
నడరి నర్మద బోటియై భజింప...."
"బాలకూర్మ విలాసపదములు కాంతారం
భా ప్రతిబింబోరు భవ్యరుచులు..."

వ.చ. 2-105, 106, 110

అను పద్యములలోను రెండర్థములు కలవు- ఒకటి నదీ సంబంధి. మరొకటి స్త్రీ సంబంధి. శుక్తిమతి నది కావున నదీ సంబంధి యర్థమును ముందు గ్రహించ వలయును. ఆ నదీసంబంధి యర్థము ననుసరించుచు శబ్దశక్తి మూలకమైన పాఠకులకు స్త్రీసంబంధి యర్థము స్ఫురించుచున్నది. మరియు ఒక్కొక్కపుడు శబ్దములకు రెండర్థములు లేకయే నదీపర్వత వర్ణనలో స్త్రీ పురుషులను భావ వ్యంగ్యము గోచరించుచున్నది ఉదాహరణకు- శుక్తిమతిని గూర్చి చెప్పు నపుడు "ఆ నది పెంపు", "నలువ కొలువున కేగుచున్నది", "నదియుక్ విన యంబున నోరయై చనన్" అను 'నది'శబ్దములో'ఆమె' యను నర్థముగల 'అది' యను శబ్దము తొంగిచూచుచు వ్యంగ్యభావపోషకమై యున్నది నది 'ఓర'యై చనినదని చెప్పునప్పుడు 'ఓర' శబ్దము ద్వారా ప్రవాహము ప్రక్కగా జరిగి ప్రవహించెనను అర్థమేగాక శుక్తిమతి యను స్త్రీ ప్రక్కగా జరిగి వెళ్ళిపోయిన దను అర్థము స్ఫురించుచున్నది..

కోలాహలుని "ధరాధీశు"డనుటచే "పర్వతాధీశుడు"తో పాటుగ రాజు యను నర్థము అప్రయత్నముగ స్ఫురించుచున్నది."తన భాగదేయ మహి మంబున మిన్నులుముట్టి వచ్చు ధన్యుని"అనుచోట గల 'మిన్నులు ముట్టు' అను జాతీయమును వసుచరిత్రకారుడు వ్యంగ్యార్థస్ఫోరకముగా, నపూర్వముగా ప్రయో గించినాడు.

"అతుల శైవలవతీ శతములీనెడు మీకు
నాయిచ్చు విమలార్ఘ్య తోయమెంత...."

వ.చ. 2–122

అను పద్యమున పర్వతపరమగు అర్థమేగాక అభిజాత్యము గల పురుషుని పరముగా నర్థము స్ఫురించును. ఈ పద్యమున గల "కొండంత వారికవని గొండంత పూజసేయంగఁ గలరె"యను సామెతను కవి ధ్వనిస్ఫోరకముగ ప్రయోగించెను.

"......భవత్కమనీయకాంతి ధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవకసుళ్ళఁ బెట్టెదో"
నీవిఁక గ్రుచ్చి యెత్తి ఘన నిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్

వ.చ. 2–185

ఇందలి "సుళ్ళఁ బెట్టుట, తెప్పలను దేల్చుట" అను జాతీయములకు నదీతరంగము లలో గల సుళ్ళలో త్రిప్పుట అనియు తేల్చివేయుట అను శబ్దార్థములతో పాటు కష్టపెట్టుట, సంతోషపెట్టుట అను నర్థములు స్ఫురించుచున్నవి. "మతిఁ గ్రీడా రతి గల్గనేని సకలక్ష్మాపుణ్య దేశాళిఁ గాంచి తపస్స్వార్తి మెయిం గృశించి వన రాశిం జెందు మాబోంట్ల నుద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల..." (1-186) అను పద్య పాదములలో శ్లేషవిశేషము లేకున్నను నదీపరమైన అర్థమేగాక విరాగినియైన స్త్రీ పరమైన అర్థము స్ఫురించి రసిక హృదయరంజనమును కావించుచున్నది. ఇందలి క్రమ్మగనేల అను తెలుగుక్రియాపదములోని యర్థచమత్కారము గమనార్హము.

ఈ విధముగా రామరాజభూషణుడు శబ్దశక్తిమూలకముగ అనేకపద్యము లందు నదీపర్వతములను స్త్రీ పురుషులుగా ధ్వన్యమాన మొనర్చినాడు.

"అనవిని నగరాజు ఘన
ధ్వని గిరిమకుఁ గలఁగి ముకుళిత కరాంబుజయై...."

వ.చ. 2-131

అను పద్యము ద్వారా శుక్తిమతీకోలాహలుల వృత్తాంతమున ధ్వని కలదని కవి సూచించినాడేమో! ఈ వృత్తాంతమున కవి యంతటను స్త్రీ పురుష పరమైన అర్థములను వ్యంగ్యమొనర్చుచు, నదీపర్వతసంబంధి వాచ్యార్థకథను మిక్కిలి రంజక మొనర్చుచు, జడపదార్థముల కామోపభోగ వృత్తాంతములోని రసాభాసదోషమును కొంతవరకు నివారించినాడని చెప్పవలయును.

శుక్తిమతీకోలాహల వృత్తాంతమున గల రెండర్థములను నియతముగా తెలుసుకొనవలసిన అవసరము లేదు ఇట సహృదయపాఠకుల శబ్దజ్ఞాన శక్త్యాను సారము రెండవ అర్థము అనగా శబ్దశక్తిమూలకధ్వని స్ఫురించి చమత్కార హేతువగుచున్నది. కావున అపుడది కేవలము శ్లేషయని చెప్పుటకు వీలులేదు. "అర్థాంతరస్ఫురణ రూపమగు నిట్టి ప్రౌఢరచనను గావ్యజీవిత భూతధ్వనిగ సంభావించుట మాని కావ్యశరీరమున కనియతములగు నాభరణముల వంటి యలంకారములలోఁ జేర్చి దాని విలువ తగ్గించుట స్వారస్యముగా నుండదని తోఁచుచున్నది" యని శ్రీవఝ్ఝలవారు విశ్వనాథాదుల మతాధారముగా వచించి యుండిరి.[1]

1. వసుచరిత్ర విమర్శనము. పుట 82.

శ్రీనాథుడు కాశీఖండమున వింధ్యమును గూర్చి-

"స్థావరం బైన రూపంబు జలదవీథి
నావరించుచు మొదలనున్నట్లయుండ
జంగమంబైన రూపంబు నవధరించి
యెదురుగా వచ్చె వింధ్యమహీధరము"

కా.ఖం. 1-97

అని చెప్పెనే కాని యాతడు ఆ వింధ్యము యొక్క జంగమరూప మెట్టిదో ధ్వనింపజేయలేదు.

ఈ విధముగా కుమారసంభవమున గాని, కాశీఖంతమునగాని మరి యే యితర కావ్యములందుగాని లేనట్టి అపూర్వరీతిలో రామరాజభూషణుడు నదీ పర్వతములను స్త్రీ పురుషులుగా వ్యంగ్యమొనర్చినాడు అదేవిధముగ ఇంద్రుడు వసురాజున కొసంగు పద్మమాల, వేణుయష్టి వర్ణనా సందర్భములందును కవి చక్కని శ్లేషమూలక ధ్వని వైభవమును ప్రకటించి రక్తిని కట్టించినాడు. మరియు అనేకచోటుల ప్రకృతాప్రకృతశ్లేషాద్యలంకారములను ప్రయోగించుచు ఉపమాద్యలంకార వస్తుధ్వనులను కవి పోషించినాడు.

ఇట్టి శ్లేషాద్యనుప్రాణిత వ్యంగ్యములేగాక వసుచరిత్రలో, మనుచరిత్రలో గల విభావానుభావాదుల వర్ణనద్వారా ప్రతీయమానము చేయబడిన రసధ్వని యును కలదు. "సాహితీ రసపోషణుడ"నని చెప్పుకొనిన రామరాజభూషణుడు శృంగారమునంగిగా గ్రహించి, ఇతర రసస్పర్శ నధికముగా కావించక నాటకములో వలె దానినికావ్యాద్యంతమున,విభావానుభావాదులచే పుష్టమొనర్చి పోషించి నాడు. కావుననే రసవ్యంజకమైన మొదటి స్వతంత్రకావ్యమును వ్రాసిన ఘనత రామరాజభూషణునికే దక్కుతున్నది

రామరాజభూషణుడు మనుచరిత్రలో వలెనే రసధ్వనిని ప్రకటించుటయే గాక, తన ఉక్తివైచిత్రి, భావచమత్కృతి, అలంకారప్రయోగ వైభవములచే వస్తు, అలంకార ధ్వనులను, గుణీభూతవ్యంగ్యాదులను ప్రకటించి మించె ననవచ్చును.



# వసుచరిత్రలో చమత్కారము

ధ్వని సిద్ధాంతపోషకుడగు అభినవగుప్తుని శిష్యుడైన క్షేమేంద్రుడు చమత్కారము నిట్లు ప్రశంసించియున్నాడు- "నహి చమత్కార విరహితస్యకవేః కవిత్వం కావ్యస్య వా కావ్యత్వమ్" మరియు-

"ఏకేన కేనచిదర్ఘ మణి ప్రభేణ
కావ్యమ్ చమత్కృతి పదేన వినా సువర్ణమ్
నిర్దోశ లేశమపి రోహతి కస్యచిత్తే
లావణ్య హీనమివ యౌవనమంగనానామ్

క.కం. పుట 71

కావ్యమున చమత్కారము లేకపోయిన అది మణి పభాహీనమైన సువర్ణము మరియు లావణ్యహీనమైన సుందరి సౌందర్యము వంటిదని క్షేమేంద్రుని యభిప్రాయము. చమత్కారహీనమైన కవి కవిత్వము కవిత్వము కాదు, కావ్యము కావ్యము కాదనియు ఆతని యభిప్రాయము.

"ప్రతీయమానం పునరన్యదేవవస్త్వస్తివాణీషు మహాకవీనామ్
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాంగనాసు

ధ్వన్యా 1-4

సుందరి యందు సౌందర్యాతిరిక్తమై లావణ్యము భాసిల్లునట్లుగా కవి యొక్క వాణిలో వస్త్వంతరమొకటి ప్రతీయమానమగుచుండునని ఆనందవర్ధనుడు చెప్పి, ప్రతీయమానమగు ఆ వస్త్వంతరమును ధ్వనిగా పేర్కొనినాడు. కవిత్వములోని ధ్వని సుందరియందు ప్రకాశించు లావణ్యముగా పేర్కొనబడగా- క్షేమేంద్రుడు చమత్కారహీనమైన కవిత్వము లావణ్యహీనమైన సుందరిసౌందర్యమని చెప్పి చమత్కారమునకు ధ్వనిసిద్ధాంతము ప్రక్కన సరిగద్దియను వేసినాడని చెప్పవచ్చును అదేవిధముగ ఆతడు పేర్కొనిన దశవిధ

చమత్కారములు. మరియు ఔచిత్య సిద్ధాంతము ధ్వనిసిద్ధాంతపు మారురూపములని గ్రహించవచ్చును క్షేమేంద్రుడు పేర్కొనిన దశవిధ చమత్కారములు— అవిచారిత రమణీయః, విచారిత రమణీయః, సమస్తసూక్త వ్యాపీ, సూక్త్యైకదేశ దృశ్యః, శబ్దగతః, అర్థగతః, శబ్దార్థగతః అలంకార గతః, రసగతః, ప్రఖ్యాత వృత్తగతశ్చ"[1] క్షేమేంద్రుడు పేర్కొనిన ఈ దశవిధ చమత్కారములు వసుచరిత్రలో అడుగడుగున కలవనుట సహృదయపాఠకులకు తెలియును.

క్షేమేంద్రుని తరువాత విశ్వేశ్వరుడు తన చమత్కార చంద్రికలో చమత్కారమును గూర్చి చెప్పినదానిని శ్రీ వి. రాఘవన్‌గారు ఇట్లు పేర్కొనిరి— "Chamatkara ia the Sahrudaya's delight on reading a poem and that the Alambanas of this Chamatkara in a poem are seven-Guna, Riti, Vritti, Paka, Shayya, Alankara and Rasa.[2]
ఈ యేడు విషయముల మీద ఆధారపడిన చమత్కారములు వసుచరిత్రలో సుస్పష్టములై కలవు. మనుచరిత్రలో రస, గుణ, వృత్తి, శయ్యా సంబంధి చమత్కారములు కలవని చెప్పవచ్చును. కాని వసుచరిత్ర శబ్దార్థగతాది చమత్కారములకు నిలయమైనది. విశ్వేశ్వరుడు చమత్కారమును మూడు విధములుగా విభజించి దానికి ధ్వని సిద్ధాంతముతో పొందును కూర్చినాడు— చమత్కారి (శబ్దచిత్రము) చమత్కారితర (అర్థచిత్రము, గుణీభూతవ్యంగ్యము), చమత్కారితమ (వ్యంగ్యప్రధానము). క్రీ.శ. 1729 ప్రాంతమువాడైన హరిప్రసాదుడు చమత్కారమును కావ్యాత్మగా గ్రహించినాడు. జగన్నాథపండితుడును "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్. రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనకజ్ఞాన గోచరతా. లోకోత్తరత్వం చాహ్లాదగతః చమత్కారాపర పర్యాయః" అని చమత్కారస్థానమును గుర్తించియున్నాడు [3]

వసుచరిత్రప్రబంధమున విశ్వేశ్వరుడు పేర్కొనిన త్రివిధచమత్కార భేదములలో చమత్కారితర, చమత్కారితమ తరగతికి చెందిన చమత్కారములే కలవు. కాని చమత్కారి అనగా శబ్దచిత్రత్వము లేదు.

1. కవి కంఠాభరణమ్, పుట 71
2 Some concepts of Alankara Sastra. Page 270
3. Some concepts of Alankara Sastra. Page 271

రామరాజభూషణుడు, దండి కుంతకులు పేర్కొనిన వక్రోక్తి, విచిత్ర మార్గములలో నడచి ఉక్తివైచిత్రులను, వివిధ వ్యంగ్యములను ప్రదర్శించి చమత్కారమును పోషించినట్టివాడు. పెద్దన దండి, కుంతకులు పేర్కొనిన స్వభావోక్తి, సుకుమార మార్గములలో నడచి సహజోక్తుల ద్వారా భావికత్వమును పోషించినట్టివాడు. రెండును భిన్నమార్గములైనను రెండును సహృదయ రంజనము కావించునట్టివే. కాని—

> "యథాయూనస్తద్వత్పరమ రమణీయాపి రమణీ
> కుమారాణామంతఃకరణ హరణంనైవ కురుతే
> మదుక్తిశ్చేదంతర్మదయతి సుధీభూయ సుధియః
> కి మస్యానామస్యాదరసపురుషానాదర భరైః

నై.చ. 22 - 1

రమణీయ సౌందర్యముగల రమణి యువకుల నాకర్షించినట్లుగా బాలకుల నాకర్షించదు. అదేవిధముగ విపశ్చిద్వర్గము నానందింపజేయు నా మహాకావ్యము నీరసహృదయులైన అసహృదయుల నాకర్షించదు, వారి యనాదరణచే నా కావ్యము దోషయుక్తము కానేరదని శ్రీహర్షుడు వచించినట్లుగా వసుచరిత్ర పాండిత్యప్రౌఢులను మాత్రమే రంజింపజేయునట్టి కావ్యమై, మనుచరిత్రను మించిన ప్రౌఢగుణము కలదై భాసించుచున్నది.



## వృత్తులు

రసానుగుణమైన అర్థములతో కూడిన పదరచనయే వృత్తి "వృత్తిర్నియత వర్ణగతో రసవిషయో వ్యాపారః" అని కావ్యప్రకాశకారుడు. అనగా రసవ్యంజకములైన వర్ణములతో కూడిన వాగ్వ్యాపారము వృత్తి. వృత్తులు నాలుగు విధములు—కైశికి, సాత్త్వతి, ఆరభటి, భారతి

కైశికి– "శృంగార కరుణరసములు మిక్కిలి సున్నితమగు విధమున వర్ణించిన కైశికీవృత్తి యగును" అని ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము.

మనుచరిత్రలో ప్రవరుని గాంచినప్పుడు వరూథినిలో కలిగిన శృంగార విలాస, సాత్త్వికభావ వర్ణనలు కైశికీవృత్తిలోనే నడచినవి. తృతీయాశ్వాసమున 5,6,7,8 పద్యములలో వరూథిని విరహవేదన, అదే ఆశ్వాసమున 93, 94, 95 పద్యములలో వరూథిని మాయాప్రవరుని తోడి కరుణరస ముట్టిపడు సంభాషణ, మొదలగు సందర్భములందు కైశికీవృత్తి కలదు.

వసుచరిత్రలో తృతీయాశ్వాసమున 48, 49, 50, 51 పద్యములలో గిరికాహృదయమున అనురాగోదయమగుట, గిరికావసురాజుల చక్షుఃప్రీతి కైశికీవృత్తిలో వర్ణించబడినవి. చతుర్థాశ్వాస - 52, 53, 54 పద్యములందు గిరికాదేవి విరహవేదన, సఖుల యూరడింపు కరుణరసాత్మకమై కైశికీవృత్తిలో ఘటించబడినవి.

సాత్త్వతి– "ఈషత్ప్రౌఢములగు వీరభయానక రసములను ఈషత్ప్రౌఢ సందర్భమున వచించిన సాత్త్వతి యగును" అని ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము.

మనుచరిత్రలో చతుర్థాశ్వాసమున మృగయావర్ణన, స్వారోచిరాక్షస యుద్ధవర్ణనాసందర్భములందు సాత్త్వతీవృత్తి కలదు. అదే ఆశ్వాసమున 68,69, 70 పద్యములందు మనోరమభయాదుల వర్ణన సాత్త్వతీవృత్తిలో కూర్చబడినది.

ఆరభటి– "రౌద్ర బీభత్సరసములు పెలుసుగ వర్ణించబడిన ఆరభటి యగును" అని ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము.

మనుచరిత్రలో మనోరమను ముని శపించుఘట్టమున ఆరభటీవృత్తికలదు. రాక్షసుని వర్ణనలో, మృగయా, యుద్ధవర్ణనలలో కొంతవరకు, కళావతి జన్మ వృత్తాంతమున కొంతవరకు ఆరభటి నాశ్రయించిన రచన కలదు.

వసుచరిత్రలో ద్వితీయాశ్వాసము 102, 142, 152 పద్యములు ఆరభటిలో కూర్చబడినవి వసుచరిత్రలో రౌద్రబీభత్సరస సందర్భములందేగాక

ఇతర సందర్భములందనేక చోటులలో ఆరభటీవృత్తి కూర్చబడినది. ఉదాహరణకు– కోలాహలపర్వత, సరోవర వర్ణనలు.

భారతి– "కొంచెము కోమలములగు హాస్యశాంతాద్భుత రసములు కొంచెము మృదువైన సందర్భమునఁ జెప్పఁబడిన భారతి యగును" అని ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము

మనుచరిత్రలో–
"ఊసరవెల్లిచందమున నొక్కట బీఱ నరాలు ...."

"ధగధగని దేహకాంచి నిగనిగని కుందనపుఁ
దగడుఁ దెగడం జిగురు జిగి నెగుచు మోవిన్...."

ము.చ. 4–79, 117

అను పద్యము లందు భారతీవృత్తి కలదు. ప్రవరుని ధీరశాంతత్వవర్ణన భారతీవృత్తిలోనే కూర్చబడినది. వసుచరిత్రలో చతుర్థాశ్వాసము 59పద్యమున భారతీవృత్తి కలదు

రసానుగుణమైన పదరచనను, వర్ణముల కూర్పును మనుచరిత్రలో పెద్దన ఎక్కువగ పాటించినను మొత్తముమీద ఆతని కవిత ప్రసాద,మాధుర్య, సౌకుమార్యగుణములచే కూడినదై కైశికీవృత్తిలోనే సాగినదని చెప్పవలయును. వసుచరిత్రలో రసానుగుణమైన పదరచన, వర్ణముల కూర్పు కనబడినను మొత్తము మీద రామరాజభూషణుని కవిత ప్రౌఢమై, ఓజఃకాంతి గుణములతో కూడినదై ఆరభటీవృత్తికి చెందినదని చెప్పవలయును.



## శయ్య

"పదము లొండొంటితోఁ గదిసి మేల్సరణి
గుదిరిన శయ్యనాఁ గొమరారు కృతుల" అని ఆంధ్రప్రతాపరుద్రయశో భూషణము.

"కదిసి పదంబులు మందటి
పదములతోఁ బరమమైత్రిఁ బరగి పరపదా
స్పదమన కుండిన గతులం
దది శయ్య......" అని కావ్యాలంకారసంగ్రహకర్త. అనగా పరస్పరానుగుణమైన పదముల కూర్పు శయ్య యనబడును. పదము నొకదానిని తీసి మరొక పర్యాయపదమును చేర్చుటకు వీలులేని, అనగా పరపదాసహిష్ణుతతో కూడిన పదమైత్రికలదే చక్కని శయ్య.

మాలాకారో రచయితి యథాసాధు విజ్ఞాయమాలాం
యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వదేవాభిధానమ్.

కావ్యా. 1-59

మాలాకారుడు పువ్వుల నేరియేరి పూలమాలను అందముగకట్టు విధముగా కవి యే పదముతో యేపదమును జోడించవలయునో తెలిసికొని శ్రద్ధతో కవితను కూర్చవలయునని భామహుని యభిప్రాయము. ఇట్టి శయ్యాసౌభాగ్యము మనుచరిత్రలో నంతటను గోచరించును. 'అల్లసాని వాని అల్లిక జిగిబిగి' యని ప్రసిద్ధి. ఇట 'జిగి'యన కాంతి యను కవితాగుణము. ఇక 'బిగి' బిగువు యొక్క రూపాంతరమే. బిగువు అనగా వదలుగా లేనిది, దృఢమైనదని యర్థము పదముల యొక్క దృఢమైన బంధము కలిగి పరపదాసహిష్ణుతతో కూడినది, పెద్దన కవిత్వమని అల్లిక జిగిబిగిలోని 'బిగి' కర్థము.

పెద్దన కవిత్వములోని పదమైత్రి, పరపదాసహిష్ణుత, సరివృత్త్యసహిష్ణుతతో కూడిన గాఢబంధము ప్రసిద్ధమై సహృదయవేద్యమైనట్టిది.

శబ్దాలంకారచ్ఛాయ కొంతవరకు శయ్యకు సౌందర్యము నాపాదించవచ్చును. కావ్యాలంకారసంగ్రహములో రామరాజభూషణుడు శయ్య కుదాహరణముగా నొసగిన పద్యమున అనుప్రాసకలదు-

"రతిపతివో తెలుపున భా
రతి పతివో నుత గుణాభిరామత రామ
క్షితిపతివో ధరనోబ
క్షితిపతి నరసింహ శౌర్యజిత నరసింహా!"

కావ్యా. సం. 2-39

"ఇట్లనుప్రాస భూయిష్ఠముగా నుండుటయే శయ్యయని భ్రమింపరాద"ని తద్వ్యాఖ్యలో శ్రీ సన్నిధానమువారు తెలియజేసిరి. కావున శయ్య, అనుప్రాసాది శబ్దాలంకారములు కలదిగా నుండవలయునని నియమము లేదు. కాని అనుప్రాసాది శబ్దాలంకారములు శయ్యలో నొక లక్షణముగా నుండవచ్చునని రామరాజభూషణుని పై లక్ష్యపద్యమును బట్టి తేలుచున్నది. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణమున శయ్య కుదాహరణముగ నొసగిన పద్యమునను ఇట్టి యనుప్రాస కొంతకలదు

వసుచరిత్రలో వృత్త్యనుప్రాస, యమకాద్యలంకారము లనేకములు కలవు. అంతేగాక శుక్తిమతీకోలాహల వృత్తాంతమున కవి ప్రయోగించిన జీవనము, గంభీరత, రసము, ఆశయము మొదలగు అనేకపదములు పాఠకహృదయములందు వ్యంగ్యభావ చమత్కారములను కలిగించు శక్తికలవై యున్నవి. వీనికి మారుగా నీరు, లోతు హృదయాదిశబ్దములను ప్రయోగించిన యెడల చమత్కారము పుట్టదు. కోలాహలుడు "ప్రబలతర దీర్ఘ భుజశాఖఁ బట్టుటయు" అనుచోట దీర్ఘ భుజశాఖకు మారుగా దీర్ఘ భుజదండమనిన పూర్వ చమత్కారముండదు. అట్లే "వేణి చలింపఁ గంపిత నవీన మృణాళభుజాగ్ర కంకణశ్రేణి నటింప...." అను పద్యములోని యేయొక్క పదమును తీసి పర్యాయపదమునేదైన పయోగించుటకు వీలులేదు. అట్లే 3-101, 6-60 సంఖ్య గల పద్యములలో కవి ప్రయోగించిన "తమ్ముల" అను శబ్దమును తీసి పద్మమను శబ్దమునుంచినచో నట్టి పూర్వచమత్కారము కలుగదు.

"నాకుల దైవతంబు లలనాకుల భూషణమీ లతాంగి మే
నాకుల భూధరేంద్రుల యనాకుల నిర్మల భాగ్యరాశియై...."

వ.చ. 6-12

అను పద్యమున పదముల మార్పిడిచేసిన యమకాలంకార చమత్కారయు నశిం చును. ఈ విధముగా పరపదాసహిష్ణుతతో కూడిన శయ్యాసంపదగల పద్య ముల నెన్నింటినో వసుచరిత్ర నుండి ఉదాహరించవచ్చును.

పెద్దన రామరాజభూషణు లిరువురును అల్లిక జిగిబిగి గల కవులే. కాని వారిలో పాకభేదము కలదు పెద్దనది ద్రాక్షాపాకము. పద్యములలోని యర్థము లప్రయత్నముగా గోచరించును. రామరాజభూషణునిది నారికేళపాకము. అర్థ ము లప్రయత్నముగా కాక ప్రయత్నముచేత ప్రకటమగును, "ఓపిక కలిగి బుద్ధిని లోనికిఁ జూపిన రసాస్వాదము సేయనను వగును."[1]

వృత్తి, రీతి, గుణ, పాకముల పరస్పరాశ్రయత్వమును కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యలో శ్రీసన్నిధానమువారుఒసగిన ప్రకారముగా—పెద్దన కవిత్వము కైశికీవృత్తితోకూడి, ప్రసాదమాధుర్యగుణములతో వైదర్భి రీతిలో నడచినది. పాకము—ద్రాక్షాపాకము. రామరాజభూషణుని కవిత్వము ఆరభటీవృత్తితో కూడి ఓజఃకాంతి గుణములతో గౌడీరీతిలో నడచినది. పాకము—నారికేళపాకము.



1. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము. పుట 115.

# అలంకారములు

కావ్యశోభ నతిశయింపజేయుటకు అలంకారములు అత్యవసరములు.[1] కావ్యమునకు శబ్దార్థములు శరీరములు కాగా ధ్వని ఆత్మయగును. మరియు అలంకారములు సొమ్ములగును.[2] ఈ సొమ్ములు కావ్యేందిరయొక్క సహజ లావణ్యమును కప్పివేయునంతగా కాక ఆమె సహజ లావణ్యమునకు దోహద కారులు కావలయును. కావ్యమున అలంకారములయొక్క ఆవశ్యకతను గూర్చి శ్రీ వి. రాఘవన్ గారిట్లు నుడివిరి–

"The function of Alankara is to heighten the effect, it is to aid the poet to say more pointedly"[3]

అలంకారములు కవి భావములను, కావ్యవస్తువును స్పష్టముగా దర్శింప జేయుటయేగాక వస్తురస వ్యంజకములునై సహృదయానందమును కలిగించ వలయును. శైలూషికయొక్క ఆహార్యమేవిధముగా భావప్రకటనకు తోడ్పడుచు రసికప్రేక్షక హృదయములందు రసోత్పత్తికి హేతుభూతమగునో అదే విధముగ అలంకారములు కావ్యమున భావప్రకటనకు, తద్ద్వారా రసవ్యంజకతకు తోడ్పడవలయును. కావున అలంకారములను కేవలము అలంకారార్థమే యుపయోగించకూడదు. మరియు కావ్యమున అప్రయత్నముగా కవిచే ప్రయోగించబడిన అలంకారములు సుందరికి సహజాలంకరణలవలె మిక్కిలి సొబగును చేకూర్చును.

---

1. "కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే..."

కావ్యాద. 2–1

2. తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవ మలంక్రియా వితానము సొమ్ముల్. కావ్యా.సం. 2–53

3. Some concepts of Alankara Sastra. Page 89.

# మనుచరిత్రలో అర్థాలంకారములు

మనుచరిత్రలో సహజాలంకరణ శోభయే అధికముగ కనవచ్చుచున్నది. భావసుస్పష్టతకు, వస్తుసందర్శనమునకు, సజీవదృశ్యచిత్రణకు మాత్రమేగాని యలంకారములను అలంకారముల కొరకు మాత్రము ఏ పద్యములోను పెద్దన మనుచరిత్రప్రబంధమున కూర్చలేదు. ఉపమ, స్వభావోక్తి, ఉత్ప్రేక్ష, రూపక, అతిశయోక్తి, భ్రాంతి, కావ్యలింగ, అర్థాంతరన్యాస, అప్రస్తుత ప్రశంస, ఉదాత్త, అత్యుక్తి, తద్గుణ, పరికర, నిదర్శన, అర్థాపత్తి, దీపక, ఉల్లేఖ, భావిక, లోకోక్తి, విషమ, మీలిత, పరిణామ, ప్రౌఢోక్తి, కైతవాపహ్నుతి, వ్యాజస్తుతి, ప్రౌఢోక్తి, సముచ్చయ, వ్యతిరేక, ఆక్షేప, విశేషోక్తి, హేతు, అనుమాన, ప్రతిషేధ, వక్రోక్తి, విభావన, క్రమ, సార,సమాధి వినోక్తి, సహోక్తి, తుల్యయోగిత, పర్యాయోక్తి, కారణమాల, సమాధి, అధిక, లలిత, మీలన, సమాసోక్తి- అలంకారములను పెద్దన మనుచరిత్రలో ప్రయోగించినాడు. వీనిలో స్వభావోక్తి, ఉపమ, ఉత్ప్రేక్ష,రూపక, తద్గుణ, అర్థాంతరన్యాస, లోకోక్తి, అతిశయోక్త్యలంకారములను విశేషముగా ప్రయోగించినాడు. వానిలోను స్వభావోక్తి, ఉత్ప్రేక్షాలంకారములను పెద్దన ఎక్కువగా నాదరించినాడు. స్వభావోక్తి, భామహాదులు చెప్పిన వార్తామాత్రము కాదు. దండి స్వభావోక్త్యలంకారమును విశేషముగా నాదరించి తన కావ్యాదర్శమున అలంకారముల వివరణను దానితోడనే ఆరంభించినాడు. స్వభావోక్తి, కవి వర్ణ్యవస్తువుయొక్క యథార్థస్వరూపస్ఫుటీకరణ సమర్థమైన దని యాతడు చెప్పెను. ప్రతి యలంకారమున నేదో చమత్కృతియుండును గదా. మరి యున్నదున్నట్లు వర్ణించు స్వభావోక్తిలో చమత్కారమునకు తావేది యను ప్రశ్న ఉదయించవచ్చును వస్తువు యొక్క నానావస్థలను మనోహరముగ వర్ణించుటయే అట చమత్కారము. అట్టి సహజవర్ణన వస్తుస్థితిని పాఠకుల హృదయములందు సజీవమొనర్చి ఆహ్లాదజనన హేతువగుచున్నది. కావ్యములోని పాత్రల స్వరూపములను, చేష్టాదులను వర్ణించునపుడు పెద్దన స్వభావో

త్యలంకారము నాశ్రయించినాడు. మృగయా సందర్భమున స్వరోచి వేటాడు వర్ణనను, ఆతని వెంట బయలుదేరు రాజకుమారాది పరివార వర్ణనను, జంతువుల స్వభావాదుల వర్ణనలను పెద్దన స్వభావోక్తి ద్వారా రక్తి కట్టించినాడు. ఈ కారణము చేతనే గదా పెద్దన మృగయా వర్ణన ఆంధ్రసాహిత్యమును నభూతో నభవిష్యతిగా నిలచినది. పెద్దన మనుష్యుల చేష్టలనే గాక పశుపక్ష్యాదుల చేష్టలను గూడ సహజముగా వర్ణించి హృదయానందమును కూర్చును-

కొలకొలఁగూయుఁ బై నొఱగుఁ గుత్తుకఁగుత్తుకఁ జుట్టుబాఱుచి
ల్వల క్రియఁగానరాని గతుఁ మఱుమైఁ జొచ్చుఁ జనించు న
గ్ర లఱత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలపవు కంటె పాసినవెతల్ దపించుచుఁ గోకదంపతుల్

మ చ 3-62

అను పద్యమున వియోగానంతరము కలుసుకొను చక్రవాకముల ప్రేమోత్కంఠ హృదయంగమముగ వర్ణించబడినది. అట్లే-

"ఏ విహంగముఁ గన్న నెలుఁగిచ్చుచును సారె
కును సైకతంబులఁ గూడఁదారు...."

మ.చ. 3-16

అను పద్యమున చక్రవాకి యొక్క విరహము,అన్వేషణలు సహజముగ వర్ణించబడినవి. అదేవిధముగ నీ క్రింది పద్యమున లేళ్ళయొక్క స్వభావవర్ణన సహజసుందరముగా నున్నది-

"ఘనముగఁ దమచెవుల వాలుఁగన్నులు సోలన్
మొన సెలవియెత్తి ప్రియు నా
ననమున్ మూర్కొను నఱు నాకెడు వేళన్...."

మ.చ. 6-78

ప్రేమసూచకముగా లేళ్ళు మోరలెత్తి మగలేడి ముఖమును మూర్కొనుట్, మెడను నాకుట మొదలగునవి వాని స్వభావము. దానిని పెద్దన స్వభావోక్తితో కనులకు కట్టునట్లు వర్ణించినాడు-

"పలుకులునేర్పు వేళఁగలభాషిణి నీవిటులుండఁ బంజరం
బుల నరగన్నువెట్టి ముఖముల్ చరణాగ్ర నఖాళి గోఁకుచున్

నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్టుపల్కఁ న
ప్పలుకులె యట్టులె త్తి విని పల్కెఁడు వింటివె కీరశారికల్''

మ.చ, 3-58

అను పద్యమున పక్షులు కాలి కొనగోళ్ళతో ముఖములను గోకికొనుట, నిలుగుట, ఆవులించుట, మొదలగు చేష్టలు స్వభావసహజముగ వర్ణించబడినవి.

''తొండముల్ సాఁచి యందుగుఁ జిగుళ్ళకు నిక్కఁ
కరుల దంతచ్ఛాయ గడలుకొనఁగ......''
''చకితైణాహుతి దావ మావళితపుచ్ఛ గచ్ఛత్తర...''

మ.చ. 2-7, 4-38

మొదలగు పద్యములలో గజవరాహ హరిణాది వన్యమృగముల చేష్టలు సహజ సుందరముగా వర్ణించబడినవి.

స్వభావోక్త్యలంకారమును ప్రయోగించినంత తరచుగ పెద్దన ఉత్ప్రేక్షాలంకారమును ప్రయోగించినాడు. ఈ రెండు అలంకారములు ఒక్కొక్కటి మనుచరిత్రలో దాదాపు 67మారులు పద్యగద్యములలో ప్రయోగించబడినవి. పెద్దన ఉత్ప్రేక్షాలంకారభేదములలో ద్రవ్యోత్ప్రేక్ష, గుణోత్ప్రేక్షలను ప్రయోగించినాడు. ఉత్ప్రేక్షాలంకారమున స్వాభావికమైన వస్తు, గుణ, క్రియాదులను కవి తన భావనాబలముచే వేరువిధముగా నూహించుట జరుగును. వేరువిధముగా ననగా ఉపమానముగా నూహించబడుటయే యిందలి చమత్కారము. పెద్దన సూర్యోదయాస్తమయ పర్వతాది వర్ణనాసందర్భములందు భావనావిహంగముల నెగురవేసినాడు. తృతీయాశ్వాసము 17, 20, 22, 25, 26, 54, 61,75, 81, 91 చతుర్థాశ్వాసము 43, పంచమాశ్వాసము 45, 64, 68 మొదలగు పద్యములందు రమ్యమైన ఊహలు కనిపించుచున్నవి. ఇందలి భావనలన్నియు కవియొక్క ఊహావైచిత్రికి నిదర్శనములు.

ఉత్ప్రేక్ష తరువాత పెద్దన ఉపమ, రూపకాలంకారములను ఎక్కువగా ప్రయోగించినాడు. ఇవి యొక్కొక్కటి దాదాపు 50మారులు పద్యగద్యములలో ప్రయోగించబడినవి. ఈ రెండు అలంకారములు వస్తురూప గుణ విషయ దర్శనమునందు పాఠకులకు మిక్కిలి తోడ్పడినవి. పెద్దన ప్రయోగించిన ఉప

మానములు అతని లోకజ్ఞతను, ఉపజ్ఞతను ప్రకటించునట్టివి, కాని పూర్వకవి ప్రయోగ పఠన పరిశీలనాధారములైనవి కావు. పెద్దన లుప్తోపమ, పూర్ణోపమ, అభూతోపమ, మాలోపమ అను మొదలగు ఉపమాలంకార భేదము లను ప్రయోగించినాడు. పెద్దన ప్రయోగించిన ఉపమాలంకారము లొక్కొక్క చోట వ్యంగ్యవైభవముతో కూడినట్టివి. ఉదాహరణకు-

"వాని చంద్రదనము వైరాగ్యమునఁజేసి...."

మ.చ. 1-52

అను పద్యములో వేశ్యలను మధుకరాంగనలతో, ప్రవరుని సంపెంగపూవుతో నుపమించి కవి భావికథా సూచన కావించినాడు. లోకసామాన్య విషయమును గాని, వస్తువునుగాని ఉపమాద్రవ్యముగా గ్రహించి పెద్దన ఒక దృశ్యమునుగాని యొక వస్తుస్థితిని గాని పాఠకులకు ప్రత్యక్షమగునట్లు కావించును-

కరకరిఁగూట గట్టయిడఁగా మొఱవెట్టెడు లీల బాల భా
స్కరకర కాండ కందళ విఘట్టన నించుక వాయివడ్డ తా
మర మొఱవెట్టివెట్టి పలుమాఱును వాకిలిదాఁటి యాఁగుచున్
మొరయు విపంచి మీటుగతి మ్రోసియళుల్ వెడలెం గొలంకులన్.

మ.చ, 3-60

అను పద్యమున సూర్యకిరణములుతాకి పద్మము వికసించుట, అందు క్రితము రాత్రి బందీలై యున్న తుమ్మెదలు రొదచేయుచు బయల్వెడలుటను కవి పక్షుల గూటితో కఱ్ఱయిడి పొడిచిన పక్షులు మొఱపెట్టుచు బయల్వెడలుటతో పోల్చినాడు. అట్లే-

ఉరుతర విగ్రహస్ఫురణ నుబ్బిన సీదు పరిచ్ఛిదా ముఖాం
తరమునఁ దోరమై యెగయుదార నజాండము గాఱుకుప్పెతో
సరియనఁగాఁ దలాతల రసాతలసీమలు వీండి ధాత్రి ను
ద్ధరణ మొనర్చినట్టి నిను నాదివరాహము నాశ్రయించెదన్.

మ.చ. 6-109

అను పద్యమున అజాండము నొక గాఱుకుప్పెతో పోల్చి విచిత్రమైన పోలికను మనుచరిత్రకారుడు చెప్పినాడు.

పెద్దన రూపకాలంకారమును ప్రత్యేకముగా ప్రయోగించుటయేగాక దానిని యితరాలంకారములకు అంగము కావించియు అనేకచోటుల చెప్పినాడు-రూపక గర్భిత స్వభావోక్తి (4-63), రూపకానుప్రాణితోత్ప్రేక్షలు (3-79,120, 5-35, 36, 40, 92), రూపకానుగర్భిత అనుమానాలంకారము (3-76), రూపకోత్థాపిత హేతూత్ప్రేక్ష(3-74), లు మనుచరిత్రలో కలవు.

"మౌనినాథ! కుటుంబ జంబాల పటల
మగ్న మాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపగ నేషధ మొండుగలదె
యుష్మదంఘ్రి రజోలేశ మొకటి దక్క"

మ.చ. 1-64

అను పద్యములో రూపకాలంకారము మనోజ్ఞము. పెద్దన అటనట శ్లిష్టరూపకమును ప్రయోగించినాడు. శ్లేష ఏకపదమాత్రగతమై 1ఆశ్వా. 9, 18, 25 3ఆశ్వా. 21, 27: 5ఆశ్వా, 36, 40: 6ఆశ్వా.20 పద్యములలో రూపకాలంకారము కనబడుచున్నది

పెద్దన ప్రయోగించిన భ్రాంతిమదాలంకారములు మనోజ్ఞములు. మనుచరిత్ర ప్రబంధారంభపద్యముననే భ్రాంతిమదాలంకారము కలదు. మరియు-

"ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్
ఖురవారి శోణిత శంకద్రావ...."

మ.చ 3-11

అను పద్యమున భ్రాంతిమదాలంకారము కలదు. ఇందు సంధ్యారుణిమ వర్ణించబడినది. సూర్యకిరణములు సంధ్యాసమయమున క్రమక్రమముగా నూర్ధ్వముఖములగుచున్నవను వస్తు వ్యంగ్యము ఇందు కలదు.

పెద్దన స్వభావోక్తి, ఉత్ప్రేక్షల నాదరించినంతగ అతిశయోక్తి నాదరించకున్నను, ఆ యలంకారమును 30మారుల కంటె నెక్కుడుగానే పద్యగద్యములలో కూర్చినాడు. వస్తు యథార్థ స్వరూప సందర్శనమును కావించుటలో స్వభావోక్తి యెట్లు తోడ్పడునో అతిశయోక్త్యలంకారమట్లే తోడ్పడును. దండి అతిశయోక్తిని పొగడుచు ఇట్లు చెప్పినాడు- "వస్తుగతోత్కర్షత్వము, లోక

మర్యాద నతిక్రమించి వర్ణనచేయుటయే అతిశయోక్త్యలంకారము. ఇది అలంకారములలోకెల్ల ఉత్తమమైనది. వాచస్పతి ద్వారా పూజింపబడిన శ్రేష్ఠమైన అలంకారము. వైచిత్రిమూలకమైన ఈ యతిశయోక్తి యితరాలంకారముల కన్నింటికిని ఆశ్రయభూతమైనదని కవిగణము ప్రశంసింతురు."[1] అతిశయోక్తి సమగ్రవక్రోక్తితో కూడినదనియు, అతిశయోక్తితోడనే కవిత్వము రమణీయమగుననియు, ఇది లేని యే అలంకార రచన సాధ్యముకాదు కావున కవులు దీనికొరకు ప్రయత్నించవలయుననియు భామహుడు చెప్పెను.[2] ఇట్టి లాక్షణిక గణ ప్రశంసితమగు అతిశయోక్త్యలంకారమును పెద్దన వస్తువిషయోత్కర్షకును, భీకర, గంభీర భావాదులను ఉన్నదున్నట్లు ప్రదర్శించుటకుగాను గ్రహించియున్నాడు-

"గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగులలయి పో గోతముల్ గ్రుద్దు లీలన్ ..........."

"దానవుతద్ధరాధరము దాకె నుదగ్ర పదాగ్ర ఘట్టన
గ్లాని సపాటమై యచటి కాన ఘరట్ట విఘట్టితాకృతిం
బూని చెడం.. ...."

మ.చ. 4-8, 4-96

అను పద్యములలోని యతిశయోక్తి విషయోత్కర్షను కావించి యథార్థవస్తు తత్త్వము ను బోధించుచున్నది.

స్వభావోక్తి, అతిశయోక్త్యలంకారములు పైకి విరుద్ధాలంకారముల వలె భాసించును ఒకటి వసువిషయ యాథార్థ్యమును ప్రకటించగా మరొకటి వస్తు విషయోత్కర్షను కావించును. కాని రెండును భిన్నమార్గముల ద్వారా

---

1. వివక్షాయా విశేషస్య లోకసీమాతి వర్తినీ
అసావతిశయోక్తిః స్యాదలంకారోత్తమా యథా
అలంకారాంతరాణా మప్యేక మాహుః పరాయణమ్
వాగీశ మహితా ముక్తిమిమా మతిశయాహ్వయామ్.

కావ్యాద. 2-214, 220

2. కావ్యా. 2-84, 85

వస్తువిషయసందర్భనమునకే తోడ్పడుచున్నవి. అట్టి స్వభావోక్తి, అతిశయోక్తు లను ఒకేపద్యమున కూర్చుట పెద్దనకు ప్రియము. ఈ అలంకారసంసృష్టి అపూర్వమైనది-

"కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగుఱైన తటుల...."
"కండూతికై రాయఁ గర్కశంబగు తుంటిఁ
బీఁటవెట్టిన మ్రాను పెల్లగిల్ల...."

మ చ. 2-19, 4-17

మరియు 4ఆశ్వా. 2 , 6ఆశ్వా. 21 పద్యములలోను స్వభావోక్తి, అతిశయోక్తులు జంటగా నడచి యాహ్లాదమొసగుచున్నవి.

మనుచరిత్రలో నుదాత్తాలంకారము 13 మారులు ప్రయోగించబడినది. పెద్దన వస్తుసమృద్ధి నుద్యోపింపజేయుటకు ఉదాత్తమును ప్రయోగించినాడు-

"చిన్నివెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువతోఁబుట్టు మాకు..."
"బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులం బొల్చు..."
"సద్యోవినిర్భిన్న సారంగ నాభికా
హృతమై పిసాళించు మృగమదంబు...."

మ.చ. 2-48, 2-45, 2-55

అను పద్యములందును మరియు 5 ఆశ్వా. 102, 3ఆశ్వా. 111, 6ఆశ్వా.102, 4ఆశ్వా. 78 పద్యములందు ఉదాత్తాలంకారములు కూర్చబడి విజయనగరకాలమునాటి సంపత్సమృద్ధులను ప్రకటించుచున్నవి.

మనుచరిత్రలో లోకోక్తి, కావ్యలింగము, అర్థాంతరన్యాసము, అప్రస్తుత ప్రశంస, తద్గుణాలంకారములు ఒక్కొక్కటి యొకటి రెండుమారులకన్న నెక్కుడుగా ప్రయోగించబడినవి. ఈ యలంకారము లన్నియు సందర్భమున ఒదిగి పోయి అసహజములుకాక కవితకు మెరుగులు దిద్దుచు రసపోషకములుగా హృదయాహ్లాదకరములుగా నున్నవి. అట్లే మిగిలిన పైయలంకారములు సైతము పెద్దన ఉత్తమ వాగ్భంగిమలను ప్రకటించునట్టివియే గాని కేవలము అలంకారార్థము కూర్చబడినవి కావు.

## మనుచరిత్రలో శబ్దాలంకారములు

మనుచరిత్రలోని శబ్దాలంకారముల పైకి విమర్శకుల, వ్యాఖ్యాతల దృష్టి యెక్కువ మరలినట్లుగా లేదు మనుచరిత్రలో వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస, యమకము, అంత్యానుప్రాస, ముక్తపదగ్రస్తములు ప్రయోగించబడినవి. వీనిలో పెద్దన వృత్త్యనుప్రాస నెక్కుడుగ నాదరించినాడు. ఆతరువాత యమకముల సంఖ్య ఎక్కువగా కనిపించుచున్నది

అనుప్రాసాలంకారమును గూర్చి శ్రీ సన్నిధానమువారు ఇట్లు నుడివిరి— "రసానుగతమగు ప్రకృష్టమగు వర్ణవిన్యాసము అనుప్రాసము...' "రసము విభావాదుల చేతనే వ్యఙ్గ్యమానమగుచున్నను కొన్నివర్ణములు కొన్ని రసములను వ్యక్తముచేయు ననియు దెలిపితిమి. కాన నట్టి యాయా రసస్ఫోరకములైన వర్ణముల విన్యాసము."[1] ఇట్టి రసస్ఫోరకములగు వర్ణావృత్తులు మనుచరిత్రలో పలుతావుల కలవు. కొన్ని "రసపోషణము" విషయమున వివరించియుంటిని. మరికొన్ని విషయస్ఫురణకై తోడ్పడిన వృత్త్యనుప్రాసాలంకారములను పరిశీలింతము—

"స్వరుచి స్ఫురణను శశి భా
స్కర పావక తారకా ప్రకాశము లెల్లన్
విరళములుసేయ నతనికి
స్వరోచియను నామమిడి రచటి మునులెల్లన్.

మ.చ. 4-6

ఇందు రకారావృత్తియేగాక స, శ ల ఆవృత్తియు కలదు. వీని యావృత్తి స్వరోచి వపుఃరుచిస్ఫురణను పాఠకులకు తెలియజేయుచున్నది.

---

1. కావ్యాలంకార సంగ్రహము. పుట 544

"కరకా చిటపట రవ శ్రీ
కరమై పెళపెళ నినాద ఘనమై ఝుంఝూ
మరుదుజ్ఝిత బిలమంద్ర
స్వరమై యక్కొండ నొక్క వర్షము గురిసెన్"

మ.శ. 4-11

ఇందలి ర, ట, ఝకారముల ఆవృత్తి వర్షము కురియుటను అక్షిసాక్షాత్కార మొనర్చుచున్నది. అట్లే-

"ఉల్లల దళకా ఖలకణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద బంభర
మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్"

మ.చ. 2-6

ఇందుగల ద్విత్వలకార, ళకార, బకారముల ఆవృత్తి మదబంభర మల్ల ధ్వను లతోడను, పరిమళముల తోడను కూడిన మరుదంకురముల స్పర్శను పాఠకులకు కలిగించుచున్నది.

"కుటిల కృశ సాంధ్య శశినీ
విటకోరక కోమలచ్ఛవిస్ఫుట దంష్ట్రో
ద్భట పోత్ర ఖనిత్రాగ
స్ఫుటిత వసీధాత్రి నొక్క పోత్రిం గనియెన్"

మ.చ. 6-87

ఇందలి మొదటి రెండు పాదములలోని కకారావృత్తి, మిగతా రెండు పాదముల లోని త్రకారావృత్తి వరాహము యొక్క విజృంభణమును చక్కగా గోచరింప చేయుచున్నది.

ఘుర్ఘురారావ సంఘాత ఘూర్ణమాన
సప్తపాథోధి పాథః ప్రచండ నక్ర
తిమి తిమింగిలమగుచు నక్రమమును మహియుఁ
గ్రమ్ముకొనివచ్చు నొక యేకలమ్ముఁ గనియె"

మ.చ. 6-88

ఇందలి "ధ, గ, నిమి" వర్ణముల ఆవృత్తి, ఆకసమునంటివచ్చు యేకలము యొక్క రూపమును పాఠకుల హృదయములందు నిలుపుచున్నది.

"ధగధగని దేహరుచి నిగనిగని కుందనపుఁ
దగడుఁ దెగడం జిగురుజిగి నెగుచు మోవిన్"

మ.చ. 4-117

ఇందలి గకారావృత్తి ఇందీవరాక్షుని తేజోరూపమును చాటుచున్నది. అటే 4ఆశ్వా. 118లోని వకార, రకారముల ఆవృత్తి కువలయ వర్ణమును, మురజర వములను సూచించుచున్నది.

"ఇందునిభాస్య! వాఁడనగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో
యిందులకై వగలఁ బొగుల నేటికి? నేటికి నందుఁబోద మో
నందనభూమి భూమి సురనందనుఁడుండకపోఁడు రమ్ము నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁజేయదే

మ.చ. 3-68

ఈ పద్యమంతయు శబ్దాలంకార భరితమే. బిందుపూర్వక 'ద'కారావృత్తియే గాక 'నేటికి నేటికి' యనుచోట యమకాలంకారము కలదు. నందనభూమి, భూమిసురనందనుడు, జవ్వని యెవ్వని యనుచో ఛేకానుప్రాస కలదు.

"ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్షబా
ష్పకుల కోణ కోణ రుచులగ్రమునఁ జనజూచు చూపుతీ...."

మ.చ. 3-90

ఇందు రెండు పాదములందు ఛేకానుప్రాస కలదు. స్వరసాదృశ్యము లేని అవ్యవధానపూర్వక వ్యంజనసంఘమునకు కావృత్తి ఛేకానుప్రాస [1] అట్టి వ్యంజనావృత్తి పై పద్యమున కనిపించుచున్నది.

"నవ్వఁగఁ జాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై ...."

మ.చ. 3-135

---

1. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము. పుట 388

ఇట 'పాలు' అను రెండు వర్ణములు గల పదము ఒకే అర్థమున మూడు మారులు ప్రయోగించబడినది. ఆ పదములకు అవ్యవధానముగ నావృత్తిలేక పోవుటచే ఛేకము కాదు. దీనిని వృత్త్యనుప్రాసముగ చెప్పవలయును. వృత్త్యనుప్రాసమున ఒకేవ్యంజనమున కావృత్తి కలుగవలెనని లేదు. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణకర్త అభిప్రాయమున— "ఒకటి రెండు, మూడు మొదలుగ వ్యంజనములకు ఆవృత్తి కలిగెనేని వృత్త్యనుప్రాసము".[1] ఈక్రింది పద్యమున మూడు వ్యంజనములకావృత్తి కలదు—

"తడికంట నెపుడుఁ దఱుగక
కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి గాసిన్ బుడమిన్"

మ చ. 3—131

ఇట 'తఱుఁగ' వ్యంజన సమూహమున కావృత్తి కలదు.

"కాంచిన వస్తువుం దెలిసి కాంచినయట్లనుర క్తిఁ గాంచుచున్...."

మ.చ 3-89

ఇట 'కాంచు' హల్లుల జంటకావృత్తి కలదు. ఈ విధముగా అనుప్రాస సౌందర్యమేగాక మనుచరిత్రలో యమకాలంకారసౌందర్యము కూడ కలదు—

"నాళీక మధూన్మత్త మ
రాళీ ముఖరాళీ సుఖకంబగు కొలనం...."

మ.చ. 3-85

ఈ పద్యమున మరాళీ, ముఖరాళి యని అర్థభేదముతో కూడిన ఆవృత్తి కలదు. కావున నిది యమకమున కుదాహరణ మగును. "స్వరసహితములగు వ్యంజనముల కావృత్తి గలుగుట" యమకము. ఇందు స్వరసహితమగు వ్యంజనముల కావృత్తియేగాక వానికి యర్థభేదము వివక్షితము. కావున అర్థభేదముతో కూడిన "స్వరవ్యంజన పౌనరుక్త్యమున్నచోట యమకమనియు, కేవలవ్యంజనయుగ్మమున కావృత్తియున్నచో ఛేకానుప్రాసమనియుఁ జెప్పుట

1. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము పుట 388.

లెస్స"యని శ్రీ సన్నిధానమువారి యభిప్రాయము.[1] అపుడీ క్రింది మను చరిత్ర పద్యములలో యమకము కలదని చెప్పవలయును-

"పవమాన ప్లవమాన పంకజరజఃపాళీ పిశంగచ్ఛవీ..."

"కాంచి కలక్వణత్కనక కాంచికయై యెదురేగి యప్పుడ...."

"ఏలర! యీ చలంబుడిగి యేలర బాలరసాల మాలతీ..."

"పలాశి డాసి రాజుఁజూచిపల్కె నోరి! నోరికీ
పొలానఁ బెన్పొలాస లేకపోవ నీవు దోఁచితొ..."

"బొక్కఁగ లోకము పురిపురఁ
బొక్కఁగఁ బాడయ్యె నంతిపురమును బురమున్"

"జయజయ తామరసోదర సోదర చారుపదోజ్ఝిత గాంగఝరా...."

"మింట గ్రహరాజు తన సగమింట వెలుఁగు..."

మ.చ. 3-74, 3-89, 3-93, 4-98, 5-25, 6-104, 5-46

ఇక 3ఆశ్వా. 63పద్యములో గల యమకమును ఇతఃపూర్వమే పరిశీలించితిమి.

3ఆశ్వా. 84రగడలో పెద్దన అంత్యానుప్రాసను ప్రయోగించియున్నాడు ఇవిగాక షష్ఠ్యంత, ఆశ్వాసాంత పద్యములందు వృత్త్యనుప్రాస, అంత్యానుప్రాస, ఛేకానుప్రాసలను చూడవచ్చును.

విశ్వనాథుడు "శ్రుత్యనుప్రాస' మను ఒక శబ్దాలంకారమును గుర్తించి యున్నాడు దాని లక్షణము నాతడిట్లు పేర్కొనినాడు-

"ఉచ్చార్యత్వాద్యదేకత్రస్థానే తాలురదాదికే
సాదృశ్యం వ్యంజనస్యైవ శ్రుత్యనుప్రాస ఉచ్యతే"

సా.ద. 10-5

తాలు, కంఠ, మూర్ధ, ఓష్ఠ దంతాదులలో నేదైన ఒక్కస్థానము నుండి ఉచ్చరించబడు స్వరరహితవ్యంజనములయొక్క సమానత ఉన్న అది శ్రుత్యను ప్రాస యగును. అట్టి "శ్రుత్యనుప్రాస" మనుచరిత్రప్రబంధము నంతటను విస్తరించియున్నదని చెప్పవచ్చును. ఈ శ్రుత్యనుప్రాసయే మనుచరిత్రను మాధుర్యభరితము కావించినది.

2. కావ్యాలంకార సంగ్రహము. పుట 547.

# మనుచరిత్రలో శ్లేష

శ్లిష్టరూపకములను విడిచిన, మనుచరిత్రలో శ్లేషాలంకారము మూడు చోట్ల ప్రయోగించబడినది తృతీయాశ్వాసము 67వ పద్యమున చంద్రునకు యమునకు శ్లేషద్వారా అభేదాధ్యవసాయము చెప్పబడినది. కృత్యవతారికలోని ౨౫వ పద్యమున గల విశేషణములు ఈశ్వరరాయలు, నృపుడు ఇరువురి పరముగా శ్లేషించుచున్నవి. పైపద్యములో వలెనే ఇదియును శ్లిష్టరూపకమే. ఇతర శ్లిష్టరూపకాన్విత పద్యములలో నేదైన ఒక్క పదముమాత్రమే శ్లేషించుచుండగ నీ రెండు పద్యములలో పదము లన్నియు శ్లేషించుచు శ్లేషప్రాధాన్యము కలిగి యున్నవి.

"వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెం గరవ్యాపృతిం
గకుబంతంబుల నాక్రమించెఁ బొసఁగంగా నేర్చె వర్ణాళిఁ గాం
తికిఁ బాపెం బెఱ రాజకోటిఁ దుది శాంతింబొందె దైవంబు సేఁ
తకుఁ దాపంబిక నేలనంగ నిను దస్తప్రాప్తుడయ్యెం గడున్"

మ.చ. ౫-౩౨

అను పద్యమున శ్లేష కలదనియు, ధ్వని కలదనియు మతభేదము కలదు. ఇందలి విశేష్యపదము 'ఇనుడు'—శ్లేషించుటచేత (ఇనః సూర్యే ప్రభౌః అని రెండర్థములు) ప్రకృతాప్రకృత శ్లేష యగును. ప్రకృతమైన సూర్యసంబంధి యర్థముతో పాటు అప్రకృతమైన ప్రభుసంబంధి యర్థము కూడ స్ఫురించి తద్ద్వారా ఉపమేయ, ఉపమాన సంబంధము వ్యంగ్యమగుచున్నది. కావున నిట ప్రకృతాపకృత శ్లేషచేత ఉపమాలంకారము ధ్వనించుచున్నదని చెప్పవలయును.

పెద్దన ప్రయోగించిన శ్లేషలు రూపకాలంకార చమత్కృతికే గాని శబ్దార్థాలంకార వైచిత్రికై ప్రయోగించబడినవి కావు పెద్దన తాను "శఠకోప తాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితామతల్లి" కలవాడనని చెప్పుకొనినను అట్టి చిత్రకవిత్వాదులందాతనికి ప్రీతియున్నట్లు గోచరించదు.

కిరాతార్జునీయములో భారవి హిమాలయ, ఋతువర్ణనల సందర్భమున (5 సర్గమున)ను, శిశుపాలవధ కావ్యములో మాఘుడు ఋతువర్ణనల సందర్భమున (6 సర్గమున)ను అనుప్రాస, యమకాలంకారములను విరివిగా ప్రయోగించిరి. ఆ పరిపాటిని యనుసరించుటకా యనునట్లుగ పెద్దన మనుచరిత్ర తృతీయాశ్వాసమున పుష్పాపచయాది సందర్భమున అనుప్రాస,యమకములను కొంత వరకు ప్రయోగించి చూపినాడు. కాని పెద్దనలోని శబ్దాలంకారములు రచనలో నొదిగిపోయి సహజముగా, అప్రయత్నముగా వర్ణములు దొరలిపోయినట్లుగా కనిపించుటచే కాబోలు పాఠకుల దృష్టి నవి యంతగా నాకర్షించుట లేదు. ఇట్టి మనుచరిత్రలోని యనుప్రాస, యమకములను మించుటకే కాబోలు రామరాజభూషణుడు వసుచరిత్రలోను అనుప్రాస, యమకముల ప్రాచుర్యమును ప్రదర్శించినాడు వసుచరిత్రలోని యనుప్రాస యమకములు పాఠకుల దృష్టిని ఝట్టున ఆకర్షించునట్టివి.



## వసుచరిత్రలో అర్థాలంకారములు

వసుచరిత్రలో నేదోయొక అలంకారములేని పద్యమే లేదని చెప్పవలయును. ప్రతి పద్యమున నొక అర్థాలంకార వైచిత్రియో, శబ్దాలంకార వైచిత్రియో తప్పక కనిపించును.

రామరాజభూషణుడు స్వభావోక్త్యలంకారమును పెద్దనవలె అంతగా నాదరించలేదు. 'వసుచరిత్రలో 5 మారులు స్వభావోక్తి ప్రయోగించబడినది అవి పెద్దన స్వభావోక్తులంత రమ్యముగా లేవు. రామరాజభూషణుడు శ్లేష తరువాత ఉత్ప్రేక్ష, రూపక, సమాసోక్తి, ఉపమాలంకారములను విరివిగా ప్రయోగించినాడు. ఆ తరువాత భ్రాంతి, కావ్యలింగ, అపహ్నుతి, యథాసంఖ్య, వ్యతిరేక, క్రమ, ఉల్లేఖ, అర్థాంతరన్యాస, సామాన్య, విరోధాభాస, పర్యా

యోక్తి, సమాధి, అనుమాన, పరిణామ. విశేషోక్తి, స్మరణ, ప్రస్తుత, తుల్యయోగిత, సమ, సూక్ష్మ, భావిక, అన్యోన్య, కాకువక్రోక్తి, అర్థాపత్తి, వ్యాజోక్తి, విభావన, సందేహ, పరికరాలంకారములను కవి వసుచరిత్రలో ప్రయోగించినాడు. మనుచరిత్రలో కన్నను వసుచరిత్రలో గల అలంకారముల సంఖ్య అధికము.

పెద్దన వలెనే రామరాజభూషణుడు కృత్యాది పద్యమున భ్రాంతిమదాలంకారము కూర్చినాడు. పెద్దన ప్రయోగించిన తద్గుణ, లోకోక్తి, దీపక అప్రస్తుత ప్రశంస, సారాద్యలంకారములను రామరాజభూషణుడు గ్రహించలేదు. రామరాజభూషణుడు గ్రహించిన విరోధాభాస, కాకువక్రోక్తి, స్మరణ, విశేషోక్త్యాద్యలంకారములు మనుచరిత్రలో లేవు. వసుచరిత్రలో నున్నన్ని సమాసోక్తులు మనుచరిత్రలో లేవు. విరోధాభాస, సమాసోక్తులు శ్లేషనాధారముగ చేసికొన్నట్టివగుట గమనార్హము. అందు సమాసోక్తి ధ్వనికారాదులచే గుణీభూత వ్యంగ్యముగా గుర్తించబడినది. కావున వసుచరిత్రలో సమాసోక్త్యలంకారము వ్యంగ్యవైభవము నతిశయింపజేయుచు కావ్యశోభాదాయకమైయున్నదన వలయును (2:44, 128, 3:139, 140) విరోధాభాసమును కవి 1ఆశ్వా. 129 పద్యములందు ప్రయోగించినాడు.

రామరాజభూషణుడు శ్లేష తరువాత ఉత్ప్రేక్ష, రూపకముల నెక్కుడుగ నాదరించినాడు. ఆ తరువాత సమాసోక్తి, ఉపమలు వచ్చును. వానిలోను ఉత్ప్రేక్షలు మరియు శ్లేషమూలకోత్ప్రేక్షలు వసుచరిత్రలో నధికముగ కలవు. పంచమాశ్వాసమున 85 పద్యము మొదలుకొని 95వ పద్యము వరకు వరుసగా నుత్ప్రేక్షాలంకారములను ప్రయోగించుట కవియొక్క ఉత్ప్రేక్షప్రీతికి మంచి నిదర్శనము. వసుచరిత్రలోని యుత్ప్రేక్షలు రామరాజభూషణుని భావనావైచిత్రికి, ఊహానన్యత్వమునకు అద్దమును పట్టుచున్నవి. అందులో శ్లేషమూలకోత్ప్రేక్షలు చమత్కారయుక్తములై యలరించుచున్నవి. మనుచరిత్రలో—

"అంతటఁ బ్రాచీ నిశాపతి
యంతిక గతుఁడౌట విని ముఖాలంబి తమః

కుంతలములు దీర్పగఁ గొను
దంతపు దువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్"

మ.చ. 3-20

చంద్రోదయాత్పూర్వము పూర్వదిశయందు కనిపించు ధవళిమను పెద్దన ప్రాచి ధరించిన దంతపుదువ్వెనగా నుత్ప్రేక్షించగా రామరాజభూషణుడు శ్లేషమూల కోత్ప్రేక్షలో నిట్లు వర్ణించినాడు-

"ఘనతర గాఢసంతమస కల్ప మహోదధి సన్నలోకముల్
తన యుదయారుణద్యుతి వితానము పేరి రజోగుణంబుచే
ననువుపడన్ సృజింపఁ గమలాసనుఁడై ద్విజరాజు రా నమ
ర్చిన ధవళాబ్జపీఠమనఁ జెన్నలరెం దొలి తెల్పు తూర్పునన్"

వ.చ. 4-16

చీకటియను ప్రళయసముద్రము లోకములను ముంచివేయగా చంద్రుడను బ్రహ్మ రజోగుణముతో కూడినవాడై మరల సృజించుటకై అరుదేర నమర్చిన ధవళాబ్జపీఠమనునట్లు ధవళిమ తూర్పుదిశలో నొప్పెనని శ్లేషాధారముచే నొక చమత్కారభావనను కవి కావించియున్నాడు.

వసుచరిత్ర తృతీయాశ్వాసములోని జలక్రీడల సందర్భమున 156, 157, 158, 162 మరియు ద్వితీయాశ్వాసము 47 మొదలగు పద్యములలో రామరాజ భూషణుని యూహావైచిత్రి ప్రకటితమగుచున్నది

రామరాజభూషణుడు <u>రూపకము</u>ను శ్లేషానుప్రాణితముగనే తరచుగ వాడును.

ఒనర హిమావకుంఠనము లూడ్చి తెమల్చిన పత్త్రిభంగముల్
సన నసియాడుచున్ మొగడచన్నులు పల్లవపాణిఁ గప్పు నూ
తన లతికాలతాంగుల నుదారగతిం జలి వాపి నెయ్యపుం
బెనఁకువ నేర్పె దక్షిణ సమీరణుఁ డొయ్యనఁ దావులంటుచున్

వ.చ. 1-127

అను పద్యమున శ్లిష్టసావయవ రూపకము ద్వారా సమీరునియందు కవి దక్షిణ నాయకత్వమును పొందుపరచినాడు. అట్లే 1ఆశ్వా. 132 పద్యమున వసంత

ఋతువైభవమును ఒక మన్మథ రథోత్సవముగా సావయవరూపకమున కవి వర్ణించినాడు.

"తన యశోవిశద ముక్తాసౌధపాళికి
నంబుదాయనము వాతాయనముగ..."

వ.చ. 1-116

అను పద్యమున కవి వసురాజుయొక్క యశశ్శౌర్యములను వర్ణించుచు రూపకాలంకార వైచిత్రి సహాయమున చక్కని వస్తుధ్వనిని ప్రదర్శించినాడు. 1ఆశ్వా. 155, 2ఆశ్వా.36, 3ఆశ్వా.106, 142, 6ఆశ్వా.99 మొదలగు ఎన్నియో పద్యములందు రూపకాలంకారవైభవమును రామరాజభూషణుడు ప్రకటించియున్నాడు.

అలికులవేణి యారు నవయౌవనమన్ వలరాచతోటలో
బొలుచు నితంబవేదికడఁ బొక్కిలి డిగ్గియచెంత నీల సం
కలిత నవాంబు యంత్రమగుఁ గానియెడన్ రసగుంభనంబు సం
ధిలఁబుట ముబ్బునే నడుమ నిల్చి ఘనస్తన సూన గుచ్ఛముల్

వ.చ. 2-40

అను గితికాసౌందర్యవర్ణనా సందర్భమున కవి యామె యౌవనము నొక ఉద్యానవనముగా రూపింపజేసి స్తనసూనగుచ్ఛములను పుష్పింపజేసినాడు. ఊసరక్షేత్రమునను సస్యము పండించగలది రామరాజభూషణుని ప్రతిభ.

రూపకోత్ప్రేక్షల మేళనమును వసుచరిత్రకారుడు చాలాచోటుల కావించి వైచిత్రిని ప్రదర్శించినాడు-

తారాసస్యము పండినన్ గగనకేదారంబునం జంద్రికా
నీరంబారగఁ గోసి తద్రుచి ఫలానీకంబు ప్రాతర్మహా
సిరిగ్రామణి తూరుపెత్తెననఁదోఁచెం దూర్పునం దెల్పు త
ద్ధాతన్యస్త పలాలరాశి క్రియ నిందుం డేగె నిస్సారుడై

వ.చ. 4-130

అను పద్యమున నిట్టిరూపకోత్ప్రేక్షల మేళనమే కలదు.

"విషరాశిన్ జనియింపవో విషసహావిర్భూతి వాటింపవో..."

"బలిత గుబ్బ గుబ్బలులపై నిరవొంది మెఱుంగు దీఁగెచే....

"శ్రీవాణీ ధరణీ ముఖాంగనలపైఁ జిత్తంబు లేకున్కికే..."

వ.చ. 4-80, 2-72, 4-115

అను మొదలగు పద్యములందు శ్లేషమూలక కావ్యలింగాలంకారమును వసుచరిత్ర కారుడు ప్రయోగించినాడు. అట్లే 4ఆశ్వా. 34, 2ఆశ్వా.50 మొదలగు పద్యము లందు శ్లేషమూలక అర్థాంతరన్యాసము కలదు.

పురి పూఁదోఁటలతావి మిన్నులమ వేల్పుల్ మెచ్చి తద్భూజభా
స్వర సంతానములన్ దివిం బెనుప నా సంతానముల్ దివ్య ని
ర్ఝరిణీ నిర్మల వారిపూర పరిపోషంబందియు దన్మహో
తరులక్ష్మిం పరిపూర్తిఁగాన కెసఁగెం దత్కల్పశాఖి ప్రథన్

వ.చ. 1-108

అను పద్యమున కవి యతిశయోక్తిని ప్రదర్శించినాడు. స్వర్గములోని సంతాన వృక్షములు భూమి మీదగల వృక్షముల సంతానము లగుటచేతనే వానికా పేరు కలిగినదట! 'సంతాన'మను పదమునకున్న రెండు అర్థములను గ్రహించి కవి యిట్టి సంబంధమును కల్పించినాడు.

అలఘుస్యందనకోటి వీటిమణి రథ్యావాటికా హాటకా
కలితక్షోణుల నేఁగుచోఁ జటులచక్ర క్షుణ్ణ తత్క్షోదముల్
గలయం బర్వి సుపర్వలోక నదిలో గాంగేయపంకంబు జో
బ్బిలఁజేయం దఱుచై జనించి యచటం బెంపొందుఁ జెందామరల్

వ.చ. 1-103

అను పద్యమున రథములు అధిష్ఠానపుర వీథులందు నడచునపుడు అచటిబంగారు ధూళి (ఆ పురము హాటకాకలిత క్షోణి కలదగుటచే) లేచి ఆకాశగంగలో పడి యందు బంగారు బురదను కలుగజేసి, బంగారుతామరలు జనించుటకు కారణ మైనదట. ఏమి యతిశయోక్తి! వసుచరిత్రలోని యతిశయోక్తులు మను చరిత్రలోవలె వస్తు యథార్థస్వరూపదర్శనమునకు కాక కవి భావనా బలమునకు గీటురాయిగా నిలిచినవి. ఇట్టి రామరాజభూషణుని భావనాబలము సంస్కృత కవి శ్రీహర్షుని భావనాబలమును తలపించును. వసుచరిత్రలో నిట్టి యూహా న్నత్యము చాలాచోట్ల కనిపించును.

నిరతిన్ నాభి సురంగ మీఁగియు వళీ నిశ్రేణికన్ హత్తియు
న్వర రోమావళి వల్లరీగుణము నంటం బ్రాకియుం దత్పయో
ధర దుర్గంబుల నాక్రమించె నచలేంద్రద్వేషి చూపౌర సం
గర సామోద వినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే

వ.చ. 2—66

అను పద్యమున వసురాజు, గిరికా వపుస్సౌందర్యమును దర్శించుపట్ల ఒకానొక దుర్గారోహణమును స్ఫురింపజేయునట్టి సమాసోక్త్యలంకార వైచిత్రిచూపబడినది.

"విలసిత మౌక్తికంబులు సవిభ్రమరేఖలు నున్కి సాటిరాఁ......"

"కాంత పదమొంది యట యూరుఁ గ్రమ్మికాంచి...."

వ.చ. 2-44, 2—65

అను పద్యములందు శ్లేషమూలక సమాసోక్త్యలంకారము చెప్పబడినది. ఇట్టి శ్లేషమూలక సమాసోక్త్యలంకారములను వసుచరిత్రకారుడు విరివిగా రచించి తన వాగ్భంగిమా నైపుణిని ప్రదర్శించియున్నాడు.

## రామరాజభూషణుని శ్లేష ప్రీతి

హరిశ్చంద్రనలోపాఖ్యాన రచన ద్వారా రామరాజభూషణునికి గల అర్థ ద్వయ ఘటనాప్రీతి, దానియందు ఆతనికి గల ప్రావీణ్యము తెలియుచున్నది. రామరాజభూషణుడు మొదట చిత్రకవిత్వమును చేపట్టిన దిట్టయే. కావ్యాలంకార సంగ్రహములోని—

"శతలేఖినీ పద్య సంధాన ధౌరేయు
ఘటికా శతగ్రంథకరణ ధుర్యు...."

అను పద్యము దీని కాధారము.

"రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండం దద్గతి కావ్యమెల్ల నగునే నోహో! యనం జేయదే

పాండిత్యంబున నందనుం డెనుగుఁ గబ్బం బద్భుతంబం(డు ద
క్షుం డెవ్వాఁడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్"

రా.పా. 1-10

అను పింగళిసూరనార్యుని గర్వాతిశయమును మాన్పుటకు రామరాజభూషణుడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించెనని ప్రసిద్ధి. కాని దీనికి ముందు కావ్యాలంకారసంగ్రహ రచనానంతరము రామరాజభూషణుడు పండితజనాదరణపొందు చిత్రకవిత్వమును విడిచిపెట్టి పెద్దనకృత ప్రబంధముతో దీటగునదియే గాక కొన్ని విషయములందు మించునదియు నగు నొక ప్రౌఢ పబంధ రచనకు పూనుకొనినాడు. రామరాజభూషణుడును పెద్దన వలెనే కావ్య ఆశ్వాసాంత గద్యమున"పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితానిర్వాహకు"డనని చెప్పుకొనినాడు. కాని పెద్దన వలెనే రామరాజభూషణుడు చిత్రకవిత్వమును వ్రాయ బూనుకొనలేదు. సంస్కృత కిరాతార్జునీయ, శిశుపాలవధ వంటి మహాకావ్యములందు, పారిజాతాపహరణము వంటి తెలుగుప్రబంధములందును కనిపించు చిత్ర, బంధ, గర్భాది కవిత్వముల నాతడు ఆదరించలేదు. కాని యలంకారములన్నింటికి శోభనిచ్చు శ్లేషను రామరాజభూషణుడు పెక్కు పద్యములలో ప్రయోగించినాడు.

"శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్"- చమత్కార వర్ధనకు, ఉక్తివైచిత్రికి, వక్రోక్తికి శ్లేష శోభాదాయకమని దండి పేర్కొనినాడు. ఈ మతము నంగీకరించినవాడు రామరాజభూషణుడు-కావుననే శ్లేష సంసృష్టిలేని యలంకారములను తక్కువగా రచించినాడు. ఈ విషయమున సంస్కృతసాహిత్యములో ప్రౌఢకవులైన బాణ, సుబంధు, శ్రీహర్షులతో రామరాజభూషణుడు సరిగద్దియ మీద కూర్చుండదగినవాడు. వసుచరిత్రలో శ్లేష విస్తరముగ కనవచ్చుటచేతనే దీనిని శ్లేషకావ్యమని తక్కువచూపు చూడదలచినారు కొందరు. "చదువరులు రెండర్థములను నియతముగఁ దెలిసికొనకున్న కథాభాగము నడువని రీతిగనుండు సమానబలముగల అర్థములు శ్లేషార్థములనియనుట సమంజసముగా నుండు"నని శ్రీ వజ్ఝలవారి యభిప్రాయము.[1] రామ

1. వసుచరిత్ర విమర్శనము పుట 89.

రాజభూషణుడు శ్లేషను అలంకారమై చిత్రి, ఉక్తివైచిత్రుల కొరకు వాడినాడు. వసుచరిత్రలో కొన్ని చోటులందు అర్థద్వయము (శుక్తిమతీకోలాహల వృత్తాంతమున, విదూషకుని మాటలలో) శబ్దశక్తిమూలకధ్వని లేక గుణీభూతవ్యంగ్యము లేక సమాసోక్త్యాద్యలంకార ప్రకటన కొరకు ప్రయోగించబడినది. కొన్ని పద్యములలోని శ్లేష ఆయాశాస్త్రజ్ఞానము పాఠకున కున్ననే బోధమగును. ఉదాహరణకు—

అస్త్రాసవృత్తిఁ జెన్నలరి నూతన రాగ
మహిమఁ గుల్కెడు కల్కి మానికములు...."

వ.చ. 6–72

అను పద్యములోని శ్లేష రత్నశాస్త్ర పరిచితిలేనివారి కంతుపట్టదు.

"ఉరువురు దేవ సంభరణ లిర్వురు నబ్జధరోన్నమత్కరాం
తర మహనీయు లిర్వురు ననంత గుణాఢ్యులు గావునం..."

వ.చ. 5–37

అను పద్యమున మేరు మందరములు ఒకే విశేషణములతో శ్లేషాలంకారమున వర్ణించబడినవి. ఇది రామరాజభూషణుని శ్లేషప్రీతికి చక్కని యుదాహరణ. ఏలయన కవికచట ఆ రెండు పర్వతములను శ్లేషించుపదములతో నొకే పద్యమున వర్ణించు ఆవశ్యకత గాని, ప్రయోజనము గాని కథలో లేదు.

"వర సుమనోభవ్యతరుల కావాల మ
త్యలఘు కలాపాలికలకు ధరణి...."

"మన మనాలక్ష్మి నెనయు కొప్పిరుగడ
నిరుగడఁ దరుణాబ్జకృత వతంస...."

"తరుణార్క కబళనోద్ధతిఁ జూపె నెవ్వాడు
రుచులచే ఫలమోహ రుచులచేత..."

వ.చ. 1–94, 1–6, 1–8.

మొదలగు పద్యములననేకములను రామరాజభూషణుని శ్లేషప్రీతి కుదాహరణలుగా చూపవచ్చును. శ్లిష్టము కాని రూపకోత్ప్రేక్షాద్యలంకారములును వసుచరిత్రలో తక్కువ. అవియును రామరాజభూషణుని శ్లేషప్రీతిని, శ్లేషప్రయోగనైపుణిని చాటుచున్నవి

# వసుచరిత్రలో శబ్దాలంకారములు

ఆంధ్రసాహిత్యమున శబ్దాలంకారములను విరివిగా ప్రయోగించినవారిలో పోతన తరువాత రామరాజభూషణుని పేరు చెప్పుకోవచ్చును. పోతనలో శబ్దాలంకారములు రచనకు పుష్టినిచ్చి రసస్ఫోరకతకు తోడ్పడినవి. రామరాజభూషణుని శబ్దాలంకారములు రసస్ఫోరకతకేకాక, ఒకొకచోటఅర్థవైచిత్రికినితోడ్పడినవి సంగీతకళా రహస్యనిధియైన రామరాజభూషణుని శబ్దాలంకారములు కావ్యశరీరమునకు సౌందర్యమాధుర్యముల నొసగినవి "భావసమృద్ధి కలిగి చేసిన పద్యరచనలో నీ శబ్దాలంకారములు కవియొక్క ప్రతిభకొలది రామణీయకమును పండించిపోయు"నని శ్రీ విశ్వనాథవారు అభిప్రాయపడిరి.[1]

రామరాజభూషణుడు వసుచరిత్రలో వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస, యమక, ముక్తపదగ్రస్త, లాటానుప్రాసలను ప్రయోగించినాడు. లాటానుప్రాస ఒక్కమారు కలదు. వసుచరిత్రలో శ్లేష ఎంత యెక్కుడుగా కలదో దాదాపు అంత ఎక్కుడుగానే అనుప్రాస, యమకములు కలవు. ముక్తపదగ్రస్తము ఆశ్వాసాంతపద్యములందు కొన్నిటిలో మాత్రమే ప్రయోగించబడినది. వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస, యమకములు రామరాజభూషణుని కవితలో నప్రయత్నముగ దొరలిపోవుచుండును.

"ఏమంద మేమిసేయుద
మేమందని మందలింత మేమందమొ యిం
దే మందయాన నడుగుద
మే మందఱ మనుచుఁ దరళ హృదయాంబుజలై"

వ.చ. 3-181

ఇందలి పూర్ణానుస్వారయుక్త దకారానుప్రాస గిరికాదేవి యొక్క సఖుల కంగారును, విషాదమును ప్రస్ఫుటమొనర్చుచున్నది.

---

1. కావ్యపరిమళము పుట 114.

"వీనుల విందై అమృతపు
సోనల పొందై యమంద సుమచల దశినీ
గానము క్రందై అస్వన
మానంద బ్రహ్మమై యధిపతి పలికెన్...."

వ.చ. 2-14

ఇందలి 'విందై, పొందై, క్రందై' పదములలోని అనుప్రాస గిరికాదేవి గానము లోని మాధుర్యమును చెప్పకయే చెప్పుచున్నది.

"ఆవేళ మంజువాణి య
నావిల గతిఁజేరి దుస్సహ మిళింద పుళిం
దావలి కావలి కరువలి
యావలి కావలిత హృదయ యగు సతిఁ బలికెన్"

వ.చ. 3-126

ఇట 'ఆవలి' వ్యంజనసంఘముల ఆవృత్తిచే గిరికా హృదయగతవ్యాకుల మెట్టిదో స్ఫుటమగుచున్నది.

"కామి కమలాస్త్ర! కమలా
కాముక సుత! కామనీయక నిధీ యనుచుం
గామినులు విన్నవించిరి
కోమల కోకూయమాన కోకిల ఫణితిన్"

వ చ. 4-171

ఇందలి కకార మకారముల జంటయొక్క ఆవృత్తిచే కామినుల కోకూయమాన కోకిల ఫణితి యెట్టిదో స్ఫురించును.

"ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొక సీమ నానామయూర నినద...."

వ చ. 2-7

అను పద్యము నందలి య, క, ంత, ర, ండ, ందకారముల ఆవృత్తి, కోలాహలుని కలిమిని తెలుపుచు కోలాహలమనునామమూ కొండకెట్లు తగినదో ప్రత్యక్షీకరించుచున్నది.

"నాళీకాకర తీరసార కదళీ నారంగ పూగావళీ
పాళీ వాసితమైన కోనఁగని...." వ చ. 2-2౯

అను పద్యము నందలి ళకారావృత్తి కోనలో నల్లిబిల్లిగ అల్లుకొనియున్న లతా వృక్షములను దృష్టిగోచరము చేయుచున్నది.

"సరసదరీ ఝరీ వికచ సారస సౌరభసార పూరితాం
బరమగు నిమ్మహా నగము పజ్జనె ." వ.చ. 2-95

పై పద్యపు ప్రథమపాదములోని ర,సల ఆవృత్తి మరియు రకార ప్రాస పర్వతశోభను తెలుపుచున్నవి.

మనుచరిత్రలో వరూథిని వర్ణనాసందర్భమున (2ఆశ్వా 25) వరూథినికి కొన్ని విశేషణములను పెద్దన ప్రయోగించినాడు. ఆ విశేషణపదములు వేరు వేరు వర్ణములతో నారంభమగుచున్నవి. వసుచరిత్రకారుడు తన్వియగు గిరికను వర్ణించుచు తకారాది గల విశేషణ పదములనే ప్రయోగించి రక్తికట్టించినాడు-

"తరువుల పొంతఁ బొంచి వసుధావర మిత్రుడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీల కచఁ దామరసోదర సోదర ప్రభం
దరళ విలోచనం దత నితంబఁ దటిన్నిభ గాత్ర వల్లరిం
దరుణ శశాంకఫాల నొళ దన్విఁ దరంగవళిం దళోదరిన్"

వ.చ. 2-26

"అమిత యమకాళ నిధి"నని రామరాజభూషణుడు తననుగూర్చి కావ్యాలంకార సంగ్రహమున చెప్పుకొనినాడు. అది వసుచరిత్ర పరిశీలనము ద్వారా సత్యమనియే తెలుచున్నది. రామరాజభూషణుని యమకములు పద సంఘటనలో సహజముగ దొరలిపోవుచుండును.

"నాకుల దైవతంబు లలనాకుల భూషణమీ లతాంగి మే
నాకుల భూధరేంద్రుల యనాకుల నిర్మల భాగ్యరాశియై
నాకుల ముద్దుకూతురు పినాకుల కోడలటంచుఁ దెల్పి నా
నాకుల పాలికల్పొగడ నాకుల మ్రొక్కఁగఁ బంచెఁ గన్నియన్"

వ.చ. 5-12

మఱియు—

బెగడవల దనుచు బెట్టిద
మగు నెవ్వగ నగరు పడుచు నాఁడుంబడుచు లే
పగవారికి వలదన నా
పగవారికి నేల యొసగెఁ బద్మాక్షుఁ డనుచున్

వ.చ. 6–62

ఇట యమకమే గాక, ఏ పగవారికి వలదన, నా (యొక్క) పగవారికేల అడ పడుచు నొసగెనని యర్థము కలిగి వెంటనే అట 'ఆపగవారికి' యన "నదుల" కని యర్థము స్ఫురించి చమత్కారహేతువగుచున్నది ఇట అర్థక్లిష్టత అంతగా లేదు. అట్లే 6ఆశ్వా 98, 6ఆశ్వా 45, 60, 63, 62, 96 మొదలగు అనేక పద్యములందీ యమక చమత్కృతి కలదు.

మనుచరిత్రలో వలెనే వసుచరిత్రలోను శ్రుత్యనుప్రాస కలదని చెప్ప వలయును. తాలు, మూర్ధ, కంఠ, ఓష్ఠ, దంత్యాదులలో నేదైన నొక్క స్థానము నుండి ఉచ్చరించబడు స్వరరహిత వ్యంజనముల యొక్క సమానత వసుచరిత్ర యంతటను గోచరించును.

ఈ విధముగ అనుప్రాస యమకాదులు వసుచరిత్రలో రసపోషకము లును, చిత్తాహ్లాదకరములను చమత్కారజనకములునై యొప్పుచున్నవి. అనవసర మగు చోటుల, అర్థగాంభీర్యమును చెరచునట్టి శబ్దాలంకారములు వసుచరిత్రలో లేవు. కావున ఈ ప్రబంధములోని కవిత్వము కేవలము శ్లేష యమకానుప్రాస లతో కూడిన చిత్రకవిత్వము కాదని చెప్పవలయును.

## మను, వసుచరిత్రలలో సంసృష్టి, సంకరాలంకారములు

వసుచరిత్రలో నొక్క అలంకారముతో నొప్పు పద్యములు విరళములు. అనేకాలంకారముల కూర్పు గల పద్యములే యధికములు. అట్టి యనేకాలంకార ముల కూర్పు రామరాజభూషణునికి అనాయాసకార్యము.

ఇంతి మృదూక్తిమాధురికి నిక్షురసం బెనవోలఁజాల కా
ద్యంతము నోడి మధ్యమ గుణాశ్రయమై నెఱకాక నెన్ని జ
న్మాంతరము ల్వహించియుఁ దనంతనె ఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూనదెంత వాడియయ్యె నఖండ తదీయ సంపదన్

వ.చ. 2-46

అను పద్యమున శ్లేషోత్థాపిత వ్యతిరేకము, కావ్యలింగము, సమాసోక్త్యలంకార ముల కూర్పు కలదు.

"పరబల భంగచంగములభంగురతుంగ మతంగజంబు ల
ప్పురిఁ బరికీర్ణపుట పూరితభూరి తరానిలాహతి
న్విర్థియగఁదోల మేఘములు నింగి దొఱంగి తదంఘ్రిమూలముల్
శరణము నందఁబోలు ననిశంబు పదంబు మదంబు పేరిటన్

వ.చ. 1-101

అను పద్యమున అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, అపహ్నవ, వృత్త్యనుప్రాస అను నాలుగు అలంకారముల కూర్పు కలదు. రెండు లేక మూడు అలంకారముల నొకే పద్యమున కూర్చుట వసుచరిత్రలో సామాన్యవిషయమే. ఇక నాలుగు అలంకారముల కూర్పు కూడ కనిపించును-

బలి చూడామణులందు విష్ణుపదజల్ వాటించు ధాన్యంపుఁ ది
ప్పలు చంద్రామృతసాంద్రసేకముసఁ బైపై మోసు లెత్తంగఁ ద
త్కల మాంకూరపుఁ బంపుమేయు నెల జింకన్ సారె వారించు వా
రలతోఁబుట్టువు గంగ పద్మముఖ నిర్యద్భృంగ నాదార్భటిన్

వ.చ. -100

అను పద్యమున కావ్యలింగము, పరికరము, అతిశయోక్తి, రూపకాలంకారముల సంసృష్టి కలదు. పరస్పర నిరపేక్షములైన వివిధ అలంకారముల కూర్పు సంసృష్టి యనబడును. పరస్పర అంగాంగి భావముగల అలంకారములకూర్పు సంకరమనబడును. వసుచరిత్రలో నీ రెండు విధములైన అలంకారముల కూర్పు కలదు. మరియు ఒక్కొక్క పద్యమున కొన్ని యలంకారములకు సంకరము, కొన్ని యలంకారములకు సంసృష్టియు చెప్పబడినవి. ఉదాహరణకు-

అనయము నీలకంధరము నచ్ఛమము నన్న సమాఖ్య వారితో
నొనరియు నింతి వేనలికి నోడి యనిశ్చితరూప ధేయమై
చనియె మొగుల్నగావళికి శబ్దగుణంబులు సూపువాని నె
ట్టనఁ బురివిచ్చువాని దరిడాయు జడాత్మల కెవ్విఁ నిల్కడల్

వ.చ. 2-60

అను పద్యమున శ్లేష, అర్థాంతన్యాసములకు సంకరము, అర్థాంతరన్యాస సమాసోక్తులకు సంసృష్టియు కలదు. అదేవిధముగ అర్థాలంకారముల సంసృష్టి, సంకరము, అర్థాలంకార శబ్దాలంకారముల సంసృష్టి, కేవల శబ్దాలంకార సంసృష్టియు వసుచరిత్రలో కలవు.

మనుచరిత్రలోను అనేకాలంకారముల కూర్పు కలదు. ఇతఃపూర్వము పేర్కొనిన శ్లిష్ట రూపకములు, రూపకానుప్రాణితోత్ప్రేక్షలు కాక

"వదన ప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబులన పీని కన్నులమరు...."

మ.చ. 2-36

అను సీసపద్యమున హేతూత్ప్రేక్ష, రూపకానుప్రాణితోత్ప్రేక్ష, ప్రౌఢోక్త్యలంకారముల సంకర, సంసృష్టులు కలవు.

బలమిక నేమిసెప్ప విను పండు వెదుళ్ళవలీల మోరత్రో
పులఁబడఁ జొప్పవంచికొను పోలికవంచి తదగ్ర ధాన్యముల్
సెలవుల ఫేనముట్టిపడ జిట్టలతోడనె చప్పరించు న
వ్వోలము వరాహపోతములు భూవర తొండములేని యేనుగుల్

మ.చ. 4-17

అను పద్యమున రూపక, ఉపమ, స్వభావోక్తి, అర్థాపత్తియను నాల్గుగు అలంకారముల సంసృష్టి కలదు. 4ఆశ్వా 99 పద్యమున ఉపమాతిశయోక్తుల సంకరము, నిదర్శనతో సంసృష్టి సహాలంకార ధ్వనియు కలవు అట్లే 5 ఆశ్వా. 18 పద్యమున నాలుగు అలంకారముల కూర్పు, 5ఆశ్వా. 30 పద్యమున మూడు అలంకారముల సంసృష్టి కలవు. 3ఆశ్వా 47పద్యమున అనుమాన కావ్యలింగములకు, 1ఆశ్వా 8 పద్యమున ఉపమ ఉదాత్తములకు, 1ఆశ్వా 4

పద్యమున పరికర భ్రాంతులకు, 3ఆశ్వా 61 పద్యమునకైతవాపహ్నవఉత్ప్రేక్షల సంకరమున్నను, మనుచరిత్రలో తిలతండుల న్యాయమున సంసృష్టి గల పద్యములు ఎక్కువ. పరస్పరాపేక్షలేని అలంకారముల కూర్పును ఆతడు ఆదరించినాడు. పెద్దన ప్రయోగించిన అలంకారములు అక్లిష్టములై, అర్థవ్యక్తి గుణముతో కూడినవై రసపోషకములై యొప్పుచున్నవి.

రామరాజభూషణుని అనేకాలంకారముల కూర్పు ప్రధానముగా సంకర రూపమైనది అనగా పరస్పరాపేక్షతో కూడి, అంగాంగభావముతో నొప్పుచున్నవి. పద్యములోని భావవైచిత్రి, అలంకారసౌందర్యము వసుచరిత్రలో తేటపడవలయునన్న ప్రయోగించబడిన సర్వాలంకార సమన్వయము పాఠకులకు కలుగవలయును. కావుననే వసుచరిత్ర ప్రౌఢప్రబంధమై యొప్పుచున్నది.

మొత్తముమీద రామరాజభూషణుడు పెద్దనలోని సహజసుందరములైన ప్రసాదగుణభరిత అర్థాలంకారములను తన భావవైచిత్రీనూలక అర్థాలంకార రచన చేతను మరియు శబ్దాలంకార వైచిత్రిచేతను మించి వసుచరిత్ర నొక వక్రోక్తిభరితమైన ప్రౌఢప్రబంధముగా తీర్చిదిద్దినాడనవలయును.



# రసపోషణము

మనుచరిత్ర "రస సమంచిత కథల"తో కూడినది. అది శృంగార వీర కరుణ రసాన్వితములైన వృత్తాంతములతో కూడి బహునాయకాశ్రయ మైనది. అందుచేత విమర్శకులు మనుచరిత్రలో వస్త్వైక్యము శూన్యమనునంత వరకును పోయిరి. కాని మనుసంభవమను ఫలప్రాప్త్యున్ముఖమై కథ ముందుకు సాగుటచే కవి పురాణకథలో ప్రబంధోచితమైన వస్త్వైక్యలక్షణమును సాధించి నాడు. బహునాయకాశ్రయమై, రససమంచిత కథలతో కూడిన మనుచరిత్రలో అంగిరసమేది యనుటలోను విమర్శకులలో భిన్నాభిప్రాయములు కలవు. రామ రాజభూషణుని వసుచరిత్ర విషయమున నిట్టి బాధకము లేదు. అందు అంగి రసము శృంగారమనుట స్పష్టము. మహాభారతములోని రసశిల్పము మృగ్య మైన చిన్నకథను గ్రహించి రామరాజభూషణుడు తన సాహిత్య రసపోషణా ప్రతిభచేత వసుచరిత్ర ప్రబంధము నొక జాతిరత్నముగా సానబట్టినాడు. ప్రసిద్ధకథలో అనౌచిత్యములున్న తొలగించి, మార్చి రసపోషణకై అభినవాంశ ములను పోహశించి చెప్పవచ్చునని ధ్వన్యాలోకకారుని యభిమతము—

విభావభావానుభావ సంచార్యౌచిత్య చారుణః
విధిః కథా శరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా
ఇతివృత్త వశాయాతామ్ త్యక్త్వా౽ననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యాఽప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః
సంధి సంధ్యంగ ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా
ఉద్దీపనప్రశమనే యథావసర మంతతా
రసస్యారబ్ధ విశ్రాంతే రనుసంధాన మంగినః

ధన్యా. 3: 10—13

విభావభావానుభావ సంచారుల ఔచిత్యముతో కూడి రమణీయమైన ఇతివృత్తమును

గ్రహించవలయును. ఒకవేళ ఇతివృత్తమున అనౌచిత్యములున్న వానిని తొల గించి రసోచితముగా మార్చవలెను. రసోపస్కారకములుగా సంధి, సంధ్యంగ ములను కూర్చవలెనే కాని శాస్త్రమర్యాద ననుసరించుటకై కాదు ప్రబంధ ములో ఆయా ఘట్టములందు రసోద్దీపనమును, రసప్రశమనమును యథోచితముగ కావించవలెను. రామరాజభూషణుడు స్వయముగా అలంకారశాస్త్రకర్త కావున ధ్వన్యాలోకకర్త ఏర్పరచిన రసాదివ్యంజక నిబంధనముల నాతడు బాగుగా పాటించినాడు. "అవారిత సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములు సానలందీరిన జాతిరత్నము"లని వచించుటను బట్టియు ఆతడు రసాదివ్యంజక నిబంధనములను తెలిసినవాడనుట స్పష్టము. కావుననే అప్రసిద్ధమైన రసహీనమైన మహాభారతాంతర్గత కథను గ్రహించి రసవత్తరమైన ప్రబంధముగా తీర్చిదిద్ద గలిగినాడు. విభావభావానుభావ సంచారుల నుచితరీతిలో వర్ణించి సంపూర్ణ పుష్టిని చేకూర్చి అంగిరసమును పోషించినాడు అట్టి రామరాజభూషణునకు "సాహిత్య రసపోషణు"డను బిరుద మెంతగానో తగియున్నది

## వసుచరిత్రలో శృంగారము

వసుచరిత్రలో అంగిరసము శృంగారము. శృంగారరసమునకు ఆలం బన విభావములు నాయికానాయకులు వసుచరిత్రలో నాయకుడు వసురాజు మహాభారతకథలోని వసురాజు వంటివాడు కాడు. ఇతడు సుందరుడు, యువ కుడు, పరాక్రమవంతుడు, గంభీరుడు, అవివాహితుడు. మూలకథలో నాతడు శృంగారనాయకుడు కాడు. వసుచరిత్రలో నాతడు పూర్తిగా శృంగార నాయ కుడు ఆతడు గిరికా సౌందర్యము చేత ఆకర్షించబడినవాడు. ఆమెను ప్రేమించి విరహబాధ నొంది, ఆమెను పొందవలయునను కాంక్ష గలవాడు. నాయిక గిరిక ముగ్ధాస్త్రీ మూలకథలో గిరికకు వ్యక్తిత్వమే లేదు. వసుచరిత్ర లోని గిరిక సౌందర్యవతి, యౌవనవతి, సర్వకళా ప్రావీణ్య. అచ్చమైన శృంగార నాయిక. గిరిక వయోరూప లావణ్యములు, వసురాజు "తలిరుం బాయము వలరాజు నలరాజుం దెగడు సోయగము", పరాక్రమము వారికి పర

స్పరాలంబన విభావములు, నాయికానాయకుల పరస్పర వీక్షణములుద్దీపన విభావ ములు గిరికాదేవి లజ్జాదిచేష్టలు నాయకునకు ద్దీపన విభావములు, నాయికకను భావ ులు

"నీ వినూ తన విజయాంక గేయములఁ దావక చాటుకథా సుధారసం బున నలరింతు మీ భువనమోహినిఁ చిన్ననాట నుండియున్"

వ.చ. 3-56

అను మంజువాణి మాటలలో గిరిక యందు 'గుణకథ' అను శృంగారావస్థ ధ్వనితమ. గిరికకు తనయందు పూర్వరాగము కలదను జ్ఞానము వసురాజు నకుద్దీపన విభావము. మరియు గిరికయొక్క హేలహావశోభలు, నవలాలితదృష్టి జాలములు, అనిమేష దృష్టులు, వెళ్ళిపోవుచు వివిధ మిషలతోవెనుకకు తిరుగుట అను విలాసములు వసురాజున కుద్దీపన విభావములు. గిరికా వసురాజుల పర స్పర చక్షుఃప్రీతి, ఆ సందర్భమున వారిలో నుద్భవించిన సాత్త్వికభావ సంచల నమును వసుచరిత్రకారుడు వర్ణించినాడు. ఇట్టి విభావానుభావ సాత్త్వికభావ వర్ణనలు పాఠకులకు శృంగార రసోద్దీపనములు

వసుచరిత్రలో నాయికానాయకుల ప్రథమసమాగమమున వారు మనసులు విప్పికొని మాటాడుకొనక యుండే నాయిక యొక్క ముగ్ధాత్వము చేత ఎడబాటు కలిగినది. కవి యిట విప్రలంభశృంగారమును పోషించినాడు. గిరిక విరహ బాధ ఆ బాధ నోర్వలేక ఆమె మరణప్రయత్నము, వసురాజు యొక్క విర హము, ఆతనిలో కృశత్వ, పాండిమత్వ, ప్రలాపోన్మాదములు వర్ణించబడినవి. షష్ఠాశ్వాసము ప్రబంధాంతమున నాయికానాయకుల సంయోగశృంగారము వర్ణించ బడినది. ఈ వర్ణనతో కథ ముగియును. విప్రలంభ శృంగారానంతరము పోషించబడు సంభోగశృంగారము మిక్కిలి ఆస్వాదయోగ్యముగా నుండునని యాలంకారికుల మతము. వియోగశృంగారమున నాయికానాయకులాలంబన ముగా నుద్దీపనమైన శృంగారరసప్రశమనము కొంత కాలము వరకు సంభవిం చుటచే తదనంతరము సంయోగశృంగారము పాఠకులచేత మిక్కిలి ఆస్వాద్యమై యానందము నొసంగును కావుననే కావ్యనాటకాదులందు ఏదోయొక కారణము చేత నాయికానాయకులకు విప్రయోగమును కలిగించి మన్మథాది దూషణములను చేయించుట ఒక లక్షణముగా నేర్పడినది. రామరాజభూషణుడు పరస్పరాను

రాగయుక్తమైన అయోగ, వియోగ, సంయోగములు అను త్రివిధ భేదములతో కూడిన సంపూర్ణశృంగార రసపోషణమును కావించినాడు. ఇట్టి రసప్రణాళికతో కూడిన కథను రామరాజభూషణుడేర్పరచుకొని రచించుట రససమంచిత కథలతో కూడిన మనుచరిత్రను మించుటకే కాబోలు. మనుచరితలో శృంగార వీరాదులు సంపూర్ణములై ప్రధానరసమును కొంతవరకు మరుగుపరచుచున్నవి. అట్టి లోపమును తాను సవరించుకొని రామరాజభూషణుడు విభావ, అనుభావ, సాత్త్వికభావ, వ్యభిచారుల ద్వారా సహృదయులచేత ఆస్వాద్యమానమగు, రతి స్థాయి భావముగా.గల శృంగారము నంగిగా పోషించినాడు. రసైక్యదృష్టితోడ పరిశీలించిన ఆంధ్రసాహిత్యమున వసుచరిత్రయే ప్రథమ ప్రబంధ మనదగి యున్నది.

వసుచరిత్రలో అంగిరసమగు శృంగారమేకాక వీర, కరుణ, హాస్య, అద్భుత, రౌద్రాది రసస్పర్శలు కలవు ప్రబంధమున ఒక రసమును ప్రధానముగా గ్రహించి సందర్భానుసారముగా వివిధరసములను నాతి వ్యాపకముగా వర్ణించవచ్చునని యాలంకారికుల అభిప్రాయము—

"స్థాయి వైభవమున ప్రబంధముల యందు
ప్రస్తుతంబగు రస మవభాసంబు
నొందెనా దాని కంగిత్వమెందుఁ దొలఁగఁ
బోవ దెన్ని రసాంతరములు కలిసిన"

కావున నొక రసమునకుఁ బైజెప్పినట్లు రసాంతరములతో అంగత్వమున సమావేశ మొనర్చుటలో లేశమాత్రమును విరోధము లేకపోవుటయే గాక వివేచనా పురస్సరముగ పై సమావేశము ననుసంధించు సహృదయుల కానంద మతిశయించును."[1] దీనిని దృష్టియందుంచుకొని రామరాజభూషణుడు ఆయా పట్టులందు సందర్భానుకూలముగా వివిధరసముల నంగములుగా చేసి శృంగారము నంగిగా నభివ్యక్తము కావించినాడు. పెద్దన ఈ విషయమున కొంతవరకు తప్పటడుగు వేసినాడనియే చెప్పవలయును. అతడు అంగరసములైన శృంగార, వీరములను విభావానుభావాదుల విస్తృతవర్ణనచే అనుభవయోగ్యము కావించినాడు. అంగరసము యొక్క సంపూర్ణాభివ్యక్తతను ఆలంకారికులు నిరాకరించినారు—

1. ఆంధ్ర ధ్వన్యాలోకము. పుట 433, 436.

"అవిరోధీ విరోధీవా రసోంగిని రసాంతరే
పరిపోషమ్ న నేతవ్య స్తథాస్యాద విరోధితా"

ధ్వన్యా. 3-24

ఒక రస మంగిగా నున్నపుడు విరోధియైన గాని అవిరోధియైన గాని రసాంతరమును పరిపుష్టావస్థ వరకును పోషించకపోవుటచే విరోధీరస దోష పరిహారంబగును అనగా అంగరసమును పరిపక్వావస్థ వరకును పోషించగూడ దని ఆనందవర్ధనుని మతము. ఇట్టి రసనిర్వహణాదోషము మనుచరిత్రలో పొడగట్టుచున్నది. శాంత మంగిగాగల మహాభారతమున వీరరసము అతి విస్తృతముగ వర్ణించబడి కలదు. అట వీరరసము కాని జుగుప్సా, నైరాశ్యములకు హేతువై తద్ద్వారా సహృదయపాఠకులలో శాంతరసాస్వాదన యోగ్యమగు చిత్తవృత్తికల్పనమును కావించుచు తృష్ణాక్షయము, మోక్షకాంక్ష స్థాయిగా గల శాంతరసపోషణమునకు తోడ్పడుచున్నది. కావున అట నది సమర్థనీయమై యున్నది.

## వసుచరిత్రలో వీరరసము

వసుచరిత్ర ద్వితీయాశ్వాసాంతమున వసురాజు ససైన్యముగా కదలిపోయి పాదనఖాగముచే కోలాహలము నెగజిమ్ము ఘట్టమున వీరరసపోషణము కలదు. నాయకుడగు వసురాజు యొక్క పరాక్రమాతిశయమును అభివ్యక్తీకరించు ఘట్ట మిది వీరుడు కానివాడు శృంగారి కాలేడు శృంగారనాయకుడగు వసురాజు లోని వీరతాలక్షణమును నిరూపించు సన్నివేశ మిది. శుక్తిమతీకోలాహలుల వృత్తాంతమను ఈ ప్రాసంగికకథ ద్వారా ప్రబంధమున రెండు ప్రయోజనములు సిద్ధించినవి. ఒకటి-నాయిక యగు గిరిక జన్మవృత్తాంతమును చెప్పుట, రెండు నాయకుని పరాక్రమాతిశయమును ప్రకటించుట.

శుక్తిమతీకోలాహల వృత్తాంతము వసురాజు వర్ణనతో నారంభించబడినది, కాని శుక్తిమతీకోలాహలుల వర్ణనతో కాదు. ఆ ఘట్టమున శుక్తిమతీకోలాహల

వృత్తాంతమునకు ప్రాధాన్యమీయదలచుకొన్నట్లైన కవి శుక్తిమతీకోలాహలుల ప్రసక్తితో నారంభించియుండువాడు. ఆ వృత్తాంతమును వసురాజు వర్ణనతో నారంభించుటను బట్టి, కవి ప్రధానాశయము అచట నాయక గుణోత్కర్షను కావించుటయేయని సుస్పష్టమగుచున్నది. అప్పుడచట వీరము ప్రధానమై శుక్తిమతీకోలాహల సంబంధి శృంగారము గౌణమగుచున్నది.

## వసుచరిత్రలో శృంగార రసాభాసము

శుక్తిమతీ కోలాహల సంబంధి శృంగారము సంపూర్ణశృంగార రసము కాక శృంగారరసాభాసము మాత్రమే.

"ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛ గతోఽపి వా
యోషితో బహుసక్తిశ్చేద్రసాభాసస్త్రిధామత"

మూడు విధములైన రసాభాసము లీశ్లోకమున పేర్కొనబడినవి— 1. స్త్రీ పురుషులలో నొక్కరికి మాత్రమే యనురాగముండుట. 2. తిర్యగ్జంతువుల పరస్పరానురాగము. 3. మ్లేచ్ఛాదులగు అనాగరకజాతులలోని స్త్రీ పురుషుల పరస్పరానురాగము. తిర్యగ్జంతువుల అనురాగమే రసాభాసమని చెప్పబడినచో నిక నదీపర్వతములు జడములు వాని యనురాగమును వర్ణించుటయు రసాభాసమే యగును. కాని వసుచరిత్రకారుడు నదీపర్వతములను జడపదార్థములుగానే కాక శబ్దశక్తి మూలధ్వని ద్వారా స్త్రీ పురుషులుగా నుద్యోపింపజేయుచు ఆ దోషమును కొంతవరకు శుక్తిమతీకోలాహల వృత్తాంతమున తొలగించినాడు. ఆ దోషనివారణ జరిగినను అట ఏకత్రైవానురాగ మగుటచే శృంగారము రసాభాసమే. కోలాహలుడు మొదటిచూపులోనే శుక్తిమతిని ప్రేమించినాడు. శుక్తిమతి కోలాహలుని ప్రేమించలేదు. ఆమె సాధుహృదయ, విరాగిని. కోలాహలుని కోరికను విని "తపస్స్ఫూర్తి మెయిం గృశించు వనరాశిం జెందు మా బోంట్ల" ప్రేమించనేల "తారుణ్య లావణ్య జృంభిత రంభాది నిలింప భామ"లు వేరెవ్వరు లేరాయని ప్రశ్నించి, నిరాకరించినది. కోలాహలు డామె మాటలను పాటిసేయక

బలాత్కారము చేసెను. అనురాగము కోలాహలుని యందే యుండుటచే నిట సంభోగశృంగార రసాభాసమని చెప్పవలయును.

కోలాహలుని సంపర్కముచే శుక్తిమతి గర్భమును ధరించినది. సంతానమును పొందినది. అప్పుడును శుక్తిమతి కోలాహలునితో సంసారమును సాగించినట్లులేదు. పైగా వారిద్దరకు అంతగా పడినట్లును లేదు. ఈ క్రింది పద్యమున ఆ విషయము ధ్వనితము-

"పంకజపాణి శంఖ పరిభావక కంధరఁదల్లి యేలొకో
సంకులు గట్టెనంచుఁ గులశైలసుతాగ్రణి పాయఁద్రోచి ర
త్నాంకితహారముంపఁ బరువానునొ బిడ్డ కివేల కర్కశా
లంకృతులంచు హల్లక కలాపములుంచు నదీలలామయున్"

వ.చ. 3-31

మరియు పంచమాశ్వాసమున ఇంద్రుడు కోలాహలుని దగ్గరకు వచ్చి గిరికను వసురాజున కిమ్మని యడుగగా నాతడు తన భార్యను సంప్రదించకుండగనే "పాద నిహతంబై కొన్నవాడంఘ్రి నాళీక ద్వంద్వనతుండు" కాగలడని సంబరపడుచు సమ్మతించెను. కుమారసంభవమున పార్వతిని శివునికొరకు సప్తర్షులు వచ్చి యడిగినపుడు హిమవంతుడు భార్య సమ్మతిని కూడ గ్రహించును.[1] గృహస్థులు కన్యల విషయమున భార్యల సమ్మతిని పాటింతురను కాళిదాసు మాటను, కోలాహలుని యెడల వసుచరిత్రకారుడు పాటించినట్లు లేదు.

శుక్తిమతీకోలాహలుల శృంగారము రసాభాసమైనను కావ్యమున కేమి దోషము లేదు. ఒకటి- అది కావ్యమున ప్రధానేతివృత్తము కాదు. రెండు- పైన చెప్పినట్లుగా ఆవృత్తాంతము ద్వారా కవి నాయకుని పరాక్రమాతిశయత్వమును, ఆ రక్షజనోద్ధరణను చెప్పదలచుకున్నాడు. కాబట్టి నాయకవర్ణనతో నారంభమైన ఆ యితివృత్తము వీరరసప్రధానమైనది కాని శృంగారరసప్రధాన

---

1. శైలః సంపూర్ణకామోపి మేనాముఖ ముదైక్షత
ప్రాయేణ గృహిణీనేత్రాః కన్యార్థేషు కుటుంబినః

కా.కుం.సం 6-85

మైనది కాదు. ఆ వృత్తాంతమున శృంగారము రసాభాసమగుటచే వీరరసోద్దీపనమైనదని చెప్పవలయును.

## మనుచరిత్రలో శృంగార రసాభాసము

మనుచరిత్రలో ప్రవరవరూథినుల వృత్తాంతమున, స్వరోచి వృత్తాంతమున, స్వరోచీ వనదేవతల వృత్తాంతమున శృంగారరసాభాసము కలదని విమర్శకుల అభిప్రాయము. "మనుచరిత్రలో వరూథినీ ప్రవరులలో వరూథినికి మాత్రమే యనురాగమున్నది. కాన నా శృంగారము రసాభాస"మని శిరోమణి సన్నిధానము వారి యభిప్రాయము [1] "కావ్యస్థ పాత్రల దృష్టితోఁ జూచిన సంభోగశృంగారమే యైననుఁ భావకుల పాలికి శృంగారరసాభాసమేయైన"దని శ్రీ దివాకర్ల వేంకటావధాని గారి యభిప్రాయము.[2]

ప్రవరవరూథినీ వృత్తాంతమున రతి అనుభయనిష్ఠమైనది కావున శృంగారరసాభాసమని పై విమర్శకుల అభిప్రాయము. కాని యిందు వరూథిని పాత్రపోషణము విచిత్రముగా జరిగినది. పాఠకుల సానుభూతి యంతయు వరూథినిపై కలుగునట్లుగా పెద్దన శిల్పనైపుణిని ప్రదర్శించినాడు. వరూథిని అప్సరసలలో ఒకర్తె. సురగరుడోరగ నరఖేచర కిన్నర సిద్ధసాధ్యచారణ విద్యాధర గంధర్వకుమారుల నెందరినో ఆమె యెరుగును. వారామెను కాంక్షించిరి. కాని యామె హృదయము ఎవరియందును లగ్నము కాలేదని చెప్పుటచే వరూథిని వేశ్యయను దోషము నివృత్తి యైనది. ప్రవరుని రూపలావణ్యము లామెను ఆకర్షించినవి. అట్టి తనూవిభవముగలవానికై యామె ఇన్నినాళ్ళు వేచియున్నది. ఆతడు తనను పరిగ్రహించిన మరుని దక్కను కొందువను కొన్నది. వరూథిని సౌందర్యము, హావహేలావిలాసాది చేష్టలేవియు ప్రవరుని

---

1. కావ్యాలంకార సంగ్రహము. పుట 410
2. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 48. సంచిక 5–6

నాకర్షించలేకపోయినవి. అట్టి సుందరియైన స్త్రీ తనకుతానే వలచి వచ్చిన నిరాకరించు పురుషుడుండునా? యనిపించును ప్రవరుడు కోరునదేమి? యజ్ఞ కోటులన్నియు చేసి స్వర్గమునకు పోయి ఆతడు చేయునదేమి? దేవతాస్త్రీలతో సుఖించుటే గదా. అది సశరీరముగా లభించుచుండగా గ్రహించకపోవుటేల? కాని ప్రవరుడు వీనిని తుచ్ఛసుఖములుగా నెంచినాడు. ఆతడు కోరునది శాశ్వత బ్రహ్మానందము. అపుడు బ్రహ్మానందమునకు వరూథిని తన నిర్వచనము నొసంగినది. దానికి ప్రవరుడు శుష్కమైన చిరునవ్వు నవ్వి "ఆహా! యిట్టి పాండిత్యమెక్కడనైనం గంటిమే"యని యనును. తదనంతరము వరూథిని తమకము నాపుకొనలేక కౌగిలించుకొనగా నామెను త్రోసివేసి ప్రవరుడు వెళ్ళి పోవును. అట ప్రవరుని నిష్క్రమణతో శృంగారరసమునకు విచ్ఛిత్తిగాక ప్రశమనము జరిగినది. వరూథినిచరిత్ర, ఆమె చేష్టలు, మాటల పొందిక పాఠకుల చిత్తములను గెలుచుకొనును. చివరకు "తరుణి ననన్యకాంత నతి దారుణపుష్ప శిలీముఖవ్యథాభర వివశాంగి నంగభవు బారికి నగ్గముసేసి క్రూరుడై యరిగె మహీసురాధము"డను పద్యములో కవికి వరూథినిపై గల సానుభూతియు వ్యంజకమగుచున్నది. దానివలన తరువాత వరూథిని విప్రలంభశృంగారము ఆభాసము గాక కరుణ విప్రలంభమై పాఠకుల చిత్తములను కలచును. తరువాత గంధర్వుడు ప్రవరరూపధారియై వచ్చి వరూథినితో కూడును. ఈ గంధర్వుడు ప్రవరుని బ్రహ్మతేజస్సుతో కూడిన రూపవిశేషమును మరియు వేశమునుధరించి వచ్చినాడు. వరూథిని యాతనిని నిజమైన ప్రవరునిగానే తలంచినది.

"...యిందులకై వగంబొగుల నేటికి నేఁటికి నందుఁబోదమా
నందనభూమి భూమిసురనందను డుండకపోడు రమ్ము నీ
చందము నందముం గనిన జవ్వని! యెవ్వని వెఱ్ఱిఁజేయదే"

"ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కి మే
లేలలితాంగి! యెంతపని లెమ్మిది విప్రవరుండు గోలయున్
బాలుడు గాన నప్పటికిఁ బైఁబడ గొంకెను గాని వానికిన్
గాలొక చోట నిల్చునె వగన్ మగుడన్ నినుఁజూచు నంతకున్"

3-63,64

అను సఖుల సమాశ్వాసన వరూథిని కాక్షణమున నిజమే యనిపించినది కావు ననే పూదోటలో జటాపాఠము చేయుచు దేవపూజకై పూలుకోయుచున్నట్లు నటించు గంధర్వుని చూచి వరూథిని ప్రవరుడని సులభముగా నమ్మినది. గంధర్వునకు వరూథినిపై నిజమైన ప్రేమ కలదు. వరూథినికిని గంధర్వుడు ప్రవరుడై గోచరించుచున్నాడు. ఇట రతి యుభయనిష్ఠము. కావున శృంగారమగునే కాని ఆభాసము మాత్రము కానేరదు.

ఇక రామాయణమున సీతారావణుల విషయమున, మహాభారతమున ద్రౌపది కీచకవృత్తాంతమున, సారంగధర నాటకమున చిత్రాంగి సారంగధరుల వృత్తాంతమున రతి యుభయనిష్ఠముకాక పోవుటచే నట శృంగారము రసాభాసమే యగును సీతాద్రౌపదులు వివాహితలు, పతివ్రతలు. అట్టి స్త్రీలను రావణకీచకులు వలచుట, బలాత్కారము చేయుట మొదలగునవి పాఠకులలో శృంగారరసోదయమునకు దోహదములు కావు. అట రావణుని గాని కీచకుని గానివిరహవర్ణన వరూథిని విరహవర్ణనవలె కరుణవిప్రలంభముకానేరదు.(కీచకునివిరహమునుకరుణవిప్రలంభముగా చిత్రించుటకు నర్తనశాల నాటకమున ప్రయత్నించబడినది. సహృదయులకు సానుభూతి వరూథినిపై కలుగునట్లుగా నా పాత్రను పెద్దన నేర్పుతో చిత్రించినట్లుగానే నర్తనశాలలో కవి విశ్వనాథ కీచకుని పాత్రను చిత్రించినారు). చిత్రాంగి సారంగధరునకు తల్లివంటిది. వివాహిత. అట్టి యామె వచ్చి సారంగధరుని పైబడుట జుగుప్సాహేతువే యగును కాని శృంగారరసస్ఫోరకము కానేరదు. కాన ఆ ఘట్టము లన్నియు శృంగారరసాభాసములే కాని వరూథినీ గంధర్వుల వృత్తాంత మట్టిది కాదు. వరూథిని వివాహిత కాదు- ప్రవరుని రూపమును వరించినది. అది గ్రహించి యామెను గెలుచుటకై యింతకు ముందామెను వలచి నిరాకరించబడిన గంధర్వుడు ప్రవరతేజోరూపములను ధరించి వచ్చినాడు. వరూథిని యాతనిని ప్రవరునిగానే తలచినది. కావున వరూథినీ మాయాప్రవరుల యెడల గల సంభోగ శృంగారము శృంగారమే గాని ఆభాసమనుట యుచితము కాదు. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు– "వరూథినీ ప్రవరుల నడుమను, వరూథినీ గంధర్వుల యెడను బ్రవర్తిల్లినది ముఖ్యముగా గాకున్నను నౌపచారికముగానైనను (గౌణముగా నైనను) శృంగారరసమే కావున సహృదయాస్వాద్యమగుచున్న"దని నుడివిరి.[1] "రూపభేదమున్నను నది ప్రీతి

1. మనుచరిత్ర పీఠిక. పుట. 92

విషయమగు రూపమే కావున నచట రసమే స్ఫురించును కాని రసాభాసమున కవకాశము లేదు" అని శ్రీ వేదాల తిరువెంగళాచార్యుల అభిప్రాయము.[1] అంతే గాక రసాభాసము సైతము రసము వలెనే సహృదయాస్వాదన రూపమైనదని విశ్వనాథుడు స్పష్టముగా నుడివినాడు-

"రసభావౌ తదాభాసౌ భావస్య పశమోదయౌ
సంధిః శబలతా చేతి సర్వోపి రసనాద్రసః

సా. ద. 3-259

అనగా రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావప్రశమము, భావోదయము, భావసంధి, భావశబలత లివి యన్నియు ఆస్వాదితము లగును కాన రసములే యనబడును. అనౌచిత్యము ఒక్కటే రసభంగహేతువు కాని మరొక్కటి కాదని ఆనందవర్ధనుని మతమైనపుడు రసాభాసము రసమువలెనే ఆస్వాదయోగ్యమని గ్రహించవచ్చును.[2]

అంతేగాక సహృదయులచేత మరల మరల పఠించబడి ఆనందహేతువగుచున్న మనుచరిత్రలోని ప్రవర, వరూథిని, గంధర్వుల వృత్తాంతమున శృంగారరసాభాసమే కలదనుట అనుచితము ఆ ఘట్టము పాఠకులకు రసానందమును కలిగించుచున్నది. కాన విశ్వనాథుని మతము ననుసరించి యిందలి రసాభాసము రసాస్వాదానందమునే కలిగించుచున్నదనవలయును. మరియు కావ్యస్థపాత్రల దృష్టితో చూచిన అది సంభోగశృంగారమైనపుడు పాత్రల నిష్ఠమైన రసమే పాఠకుల హృదయగతములగును కాని వేరుకాదు. ఇట వరూథినీ ప్రవరులాలంబన విభావములు. వారిలోని రత్యాదులు పాఠకులలోని రత్యాదుల నుద్బుద్ధములుగా చేయును.కావున నట శృంగారరసమనుటయే యుచితము.

స్వారోచికథలో గల బహునాయికాప్రీతి రసాభాసహేతువని కొందరి మతము.[3] బహునాయక రతిని విశ్వనాథుడు రసాభాసమనినాడు, కాని బహు నాయికా ప్రీతిని కాదు. దక్షిణ నాయకచరితమున బహునాయికలందలి నాయ

---

1. ఆంధ్ర ధ్వన్యాలోకము పుట. 183
2. ధ్వన్యాలోకః, పుట. 362
3. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము. 10 సంచిక 1

కానురాగము రసాభాసము కాదని యాలంకారికుల మతము అనేక నాటక, కావ్యములలో దక్షిణ నాయకుని బహునాయికా ప్రీతి వర్ణించబడి గ్రాహ్యమగు చున్నది, మనుచరిత్రలో స్వరోచి దక్షిణ నాయకత్వమే ప్రకటమగును కాని యది రసాభాసము కాదు

స్వరోచీమనోరమల పునస్సంధాన ఘట్టమున కవి సంభోగశృంగారమును పూర్ణావస్థవరకును తీసుకొనిపోయి రసవిచ్ఛిత్తిని కలిగించినాడని యాక్షేపము కలదు. అక్కడ కవి కథాప్రయోజనమునకై యట్లు చేయవలసి వచ్చినది. స్వరోచి విభావరీ కళావతులను కూడ వివాహమాడి, యాతడు ముగ్గురు భార్యల తోడను చేసిన విహారాదులు వర్ణించబడుటచే శృంగారవిచ్ఛిత్తి యను దోష నివారణ జరిగినది.

స్వరోచి హరిణిని కౌగిలించుకొనుటలో తిర్యక్సంపర్కమగుటచే రసాభాస మని కొందరి మతము. కాని స్వరోచి హరిణి యాదేశమున దానిని కౌగిలించు కొనినాడు. తరువాత స్త్రీ రూపమును ధరించిన వనదేవతతో స్వరోచి క్రీడించి నాడు కాని హరిణితో కాదు. కావున అదియును రసాభాసము కాదు.

పారర్షి పుంజకస్థల వృత్తాంతమున శాంతశృంగారములకు ఘర్షణ ఏర్పడి నది. పారర్షి నిగ్రహహీనుడగుటచే శృంగారముదే పైచేయి యైనది.

## మనుచరిత్రలో అంగిరసము

పెద్దన శృంగారరసమును విస్తృతరూపమున వర్ణించుటచే కొందరు సహృదయ విమర్శకులు శృంగారమే మనుచరిత్రలో అంగిరసమని భావించు చున్నారు.[1] కావ్యపఠనానంతరము పాఠకులలో నేది అవిచ్ఛిన్నముగ స్మృతికి

1. మనుచరిత్ర పీఠిక. శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు. పుట 92
శ్రీ పల్లా దుర్గయ్య గారి– ప్రబంధ వాఙ్మయవికాసము వ్రాతప్రతి పుట610

కొనిరాబడునో అదియే కావ్యమున అంగిరసమగును. దీనినే ఆంధ్రధ్వన్యాలోకకారుడు ఇట్లు వివరించినాడు— "ప్రబంధముల యందు మొట్టమొదట ప్రస్తావింపబడి మాటిమాటికి ననుసంధీయమానమగు రసము స్థాయిరస మనబడును. ఏమన అది ఇతివృత్తము నందంతటను చక్కగా వ్యాపించి చివరివరకు నవిచ్ఛిన్నముగ స్మృతికి కొనిరాబడుచున్నది. ఇట్లధికవ్యాప్తి కలది కావుననే ఇది అంగి యగుటకుఁ దగియుండును. అట్టి ఆ స్థాయి రసమునకు నితర రసములతోడ నెంతటి సమావేశమేర్పడినను దీని యంగిత్వము తొలగిపోవదు"[1]

మనుచరిత్ర ప్రారంభము ప్రవరుని ధీరశాంత స్వరూపవర్ణనతో నారంభమైనది. ధీరత్వ, శమ, శాంత గుణములచేత కలిగిన మనఃప్రసన్నత కలవాడు ధీరశాంతుడు. ధీరోదాత్తులలో కనిపించు కులము, మహాభాగ్యము మొదలగు గుణములు కూడ ధీరశాంతునిలో నుండవలయునని విశ్వనాథుని మతము— (సామాన్యగుణై ర్భూయాన్ ద్విజాదికో ధీరప్రశాంత ఇత్యుక్తః సా.ద. 3-34)—ధీరశాంతుడు బ్రాహ్మణుడుకాని మంత్రికుమారుడైన క్షత్రియుడుకానికావచ్చును మనుచరిత్రలో ప్రవరుడు విప్రవరుడు, సుందరుడు, సంపన్నుడు, ఏకపత్నీవ్రతుడు, అధ్యయన అధ్యాపనా తత్పరుడు, అతిథిసేవా పరతంత్రుడు. ప్రథమాశ్వాసమున, కావ్యారంభముననే యెనిమిది (1: 51—57) పద్యములలో ప్రవరుని ధీరప్రశాంత లక్షణములు పేర్కొనబడినవి. గంధర్వుడు ప్రవరుని వేషమును ధరించినపుడు—

"శాంతరస మొల్క బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుడయ్యె వియచ్చర ప్రవరుఁ డపుడు"

మ.చ. 3-71

అని కవి వర్ణించుట చేతను ప్రవరుని శాంతస్వరూప మెట్టిదో ప్రకటమగుచున్నది. ప్రవరుడు శాంతరసమూర్తి. వరూథిని శృంగారరసమూర్తి. ఈ శాంతశృంగారములకు ద్వితీయాశ్వాసమున సంఘర్షణ ఏర్పడినది. ఇది లోకమున రాగవిరాగములకు పొటమరించు ఘర్షణకు ప్రతీక. అట శృంగారము వీగిపోయి శాంతమునకే జయము లభించినది. వరూధినిలో శృంగారరసము నధికముగా వర్ణించి శాంతరసము దానిని జయించినట్లు చెప్పుట శాంతరసోత్క—

---

2. ఆంధ్ర ధ్వన్యాలోకము పుట 464

ర్షకు దోహదమైనదని చెప్పవచ్చును. కాని పెద్దన చతురవచోనిధి. కథా ప్రయోజనముననుసరించి శృంగారరసమునకు ప్రాధాన్యము నిచ్చి వరూధినిని అనన్యకాంతగా చిత్రించి పాఠకులకు ఆమె యెడల సానుభూతి కలుగునట్లు కావించి తృతీయాశ్వాసమందలి కరుణ విప్రలంభ, సంభోగశృంగారముల నాస్వాద్యయోగ్యము కావించినాడు.

ఆ తరువాత చతుర్థ, పంచమాశ్వాసములందు శాంతరసము లేదు షష్ఠాశ్వాసమున పారద్షి వృత్తాంతమున అతని తపోవర్ణనాదులచే శాంతరసముపోషించబడినది. కాని యాఋషి ప్రవరునివలె ధీరుడు కాకపోవుటచే శాంతము శృంగారము ముందు వీగిపోయెను. షష్ఠాశ్వాసాంతమున అనగా ప్రబంధాంతమున స్వారోచిషుని వృత్తాంతమున శాంతరసము ప్రతీయమానమైనది. ప్రవరవరూథినీసంవాద ఘట్టమున శాంతశృంగారములకు ఘర్షణ ఏర్పడినప్పుడు కవి మోక్షకాంక్ష స్థాయిగాగల శాంతము నుద్దీపింపజేసినాడు. కాని ప్రవరుని నిష్క్రమణతో మరియు వరూథిని విప్రయోగ, సంభోగశృంగారముల వర్ణనలతో శాంతరస ప్రశమనము జరిగినది. కాని మరల ప్రబంధాంతమున స్వారోచిషుని జననము తపస్సులలో మోక్షకాంక్ష స్థాయిగాగల శాంతము వ్యక్తమై కావ్యపఠనానంతరము పాఠకుల హృదయములందు నిండి నిలచిపోవు చున్నది కావున మనుచరిత్రలో శాంతరసమే యంగిరసమనుట సమంజసము. "పెద్దన మనుచరిత్రమున నా కాలప్రభావమును బట్టి శృంగారమునే ప్రధానరసముగా గ్రహించినను ఆరంభావసానములందు శాంతమున కఖండవిజయము కలిగించి తనకాల మర్యాద నతిక్రమింపజాలె"నని శ్రీ దివాకర్ల వేంకటావధాని గారి యభిప్రాయమునై యున్నది.[1]

శాంత వీరములు అంగిగాగల కావ్య, నాటకములందు శృంగారరసమును విస్తరించి వర్ణించుట కలదు. ఉదాహరణకు కిరాతార్జునీయము, శిశుపాల వధ మహాకావ్యములందు అంగిరసము వీరము. ఇందు శృంగారాంగభూతములగు ఋతు, వనవిహార, పుష్పాపచయ, జలకేళ్యాది వర్ణనలు విస్తరముగ చేయబడినవి. ఆ సందర్భములందు శృంగారరసము పోషించబడినది. అంగిరసమునకంగములుగా నితరరసములను విస్తరించినను అంగిత్వమునకు విచ్ఛిత్తి కలుగ

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 48. సంచిక 5—6

కూడదు– "ఒక ప్రధానరసమునకు రసాంతరముతో సంఘర్షణ కలిగినపుడు దాని ప్రాధాన్యము యొక్క విలువ హెచ్చుటయు, దానితో చూపఱ (పాఠకుల) చిత్తము తన్మయమగుటయు సంభవించును అట్లు కలుగదేని ప్రేక్షకుని భావ ముద్బుద్ధముగాక మన్నుతిన్న పామువలె నట్టే పడియుండును........కావున నే రసమైనను రసాంతర సంఘర్షణ వల్లఁగాని అవస్థాంతర సంఘటనము వల్లగాని సముచితముగాఁ బోషింపబడి సహృదయ హృదయాహ్లాదకరమగు ననుట నిజము."[1] అపుడు మనుచరిత్రలో అంగిరసాంతరమున రసాంతర విస్తృతి కలదను దోషము కొంతవరకు నివారితమగుచున్నది. ఇంతకుముందు శాంత మంగిగాగల మహాభారతమున వీరము విస్తరింపబడి యుండుటనుచెప్పుకొంటిమి. అదేవిధముగ శాంతమంగిగాగల మనుచరిత్రలో శృంగారవీరముల విస్తృతిని అంగిరసపోషకముగానే గ్రహించవలయును

మనుచరిత్రలో అంగిరసము శృంగారమనువారు ద్వితీయాశ్వాసమున వరూథినీప్రవర సంవాద ఘట్టమున ప్రవరునిలో ధర్మవీరము కలదని యభి ప్రాయపడుచున్నారు. "ప్రవరుడు రామ యుధిష్ఠిరుల వంటి ధర్మవీరు డగు టచే తదాలంబనమగునది ధర్మవీరము కాని శాంతరసము కాదు" అని శ్రీ వెంప రాల వారి యభిప్రాయము.[2] శమదమాది గుణములు ధర్మవీర, ధీరప్రశాంతు లలో సమానగుణములుగా నంగీకరింపబడుటచే నట్లు ప్రమాదపడుట కవకాశము కలదు వీరమునకు స్థాయి ఉత్సాహము. ప్రవరునిలో ధర్మమాలంబనముగా గల ఉత్సాహము గోచరించుచున్నది. కాని యా ధర్మోత్సాహము వ్యభిచారిభావము నొందినది. ధీరోదాత్తునకు ధర్మయుద్ధ వీరములు, ధీరోద్ధతునకు వీరరౌద్ర ములు, ధీరలలితునకు వీరశృంగారములు ప్రధానమైనట్లుగా ధీరశాంతునకు శాంతముతోపాటు దాన, ధర్మ వీరములును ప్రధానములు. ద్వితీయాశ్వాస మున ధీరశాంతుడగు ప్రవరునిలో ధర్మవీరత్వ గుణము వ్యభిచారిభావమునొంది కనబడుచున్నదే కాని యది విభావానుభావ సాత్త్వికవ్యభిచారిభావపరిపుష్టమైన ధర్మవీరమనుట యుక్తము కాదు. దయావీరమున ఉత్సాహము అహంకార

1. వ్యాసరత్నావళి. పుటలు 99–100
2. మనుచరిత్ర పీఠిక. పుట. 89.

రూపమైనది. శాంతమహంకార ప్రశమరూపము. విశ్వనాథుడు "నిరహం కార రూపత్వాద్దయా వీరాదిరేషన " (సా.ద. 3-249) శాంతము నిరహం కారరూపమగుటచే దయావీరమునకన్న భిన్నమని నుడివినాడు.మరియు ఆతడు-

"సర్వాకార మహంకారరహితత్వం వ్రజంతిచేత్
అత్రాంతర్భావ మర్హంతి దయా వీరాదయా స్తథా"

సా.ద 3 పరిచ్ఛేదః

అని చెప్పినాడు. అనగా దయావీరాదులు అహంకారరహిత మగుచో శాంత రసమందే అంతర్భవించును. అంతేగాని శాంతము దానిలో నంతర్భవించదు. అట్లే ధర్మవీరమును. వీరరసము అభిమానమయము. అహంకార ప్రశమరూప మైన శాంతమును వీరరసమున అంతర్భవింపజేయుటను ఆనందవర్ధనుడు తగ దనినాడు ప్రవరునిలో శమదమాదులే గాని వీరరసమునకు వ్యభిచారులగు క్రోధాభిమానములు కనిపించవు. కావున ప్రవరునిలో కనిపించునది నిరహం కార రూపమైన శాంతమే గాని ధర వీర మనుట యుక్తము కాదు. ప్రవరుడు మోక్షకాంక్షి, బ్రహ్మానందాది రాజ్యపదవి తప్ప ఆతడు వేరు కాంక్షించుటలేదు. మరల స్వారోచిషునిలోను ఈ మోక్షకాంక్షయే కనిపించుచున్నది. కాని కేవలము అది ధర్మోత్సాహము కాదు. కావున మోక్షకాంక్ష స్థాయిగాగల శాంతమే మనుచరిత్రలో అంగిరసము.

మరి శాంతము నంగిరసముగా ప్రబంధమున పోషింపదగునా?యనుటలో అభిప్రాయభేదము కలదు. ధనికుడు శాంతమభినయించదగినది కాకపోవుటచే నాటకమున దానికి ప్రవేశము లేదనిచెప్పి శ్రవ్యకావ్యమున నిబంధించవచ్చునని యంగీకరించినాడు- "శాంతరసస్యచ అనభినేయత్వాత్ యద్యపి నాట్యేఽమ ప్రవేశో నాస్తి. తథాపి సూక్ష్మాతీత వస్తూనామ్ సర్వేషామపి శబ్ద పతిపాద్య తాయాః విద్యమానత్వాత్ కావ్యవిషయత్వం న వార్యతే "[1] విశ్వనాథుడు మాత్రము శాంతమును కావ్య, నాటకములు రెండింటిలోను నిబంధించుట కంగీక రించినాడు.[2] శాంతము అంగిరసముగా మహాభారత, సౌందరనంద, బుద్ధ

1. దశరూపకమ్ పుట 259

2. సాహిత్యదర్పణమ్ 3:245-248

చరితాది శ్రవ్యకావ్యములందును ప్రబోధచంద్రోదయాది నాటకములందును కని పి.చు చున్నది. మహాభారతాది కావ్యములందు అంగిరసముగా గోచరించు తృష్ణాక్షయము, మోక్షకాంక్ష స్థాయిగాగల శాంతము నంగిగా పోషించి పెద్దన మనుచరిత్రకొక ఉత్తమస్థానమును కల్పించినాడు.

## వీ ర ము

మనుచరిత్రలో అంగిరసములలో శృంగారానంతరము వీరము విస్తరించి కనిపించుచున్నది. స్వరోచి ధీరోదాత్తనాయకుడు. వీరమతని నాశ్రయించి ప్రతీయమానమగుచున్నది. చతుర్థాశ్వాసమున వేటాడు సందర్భమున, స్వరోచి రాక్షసుల యుద్ధ సందర్భమున, షష్ఠాశ్వాసమున స్వరోచి రెండవమారు వేటాడు సమయమున వీరరసము పోషించబడినది. శృంగారమును పోషించుటలో పెద్దన ఎంత నేర్పరియో వీరరసమును పోషించుటలోను అంతటి నేర్పరియే. వీరరస మును వ్యంగ్యమొనర్చు వర్ణనల కూర్పును, పదబంధములను, శైలీవిన్యాస మును చూపుటలో పెద్దన ఆరితేరినవాడు. "అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప" "చూచి ఝుళంఝుళత్కటక సూచిత వేగ పదారవిందయై" "ఎక్కడి వాడొ యక్ష తనయేందు జయంత వసంత కంతులన్..." అను మొదలగు పద్యములలో శృంగారము చిప్పిలు, మాధుర్య సౌకుమార్యాదులతో కూడిన వైదర్భీశైలిని ప్రయోగించినట్లుగానే "గళగర్త క్రోడ నిర్యత్కహకహ నినదో గ్గాఢహాసంబు..." "అని బాహాస్ఫోట రావాహత పతగ కులంబవ్వనీ శాఖిశాఖా ........" "దానవు డద్ధరారమణుఁ దాఁకె నుదగ్ర పదాగ్రఘట్టన గ్లానిసపాటమై ...." అను మొదలగు పద్యములలో పరుషాక్షర యుక్తమైన కఠినశైలిని ప్రయోగించి వీరరసవ్యంజకమును కావించెను. శృంగారమున పెద్దనతో సరి వచ్చు తిమ్మన, చేమకూర కవులు వీరరసపోషణమున ఆతనిముందు వీగి పోవుదురు.

వసుచరిత్రలోని వీరరసపరిచయము ఇంతకుముందే కావించబడినది. వసురాజు శుక్తిమతిని రక్షించుటకై పూనుకొనుఘట్టమున మరియు కోలాహలుని యెగఁజిమ్ము ఘట్టమున కవి యేడు పద్యములందు వీరరసమును నిబంధించినాడు. ఈ యేడు పద్యములలో వీరరసముయొక్క విభావానుభావ వ్యభిచారీ భావములను కవి చక్కగా ప్రకటించినాడు.

> "అనుచున్ వారలు విన్నవించుటయు లోకానీక రక్షా కళా
> కనదుత్సాహ రసచ్ఛవిస్ఫురణమై కన్దోయిఁ గట్టెఱ్ఱదా
> ర్కొన నుర్వీజన దైన్యభంజన ఘన భ్రూభంగభంగీ వినూ
> తన శక్రధ్వజ ముద్భవిల్ల ఖలగోత్రధ్వంసనోదగ్రుడై"
>
> వ చ 2-150

అను పద్యమున వీరరసము యొక్క కోపమను వ్యభిచారిభావము చెప్పబడినది అట్లే 2 ఆశ్వా 151 పద్యమున ఉత్సాహము చెప్పబడినది.

## అద్భుతము

అద్భుతమునకు విస్మయము స్థాయిభావము. మనుచరిత్రలో స్వరోచి ప్రయోగించిన పావకాస్త్రము తాకి రాక్షసుడు ఇందీవరాక్షుతను గంధర్వునిగా మారు ఘట్టమునను (4 ఆశ్వా 117). ఇందీవరాక్షుడు రాక్షసునిగా మారునపుడు (5 ఆశ్వా 24), వనదేవత స్త్రీగా మారుపపుడు (8 ఆశ్వా 96) విస్మయముస్థాయిగా గల అద్భుతరసము పోషించబడినది. వసుచరిత్రలో మంజువాణి ఆకాశగమన వృత్తాంతమున (4 ఆశ్వా 59 మొ॥), మంజువాణి రత్న పాంచాలికలలో నొక దానిగా నిలిచి గిరికా మౌక్తికహారమును రాజు మెడలోవేయు ఘట్టమున, రత్న పుత్రియైయున్న మంజువాణి సశరీరయై రాజు ముందు జోహారుచేయుచు నిలచిన ఘట్టములందు అద్భుతరస స్పర్శ కలదు.

## రౌద్రము

మనుచరిత్రలో మనోరమను శపించి ముని నాగబెత్తముతో నామెను బాదుపట్టమున, బ్రహ్మమిత్రుడు ఇందీవరాక్షుని శపించు సన్నివేశమున (6ఆశ్వా 18), పారర్షి దేవాపిని తిట్టుచోటను (6ఆశ్వా 45—47) క్రోధము స్థాయిగాగల రౌద్రము పోషింపబడినది. వసుచరిత్రలో ద్వితీయాశ్వాసాంతమున వీరముతో పాటు కొంత రౌద్రరస స్ఫూర్తియు కలదు.

## భయానకము

మనుచరిత్రలో పారర్షిని దేవాపి చంపుఘట్టమున (6ఆశ్వా 50, 51) భయము స్థాయిగాగల భయానకరసము పోషింపబడినది. వసుచరిత్రలో కోలాహలుడు శుక్తిమతినదిలో దుమికిన దృశ్యమును ప్రజలు వసురాజుతో వర్ణించి చెప్పు ఘట్టమున భయానకము కలదు—

అక్కట మిక్కుటంబగు రయంబున నెక్కటనుండి వచ్చెనో
యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహము
ల్పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీ స్రవంతి పై
రక్కున వ్రాలి యాఁగె భువనావళి నుద్భటవింధ్య శైఖరిన్

వ.చ. 2—146

## బీభత్సము

మనుచరిత్రలో రాక్షసుని వర్ణనలో (4 ఆశ్వా 73) వివిధ జంతువులను వేటగాండ్రు వేటాడు పట్టున (4 ఆశ్వా 48 మొ॥), యుద్ధవర్ణనలో కొంతవరకు జుగుప్స స్థాయిగా గల బీభత్సము పోషింపబడినది వసుచరిత్రలో విదూషకుడు కోలాహల పర్వతమును వర్ణించుపట్టునగల క్రింది పద్యమున బీభత్సరస

"అక్కట నీయుదగ్ర చరణాహతి కోరుపలేక యే గతిన్
స్రుక్కెనొ గట్టు రాచకొమరుం డలనాడు కపోతహుంకృతిన్
గ్రక్కున మూల్గుచుం బిలముఖంబున నేడును గంటె నేత్తురుల్
గ్రక్కెడు ధాతులన్నెదరగా నరుణాంబు ఝరీమిషంబునన్"

వ చ. 2-89

## క రు ణ ము

మనుచరిత్రలో కళావతి తండ్రి మరణించగా దుఃఖించు ఘట్టమున(షష్ఠా శ్వాసము) శోకము స్థాయిగాగల కరుణరసస్పర్శ కలదు. వసుచరిత్రలో కోలాహలుడు పైనబడినపుడు శుక్తిమతి మొరపెట్టుకొను ఘట్టమున, శుక్తిమతీ నది యుప్పొంగుటచే కలిగిన కష్టములను ప్రజలు వసురాజుతో నివేదించుకొను ఘట్టమున కరుణరసస్పర్శ కలదు.

## హా స్య ము

మనుచరిత్రలో మనోరమ వృత్తాంతమున మునివర్ణనలో(4ఆశ్వా79,80) హాసము స్థాయిగాగల హాస్యము కలదు.

వసుచరిత్రలో విదూషకుడు నాటకములలో వలె హాస్యపాత్రగా కాక సంపూర్ణ నర్మసచివుడుగానే కనిపించును. అయినను విదూషకుని యతివేషధారణలో హాస్యరస స్పర్శ కలదు.మరియు విదూషకుడు యతివేషధారియై గిరికా సఖులతో మాట్లాడిన మాటలలోని వ్యంగ్యము తదనంతరము అనగా విదూషకుడు నిజమైన యతి కాదనియు ఆతడు వసురాజు యొక్క సఖుడే అనియు వారు గ్రహించిన తరువాత, వారికి గోచరించి హాసజనకమై యలరించినది. పాఠకులకును ఈ ఘట్టమున హాస్యరసము ప్రతీయమానమగుచున్నది.

## భక్తి

మనుచరిత్ర షష్ఠాశ్వాసాంతమున స్వారోచిషునకు విష్ణుదేవుడు సాక్షాత్కరించగా నాతడు చేసిన భగవన్నుతి, దశావతార వర్ణనలో భగవద్రతి స్థాయిగా గల భక్తిరస స్పర్శ కలదు. మూలమున మహాభారత కథలో వసురాజు ఇంద్రునిగూర్చి తపస్సుచేసినట్లుగాను, ఇంద్రుని యెడల ఆతడు భక్తిగలవాడుగాను వర్ణించబడియుండగా వసుచరిత్రలో భామగాజభూషణుడు ఆ విషయమును విడిచిపెట్టి ఇంద్రుని వసురాజునకు సఖునిగా మార్చినాడు. వసుచరిత్ర శృంగార రస మంగిగా కలదు కావున కవి వసురాజు పరాక్రమమునే స్మరించినాడు కాని మూలమున గల భక్తి, తపస్సులను విడిచిపెట్టినాడు. వసుచరిత్రలో భక్తి రసము గల సందర్భమేద లేదు. తృతీయాశ్వాసమున గిరికాసఖులు కావించిన మన్మథపూజలో భక్తిరసాభాసము కలదు.

## వసుచరిత్రలో శాంతము

వసుచరిత్రలో నెచటను శాంతరస పరిపోషణను కావించకున్నను కవి కొన్ని పాత్రలలో, వర్ణనలలో ఆ రసస్పర్శను ప్రకటించినాడు. పాత్రలలో శుక్తిమతి శాంతగుణశీలి. "సకల క్ష్మాపుణ్య దేశాళిఁ గాంచి తపస్స్ఫూర్తి మెయిం గృశించి వనరాశిం జెందు మా బోంట్ల...." అను మాటలలో మృదువుగా కోలాహలుని తిరస్కరించుటలో శుక్తిమతి యందు సాత్త్వికస్వభావము, శాంత గుణములు ప్రకటమగుచున్నవి.

చతుర్థాశ్వాసమున మంజువాణి ముఖమున అధిష్ఠానపురము ప్రశాంత ఘోష మయి, పూర్ణసమాధిలో చెలగుచున్నట్లుగా నున్నదని వర్ణించబడిన పద్యమున శాంతరస స్పర్శ కలదు-

సాలము యంత్రపీఠము శాల కవాటిక ఘట్టనంబు దృ
జ్మీలనమైందవామృత సమేత పతాకిక జిహ్వాచంద్రికా
జాలము భూతిఁ పూత నవచంద్ర శిలాంబు లశ్రుధారగా
బ్రోలు ప్రశాంతఘోషమయి పూర్ణసమాధిఁ జెలంగె నయ్యెడన్

వ.చ. 4—64

## సారాంశము

మనుచరిత్రలో భక్తితో కలిపి దశవిధ రసములును పోషించబడినవి. వసుచరిత్రలో ఒకటి రెండు రసములు తక్కువగా అన్ని యే రసములు పోషించబడినవి. పెద్దన రససమంచిత కథలకు నిలయమనియే మార్కండేయ పురాణము నుండి స్వారోచిష మనుసంభవ కథను గ్రహించినాడు. రామరాజ భూషణుడు నీరసమైన మహాభారతాంతర్గత కథను గ్రహించి "రసోచిత చమత్క్రియా కల్పనా భవ్యంబు"గా నిర్మించినాడు.

మనుచరిత్రలో సంస్కృత మహాకావ్యోపలభ్యమగు శృంగార వీరములలో నొకటి గాక మహాభారతేతిహాసములో వలె శాంతము అంగిరసమైయున్నది వసు చరిత్రకారుడు మహాకావ్యోచితమైన శృంగారము నంగిగా గ్రహించి సంస్కృత మహాకావ్యముల పరిపాటి ననుసరించినాడు. మనుచరిత్రలో అంగిగాగల శాంతము అంగరసములగు శృంగారవీరముల మాటున దాగి అతిస్ఫుటము కాకున్నది. వసు చరిత్రలోని అంగిరసము శృంగారము సంపూర్ణ ఆరంభవికాసములతో గోచరించును. వసుచరిత్ర ప్రబంధాంతమున సంభోగశృంగారమును బ్రహ్మానంద ముతో సమానమైనదిగా శ్లేషద్వారా కవి వర్ణించుటచే గిరికావసురాజుల శృంగారము తుచ్ఛమైనది గాక ఉదాత్తత నొందినది. తరువాత దక్షిణాంధ్ర యుగమున వెలసిన పచ్చి శృంగారము వంటిది కాదిది. నవరససమంచితమైన మను చరిత్రను రామరాజభూషణుడు రసైకాంగిత్వముచేత మించి అర్వాచీన ప్రబంధ కవులకు వస్తుసంబంధి వస్త్వైక్యతయే గాక రససంబంధి వస్త్వైక్యత గల ప్రబంధరచనలకు ఆదర్శుడై నాతనవలయును.

# మను.వసుచరిత్రలలో రసవ్యంజకమున గల భేదము

ఇట ఈ రసమున్నదని వాచ్యరూపమున చెప్పినంతమాత్రమున పాఠకుల చేత ఆ రసము ఆస్వాద్యము కాదు. విభావానుభావ వ్యభిచారి భావములచే ఆస్వాద్యమానమగు స్థాయిభావము రసమగును.నాటకమున ఈ విభావానుభావ సాత్త్విక భావాదులు రంగస్థలముపై కనబడి ప్రేక్షకులకు రససాక్షాత్కార మును కలిగించును.శ్రవ్యకావ్యము లందు కవి తన వర్ణనాశక్తి ద్వారా విభావాను భావాదులను అక్షి సాక్షాత్కార మగునట్లు వర్ణించి పాఠకునకు రసస్ఫూర్తికలుగు నట్లుగా చేయవలెను. కవి చేత చేయబడిన వర్ణనల ద్వారా విభావానుభావాదులు పాఠకునకు అక్షిసాక్షాత్కారమై ఇదివరకే యాతని హృదయములో సంస్కార రూపమున నున్న రత్యాదుల నుద్బుద్ధము చేయును. ఉద్బుద్ధమైన స్థాయిభావము మరల మరల విభావానుభావాదుల స్మరణచే చర్వ్యమాణమగును అట్లు ఏది చర్వ్యమాణమై ఆనందరూపమున ఆస్వాద్యమగునో అది రసము అందుకే రసమెప్పుడు వాచ్యరూపమున చెప్పిన ఉద్బుద్ధమై ఆసాద్యమానమగునది కాదు వర్ణ్య విభావానుభావాదులే రసము నుద్బుద్ధము కావించును.కావుననే రసమెప్పుడు విభావానుభావాదులచే ప్రతీయమానమగునదే కాని వాచ్యరూప కథనమున వ్యక్త మగునది కాదు విభావానుభావాదులచే ప్రతీయమానమగు స్థాయిభావమునే ఆనందవర్ధనాదులు రసధ్వని యని పేర్కొనినారు.

రసధ్వనికి విభావానుభావ సాత్త్విక భావాదుల వర్ణనయేకాక వర్ణ మరియు పదముల సంఘటన అనగా రీతి లేక శైలి, ఉక్తిచాతుర్యము, ఔచిత్యాదులును ప్రధానముగా తోడ్పడును. ఉపమారూపకాద్యర్థాలంకారములు, యమకాది శబ్దాలంకారములు సైతము ఉచితముగా ప్రయోగించబడిన రసవ్యంజకములై సహృదయానందకరము లగును.

అటఁబని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లు ఠదభంగ తరంగ మృదంగ నిస్వన

స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
కటక చరత్కరేణుకర కంపిత సాలము శీతశైలమున్

మ.చ. 2-8

అను మనుచరిత్ర పద్యములోని వర్ణముల, పదముల సంఘటన వస్తుస్ఫోరకమై తద్వారా రసవ్యంజకతకు తోడ్పడుచున్నది. ఇందలి 'అంబరచుంబి' లోని బిందు పూర్వక బకారము ఆకాశమునంటు శైలశిఖరములను, 'అభంగ తరంగమృదంగ' లోని బిందుపూర్వక గకారము మృదంగవ్యాపారమును, "పరిఫుల్ల కలాప కలాపిజాలము" లోని ద్విత్వలకారము మయూరముల స్ఫుటనటనలను వ్యంగ్యమొనర్చి శీతశైలము యొక్క వైభవము నంతటిని హృదయసాక్షాత్కారము నొనరించును అట్లే-

తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లికొను కాంతారంబునం దైందవ
గ్రావా కల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్

మ.చ. 2-22

అను పద్యమున 'అల్లిబిల్లి'యను పదప్రయోగముచే మామిడి, గోరంట వృక్షముల వ్యాప్తి, 'జటిల' శబ్దముచే ద్రాక్షాగుళుచ్ఛముల ఆధిక్యము, 'పూవుందీవె' లను సుకుమారపదముచే సుకుమార సుందర పుష్పలతలును సాక్షాత్కారమగుచున్నవి ఈ వర్ణన శృంగారోద్దీపన విభావములలో నొకటి.-

చూచి ఝళంఝుళత్కటకసూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడుమల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్కపోక నునుబోదియఁజేరి విలోకన ప్రభా
వీచికలం దదీయపదవీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్

మ.చ. 2-29

అను పద్యములో 'ళ'కారము వరూథిని కాలి యందియల మ్రోతలను వినిపించుచున్నది. "ఝళం ఝుళత్కటక" అను సమాసము కాలియందెల మధుర ధ్వనితో కూడిన వరూథిని నడకను వ్యంగ్యమొనర్చుచున్నది. వరూథిని కాలి యందెలు ఝళంఝుళమని మ్రోగుచుండగ లేచివచ్చినది యని చెప్పక "ఝళం

ఝుళత్కటకసూచిత వేగ పదారవిందయై"యని యనుటలో యుక్తిచాతుర్యము ఆమెలోని 'కుతూహల' భావమును సుందరముగా వ్యజ్యమానమొనర్చి పాఠకుల నలరించుచున్నది. "ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు...." (మ.చ. 2–41)అను పద్యములోని 'ఇంతలు' శబ్దము నర్మగర్భమై వరూథిని హృదయ గతమైన శృంగారభావమును ప్రకటించుచున్నది.

ఏలర యీచలం బుడగి యేలర బాలరసాల మాలతీ
జాలములోఁ శశాంక కరజాలములో వలవంత నశ్రువుల్
జాలుగ నాల్గుజాలు నికఁ జాలు భవంబను నంతకాక కుం
బాలయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితిన్

మ.చ. 3–93

లోని లకారావృత్తి, అసమస్తపదరచన పాఠకులలో వరూథిని వేదనను మూర్తీ భవింపజేయుచున్నది.

మధురము, సుకుమారమునైన శృంగారము మాధుర్యసౌకుమార్య ములతో కూడిన రచన ద్వారా వ్యంగ్యమగునట్లుగానే పరుషాక్షరము, దీర్ఘసమా సముల ద్వారా బీభత్సరౌద్రాదులు వ్యంగ్యమగును దీనికి మనుచరిత్రలో ననేక ఉదాహరణములు కలవు.

"........ఘర్ఘర గళగర్తజనిత బూరి
భూభృదురు బిలభరిత భౌభౌ భయంక
రార్భటీ దీర్ఘ దిగ్భిత్తులగుచుఁ జలఁగె
సరిపెణలఁ బట్టితెచ్చిన జాగిలములు"

మ.చ. 4–31

ఇందలి ఘకార, భకార. రకారములు జాగిలముల ఆర్భటమును చక్కగా వ్యంగ్యమొనర్చుచున్నవి. అట్లే–

చకితైణాహుతి దావమాపతిత పుచ్ఛస్వల్ప గచ్ఛత్తర
క్షుక మద్రి గ్రహయాళు భల్లుకము వక్షోభాగ నిక్షిప్త డిం
భక వల్గత్ప్లవగీ కదంబము హ్రదాంభః ప్రోత్థితక్రోడ నా
యక మాభీలముఖ ద్విపిస్థపుటితంబయ్యెన్వనం బత్తఱిన్

మ.చ. 4–38

అను పద్యమున శబ్దార్థములు సరిగా తెలియకముందే అరణ్యమున వేటగాండ్ర అలజడిని విని జంతువులన్నియు తత్తరబిత్తరపాటుచెందిన విధము బోధమగుచున్నది. సంస్కృతసమాస శైలితోకూడిన పై పద్యమునందలి రచనలో పదములకూర్పు భావవ్యంజకముగా నున్నది. అర్థము తెలియకముందే పదములు రసమును స్ఫుటీకరించుచున్నవి.

"గళకర్త క్రోధ నిర్యత్కహకహ నినదోద్గాఢహాసంబు..."
"అని బాహాస్ఫోట రావాపతగ కులంబవ్వని శాఖి శాఖా...."

మ చ. 4-95, 99

అను మహాస్రగ్ధరలలోని పరుషాక్షరసహిత సమస్తపదశైలి వీరరసస్ఫోరకము. ఆదేవిధముగా-

"దానవు డద్ధరారమణుఁ దాకె నుదగ్ర పదాగ్ర ఘట్టన...."

"గదాహతికి నాత్మఁ గొంకొక యెదిర్చి రాఁగానిదొఁ
గదాయనుచుఁ ద్రిప్పి రాక్షసుడు వైచె గాఢభ్రమా
న దత్కనక కింకిణీ నటన ఝాగ్ర దుగ్రార్భటీ
వదావద మహాగుహా వలభియైన శూలంబునున్"

మ.చ. 4-94, 100

మొదలగు పద్యములలోని పరుషాక్షరభరిత సమాసశైలి వీరరసపోషకముగా నున్నది.

"ధగధగని దేహరుచి నిగనిగని కుందనపుఁ
దగడుఁ దెగడం జిగురు జిగి నెగుచుమోవిన్...."

మ.చ. 4-117

అను పద్యములోని దకార గకారముల ఆవృత్తి గంధర్వుని తేజోరూపమును సాక్షాత్కరింపజేయ సమర్థమై, అద్భుతరసవ్యంజక మొనర్చుటలో తోడ్పడుచున్నది.

"ధారాళ క్షతజోక్షిత
ఘోర జరా ధవళితోరు కూర్చముగఁ గర్రా

చూరిని మెడ తెగియుట జా
గారంబునఁ బడిన మూఁడు కాళ్ళ ముసలికిన్...."

మ.చ. 6-53

ఇందలి రకార, ఙకార చకారములు భయానకరసపోషణమును కావించుచున్నవి.

"ఘుర్ఘురారావ సంఘాత ఘూర్ణమాన
సప్తపాథోధి పాథ ప్రచండ నక్ర
తిమితిమింగల మగుచు నభ్రమును మహియుఁ
గ్రమ్ముకొని వచ్చు నొక యేకలమ్ముఁ గనియె"

మ.చ. 6-98

అను పద్యములోని ఘకారాదులు నడచివచ్చు యేకలము యొక్క భయంకరాకార మును స్ఫురింపజేయుచున్నవి.

ప్రాసాక్షరములను కూడ రసవ్యంజకముగా ప్రయోగించుటలో పెద్దన అతని కతడే సాటి. బిందుపూర్వక గ, త, ద, డ, చకారాదులను ద్విరుక్త ద, క, వకారాదులను ప్రయోగించి భావపోషణను, తద్ద్వారా రసవ్యంజకతను కావించి పెద్దన చక్కని రచనాశిల్పమును చూపినాడు. ఉదాహరణకు కొన్ని పద్యములు- చింత విచారాది భావములను ప్రకటించునపుడు ద్విరుక్త కకార ప్రాసను వాడుట పెద్దనకు ఇష్టము-

"అక్కట నాడు నా తగ్రుల మాఱడి సేసి దయావిహీనుడై
చిక్కక త్రోచిపోయెఁ దరిజేరఁగరాని వియోగసాగరం...."

3-5

"చొక్క పుఁ బ్రాయమున్ మిగుల సోయగముం గల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతులనేఁకట దీర్చి సమేళన మొప్పగా...."

3-7

"ఒక్కొకవేళ పద్మముఖు లొల్లమి సేయుదు రొక్కవేళ...."

3-69

"అక్కట నా యెడన్ మిగుల నక్కఱగల్గి చరించు నెచ్చెలుల్...."

6-10

"నిక్కము దాపనేల ధరణీసురనందన యింక నీ పయిన్..."

2-51

"ఎక్కడివాడొ యక్ష తనయేందు జయంత వసంతకంతులన్..."

2-35

"ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁబోయెదనంచుఁ బల్కెడీ..."

2-50

"ఎక్కడి యరుణాస్పద పుర
మెక్కడి తుహినాద్రి క్రొవ్వి యే దాఁదగునే...."

2-15

మొదలగు మనుచరిత్ర పద్యములలోని ద్విరుక్త కకార ప్రాస చింత మొదలగు భావములను చక్కగా వ్యంగ్యమొనర్చుచున్నది.

"మట్టెల్ మ్రోయగ గబ్బిచన్నుఁగవ కంపంబంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మ చీకటులుగా..."

మ చ. 4-37

అను పద్యములో ద్విరుక్తటకారప్రాస,

ఒక్కతె భయశోకంబుల
వెక్కుచు మెయిఁగల విలాస విభ్రమలక్ష్మల్
దక్కటయును...." మ.చ. 4-68

లోని ద్విత్వకకారప్రాసయు క్రమముగా మనోరమ యొక్క భయశోకములను ప్రకటించుచున్నవి.

"పలుచని వాతెఱ మొఱుఁగున
బలు యెఱుఁగులు సందడింపఁ బాపటపై నం
జలిఁ జేర్చి...." మ.చ. 4-69

అను పద్యమునగల లకార ప్రాస, ఱకారావృత్తి మనోరమ యొక్క విలాస

మును తెల్పుచున్నవి. లకార ప్రాసకు మరికొన్ని యుదాహరణలు-

"పలుకులు నేర్పువేళఁగల భాషిణి నీవిటులుండఁ బంజరం..."

3-58

"కొలకొలఁ గూయుఁ బైనొఱగుఁ గుత్తుకఁగుత్తుకఁ జుట్టు...

3-62

"చిలుకలు ముద్దుబల్కులకుఁ జేరగ రానెఱివేణి కాంతికిన్ ...."

6-25

ఏలర యీ చలంబుడిగి యేలర బాల్యసాల మాలతీ...."

3-93

"అలికులవేణి యొక్కతె రతాంతమునం దన యంగవల్లి కం..."

5-66

"జిలుగులుఁ బెట్టుచుం దొడలఁ జెంద్రిక పావడ యంటమై తడిం ..."

5-68

మొదలగు మనుచరిత్ర పద్యములలోని లకారప్రాస సుకుమార శృంగార కరుణాది భావపోషకమునై యున్నది. విభావానుభావ సాత్త్విక భావాదులను సహజముగా ప్రసన్నముగా ఔచితీవంశముగా వర్ణించి రసవ్యంజకమును కావించు టలోను పెద్దనకు చాతుర్యము కలదు.

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ...."

2-28

"చూచి ఝళంఝళత్కటకసూచిత వేగ పదారవిందయై...."

2-29

"మునుమున్ పుట్టెడు కొంకులౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్
..."2-30

పంకజముఖి కప్పుడు మై
నంకురితములయ్యెఁ బులుకలావిష్కృతమీ...."

2-31

"తొంగలిఱెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు...."

2-32

"అనిమేషస్థితి మాన్పె బిత్తరఁజూపస్వేదతావృత్తి....
2-33

అను మనుచరిత్రపద్యములలో వరూథినిలోని ఆశ్చర్యము, కుతూహలము,సంకోచము, విలాసము, గగుర్పాటు, ప్రళయము(చేష్టారాహిత్యము), స్వేదము మొదలగు సాత్త్వికభావముల వర్ణనలు పాఠకులలో శృంగారరసోద్దీపనమునకు దోహదము చేయుచున్నవి. ఇట వరూథినిలోని శృంగారమునకు- గరుడ్గోత్కీర్ణ భవనము మరియు తత్పరిసర సుందరప్రదేశములు, ఏకాంతత్వము, ప్రవరుని రూపలావణ్యములు ఉద్దీపనవిభావములు. ప్రవరుడాలంబనవిభావము, వరూథిని హావహేలావిలాసాదు లనుభావములు తృతీయాశ్వాసారంభమున వరూథిని విప్రలంభశృంగారవర్ణన కలదు. అట అభిలాష, చింతనము, స్మృతి, గుణకథ, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, సంజ్వరము, జడత, మరణమను దశవిధ మన్మథావస్థలు వర్ణించబడినవి. మాయాప్రవరుని కాంచినప్పుడు వరూథినిలో కలిగిన (3ఆశ్వా. 90-93) అశ్రు, వైస్వర్యము, కంపము, వైవర్ణ్యము అను సాత్త్వికభావములును, దైన్యము, జాడ్యము, త్రాసము, ఆర్తి, ఆవేగము, తపాది సంచారీభావములును వర్ణించబడినవి.

ప్రబంధమున అంగిరసమగు శాంతమునకు ప్రవర, స్వారోచిషులు ఆలంబన విభావములు. వారి ధర్మవీరము, ధీరత్వము, శాంతస్వభావములు అనుభావములు. ప్రవరస్వారోచిషుల అకామత, శాంతి దాంతి దయా సత్య శౌచ నిరతత్వ. సాలోక్యేచ్ఛలు శాంతరస పోషకములు.

అదేవిధముగ పెద్దన వీరాదిరసములను విభావానుభావ సాత్త్వికభావాదుల వర్ణనల ద్వారా వ్యజ్యమానమొనర్చినాడు. "విభావానుభావాది వర్ణనల కనుకూలమైన మనుసంభవకథను గ్రహించి పెద్దనామాత్యుడు మనుచరిత్రమునందు నవరసములను సందర్భానుసారముగ హృదయంగముగఁ బోషించె"నని పల్లా దుర్గయ్యగారి యభిప్రాయము.[1]

విభావానుభావసాత్త్వికభావాదుల వర్ణనల ద్వారా రసమును వ్యంగ్యమొనర్చుటలో రామరాజభూషణుడును తన చాతుర్యమును ప్రదర్శించినాడు. రామ

1. ప్రబంధ వాఙ్మయవికాసము. వ్రాతప్రతి. పుట. 610

రాజభూషణుడు స్వయముగా ఆలంకారికుడు, పండితుడు కావున ఆ వర్ణనలు కొంత లక్ష్యలక్షణరూపముగా గోచరించును కాని సహజకవి వర్ణనల వలె గోచరించకపోవచ్చును. వసుచరిత్రలో అంగిరసము శృంగారము. ఆ శృంగారరస వ్యంజనావిధమును పరిశీలింతము– వసుచరిత్రలో నాయికా నాయకులు గిరికా వసురాజులు. వారు ఆలంబనవిభావములు. వారి యౌవనము, సౌందర్యము, హావహేలాదులు సహజోద్దీపనభావములు. ఉద్యానవనము, గిరికాగానము తటస్థోద్దీపనభావములు. తృతీయాశ్వాసమున 48–53 పద్యములలో నాయికానాయకుల చక్షుఃప్రీతి వర్ణించబడినది ఇందు పరస్పరవీక్షణాకుతూహలము, సంకోచము, స్వేదము, త్రప,అను సాత్త్వికభావములు వర్ణించబడినవి. గిరిక హారమణిలో వసురాజును కాంచుట, అది చెలులు కనిపెట్టగా సిగ్గుతో నామె తెర మాటునకు పోవుట, ఆమెను తోడ్కొనిపోవుటకు జనని వయస్య వచ్చుట,వెడలిపోవునడు గిరిక వివిధ మిషలతో వెనుతిరిగి వసురాజును చూచుట మొదలగు ఘట్టములందామె మౌగ్ధ్యము, లజ్జ, హావహేలవిలాసాది చేష్టలు చెప్పబడినవి. ఇవన్నియు పాఠకులకు ఆలంబనోద్దీపన విభావములై రసస్ఫూర్తికి దోహదములగుచున్నవి. విప్రలంభశృంగారమున నాయికానాయకులలో కృశత్వము, వైవర్ణ్యము, చింతన, స్మృతి, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, జడతలు వర్ణించబడినవి. మనుచరిత్రతో వలెనే వసుచరిత్రలో గిరికా మరణప్రయత్నము వర్ణించబడినది.

పవమాన మానవ ప్లవమాన కైరవ
చ్యవమాన రజముమైనంటఁ దివురు...

వ.చ. 3–118

అను వసుచరిత్రలోని పద్యమున కవియొక్క పాండిత్యము, అలంకారప్రౌఢిమ ఉక్తివైచిత్రి గిరికా మరణప్రయత్న విషయమును గౌణమొనర్చి రసస్ఫురణకు ప్రతిబంధకములైనవి. మనుచరిత్రలోని–

"చనుఁగప్పు దొలఁగ వాసన గాలి తెదురేగు
బరువొప్పు నలుగులఁబాఱు కరణి...."

మ.చ. 3–31

అను వరూథిని మరణప్రయత్నవర్ణనగల పద్యములోని అర్థవ్యక్తి విషయస్ఫుర

ణకు తద్ద్వారా రసస్ఫురణకు మిక్కిలి తోడ్పడుచుండగా వసుచరిత్రకారుని పద్యములో భావస్ఫురణకన్న ముందుగా శబ్ద, ఉక్తి చమత్కారములు పాఠకుల నాకర్షించుచున్నవి.

అదేవిధముగ ప్రవరునిచూచినప్పుడు వరూధినిలో కలిగిన సాత్త్వికభావములు సులభశైలిలో రసవత్తరముగా వర్ణించబడెను. వసుచరిత్రకారుని గిరికా వసురాజుల చక్షుఃప్రీతి వారి సాత్త్వికభావవర్ణనలు శ్లిష్టములై ఉక్తివైచిత్రితో కూడియుండుటచేత అర్థస్ఫురణము వెంటనే జరుగుట లేదు. ఉదాహరణకు—

అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనకల్ వికసితోత్పల పంక్తులఁ గ్రుమ్మరింపగా
గుబ్బ మెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బతిలంగఁ జూచె నలకూబర సన్నిభు నద్ధరామరున్

మ చ. 2-28

అను మనుచరిత్రలోని పద్యభావమును పోలిన భావముగల వసుచరిత్రలోని పద్యము—

అనుపమకాంతి వైభవ సమన్వితు నా వసురాజుఁ గాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగ కందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్వెలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోద తరళస్థితులై తమిఁజూపు తుమ్మెదల్

వ చ. 3-48

మనుచరిత్ర పద్యమున శ్లిష్టపదములు లేని సహజసుందరశైలిలో రోమాంచమను సాత్త్వికభావము, నేత్రప్రసన్నత, ఆశ్చర్యములను అను భావములు చెప్పబడినవి. ఈ వర్ణన వెంటనే వరూథిని రతి నభివ్యక్తమొనర్చుచున్నది. ఇక వసుచరిత్రలోని పద్యము శ్లేష, పాండిత్యములతో కూడియున్నది పైగా "అఖండ వాసనలు, ఉత్కలికల్వెలసిల్లె" అని సాత్త్విక సంచారీభావములను వాచ్యముగా చెప్పుటచేత పాఠకుని యూహకేమియు విడువబడదయ్యెను. రామరాజభూషణుడు స్వయముగా ఆలంకారికుడు కాన రస

స్వరూపమును ఆ పద్యమందు చొప్పించినాడు. మరియు శ్లేషద్వారా అప్రస్తుత మగు పద్మిని విషయమును చెప్పుటచే రసవ్యక్తికి విలంబమగుచున్నది.

"భావగత భావనా సం
భావిత భావంబు లిట్లు మల్లడిగొని గో
త్రా వల్లభు డిట్లనుఁ జి
త్రావేశిత వనితఁగని మహామోహమునన్"

వ.చ. 4-82

ఇందు వసురాజు చిత్తగతములైన, సంస్కారములచేత సంభావితములైన సాత్త్వికసంచారిభావములు మల్లడిగొనినవని వాచ్యమొనర్చుటయు రసవ్యంజకతకు సహాయకము కాలేదు అట్లే షష్ఠాశ్వాసమున సంభోగశృంగారవర్ణనలోని యీ క్రింది పద్యము-

"సతి సాహిత్య రహస్యమీశువలనన్ సాధించి తోడ్తోనఁ ద
త్పతికిం బ్రత్యుపదేశమిచ్చె నతులప్రౌఢిన్ ధ్వని వ్యక్తిఁ ద
ద్ద్యుతికిం జొన్పుమ లోచనాంజన రసప్రోన్మేషము ల్నమ్మఖో
ద్గతము ల్సేయుచుఁ బ్రత్యలంకరణ మౌఖర్యంబు దీపింపగన్"

వ చ. 6-94

ఇందు గిరికాదేవి పుంభావరతిని వర్ణించుచు ఆలంకారికుడైన కవి కావ్య ధ్వన్యాదుల ప్రాకట్యమును గూర్చి శ్లేషలో చెప్పుటచే సహృదయములకు రస వ్యంజకత త్వరగా జరుగుట లేదు.

వసుచరిత్రలో నిట్టి రసవ్యంజతకు విలంబమును కలిగించు శ్లేషాదులు గల పద్యములున్నను మనుచరిత్రలో వలె, విభావానుభావ సాత్త్వికభావాదుల సుప్రసన్నమైన వర్ణన ద్వారా రసమును వ్యంగ్యమొనర్చుట మృగ్యమనరాదు.

తొలు దొలుతన్ విలోలనతిఁ దొంగలి రెప్పలనాని కర్ణ కుం
డల రుచి ధాళధళ్యముల డాపున నల్లనఁ బొంచి మించులై
వెలువడి పూర్ణచంద్రుపయి వెన్నెల వుల్గులచాలు ప్రాలు లీ
లల విభుమీద ప్రాలె నవలానవలాలిత దృష్టిజాలముల్

వసుధాసుధాంశుఁ బొదవుచు
వెస మరలుచు మరలి మగుడ వెడలుచు లలనా
లసమాస దృష్టిజాతము
లసమాంబకు చిత్రశరములై విలసిల్లెన్

వనజదళాయతాక్షి నిడువాలిక చూప నిమేష వృత్తి నా
ఘను నవకంబుపైఁ బొలసి కాంత తదీక్షణజాలకంబుపై
కొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును గోరికఁ గ్రమ్మరఁగూడఁ బారు మో
హనగుణ శక్తి నివ్వటిలు నవ్వలరాయని నేర్పు పెంపునన్

వ.చ. 3—49, 50, 51

అను పద్యము లలో వసుచరిత్రకారుడు నాయికానాయకుల పరస్పర వీక్షణాపేక్షను సహజసుందరముగా, సులభశైలిలో వర్ణించినాడు మరియు 6 ఆశ్వా 78, 80 పద్యములలో నాయికానాయకుల సంభోగశృంగార సందర్భమున లజ్జ, స్తంభమను సాత్త్వికభావములను, 4 ఆశ్వా 79 80, 81 పద్యములలో వసురాజుయొక్క 'మన్మథావస్థ'లను సులభశైలిలో రసవ్యంజకమగునట్లుకవి వర్ణించియున్నాడు.

అంతేగాక రామరాజభూషణుడు వర్ణ,పద సంఘటనల ద్వారా అలంకార, ఉక్తి చమత్కారముల ద్వారా రసమును వ్యంగ్యమొనర్చెను.

కొలకుల పజ్జ సజ్జకపు గొజ్జఁగి పూఁ బొదరిండ్ల బోరునం
జిలుకు హిమాంబు పూర్ణములు శీతకరోపల పట్టికా తటం
బుల దువ కం బుటం బెగయు భూరి తుషారకణంబు లెల్లెడ
న్వల గొన నిన్నగంబు హిమవన్నగమం దనరారు భూవరా!

వ.చ. 2—12

ఇందలి క, జ్జ వర్ణములు, "బోరునం జిలుకు, పుటం బెగయు" అను పదములు కోలాహలపర్వతపు హిమాంబుపూరములను, తుషారకణములను సాక్షాత్కారమొనర్చుటకు సమర్థములు.

బండి గురివెంద తీఁగె చప్పరము లెనసి
ముడిగొనిన ద్రాక్ష పందిళ్ళ నడుమఁ గిన్న
రీ నినాదానుకారి శారీశుకాది
ఘోషఘుమఘుమ ఘుమితంబైన కోనఁ గనియె

వ.చ. 2—21

అను పద్యమున చివరిరెండు పాదములలోని పదముల కూర్పు, ఘకారావృత్తి ఘోషలతో నిండిన కోనను కన్నులముందు నిల్పుచున్నవి.

నాళీకాకర తీర సార కదళీ నారంగ పూగావళీ
పాళీవాసితమైన కోనఁగని యా బల్కోనలో గానలో
లాళీ ప్రేరక రత్నకోరక మయూఖాలీ సమాలీఢ మౌ
కేళీధామముఁగంటి భూరమణ యా కేళీ నివాసంబునన్

వ.చ, 2—29

అను పద్యములోని శకార, రకారముల ఆవృత్తి మరియు ఓజోగుణ సంపద ఉద్యానవనములోని వృక్షసంపదను ఎరుకపరచుచున్నవి.

"ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానా మయూర నినద..."

వ.చ. 2—7

అను పద్యము నందలి కాంత్యాదిగుణములు య, క. ంక, ంత్యంద,రకారముల ఆవృత్తి కోలాహలపర్వతమందలి కోలాహలధ్వనిని వ్యంజకమొనర్పసమర్థములై యున్నవి. శుక్తిమతీకోలాహల వృత్తాంత మీ క్రింది పద్యముతో నారంభించ బడినది—

"కలదుల్లోక మహోమహోగ్రగహ్వర ఝగ్ఝ్వాలావళీ నిర్జల
స్థల దంభోనిధి లక్ష్య హైమవత పక్షక్షోద దక్షోరుది
గ్వలభీ దుర్భరభేరికా భయద ఝాంకారైక సంప్రీణితా
చల వైరి స్తుత కీర్తిసాంద్రుడు వసుక్ష్మాపాల చంద్రుం డిలన్

వ.చ. 2—102

ఇందలి ఓజోగుణ సంపన్నమైనదీర్ఘసమాస రచన ఆవృత్తాంతమున ప్రాధాన్యము వహించు వీరరసమును సూచించుచున్నది.

పీనుల విందై యమృతపు
సోనల పొందై యమంద సుమచల దళిగీ
గానము క్రందై యాస్వన
మానంద బ్రహ్మమైన నధిపతి పల్కెన్

వ చ 2–14

ఇందలి బిందుపూర్వక దకారావృత్తి గిరికాస్వర మాధుర్యమును ధ్వనింప జేయుచు ఆనందదాయకమైనది. గిరికా గానము నాయకునకు ఉద్దీపన విభావము లలో నొకటి.

అమ్ముదిత రత్న కటక చ
యమ్ముదిత నినాదమయ్యె నయ్యెడఁ జలమే
లమ్మని పతితోఁ దగు మే
లమ్మని సహజానురక్తి లాలించు క్రియన్

వ.చ. 6–80

ఇందు చివరి రెండు పాదములలోని లకారావృత్తి గాజుల గలగలను స్ఫురింప జేయునట్టిదే.

ఏమంద మేమి సేయుద
మేమందని మందలింత మేమంద మొయిం
దేమందయాన నడుగుద
మేమందల మనుచుఁ దరళ హృతయాంబుజలై

వ.చ 3–181

ఇందలి మకార బిందుపూర్వక దకారావృత్తులు గిరికసఖు లామె అవస్థనుగాంచి తమలోతామెట్లు మందమందముగా కళవళపడినది చక్కగా ధ్వనింపజేయు చున్నవి

అక్కట మిక్కుటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో
యొక్క నగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహము
ల్పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీ స్రవంతి పే
రక్కున వ్రాలి యాఁగె భువనావళి నుద్భట వింధ్యవైఖరిన్

వ.చ. 2–146

అను పద్యములో ద్విత్వకకార లకారావృత్తి భయానకరసపోషకమై యున్నది

నరవరుఁ డభయం బొసఁగుచు
హరిరథ నిరసన మనోరయంబున నరిగెం
గరి భరణ కరణ పరిణత
కరుణా పరిణాహియగు జగత్పతి లీలన్

వ.చ. 2-151

ఇందలి రకారావృత్తి వసురాజు శుక్తిమతిని రక్షించుటకై వెడలు శీఘ్రతను మరియు వీరరసమునందలి ఆవేగమను సంచారీభావమును వ్యంజకమొనరించు చున్నది.

"పోటనీ బంతి మీటుగతి భూవరుఁ డంఘ్రినఖాంచలంబునన్
మీటిన గట్టు బిట్టెగసి మేదిని వ్రాలు ఘనస్వనంబునన్....

వ.చ. 2-158

ఇందలి టకారావృత్తి వీరరసస్ఫోరకమై కలదు.

ఈ విధముగా రామరాజభూషణుని వసుచరిత్రలో పెద్దన మనుచరిత్రలో వలెనే రసవ్యంజన వ్యాపారాము జరిగినది. కాని పెద్దనలో సర్వత్రమాధుర్య, అర్థవ్యక్త్యాది గుణములతో కూడిన ప్రసన్నమైన వైదర్భీశైలి, విభావానుభావా దుల సంపూర్ణ సహజవర్ణనలు రసధ్వనికి మిక్కిలి పోషకములై మనుచరిత్ర నొక రసధునిగా నొనర్చినవి. ఇట్టి రసవ్యంజకతనే ఆనందవర్ధనుడు కావ్యా త్మగాను, కావ్యోత్కర్షకు ముఖ్యగుణముగాను పేర్కొనినాడు. రామరాజభూష ణునిలో శ్లేష, పాండిత్యము, అర్థవైచిత్రి, భావౌన్నత్యము, అలంకారబాహుళ్యములు రసవ్యంజకతకు కొంత విలంబమును కలిగించుచున్నవి. ఆతడు ప్రయోగిం చిన అర్థ, శబ్దాలంకారములు వసుచరిత్రలో గుణీభూతవ్యంగ్యమును ప్రాధాన్య మొనర్చినవి. ఎచట వ్యంగ్యప్రధానమై వాచ్యార్థము రమణీయతరమై గోచరిం చునో అది గుణీభూతవ్యంగ్యమనబడును. సమాసోక్తి, రూపకాద్యలంకారము లలో వాచ్యములైన వస్త్వలంకారములందే చారుత్వాతిశయము కలదు. కాని వ్యంగ్యములైన వస్త్వలంకారములలో కనిపించదు. వక్రోక్తి, ఉక్తివైచిత్ర్యాదు లందును వాచ్యమునందే చారుత్వాతిశయము కనిపించును. విభావానుభావ సాత్త్వికాదుల ఔచితీవంతములైన వర్ణనలెట్లు రసధ్వని కుపస్కారములగునో

అలంకారాదులు, ఉక్తివైచిత్రి, శ్లేషలు చమత్కారాతిశయమును పుట్టించి రమణీయమగు వాచ్యార్థము ద్వారా ధ్వని నిష్యందమై, రసవ్యంజనములో నెట్టి ప్రతిబంధకము కానేరదనియు ధ్వన్యాలోక కర్త అభిప్రాయము– "ఈ గుణీభూత వ్యంగ్యము కూడ ద్వితీయమగు ధ్వనినిష్యందమే కావున నిది యతి రమణీయ మనియు దానిని మహాకవులాదరించిరనియు సహృదయులు గ్రహించవలెను."[1]

వసుచరిత్రలోని శ్లేషాద్యలంకారములు, ఉక్తి వైచిత్ర్యాదులలోని వాచ్యార్థము రమణీయతరమై యెట్లు రససోస్ఫోరకమో పరిశీలింతము–

"ఏపారు పొదరిండ్ల నాపాటలాశోక
దీపార్చిఁ గనక కలాపమునసె .."

వ.చ 1–134

అను పద్యమునందు పదములకు గల ద్వితీయార్థముచే వసంతవాయువుతోపాటు గంధవహుడను ధూర్తనాయకుని లక్షణములు విదితములగుచున్నవి. కాని యిట రెండర్థములు నియతముగా తెలుసుకొను అవసరము లేదు. కాని పాఠక సహృదయుని శబ్దపరిజ్ఞానము నాధారముగా కొని యిందు ధూర్తనాయకుడను రెండవ అర్థము గోచరించి ఉపమాలంకారము ధ్వనించి చమత్కారము పుట్టుచున్నది.

వేణి చలింపఁ గంపిత నవీన మృణాళ భుజాగ్రకంకణ
శ్రేణి నటింపలోల శఫరీ నిబిరీ సకటాక్షతంతి వి
న్నాణము భూపహంసక గణ క్వణంబులుమీర సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖ శోభితయై కడు సంభ్రమించినన్

వ.చ. 2- 38

పర్వతముకూలిపడిన ఒకనది యెట్టిఅల్లకల్లోలమునుచెందునో సహజముగా పైపద్యమున చెప్పబడినది. ఆ యర్థము నంటియే ఒక పురుషునిచేత బలాత్కరించబడిన స్త్రీరూపమెట్లు అస్తవ్యస్తమగునో శబ్దశక్తి ద్వారా వ్యంగ్యమగుచున్నది.

1. ఆంధ్ర ధ్వన్యాలోకము. పుట. 579.

"పగలై నఁ దెల్విఁ గోల్పడని రాజులు శరం
బులు చన్న వెలవెలఁబోని ఘనులు..."

వ.చ. 1–98

పై పద్యమున రాజులు వర్ణించబడినారు. రాజులు, ఘనులు, సార్వభౌమాంకులు, కుమారులు, ఇనులు, పురుషసింహులు, గోత్రపతులు, భోగులు అను పదములకు గల అర్థాంతరములు అనాయాసముగా స్ఫురించి, వ్యతిరేకాలంకారము ధ్వనించి పాఠకహృదయములలో చమత్కారము పుట్టుచున్నది.

"అతనుభూతి ఘటింపనయ్యెనే చదరేఖ
సిక దాల్చు నింధాన చిత్రకునకు..."

"అజ్ఞాత గోత్ర యనాది శక్తి సుగోత్ర
భవమయ్యె నితని గర్భమునఁ బుట్టి..."

వ.చ. 2–137, 5–34

మొదలగు పద్యములలోని శ్లేష చమత్కారహేతువై యొప్పుచున్నది.

"అతుల శైవలవతీ శతముల్లినెడు మీకు
నాయిచ్చు విమలార్ఘ్య తోయమెంత..."

వ.చ. 2-122

"నావిని గట్టుజేడు వదనంబున విన్నదనంబు దోఁప నో
శైవలినీ శిఖామణి నిజంబు భవత్కమనీయకాంతి ధా
దావళిలో మునింగితి దయాపతిఁ బ్రోవకసుళ్ళఁ బెట్టెదో
నీవిక గుచ్చియెత్తి ఘననిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్"

వ.చ 2–122, 134

మొదలగు పద్యములలో గల వ్యంగ్యభావ చమత్కారాతిశయము సులభగ్రాహ్యమైనది.

"లలనాజనాపాంగ వలనా వసదనంగ
తుల నాభికా భంగ దోః ప్రసంగము...."

"మెఱుగొప్పు నెఱిగొప్పు నెఱగప్పు తఱగప్పు
జలదమాలిక చొప్పు దెలుపలేదొ...."

నాకుల దైవతంబు లలనాకుల నాకుల భూషణమీ లతాంగి మె
నాకుల భూదరేంద్రుల యనాకుల నిర్మల భాగ్యరాశి..."

వ.చ. 1-126, 3-69, 5-12

మొదలగుపద్యములలోని అనుప్రాస యమకాద్యలంకారములు రసవ్యంగ్య మునకు గాక చమత్కారాతిశయమునకై ప్రయోగించబడుట కుదాహరణములు.

"కలికి నీ చేపట్టుగలది మా కందంబు
సతి నీవు నగునది సరసతిలకము...."

వ.చ. 3-147

అను పద్యమున శ్లేష అనురణన రూపమున వ్యంగ్యమై చమత్కారమొనరించు చున్నది.

"వరగుణజాల సంవనన సామగ్రితోఁ
బాశంబు లాశలఁ బాదుకొల్పి..."

వ.చ. 3-111

అను పద్యమున శంబరవిరోధి యను శబ్దమునకు గల ద్వితీయార్థముచే మన్మ థునితోపాటు కిరాతుడను అర్థము గోచరించి మన్మథకిరాతకులకు ఉపమాన, ఉపమేయ సంబంధము ధ్వనించి చమత్కారహేతువగుచున్నది.

"కొమ్మ వాతెఱతో గుణమ్ముఁ గైకొనవచ్చి
కఠిన విద్రుమము చే కట్టబడియె...."

"ఫలభంగములుసేయు చిలుకకు సొంగమై
క్రోధరసంబు ముక్కునసేయుండు..."

వ.చ. 2-45, 3-123

అను మొదలగు పద్యములలోని యుక్తివైచిత్రి చమత్కారానందము నొదవించు నట్టిది· ఇట వ్యంగ్యము కన్నను వాచ్యమే రమణీయమై యున్నది.

"కొండంతవారి కవనిఁ గొండంతపూజ సేయంగఁ గలరె..."
2–122

''నను నదీనుఁ జేయవే...." 2–130

"తామరతంపమై..." ''ఎండ కన్నెఱుగక...'
3–55

"చిక్కులబెట్టఁ జూమీ...." 4–106, "తమ్ములఁ బంపుదు..."
6–60

''మిన్నులుముట్టి వచ్చు" 2–109, "నీ తమ్ముల శుభవాసన...."
6–55

మొదలగు వసుచరిత్రపద్యములలోని శబ్దములు వ్యంగ్యార్థస్ఫోరకములు అర్థ చమత్కారహేతుకములునై యున్నవి.

ఈ విధముగా వసుచరిత్రలో గల వస్త్వలంకార ధ్వనులు, గుణీభూత వ్యంగ్యములు రసవ్యంజనమునకు తోడ్పడుచున్నవని చెప్పవలయును. ఆలంకారికులు– "వస్త్వలంకారములు రసమునకు విభావానుభావరూపమగు సామగ్రియే యగుటఁ దద్వ్యంజనకును రసవ్యంజ్యనమునందే పర్యవసానము కనుక వస్త్వలంకార వ్యంజకకావ్యమున కూడ రసధ్వనియే జీవితమనుట యౌచిత్యప్రాప్త"మని యభిప్రాయపడిరి.[1] మరియు గుణీభూతవ్యంగ్యము గల కావ్యమును సైతము నుత్తమ కావ్యముగా నాలంకారికులు సమ్మతించినారు– "ఏలయన యే యర్థము వలనఁ జమత్కారాతిశయము కలుగునో యది యుత్తమము. ఇట వ్యంగ్యములగు వస్త్వలంకార రసాదులచేతనే చారుత్వము కలుగుచున్నది. కాన నవి నే ప్రధానములు........ జగన్నాథుడు వీని నుత్తమకావ్యములుగానే పరిగణించెను."[2]

---

1. ఆంధ్ర ధ్వన్యాలోకము. పుట. 102

2. కావ్యాలంకార సంగ్రహము. పుట. 232

ఉక్తివైచిత్ర్యాదుల ద్వారా రసస్ఫురణను సాధించిన కవులు-సుబంధు, భట్టబాణ, మాఘ, శ్రీహర్షాదులు సంస్కృతసాహిత్యమున కలరు. వారు ఆలంకారిక కవులనియు వారిశైలి ఆలంకారికశైలి యనియు పిలువబడును. రామరాజభూషణుడును వారికోవకు చెందినవాడు-ఆతడు ఆలంకారిక కవి

విభావానుభావాది వర్ణనల ద్వారా ఆనందవర్ధనుడు చెప్పిన రసధ్వని మర్యాద ననుసరించి కళాసృష్టి కావించిన కవులును కలరు. సంస్కృతమున వాల్మీకి, కాళిదాసాదులీ రసశైలికి చెందిన కవులు. అల్లసాని పెద్దనయు ఈ కోవకు చెందినవాడు. ఆతడు రసకవి

దండి సాహిత్యము నంతటిని స్వభావోక్తి, వక్రోక్తి అని రెండుగా విభజించినాడు-"భిన్నం ద్విధా స్వభావోక్తిర్వక్రోక్తిశ్చేతి వాఙ్మయమ్"(కావ్యాద. 2-363) వాల్మీకి, కాళిదాసాదుల వలె పెద్దన స్వభావోక్తిమార్గమునకు చెందినవాడు. రామరాజభూషణుడు బాణ, శ్రీహర్షాదులవలె వక్రోక్తిమార్గము నకు చెందినవాడు.

భారవి ప్రారంభించిన ఆలంకారికశైలి ననుసరించుచు ఇంకను అలంకార ప్రధాన మొనర్చి మాఘుడు, తదనంతరము శ్రీహర్షాది ప్రౌఢకవులకు మార్గ దర్శకుడైనాడు. అట్లే రామరాజభూషణుడును పెద్దన ప్రారంభించిన ప్రబంధ శైలిని గ్రహించి భావప్రౌఢిమను, ఉక్తివైచిత్రిని, శ్లేషచమత్కారములనుచేర్చి ప్రౌఢతరముచేసి తరువాతి కవులెందరికో మార్గదర్శకుడైనాడు.

తనకు కవితాగురువైన పెద్దన ప్రారంభించిన ప్రబంధమార్గమును రామ రాజభూషణుడు చేపట్టి అర్వాచీన కవుల కాదర్శప్రాయ మొనర్చి, పెద్దనయొక్క 'ఆంధ్రకవితా పితామహ' బిరుదమును సార్థకము కావించెను.



# పాత్ర చిత్రణము

కావ్యములో పాత్రచిత్రణ మొక శిల్పము. పాత్రల వేషభూషలను చిత్రించుట, రూపలావణ్యములను సాత్త్వికభావాదులను వర్ణించుట, లోకసహజ మగు పాత్రల స్వభావమును ప్రకటించుట పాత్రచిత్రణాశిల్పమున కంగములు. పాత్రలయొక్క మనఃప్రవృత్తిని సంభాషణలద్వారా విలాసాది చేష్టల చిత్రణము ద్వారా వ్యంగ్యమొనర్చుట గొప్ప శిల్పము. ప్రాచీనాలంకారికులు రసశిల్పమున కిచ్చినంత ప్రాధాన్యమును పాత్రచిత్రణాశిల్పమున కిచ్చినట్లు లేదు. ఆలంకారికులు చతుర్విధనాయకులను ఏర్పరచినారు. కథ కాశ్రయమైనవాడు నాయకుడు. రసము ఆతని నాశ్రయించియే యుండును. చతుర్విధనాయకులలో రసానుకూలమైన నాయకుని కవులు గ్రహించుట కలదు. లేక నాయకానుకూలమైన రసమును పోషించుటయు కలదు. ఇక నాయికయు రసానుకూలమైనదిగా నుండవలయును. ఆలంకారికులు, కవులు రసపోషణమునకే మిక్కిలి ప్రాధాన్య మొసగిరే కాని పాశ్చాత్యులవలె పాత్రలను సహజముగా, మనోవైజ్ఞానికముగా రూపొందించుటకు ప్రయత్నించలేదు. పాశ్చాత్యకవులు పాత్రల మనఃప్రవృత్తులను బట్టి కథను మలతురు. కాని భారతీయకవులవలె రసానుకూలమైన కేవలము ఆదర్శాత్మకమైన, ప్రతీకాత్మకమైన పాత్రలను వారు చిత్రించరు. భారతీయ కావ్యములలో రసమును స్థాయిభావముగా రూపొందించుటయందే కవుల దృష్టి కాని యిట్టి పరిస్థితులలో నిట్టి మనఃప్రవృత్తిగల పాత్ర యిట్లు ఆచరించు నను లోకసామాన్యమానవ మనస్తత్వచిత్రణమునందు లేదు. ఆధునిక సాహిత్యమున భారతీయ రచయిత లిట్టి శిల్పమునకు ప్రాధాన్యమిచ్చుచున్నారు.

ప్రాచీన కావ్య నాటకములందు సహజపాత్రచిత్రణాశిల్పమునకు ప్రాధాన్యము లేకున్నను, అది మృగ్యమనుటకు వీలులేదు. సహజపాత్రచిత్రణమున, తెలుగుసాహిత్యములో కావ్యకళాపారంగుడైన తిక్కన సాటిలేని ప్రతిభను ప్రదర్శించినాడు. పాత్రచిత్రణాశిల్పము నాదరించినవారిలో ఆంధ్రసాహిత్యమున అతడే ప్రథముడని చెప్పవలయును. మహాభారతమున లేని లౌకిక సంబంధి విషయము లేదేమో. అట్లే పాత్రల విషయమున. సహజ మానవ

ప్రవృత్తులను చిత్రించుటలో భారతీయ ప్రాచీనసాహిత్యమున మహాభారతము నొక అపవాదముగా గ్రహించవచ్చును. మన సత్వచిత్రణతో కూడిన పాత్ర చిత్రణాశిల్పము మహాభారతములో పాశ్చాత్యకావ్య నాటకాదులలో వలె నిర్దుష్టముగా జరిగినది. మహాభారతమున అధికభాగమును అనువదించిన తిక్కన కూడ ఈ పాత్రల చిత్రణమును నైపుణ్యముతో నిర్వహించినాడు. ఆతడు పాత్రలయొక్క మనోభావములను వాచ్య వ్యంగ్యరూపమున ప్రస్ఫుటము కావించును. పాత్రల హృదయాంతర్గత భావకల్లోలములను, అంగముల కదలికలను సూక్ష్మముగా వర్ణించి ఆయా పాత్రలు పాఠకుల మనోవీథిలో నిలుచునట్లు కావించును. తిక్కన తరువాత శ్రీనాథుడు పాత్రలయొక్క వేష, భూష, రూప, అంగవిన్యాసములను విసుగులేక వర్ణించినాడు శ్రీనాథుడు పాత్రల మనోభావచిత్రణమున కన్న బాహ్యరూపచిత్రణమునకే ప్రాధాన్యమిచ్చినాడు. తరువాతి ప్రబంధకవులు తిక్కన,శ్రీనాథుల పాత్రచిత్రణావైభవమును గ్రహించి యా శిల్ప విశేషమునకు మెరుగులు దిద్ద ప్రయత్నించిరి. పాత్రచిత్రణాశిల్పమను ప్రబంధమునకు ప్రధానాలంకారముగా వారు గ్రహించిరి. నాటక క్రమములను కొన్నింటిని గ్రహించి ప్రబంధమున ప్రదర్శించినవారు ప్రబంధకవులు. నాటకములలో కనిపించు పాత్రచిత్రణాశిల్పమును ప్రబంధములందు వారు కొంతవరకు ప్రవేశపెట్టినారు. నాటకములందు సంభాషణల ద్వారా పాత్రల మనః ప్రవృత్తులు ప్రకటమగును. ఆ పాత్రల ఆహార్య సాత్త్వికభావములు రంగస్థలముపై ప్రదర్శించబడి ప్రేక్షకులచేత దర్శించబడును. ప్రబంధమునందు కవులు సంభాషణల ద్వారా పాత్రల మనః ప్రవృత్తులను ప్రకటించుటయే గాక రంగస్థలమున ప్రదర్శించబడు ఆహార్య సాత్త్వికభావములను పాఠకులకు ప్రత్యక్షమగునట్లు వర్ణింతురు. దానివలన పాఠకులకు ఆయాపాత్రలు మనోమంచముపై సజీవములై గోచరించి ఆనందమును కలిగించుచున్నవి. పారిజాతాపహరణములో తిమ్మన చిత్రించిన నారద, శ్రీకృష్ణ, సత్యభామ పాత్రలిట్టివి. పింగళిసూరన కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నములలోను తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యములోను ఇట్టి సహజపాత్రచిత్రణలు కనిపించుచున్నవి. మనుచరిత్రలో పెద్దనయు అట్టి పాత్రచిత్రణా శిల్పమును ప్రదర్శించియున్నాడు. తిక్కన శ్రీనాథుల పాత్రచిత్రణాసరణుల నాతడు మేళవించుకొనినాడు. తిక్కన సాత్త్వికభావచిత్రణలను, శ్రీనాథుని బాహ్యరూపచిత్రణలను ఆతడు ఆదర్శముగా గ్రహించి వరూథిని ప్రవరాది పాత్రలను చిత్రించినాడు.

మనుచరిత్ర ప్రవరుని వర్ణనతో నారంభమగును. అతడు ధీరప్రశాంతు డైన నాయకుడు. "సామాన్యగుణయుక్తస్తు ధీరశాంతో ద్విజాదికః"(2-3) అని దశరూపకకారుడు. నాయక సామాన్యగుణములనగా ధీరత్వ, కులీనత, వినయాది గుణములు ధీరశాంతునిలో నుండవలెను. ఈ గుణసమావేశము గల్గి బ్రాహ్మణ, వైశ్య, మంత్రిపుత్రులలో నొకడై యుండవలెను. పెద్దన ప్రవరునిలో నాలంకారికులు ధీరశాంతునికి చెప్పిన గుణసమావేశమును వర్ణించుటయే గాక, విజయనగరకాలమునాటి ఆదర్శ తరుణసంపన్న బ్రాహ్మణగృహస్థు నొకనిని ప్రతిబింబింపజేసినాడు. మారన వరూథినిచేత ప్రవరుని "మునితనయా!" యని సంబోధింపజేసినాడు. కాని పెద్దన ప్రవరుని ఋషికులములో పుట్టిన వాడుగాకాక సమకాలమునాటి నిష్ఠాసంపన్నుడగు సామాన్య బ్రాహ్మణగృహస్థుని గానే చిత్రించినాడు. అతడు దేవియు దేవరవంటి తలిదండ్రులతో, అనుకూలవతి యగు భార్యతో, సచ్ఛాత్రులతో, తరుగని పాడిపంటలతో, ధర్మకర్మ దీక్షతో ఆదర్శగృహస్థజీవనము గడుపునట్టివాడు. ఇహలోకమున సాధించ వలసినవన్నియు నతడు సాధించినాడు. మోక్షలక్ష్మీపథగామియై జీవించు చున్నాడు

వరూథిని అప్సరస. దేవవేశ్య. ప్రవరుడామెను "కాముకురాలు"గా త్రోసిపుచ్చినను, ఆమె కాముకురాలు కాదు. ఆమె సురగరుడాది దేవజాతిలో నెవరినొల్లక హిమాలయమునకు వచ్చి వసించుచు, విశేషతేజోరూపుడగు ప్రవరుని చూచి యాతనిచేత ఆకర్షింపబడినది. ఆమె స్వారోచిషమనుసంభవమునకు కారకురాలు కాబోవుచున్నది ప్రవరుడామెను నిరాకరించినపుడు శాంత వైరాగ్యములకు విజయము కలిగినను పాఠకుల సానుభూతి మాత్రమూ వరూథిని యందే కలుగునట్లుగా చిత్రించి పెద్దన మనుసంభవకారణభూతురాలు కాబోవు ఆ పాత్రచిత్రణమున గొప్పశిల్పమును ప్రదర్శించినాడు. మరియు వరూథినియొక్క రూపవిలాసాదులను కవి కనులకు కట్టునట్లు వర్ణించి యాపాత్రను ప్రవరపాత్రను వలెనే సజీవమొనర్చినాడు.

తతనితంబాభోగ ధవళాంశుకములోన
యంగదట్టపుఁ గావిరంగు వలన
శశికాంత మణిపీఠి జాజువాఱగ గాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ

దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనదోయి
రతి పారవశ్య విభ్రమముఁ దెలుపఁ ..

మ చ. 2-27

అను వరూథిని ప్రథమపరిచయము గల పద్యముననే కవి యామె రూపవిలాస విభ్రమములను సుస్పష్ట మొనర్చినాడు.

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ..."
"చూచి ఝుళంఝుళత్కటకసూచిత వేగ పదారవిందయై...."

మ చ. 2-28, 29

మొదలగు పద్యములలో ప్రవరుని గాంచినప్పటి వరూథిని సాత్త్వికభావములు చక్కగా వర్ణించబడినవి. "కనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములున్ జనుఁగవయు నడుము వడఁకగ" "సెలవి వాఱ నవ్వి" (2-40), "వలయ మణిగణచ్ఛాయా కలాపంబు లుప్పరంబెగయఁ గొప్ప చక్కం జెక్కుచు, జక్కవ గిబ్బలుంబోని గబ్బిగుబ్బలన్ జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తా తారకంబుల నఖకోరకంబులం గీఱి తీరువడంజేయుచు..." (2-31) మరియు 2ఆశ్వా 68, 69, 70 సంఖ్యగల పద్యములలో గల వరూథిని ప్రవరుని కౌగిలించుకొనుట, ఆతనిచే త్రోపువడి కోపము, దుఃఖమును పొందుట, ఆమె యేడ్పు—ఈ వర్ణనలన్నియు మరియు ఆమె మాటలసొంపుయు ఆమె విలాసలావణ్యతారుణ్యసంపదను ప్రకటించుచు సజీవమొనర్చుచున్నవి.

"ప్రభూత లావణ్యంబు సంభూత
కమలంబులన వీని కన్ను లమరు...."
"అర్ధచంద్రునితేట నవఘుళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగమట్టితోడఁ...."

మ.చ. 2-36' 3-71

అను వర్ణనల ద్వారా ప్రవరుని రూపలావణ్య వేషభూషలు పాఠకులకు ప్రత్యక్షమగును. కావ్యారంభ వర్ణన ద్వారానేగాక వరూథినితో నాతడు మాటాడుటలో, అపురూపసుందరిని, తనకుతానై వలచి వచ్చిన వరూథిని నాతడు

నిరాకరించుట ద్వారా ప్రవరుని శీలస్వభావాదులు పాఠకులకు వ్యంజమానము లగుచున్నవి. ఇట్లు పెద్దన కావ్యారంభమున వర్ణించిన గుణగణములను తరువాత సంఘటనల ద్వారా వెల్లివిరియించుచు ప్రవరుని సంపూర్ణాకృతిని పాఠకుల హృదయములందు రచించినాడు. ప్రవరవరూథినీ సంవాదఘట్టమున పెద్దన ప్రవరవరూథిని పాత్రలయొక్క శీలస్వరూపాదులను వాచ్యముగానేకాక వ్యంగ్యముగాను ప్రకటించి సాటిలేని పాత్రచిత్రణాశిల్ప వైభవమును ప్రదర్శించినాడు.

రామరాజభూషణునకు పాండిత్యప్రకటనము, అలంకారములు, భావములు, శబ్దములు వీనిపైననే దృష్టి యధికము. పాత్రచిత్రణా శిల్పము నాతడు వాని ముందు గౌణముగానే గ్రహించినాడనవలయును వసుచరిత్రలో గిరికావసురాజులు నాయికానాయకులు. వీరిరువురి ప్రకృతిని, ప్రబంధమున అంగిరసమగు శృంగారమున కనుకూలముగా కవి వర్ణించినాడు. వసురాజు ధీరోదాత్త నాయకుడని చెప్పబడుచున్నాడు. ధీరోదాత్తనాయకుని లక్షణములిట్లు చెప్పబడినవి—

"మహాసత్త్వోతి గంభీరః క్షమావానవికత్థనః
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః"

దశరూ. 2-4

ధీరోదాత్తుడైన నాయకుడు బలవంతుడు, గంభీరుడు, క్షమాశీలుడు, అవికత్థనుడు. స్థిరుడు, నిగూఢాహంకారము గలవాడు, దృఢవ్రతుడునై యుండవలెనని తాత్పర్యము. ఈ గుణముల నన్నిటిని రామరాజభూషణుడు కావ్యారంభమున వసురాజులో నున్నట్లుగా వర్ణించినను తరువాత వసురాజులో ధీరలలిత లక్షణములు ఎక్కువగా కనిపించుచున్నవి— ధీరలలితుని లక్షణములను ఆలంకారికు లిట్లు నుడివిరి— "నిశ్చింతో మృదురనిశం కలాపరో ధీరలలితఃస్యాత్" (సా॥ద. 3-34) శత్రువులను జయించి నిశ్చింతుడైనవాడు, రాజ్యభారమును సమర్థులగు మంత్రులపై నుంచుటచే నెట్టి విచారము లేనివాడు, లలితకళలనిన ప్రీతికలవాడు, మృదుస్వభావుడు, ధీరస్వభావుడు, ప్రతాపశాలి, భోగపరాయణుడు— అని ధీరలలితుని లక్షణములు చెప్పబడినవి.[1] వసురాజు ధీరోదాత్త

1. కావ్యాలంకార సంగ్రహము. పుట. 47.

నాయకునిగా పరిగణించబడుచున్నను పైన చెప్పబడిన ధీరలలితుని గుణములే కావ్యమున ఆతనియందు ప్రకటమగుచున్నవి- 5ఆశ్వా 63 పద్యము వలన వసురాజునకు సమర్థులగు మంత్రులున్నట్లు తెలియుచున్నది. గిరికా గానముచే నాకర్షించబడుట, గిరికా చిత్రపటమును గీయుట (4-79)- ఇవి లలితకళలం దాతనికి గల ప్రీతిని తెలియజేయుచున్నవి. పరాక్రమ, మృదుత్వ, ధీరత్వ, భోగపరాయణత్వ గుణములును ఆతనియందు అటనట ప్రస్ఫుటములగుచున్నవి. వత్సరాజాదులు ధీరలలిత నాయక భేదమున కుదాహరణముగా గ్రహించబడుటచే వారిలో దక్షిణనాయకత్వముండవలయునని ధ్వనించుచున్నదియే కాని అట్టి లక్షణ మవసరమనుటకు ఆధారమేమియు లేదు. "బహు వల్లభామనోహరునిఁ గోరు ముదిత ముదితయె" (4ఆశ్వా 111) అను గిరికాదేవి నిందావాక్యాలను బట్టి వసురాజు దక్షిణనాయకుడనుటయు స్ఫురించుచున్నది. లేకపోయిన ఆతడు ఒకే నాయికయందు అనురాగము కల 'అనుకూల' నాయకునిగానే ప్రబంధమంతట గోచరించును. మొత్తముమీద మహీమహేంద్రుడై సమస్త భోగముల ననుభవించుచు శుక్తిమతీ కరుణాలాపమును విని మనసు కరగి యామెను రక్షించిన ప్రతాప కరుణాగుణాన్వితుడైన వసురాజులో ధీరలలితుని లక్షణములే యధికముగా గోచరించుచున్నవలయును.

### కావ్యనాయిక గిరిక – ముగ్ధాస్త్రీ

"పొడసూపు జవ్వనపుం బొల్పు లెసఁగఁ
గడు లజ్జ వెడవిల్తు నడఁప దా ముగుద"

ఆం.ప్ర.య. 1-64

పొడసూపు యౌవనము కలది. అధికమైన లజ్జతో కూడినది- ముగ్ధయగును. ఈ లక్షణములు గిరికయందు సుస్పష్టములు. మనుచరిత్రలోని వరూథిని గిరిక వంటిది కాదు. వరూథిని 'సామాన్య'యను నాయిక- ధీరాకళాప్రగల్భావేశ్యా సామాన్యనాయికా" అని సాహిత్యదర్పణకారుడు. (3-67) చతురురాలు, గీత నృత్యాదులందు నేర్పుగలది, వేశ్య సామాన్య నాయిక యనబడును.[1] ఈ లక్షణములు వరూథిని యందు ప్రస్ఫుటములై కనిపించుచున్నవి

---

1. కావ్యాలంకార సంగ్రహము పుట 62.

మహాభారతాంతర్గతమైన గిరికా వసురాజు పాత్రలు రామరాజభూషణుని చేతిలో అలంకారశాస్త్రలక్షణానుసారియైన నాయికానాయకులుగా రూపు ధరించి పాఠకుల మనములందు నిలిచిపోవుదురు. అంతేగాని మనుచరిత్రలోని ప్రవర వరూథినుల వలె ఆ పాత్రలు పాఠకుల మనోవీథిలో సజీవములై సాక్షాత్కరించవు.

"తలిరుఁ బ్రాయము వాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువాని..."

వ.చ. 3-46

అను పద్యములోని వర్ణనద్వారా వసురాజు-
"వదన ప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబులన వీని కన్ను లమరు...."

"అర్ధచంద్రుని తేట నవఘళించు లలాట
పట్టిఁదీర్చిన గంగమట్టితోడ..."

మ చ. 2-36, 3-71

అను పద్యములలోని వర్ణనద్వారా ప్రవరుడు సాక్షాత్కరించినట్లుగ సాక్షాత్కరించుట లేదు. పై వసుచరిత్ర పద్యమున గల శబ్దవైచిత్రి, సంగీతమాధుర్యగుణములే పాఠకుల నాకర్షించును గాని వసురాజు యొక్క మూర్తి సాక్షాత్కారమున కావర్ణన తోడ్పడుట లేదు. వసుచరిత్ర ప్రబంధారంభమునను వసురాజు యొక్క శౌర్యపరాక్రమాది గుణములను అలంకారచమత్కృతితో వర్ణించెనేగాని మనుచరిత్రారంభమున ప్రవరుని వర్ణనలో వలె సహజరూపచిత్రణమును గాని సమకాలికవ్యక్తి చిత్రణమును గాని యందు కవి కావించలేకపోయెను. అదేవిధముగ గిరికా సౌందర్యవర్ణన వసుచరిత్రలో రెండుమారులు నఖశిఖపర్యంతముగా చేయబడినది. ఈ వర్ణన ఒకమారు ఇరువదియారు పద్యములలో మరొకమారు ఐదు పద్యములలో కలదు.కాని యిట్టి సుదీర్ఘవర్ణనలు గిరికను సజీవచైతన్యము గల స్త్రీగా చిత్రించలేకపోయినవి.

"తత నితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన...."

మ.చ. 2-27

అను ఎట్టి క్లిష్టతలేని పద్యములోని వర్ణన ద్వారా వరూథిని- విశాల జఘన మండలముతో, ధవళాంశుకముతో, కావిరంగు అంగదట్టముతో, ఉత్తుంగకుచములతో, తరుణాంగుళులచే మీటు వీణాతంత్రులతో,ముద్దులొల్కు జిలిబిలి పాటలతో అరమోడ్పు కనుదోయితో, రత్న కటకముల ఝణఝణధ్వనితో వీణ వాయించుచు పాఠకుల ముందు సజీవమై నిలుచును. ఈ పద్యము ననుసరించుచు రామరాజభూషణుడు వీణవాయించు గిరికను—

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిఁ దగు గుబ్బ
కాయల కపరంజి చాయలొసఁగ..."

వ.చ. 2-30

అను పద్యమున వర్ణించియున్నాడు. ఈ పద్యపఠనమున పాఠకుల దృష్టి కవి యొక్క సంగీతశాస్త్రపాండితివేపు ఆకర్షించబడుచున్నదేగాని వారిదృష్టికి గిరిక సజీవరూప సాక్షాత్కారము మాత్రము కలుగుట లేదు.

ప్రవరుని గాంచినప్పుడు వరూథినిలో కలిగిన సాత్త్వికాది భావములను పాఠకులు చదివి ప్రత్యక్షమొనర్చుకొని ఆనందమొందునట్లుగా, అద్భుతముగా పెద్దన వర్ణించినాడు. నాటకరంగస్థలముమీద నటి సాత్త్వికాది భావములను నటించిచూపిన ప్రత్యక్షముగా చూచిన ప్రేక్షకులకు ఎటువంటి ఆనందము కలుగునో అటువంటి ఆనందమే పెద్దన వర్ణనలను చదివిన పాఠకులకు కలుగుచున్నది. "ఝళంఝళత్కటక సూచిత వేగ పదారవిందయై" "లేచి కుచంబులున్ దుఱుము లేనడు మల్లలనాడ" "పూచినయొక్క పోఁకనును బోదియఁజేరి" "గుబ్బ మెఱుంగు జన్గవ గగుర్పొడువన్" "కోర్కులు క్రేళ్ళు దివ్వ" "ఒయ్యారమునన్ జంద్రికల్దనుకన్ జూచె" "మది మెచ్చు తెప్పలల్లార్ప" "అంకురితములయ్యె పులకలు" "లేఁజెమట గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్" "కనుఁగవ మెఱుఁగు లుబ్బి" "తాటంకములున్ జనుఁగవయు నడుము వడఁకగ" "సెలవివాఱ నవ్వి" మొదలగు అనేక ఆంగికసాత్త్వికాది వర్ణనలద్వారా వరూథిని రూపవిలాసములు పాఠకులకు దృగ్గోచరములగుచున్నవి.

తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ
పల్లవాధర గుండె జల్లుమనియె

నటు రెండు మూడంజ లరుగునప్పుడె కాళ్లఁ
బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె
డాయంగఁ జను నప్పుడ ముఖాంబుజంబునఁ
గంబుకంధరకు దైన్యంబు దోచెఁ
గదిసి నిల్చిన యప్డ కనుదోయి రెప్పల
నలనకు మిగులఁ జంచలత బెరసెఁ

గటకటా యనునపుడ గద్గదిక వొడమెఁ
జెరగువట్టిన యపుడ లేఁజెమట గ్రమ్మె
సొలసి మాటాడ నుంకింపఁదలచి మోముఁ
దేరుకొనఁ జూచునపుడ కన్నీరు వొడమె.

మ చ. ౭-91

అను పద్యమున వరూథిని మాయాప్రవరుని చూచి నిజమైన ప్రవరునిగా భావించి గుండె జలుమనగా, తొట్రుపాటు, దైన్యత వహించి, కనులలో చంచలత్వము, గొంతులో గద్గదిక వొడమగా, లేజెమట శరీరమంతట క్రమ్మగా, ఆతడెచట తప్పించుకొనిపారిపోవునోయని మెలమెల్లగాపోయి యాతనియుత్తరీయపుకొంగును పట్టుకొనినది ఇందలి వరూథిని సాత్త్వికభావవర్ణనలు, చేష్టావర్ణన లతి సహజములై పాఠకుల నలరించును పై పద్యము చదువగానే పాఠకుల హృదయము లందు వరూథిని సాత్త్వికభావాదులే గాక ఆమె మెల్లగాపోయి మాయాప్రవరుని ఉత్తరీయపు కొంగును పట్టుకొను దృశ్యము సర్వము ప్రత్యక్షమగును. అట్లే-

కొనసాగి కామినీ గోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁ జూపుల రెప్ప తుదలనాచి
సంతసంబున ముఖాబ్జంబునఁ జిరునవ్వు
కందళింపకయుండ డిందుపరిచి
పొంగారు మైఁదోచు శృంగారచేష్టల
తమిఁ దెచ్చికోలు మౌగ్ధ్యమున డాచి
పొదము రసావేశమున వచ్చు నదోక్తు
లొదవి నాలుకకు రాకుండ గ్రుక్కి
మస్తకము వాంచి యుసురని మౌనముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత

సేపు వెడవెడ చింతించి శిరసొకింత
యెత్తి సన్నంపు టెలుగుతో నిట్టులనియె

మ.చ. 2-97

అను పద్యమున మాయాప్రవరుని భావములు సహజముగా చిత్రించబడినవి ఈ విధముగా పెద్దన ప్రవర, వరూథిని, మాయాప్రవర పాత్రలను పాఠకులకు దృష్టిగోచరమగునట్లుగా అతి సహజముగా చిత్రించియున్నాడు

రామరాజభూషణుడు నాయికానాయకులగు గిరికా, వసురాజుల ప్రథమ పరస్పరావలోకన సందర్భమున వారి చక్షుఃప్రీతిని,సాత్త్వికభావోదయములను వర్ణించినాడు. వసుచరిత్రలో శృంగారము నాయికానాయకోభయ నిష్ఠము. కావున రామరాజభూషణుని నాయికానాయకుల పరస్పర అనురాగోదయ వర్ణన సంపూర్ణమైనట్టిది.

“నిరతిన్ నాభి సురంగమీఁగియు వళీ నిశ్రేణికన్ హత్తియు
న్వర రోమావళి వల్లరీగుణమునంటం బ్రాఁకియుం దత్పయో
ధర దుర్గంబుల నాక్రమించె నచలేంద్రద్వేషి చూపౌర! సం
గర సామోద వినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే”

వ.చ. 2-66

అను పద్యమున వసురాజు చక్షుఃప్రీతి వర్ణించబడినది. ఇందు పాఠకుల దృష్టి అనవసరమైన దుర్గవిజయము వేపునకు మరలించబడుచున్నదే గాని నాయకుని చక్షుఃప్రీతియను అనంగదశ వర్ణనలోనియర్థము త్వరగా వారికి స్ఫురించుటలేదు. అట్లే-

“అనుపమకాంతి వైభవ సమన్వితు నా వసురాజుఁగాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతన రాగ కందళం
బొనరె నఖండవాసనలు నుత్కలికల్వెలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోద తరళస్థితులై తమిఁ జూపు తుమ్మెదల్

వ.చ. 3-48

ఇందు పద్మిని యనుటచేత పద్మినీజాతికి చెందిన స్త్రీయనియు, పద్మమనియు గల రెండర్థములచేత పాఠకులదృష్టి కవి శ్లేషనిర్వాహణావైభవమునందు

లగ్నమగుచున్నదే గాని గిరికాదేవి హృదంతరానురాగ చిత్రణవేపు మరలుట లేదు. మరియు-

> "సొలసి తటిల్లతాంగి జిగిసూపు వెలుంగులచే గల ధ్వను
> ల్గిలకలకంఠులం గదిమి గాటపు నెమ్మి నటింప హంస కం
> ఋలు జడియం బయోధర సమున్నతి భంగుర మధ్య పుష్కరాం
> చల మరదోఁపఁగా నరిగెఁ జారుఘన ప్రతిసీర చెంతకున్''

వ.చ. 2-67

ఇందు గిరిక తెరచాటున చేరుటతో పాటుగ మెరుపుతీగ మేఘమును దరియుట అను అప్రస్తుత వర్ణన చేయబడినది పాఠకుల హృదయము ఈ రెండర్థముల రమ్యతలోనే తగులుకొనును కాని గిరిక సఖులపై కోపగించి సిగ్గుతో, అందెలు మ్రోగుచుండ వక్షోజభారముచే నడుమల్లలనాడ తెరచాటున కేగురూపము వెంటనే సాక్షాత్కరించదు. అదే- ఝళంఝళత్కటక వేగసూచిత పదార విందయై లేచి, కుచంబులున్ దుఋము లే నడుమల్లలనాడ నయ్యేడన్, బూచిన యొక్క పోఁక నునుబోదియఁ జేరి...'' అను పద్యమున వరూథిని, రంగస్థల ముపై నటించు పాత్రవలె వెంటనే పాఠకులకు దృష్టి సాక్షాత్కారమగును.

రామరాజభూషణుని శుక్తిమతీకోలాహల పాత్ర చిత్రణలో వరూథినీ ప్రవరుల పాత్రచిత్రణా ప్రభావము గోచరించును. శుక్తిమతి ప్రవరుని వలె సాత్త్విక స్వభావురాలు ఆమెను కవి తపస్వినిగా, విరాగినిగా చిత్రించినాడు. కోలాహలుడు ఉద్ధతప్రకృతి గలవాడు. దేవతాత్మకుడు. భోగి. అతడు వరూథిని వంటివాడు. వరూథిని వలెనే కనువేదుఋ కలవాడు. వరూథిని ప్రవరుని ప్రథమవీక్షణమున ప్రేమించినట్లుగానే యాతడు శుక్తిమతిని ప్రథమవీక్షణము ననే ప్రేమించినాడు. ప్రవరుని గాంచి వరూథిని "ఏలని బంటుగా మరున్ దక్క గొనంగరాదె యకటా! నను వీడు పరిగ్రహించినన్" అని అనుకొనినది. కోలాహలుడు శుక్తిమతిని బ్రహ్మకొలువున చూచిన దాదిగా విరహములో మునిగి "నదీ రసోర్మికం దేలక యేల కల్గు మహనీయసుఖంబని నిశ్చితాత్ముడై "నాడు. చతురవచోనిధియైన పెద్దన ప్రవరవరూథినుల సంవాదమును చాతుర్యముతో సహజసుందరముగా రచించినాడు. రామరాజభూషణుడు ఛాయానుకరణగా పెద్దన ననుకరించుచు శుక్తిమతీ కోలాహలుల సంభాషణమును నడపినాడు.

పెద్దన ప్రవరవరూధిని పాత్రలలో సహజమానవ స్వభావచిత్రణను కావించగా రామరాజభూషణుడు శబ్ద శక్తిమూల వ్యంజనద్వారా నదీపర్వతముల సంఘర్ష నను ఒక స్త్రీ పురుష సంఘర్షణగా చిత్రించి తన అపూర్వ రచనా వైభవమును ప్రకటించినాడు. నిర్జీవమైన జడప్రకృతిని సప్రాణ సచేతనా రూపముగా చిత్రించుట, మానవీకరణమును( **personification** ) కావించుట కావ్యములలో సూర్యోదయాది వర్ణనలందును, తదితర ప్రకృతివర్ణనలందును అటనట కలదు. పాశ్చాత్యకవులందును ప్రకృతిని మానవీకరణ మొనర్చుట విశేషముగాకలదు. వర్డ్సువర్తు వంటి కవుల కవిత లందుకుదాహరణములుగా చెప్పవచ్చును. ఒకొక మారు అమూర్తభావములను మానవీకరణ మొనర్చుటయు కలదు. కామక్రోధా దులను మానవీకరణమొనర్చి కృష్ణమిశ్రుడను కవి ప్రబోధచంద్రోదయ నాటక మును రచించియున్నాడు. ప్రకృతిలో మానవత్వము నారోపించుట వేదము లందు ప్రాచీనకాలముననే విశేషముగా వేదఋషులచే గ్రహించబడినది. మేఘాంతరగతములైన జలౌఘమునకును, విద్యుజ్జ్యోతిస్సునకును కలిగిన ప్రకృతి సంఘర్షణమువలన వర్షము పుట్టును. ఈ ప్రకృతి సంఘర్షణమును ప్రాచీన ఋషులు ఇంద్రవృత్రులకు జరిగిన సంగ్రామముగా రూపకారోపణమును కావించిరి. అట్లే ఉషస్సును స్త్రీగా రూపొందించి, సూర్యుని ప్రియురాలుగా వర్ణించిరి. అట్టి మానవీకరణమునే శుక్తిమతీకోలాహలుల సంవాద ఘట్టమున రామరాజభూషణుడు కావించినాడు. ప్రాణరహితములును జడము లగు నదీపర్వతములను ప్రాణవంతములగు, చేతనారూపములగు స్త్రీపురుషులుగా రూపకారోపణమును గావించి కవి తన అద్భుత కవితావైభవమును ప్రదర్శించి నాడు. ఇట్టి వర్ణన కావ్యములందు నభూతోనభవిష్యతి యని చెప్పవచ్చును.

పెద్దన స్వరోచి మనోరమల పాత్రచిత్రణమున వరూధినీ ప్రవరపాత్ర చిత్రణములో ప్రదర్శించిన శిల్పవైభవమును చూపలేదు స్వరోచి మనోరమలు అచ్చమైన ప్రబంధనాయికా నాయకుల వలెనే గోచరింతురు. స్వరోచి స్వరూప వర్ణనను కవి యెచటను కావించలేదు. అట్లే మనోరమరూపమును కవి వర్ణించ లేదు. మనోరమను నఖశిఖపర్యంతము వర్ణించు అవకాశమున్నను కవి ఔచిత్య భంగమగుననియేమో విడిచిపుచ్చెను. నైషధములోని అంగాంగ వర్ణనా చమ త్కృతిని రామరాజభూషణుడు గ్రహించి గిరికను వర్ణించినాడు. తరువాతి కవు లెందరో దీని ననుసరించిరి. కాని పెద్దన అటువంటి అసహజవర్ణనల జోలికి

పోలేదు. స్వరోచికిని వసురాజునకును పరాక్రమ సాహసవిషయములందు సమానత్వము కలదు. అట్లే మనోరమ గిరికలకు ముగ్ధాత్వమున సామ్యము కలదు. మనోరమ వరూథినికి మేనగోడలు. కాని వరూథినిలో గల విలాస విభ్రమములు మనోరమలో నున్నట్లు కనిపించవు. పెద్దన మనుచరిత్రలో చతుర్థాశ్వాసము మొదలుకొని పాత్రల చిత్రణమును మొదటి మూడు ఆశ్వాసము లలోని ప్రవర, వరూథిని, మాయాప్రవర పాత్రల చిత్రణము వలె సహజసుంద రముగా చేయలేదనిపించును. మొదటి మూడు ఆశ్వాసములలో గల పాత్ర చిత్రణాశిల్ప ప్రావీణ్యము మనుచరిత్రలో తరువాత లోపించిన దనిపించును. కాని యాపాత్రల మూర్తి చిత్రణములనుమాత్రము పెద్దన చక్కగాకావించియున్నాడు.

"విసుమానములుగాగ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాడు
బండికందెనచాయ బైసిమాలినమేన
మెదడుగందపురొంపి మెత్తినాడు..."

మ. చ. 4-73.

అను పద్యమున రాక్షసునియొక్క,

చెంగల్వపూదండ సేర్చిపెందుఱుముపై
ఘనసారమున సూసకము ఘటించి
పన్నీటిలోఁ గదంబముచేసి మృగనాభిఁ
బూసి కుంకుమసేస బొట్టుతీర్చి...

మ.చ. 6-5

అను పద్యమున పడకటింటికి పోవు మనోరమయొక్క,

"శిఖిపింఛదళ పరిష్కృతములై సేమంతి
విరుల తీరగు శిరోవేష్టనములు
నెఱగంటి చూడ్కిఁదాయెతుల బాహులువంచి
నారాజు లల్లార్చు నారజములు..."

మ. చ. 6-44

అను పద్యమున దేవాపి యను గంధర్వునియొక్క రూపములు చదువ గానే పాఠకులకు దృష్టి గోచరమగునట్లు వర్ణించబడినవి. కాని యా పాత్రల

చిత్రణము సంపూర్ణముగా వ్యక్తిత్వ వికాసముతోకూడిన ప్రవరవరూథిని పాత్రల చిత్రణమువలె జరుగలేదు.

"ధగధగని దేహరుచి నిగనిగని కుందనపుఁ
దగడు దెగడం జిగురు జిగినెగుచుమోవిన్
నగవు నిగుడం గురులు పొగరు మగుడన్ నయన
యుగళి వెలిదామరల మగల మగలై ..."

మ చ. 4-117

అను పద్యమున ఇందీవరాక్షుని రూపవర్ణనలో రచనా చమత్కృతికి మరియు అలంకార సౌందర్యమునకే ప్రాధాన్య మీయబడినదనిపించును. పై పద్యమును చదువగానే ఇందీవరాక్షుని శరీరకాంతి స్ఫురించునేగాని ఆతని రూపు రేఖలు ఇట్టివని పాఠకులకు గోచరించవు మొత్తముమీద పెద్దన మనుచరిత్రలో చతుర్థాశ్వాసానంతరము పాత్రచిత్రణా శిల్పమునకుగాక ప్రబంధవస్తువు, వర్ణనలందే దృష్టిని నిలిపినాడనవలయును.

రామరాజభూషణుడు ఇంద్రుడు, విదూషకుడు, మంజువాణిపాత్రలను సజీవముగా చిత్రించుటలో కొంత నైపుణిని ప్రదర్శించినాడు. వారి రూప చిత్రణమును కవి యెచ్చటను కావించకున్నను సంవాదఘట్టములందు వారు మాట్లాడు మాటలతీరు, వారిచేతలు సహజములై మానవసామాన్యులవలె కనిపింతురు కాని గిరికావసురాజులవలె పోతపోసిన విగ్రహములమాదిరి కాదు. ఇంద్రుడు దేవతలకు రాజు. వసుచరిత్రలో నాతడు వసురాజునకు ప్రాణమిత్రుని వలెనేగోచరించును కాని యాతని దేవత్వమెచటను ప్రకటము కాదు. గిరికావసు రాజులుప్రబంధమున నాయికానాయకులైనను వారు అలంకారమాత్రులే కథ ఇంద్ర, విదూషక, మంజువాణులద్వారానే నడుపబడును. ఆ కారణముచేత కూడ ఆ పాత్రలు చైతన్యవంతములై కనిపించుచున్నవి.

పెద్దనకవిత్వములోని ప్రసన్నమైన, స్వభావోక్తితోకూడిన వైదర్భిశైలి, భావికత్వమను కవితాగుణము సజీవ పాత్రచిత్రణకు విశేష దోహదకారులైనవి. మార్కండేయ పురాణములోగల వరూథిని ప్రవరాదిపాత్రల కాతడు రూపకల్పన కావించి, గుణశీలముల నేర్పరిచి, వ్యక్తిత్వమునిచ్చి అజరామరము

కావించినాడు. "జీవకళ యుట్టిపడినట్లు స్వభావ మనోహరమగు ప్రతిబింబమును చిత్రించి చిత్రకారుడు మన బాహ్యచక్షుస్సును దనుపునట్లే కవియగువాడు స్వభావమును చిత్రించి మన మనశ్చక్షుస్సు నానందింపజేయవలెను. ఇట్టి శక్తి రామరాజభూషణుని కవిత్వమునందుకంటె పెద్దనార్యుని కవిత్వమునందె యెక్కువ" అని వెన్నేటి రామచంద్రరావుగారి[1] యభిప్రాయము. రామరాజభూషణుడు బాణశ్రీహర్షాదులవలె పాత్రచిత్రణా శిల్పమునకంత ప్రాధాన్యమీయ లేదు. శ్రవ్యకావ్యమున కవులు పాత్రచిత్రణా శిల్పమునకన్న వర్ణనలకు, రస శిల్పమునకెక్కుడు ప్రాధాన్యమిచ్చినట్లు కన్పట్టును. అందుచేతనే కాదంబరి, కిరాతార్జునీయము, శిశుపాలవధ, నైషధమువంటి మహాకావ్యములలో పాత్రచిత్రణముకన్న కవి రచనావైచిత్రికి, వర్ణనా వైభవమునకు ప్రాధాన్యమెక్కువ. రసోన్మీలమునకే ప్రథమస్థానము. ఆ మార్గము ననుసరించినవాడు రామరాజభూషణుడు. వసుచరిత్రలోని పాత్రలు కవియొక్క పాండితీవైభవము, అలంకార చమత్కృతి, భావవైచిత్రి—ఈ రంగులలో ముంచెత్తబడుటచే పాత్రల రూపగుణములు అస్పష్టపురేఖలవలె గోచరించును కాని మనుచరిత్రలోవలె స్పష్టమైన రూపురేఖలతో గోచరించవు.



1. మను, వసుచరిత్రల విమర్శనము. పుట. 48.

# నాటక రీతులు

సంస్కృత కావ్యాలంకారికులు నాటకమునకు గల లక్షణములలో రెండింటిని గ్రహించి వాటిని మహాకావ్యమునకు విధించిరి. అందు కావ్యారంభమున ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశము లుండవలయుననుట ఒకటి [1], నాటికేతివృత్తమున పాటించబడు పంచసంధులు కావ్యేతివృత్తమున పాటించబడవలయుననుట రెండవది[2]. కావ్యవస్తువు ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణ సంధులతో కూడియుండవలయునని కావ్యశాస్త్రకారుల అభిప్రాయము [3]

ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశములలో నేయొక్కదానినైన కృత్యాదిని కూర్చవలయునని దండ్యాదులమతము. సంస్కృత పంచమహాకావ్యములలో రఘువంశమొక్కటి నమస్క్రియతో నారంభమగుచున్నది. మిగిలిన నాలుగును వస్తునిర్దేశముతో నారంభమగుచున్నవి. వస్తునిర్దేశమనగా—''వర్ణనీయ కథాభాగస్య ప్రకారేణ కేనచిత్ ఉపనిబంధః స చక్వచిత్ నాయక నిర్దేశేన క్వచిత్ తదావాసదేశ నిర్దేశాది ప్రకారేణ వాక్రియతే''– కథాభాగముతోగాని, నాయక వర్ణనతో గాని,లేక ఆతని ఆవాసదేశవర్ణనతోగాని కావ్యము నారంభించుట తెలుగుసాహిత్యమున మొదటినుండియు కావ్యములను వస్తునిర్దేశముతోగాక ఆశీర్నమస్క్రియతో నారంభించుట ఆచారముగా కనబడుచున్నది. నన్నయ్య తన మహాభారత నారంభమున సంస్కృత శ్లోకమున ఆశీర్వచనమును పలికెను. తరువాత కవులందరును ఆశీర్నమస్క్రియతోడనే తమ కావ్యములను ఆరంభించియుండిరి.

---

1. "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్" కావాద. 1–14
2. "సర్గైరనతి విస్తీర్ణైః శ్రవ్యవృత్తైస్సుసంధిభిః" కావ్యాద. 1–18
''సంధీనపి సంశ్లిష్టా స్తేషామన్యోన్య సంబంధాత్. కావ్యా. 16–19
3. ''ముఖమ్ ప్రతిముఖమ్ గర్భో–వవ మర్శశ్చ మనీషిభిః
స్మృతానిర్వహణం చేతిప్రబంధే పంచసంధయః'' స కంఠా. 5–128

ప్రబంధయుగ కవులుమాత్రము సంస్కృత నాటకములలోని నాందివలె కావ్యారంభమున ఇష్టదైవ ప్రార్థనను నిర్వహించ నారంభించిరి. నాటకమునందలి నాందీశ్లోకములలో కథాసూచన చేయబడును. ప్రబంధయుగకవులు ఇష్టదైవ ప్రార్థన, ఆశీర్నమస్క్రియలతోపాటుగ కావ్యేతివృత్త సూచనాపద్ధతిని ప్రబంధారంభమున ప్రవేశపెట్టి నాటకక్రమము ననుసరించిరి. ఇష్టదైవ ప్రార్థనానంతరము తెలుగుకవులు తమ కావ్యారంభమున కుకవినింద, సుకవిస్తుతి, కృతిభర్త కావ్యరచనకై కవిని ప్రార్థించుట, కవి యంగీకారము, కృతిభర్తవంశ, ప్రతాపసుగుణ దిగ్విజయాదుల వర్ణనలను చేయుట, ఒకొకసారి కవి తన వంశ, పాండిత్యాదుల పరిచయమును కూర్చుటకలదు. ఇది నాటకములలోని ప్రస్తావన లేక ఆముఖమువలె నడచును. దీనిని తెలుగుకావ్యము లన్నింటిలోను చూడవచ్చును. ప్రబంధకవులు వస్తుసూచనతో కూడిన ఆశీర్నమస్క్రియను, ఆముఖరూప కృత్యవతారికలను రచించి ప్రబంధారంభమును నాటకారంభమువలె భాసింపజేసిరి ఇటువంటిది సంస్కృత కావ్యములలో మృగ్యము.

వస్తుసూచనతో కూడిన ఇష్టదైవ ప్రార్థన, ఆశీర్నమస్క్రియలను మను, వసు చరిత్రకారులు పూర్తిగా నాటకములోవలెనే నిర్వహించినారు—మనుచరిత్ర కృత్యాదిలో కవి విష్ణుస్తుతిని చేసినాడు. రాజీవాక్షుడైన విష్ణువు కృతిభర్తయైన కృష్ణరాయలపై శుభదృష్టిని పరపి కృతార్థుని చేయుగాక యని ఆశీరూప దైవప్రార్థన ఇందు కలదు. లక్ష్మీదేవిని గాఢముగ కౌగలించుకొనుటచేత ఆమె వక్షోజముల మీది కస్తూరి విష్ణుమూర్తివక్షస్థలమున కంటుకొనగ దానిని చూచి సనందనాదిభక్తులు భూదేవిగా భ్రమపడినారనియు ఆ పద్యములో చెప్పబడినది ఇట కవి భ్రాంతిమదలంకార మూలమున కథాసూచన కావించినాడు. రాబోవు కథలో వరూథిని ప్రవరునిచేత నిరాకరించబడి, గంధర్వుడొకడు ప్రవరునివేషమున రాగా అతనిని నిజమైన ప్రవరునిగానే భ్రాంతిపడునను ముఖ్యకథావృత్తాంత మిందు సూచ్యము. ఇంతేగాక తరువాతి దైవప్రార్థనా పద్యములలోను కవి కథను సూచించినాడు. రెండవ పద్యమున శివప్రార్థన కలదు అర్జునునకు పాశుపతాస్త్రము నొసంగు భిల్లవేషమునగల శివుని "ఉల్లమునందు అక్కటికమూనుట మీ కులమందు కంటి" మనుచు పార్వతి ఉల్లసమాడును. ఇందు విషమాలంకారము కూర్చబడినది. శివుని మాయాభిల్లునిగా పేర్కొనుటచే గంధర్వుడు శాంబరీ మహిమచేత ప్రవరుని రూపమును గైకొను వృత్తాం

తము స్ఫురింపచున్నది. మూడవ పద్యమున బ్రహ్మప్రార్థన కలదు. వేద ఘోషలతో నిండి నాలుగు ముఖములుగల బ్రహ్మ, తన్ను మహర్షులు సేవించు చుండగా, సరస్వతీదేవితో కూడి నిండుకొలువై యున్నట్లు చెప్పబడినది. ఇందు ఉపమాలంకారము కలదు. ఈపద్యమున స్వరోచి వృత్తాంతము సూచించబడి నది. స్వరోచికి వనదేవతతో కూడి నలుగురు భార్యలు. ఆ నలుగురు భార్యలు నాలుగు వేదస్థానీయలనుగా భావించవచ్చును. ఇందులో కొలువుదీర్చిన బ్రహ్మవర్ణనచే కృష్ణదేవరాయల సభయు సూచ్యము.

నాలుగవ పద్యమున వినాయకస్తుతి కలదు. అర్ధనారీశ్వర రూపమున నున్న, తల్లియగు పార్వతియొడిలో పరుండి గళాస్యుడైన వినాయకుడు పాలు త్రావుచు, పసితనపు చేష్టగా తొండముతో రెండవవైపున స్తనము నకై వెదకుచు సర్పహారము తగలగా తామరతూడని పట్టుకొనును. ఇట భ్రాంతిమదలంకా రము కూర్చబడినది. ఇందు బాలరూప వినాయకుని స్తుతిచేత స్వారోచిషుని పుట్టుక సూచ్యము. వినాయకుడు మృణాళ నాళమును గ్రహించినాడని చెప్పు టచేత మనువు యొక్క తపస్సు భాసించుచున్నదని కవిసామ్రాట్ విశ్వనాథగార నినారు.[1]

రామరాజభూషణుడు వసుచరిత్ర కృత్యాదిపద్యమున కవి తన ఇష్టదైవ మగు శ్రీరాముని స్తుతినిచేసినాడు. ఇందు సీతారాముల వివాహము వర్ణించబడి నది. ఈ వర్ణనచే గిరికావసురాజుల వివాహము సూచ్యము. అంతేగాక మంజీరాగ్రరత్నమందు సీతాదేవిరూపము ప్రతిఫలించుట, రాముడు సన్నెకల్లును త్రొక్కుట అను వర్ణనచే వసురాజు పర్వతభంజన, గిరికాజనన వృత్తాంతములు సూచ్యములు. శ్రీరాముని పాదస్పర్శచే రత్నము స్త్రీరూపము దాల్చినదని సీతాదేవి భావించుటచే వసురాజు మనస్సు తనయందు లగ్నమైనదో లేదో యను గిరికయొక్క ఆందోళన సూచ్యము. రాముడు మంజీరాగ్రమణిని మాటుపరచి సీత భ్రాంతిని తొలగించెననుటచే వసురాజు గిరికయందు తనకుగల యనురాగ మును ప్రకటించి, గిరికయొక్క భ్రాంతిని తొలగించు వృత్తాంతము సూచ్యము. వసుచరిత్రలో రెండవ పద్యమున సీతాదేవిప్రార్థన కలదు. శ్లేషద్వారా కవి

1. అల్లసానివాని అల్లిక జిగిబిగి. పుట. 18

సీతాదేవియందు లక్ష్మీదేవిత్వారోపణ కావించినాడు ఈ పద్యమునందు సీతాదేవి సౌందర్యవర్ణనచే నాయిక గిరికసౌందర్య,శోభలు సూచ్యములు. మూడవ పద్యమున సర్వకళాకాంతుడైన బ్రహ్మ స్మరించబడినాడు. సంగీత సాహిత్య రూపములగు సరస్వతీదేవి స్తనములపై సర్వకళాకాంతుడైన బ్రహ్మ అలఘు ప్రస్తారములను కావించుట వర్ణించబడినది. ఇందు కావ్యనాయిక గిరికయొక్క సంగీత సాహిత్య ప్రావీణ్యములు, గిరిక కళాప్రదర్శనాకర్షణచేత వసురాజు ఆమెను ప్రేమించుట సూచించబడినవి. అంతేగాక ఈ పద్యముచే వసుచరిత్రలో సంగీత సాహిత్యములు జంటగా నడచినవనుట స్ఫురించుచున్నది. కవి సర్వకళాప్రవీణుడై సంగీత సాహిత్యములనెడి స్వరరూప, ఛందోరూప ప్రస్తారములను చేసినాడు. నాలుగవ పద్యమున సరస్వతిప్రార్థన కలదు. అక్షసరాకృతి కరగి ప్రవహించుట, అందు సరస్వతి ప్రతిబింబించుటచే సంగీత సాహిత్య ప్రవీణయైన గిరికాదేవి నదీగర్భమున జన్మించిన వృత్తాంతము సూచించబడినది. ఐదవ పద్యమున శివుని దక్షిణ నాయకత్వము కొనియాడబడినది. దీనిచే వసురాజుయొక్క దక్షిణనాయకత్వము స్ఫురించును. ఆరవ పద్యమున గల అర్ధనారీశ్వర స్తుతిచే గిరికావసురాజుల అన్యోన్యదాంపత్యము సూచించబడినది. మనుచరిత్రకారునితో పోటిపడి వసుచరిత్రకారుడు వస్తుసూచనతో కూడిన ఇష్టదైవ ప్రార్థనను రచించినాడనిపించును. పెద్దన వస్తుసూచనకన్న రామరాజభూషణుని వస్తుసూచన ప్రస్ఫుటముగా నున్నదనక తప్పదు.

నాటకములోవలెనే వస్త్వైక్యమును సాధించుటకు కాబోలు ఆలంకారికులు నాటకమున పాటించబడు సంధులను కావ్యములకును విధించిరి. నాటక పంచసంధులీ ప్రబంధములం దెంతవరకు పాటించబడినవో పరిశీలింతము—ముఖసంధిలో కథాబీజారోపణ జరుగును. ప్రతిముఖసంధిలో స్థాపించబడిన బీజము అంకురదశను చెందును. అనగా కథ కొంత ముందుకు నిరాటంకముగ సాగును. గర్భసంధిలో ఫలప్రాప్తి సంభావన అనిశ్చితమై యుండును. అవమర్శసంధిలో ఫలప్రాప్తి జరుగునను ఆశ జనించును. కావ్యాంతమున కలుగు ఫలప్రాప్తితో కూడినది నిర్వహణసంధి. ఇది భరతవాక్యయుతమై మంగళాంతమైయుండును. ఈ పంచసంధులు మనుచరిత్రకథలో స్థూలముగా నిట్లు నిర్వహించబడినవి— మనుచరిత్రలో స్వారోచిష జననరూప ఫలప్రాప్తి నెరవేరుటకు బీజము ప్రవరుడు హిమాలయములకు పోయిన వృత్తాంతమున వేయబడినది. అనగా నిట ముఖ

సంధి నిర్వహించబడినది. ప్రవరవరూథిని సమావేశమున. బీజము అంకుర దశను చెందినట్లుగా కథ ముందుకు సాగినది. ఇట ప్రతిముఖసంధి నిర్వహించ బడినది. తరువాత వెంటనే, ప్రవరుడు వరూథినిని నిరాకరించుటచే ఫలప్రాప్తి సంభావన అనిశ్చితమై గర్భసంధిని చేరుకొన్నది. తిరిగి మాయాప్రవర స్వరోచి వృత్తాంతములలో ఫలప్రాప్తి కలుగునను ఆశ జనించును. ఇట అవమర్శసంధి నిర్వహించబడినది. కావ్యాంతమున స్వారోచిషుని జననవృత్తాంతమున ఫల ప్రాప్తితో కూడిన నిర్వహణసంధి నిర్వహించబడినది ఇంతమాత్రము బీజా రోపణాదులు లేని కథలుండవు. మనుచరి తకథలో కథలన్నిటిలో సామాన్య ముగా నిర్వహించబడినట్లుగానే సంధులు నిర్వహించబడినవి. ఇక వసుచరిత్రలో సంధులిట్లు కలవు- వసురాజు విదూషకులు కోలాహలపర్వతమును చూడనెంచు టతో కథాబీజారోపణ జరిగినది. అనగా నిట ముఖసంధి నిర్వహించబడినది. గిరికా వసురాజుల సమాగమమున బీజము అంకురదశను చెందినట్లుగా కథ ముందుకు సాగినది ఇట ప్రతిముఖసంధి నిర్వహించబడినది. గిరికా వసు రాజుల ఎడబాటు, విరహమున వారి వివాహరూప ఫలప్రాప్తిసంభావన అని శ్చితమైనది. ఇట గర్భసంధి నిర్వహించబడినది. మంజువాణి దౌత్యము, ఇంద్రాదులు కోలాహలుని దగ్గరకు వచ్చుటలో ఫలప్రాప్తి జరుగునను ఆశ జనించును. ఇట అవమర్శసంధి నిర్వహించబడినది. గిరికా వసురాజుల వివాహమున నిర్వహణసంధి నిర్వహించబడినది. కావ్యాంతమున గిరికా వసు రాజుల వివాహరూప ఫలప్రాప్తితో కథ మంగళాంతముగా ముగియుచున్నది. వసుచరిత్రలో ఆరు ఆశ్వాసములలోని కథ మూడురోజులలో ఐదారు అంకము లలో జరిగిన కథగా నిర్వహించబడి, సంపూర్ణసంధినిర్వహణతోకూడి నాటకము వలెనే భాసిల్లుచున్నది.

వసుచరిత్రలో నాయకుని ఫలప్రాప్తి నుండి తిరోగమింపజేయు ప్రతి నాయకరూప ప్రతిబంధకమేదియు లేదు. చివరకు మాళవికాగ్నిమిత్రము, రత్నావళ్యాదులలో వలె నాయికానాయకుల ప్రేమ ఫలించుటకు పట్టమహిషిరూప మైన అడ్డంకుకూడ లేదు. వసురాజు తనను ప్రేమించుచున్నాడో లేదో యను ఉత్కంఠ గిరికకు, గిరిక తనను ప్రేమించుచున్నదో లేదో యను ఉత్కంఠ వసురాజుకు కలిగినది. పాఠకులకు ఆ యుత్కంఠయు లేదు నాయికా నాయకులు పరస్పరానురక్తులని మొదటినుండియు వారికి తెలియును. మంజు

వాణీదౌత్యముద్వారా గిరికావసురాజులకు పరస్పర ప్రేమ ప్రకటమైనది. తరువాత గిరిక తలిదండ్రుల అనుమతిమాత్రము తీసుకోవలసియున్నది. వసురాజు కోలాహలుని శిక్షించినట్టివాడు. వసురాజుచేత అవమానమును పొందిన కోలాహలుడు అతనిని అల్లునిగా స్వీకరించుటకు అంగీకరించునో లేదో అను ఉత్కంఠపాఠకులకు కలుగును. కాని ఆ అడ్డంకుయు త్వరలోనే తొలగిపోయి కథ ఫలప్రాప్తిని చేరుకొన్నది సరళరేఖవలె ఉండి కథ ఉపరూపకములలో ప్రధానమైనదగు ''నాటిక''లోవలె ఒప్పుచున్నది నాటికలలో శృంగారము ప్రధానరసము. నాయకుడు ధీరలలితుడు, నాయిక ఉత్తమ వంశసంజాత, నాతిప్రౌఢవయస్క. నాయికానాయక సమాగమమునకు నాటికలో పట్టమహిషి రూపమైన ఆటంకముండగా వసుచరిత్రలో గిరికా మౌగ్ధ్యము, కోలాహలుని యనుమతిరూపమైన ఆటంకములున్నవి. చివరకు పట్టమహిషి అనుమతిచే నాయికానాయకులకు వివాహము జరిగినట్లుగా మంజువాణిదౌత్యముచే గిరిక ప్రేమప్రకటమై, కోలాహలుని యనుమతితో వసుచరిత్రలో గిరికావసురాజులకు వివాహము జరిగినది. వసుచరిత్ర కథా సంవిధానము నాటికలోని కథాసంవిధానమువలె ఒప్పుచున్నది. అందుచేతనే వసుచరిత్రలో నాయకుడు కొందరు విమర్శకులు తలచినట్లుగా ధీరోదాత్తుడు కాక నాటికానుగుణముగా ధీరలలితుడే.

ఆనందవర్ధనుడు మహాకావ్యమున పంచసంధులు రసోచితముగ ప్రయోగించబడవలయు ననినాడు—

"సంధిసంధ్యంగ ఘటనమ్ రసాభివ్యక్త్యపేక్షయా
నతుకేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా''

ధ్వన్యా. 3-12

రసాభివ్యక్తికొరకు పంచసంధ్యాదులను ప్రయోగించవలయును. కాని శాస్త్రోక్తమని కాదు. దీనిచే నాటకములోవలనే మహాకావ్యమునందును రసైక్యతను సాధించవలయునని యాతని యుద్దేశమై యుండును. వసుచరిత్రలోని గర్భసంధిలో అంగిరసమగు శృంగారమునకు ప్రశమనము ప్రాప్తించినది. వసుచరిత్రలో ప్రతినాయక రూపమైన అడ్డంకు లేదు. ఇందు నాయికయొక్క తలిదండ్రుల అనుమతి లేకపోవుట మరియు గిరికా మౌగ్ధ్యములే యడ్డంకులు. వీని ద్వారా శృంగారమునకు ప్రశమనము సంభవించినది. వీరరసమున ప్రతి

నాయకాదుల యుద్ధసన్నద్ధము, వ్యూహరచనాదులు నాయకోత్కర్షకు దోహద ములై యంగిరసమున కెట్లు రంజకత్వము నాపాదించునో శృంగారమున కలుగు ప్రశమన, విప్రలంభ వర్ణనలు ఆ రసమును వేయి విధములుగా సహృదయ పాఠకాస్వాద్యమానము కావించును. అదేవిధముగ వసుచరిత్రలోని గర్భసం ధిలో కలిగిన సంభోగ శృంగారరస ప్రశమనము విప్రలంభాదుల వర్ణనలచే అధిక రంజకత్వమును పొంది ఆస్వాద్యమానమగుచున్నది. రస నిర్వాహణను దృష్టిలో పెట్టుకొని పంచసంధులు ప్రయోగించబడుటచే వసుచరిత్ర కావ్యమున నాటకచ్ఛాయలు అధికముగా కనబడుచున్నవి. పంచసంధ్యన్వితమైన రస నిర్వాహణము మనుచరిత్రలో కనిపించదు. నాటకములోవలెనే రామరాజభూష ణుడు అంగరసములచేత విశేషముగా బాధనొందని శృంగారమునంగిగా పోషిం చిన సాహిత్యరసపోషకుడు.

పంచసంధులు కావ్యమున పాటి చబడవలయుననుటచేత రస నిర్వాహ ణము నిర్దుష్టముగా జరుగుటయేగాక పాశ్చాత్యవిమర్శకులు చెప్పినUnity of action సాధించబడుట అను ప్రయోజనము కూడ నెరవేరుచున్నది.

**"It (plot) should have first unity of action or only those actions, and not all, in the life of the hero which are intimately connected with one another and appear together as one whole, the structural union of the parts being such that, if anyone of them is displaced or removed, the whole will be disjointed and disturbed"1**

నాయకచరిత్రను నిబంధించునపుడు అతని జీవితములోని ప్రతిసంఘటననుకాక కథా ప్రయోజనానుసారి యయినవానినే గ్రహించవలయును. మరియు సంఘ టనల కూర్పు చిక్కగా నుండవలయును. నాయకుని ప్రతిచర్య ఫలప్రాప్త్యున్ము ఖమై ఉండవలయునే కాని కథాగమనమునకు గాని ఫలప్రాప్తికి గాని పనికిరాని విధముగా నుండకూడదు అరిస్టాటిల్ ఉదాత్తనాటకమునకు(Tragedy) చెప్పిన ఈ Unity of actionఅనునది సంస్కృతాలంకారికులు విధించిన సంధి సంధ్యం గముల ద్వారా సాధించబడుచున్నది.మహాకావ్యమున సైతము సంధులు పాటించ బడవలయుననుటచే, అరిస్టాటిల్ చెప్పిన Unity of action నాటకములకే పరి

---

1· An introduction to English criticism. Page· 18

మితము కాక మహాకావ్యమున కూడ ఉండవలయునని సంస్కృతాలంకారికుల ఉద్దేశమైనట్లుగా తెలియుచున్నది రామరాజభూషణుడు సంధి నిర్వహణాదులను దృష్టిలో పెట్టుకొనియే నామమాత్రముగా మహాభారతము నుండి తీసుకొనిన వసు చరిత్రను నిబంధించి నేర్పును చూపినాడు మనుచరిత్రకథ పురాణానుసారి అయినది పూర్తిగా నాటకములో వలె Unity of action పాటించబడలేదనియే చెప్పవలయును.

సంస్కృతాలంకారికులు విధించిన నాటకలక్షణములను ప్రబంధకర్తలు పాటించుటయేగాక నాటకశిల్పమును కూడ వారు తమ ప్రబంధములందు ప్రదర్శించిరి. అందొకటి- ప్రబంధములోని కథను నాటకములో వలె సన్నివేశములుగా విభజించుకొని నిర్వహించుట. ఒక్కొక్కసారి ప్రబంధములోని ఆశ్వాసములను నాటకములోని అంకవిభజనవలె విభాగించి రచించుట. వానికి మను, వసుచరిత్రలనే గాక పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నాది ప్రబంధముల నుదాహరణములుగా పేర్కొనవచ్చును. కొన్ని సంస్కృతనాటకములను తెలుగుకవులు కావ్యములుగా రూపొందించుటచే నిట్టి లక్షణములు తెలుగుకావ్యములందు ప్రవేశించినవేమో. వానినే ప్రబంధకవులు గ్రహించియుండవచ్చును. రాజశేఖరుని విద్ధసాల భంజిక నాటకమును మంచన కేయూరబాహుచరిత్రగా, కాళిదాసు నాటకక్రమము ననుసరించుచు పినవీరన మహాభారతాంతర్గత శకుంతల కథను గ్రహించి శృంగారశాకుంతలముగా, కృష్ణ మిశ్రుని ప్రబోధచంద్రోదయ నాటకమును నందిమల్లయ, ఘంటసింగయ కవులు ప్రబోధచంద్రోదయ కావ్యముగా రచించిరి. ఆ విధముగా కావ్యరూపమున నాటకములను మలచునపుడు కవులు నాటకములోని దృశ్యములను, సంభాషణలను గ్రహించుటయేగాక అంకవిభజన ననుసరించి కొంతవరకు ఆశ్వాస విభజనను కావించియున్నారు. అట్టి యీ కావ్యములు తెలుగుప్రబంధములందు నాటకీయత ప్రవేశించుటకు దోహదకారు లయ్యెనని చెప్పవచ్చును. అట్టి ఆశ్వాసవిభజనరీతి మను, వసుచరిత్రలలో నెంతవరకు పాటింపబడెనో పరిశీలింతము—

పెద్దన తన కథా సంవిధానమునంతయు మార్కండేయ పురాణమునుండి గ్రహించినను కథను ఆశ్వాసములుగా విభజించి మలచుకొనుటలో నాటకాంక విభజనా రీతిని కొంతవరకు పాటించినాడు. మనుచరిత్రలోని కథను కొన్ని

దృశ్యములుగా విభాగ మొనర్చవచ్చును. సిద్ధ-ప్రవర సంవాదము, ప్రవర-వరూథినీ సంవాదము, వరూథినీ మాయాప్రవరుల సమాగమఘట్టము, మాయా ప్రవరుడు వరూథినిని విడిచిపోవు ఘట్టము, స్వరోచి వేటకు బయలుదేరుట, మనోరమతో సమాగమము, యుద్ధము, వివాహము, కళావతి వృత్తాంతము, వనదేవతా వృత్తాంతము, స్వారోచిషుని జననము — ఈ దృశ్యములను కవి ఆశ్వాసములలో కొంతవరకు నాటకాంకములలో అమర్చిన విధముగ అమర్చినాడనవచ్చును. మనుచరిత్రలో ప్రథమాశ్వాసము-ప్రథమాంకము. ఇందు సిద్ధ-ప్రవర సంవాదము నిర్వహించబడినది. ప్రవరుని హిమాలయ సందర్శనోత్సుకతలో భావికథకు బీజారోపణ జరుగును. ఇందు రంగస్థలము ప్రవరుని గృహము. ద్వితీయాశ్వాసము-ద్వితీయాంకము. ఇందు ప్రవరుని హిమాలయ సందర్శనము, వరూథినిని చూచుట, వరూథిని మొదటిచూపులోనే ప్రవరుని కాంక్షించుట, ఆమెతో ప్రవరుని సంవాదము, ఆమెను నిరాకరించి ప్రవరుడేగుట ఇందు ప్రదర్శించబడు వృత్తాంతములు. ఇందు రంగస్థలము హిమాలయ పర్వతప్రాంతము. తృతీయాశ్వాసము-తృతీయాంకము. ఇందు వరూథిని విరహము, మాయాప్రవరుని చూచుట, వరూథిని మాయాప్రవరుని నియమముల కంగీకరించు ఘట్టములు కలవు. ఇందు రంగస్థలము వరూథిని కేళీవనము. చతుర్థాశ్వాసము-చతుర్థాంకము. ఇందు స్వరోచి వేట, శాకుంతలములోని దుష్యంతుని వేటవలె ప్రదర్శించుట కనువైనది. స్వరోచి మనోరమల సమాగమము. ఇందు రంగస్థలము అరణ్యము. చతుర్థాంకమునకు ముందు అర్థోపక్షేపకము ద్వారా మాయాప్రవరుడు వరూథినిని మెప్పించి వెళ్ళిపోవుట, స్వరోచి జననమును సూచించవచ్చును. చతుర్థాంకము తరువాత మరొక అర్థోపక్షేపకము ద్వారా స్వరోచి రాక్షసుల యుద్ధము, రాక్షసుడు గంధర్వరూపము నుగ్రహించుట సూచించవచ్చును. పంచమాశ్వాసము-పంచమాంకము. ఇందు ఇందీవరాక్షుని శాపవృత్తాంత కథనము, స్వరోచి మనోరమల వివాహము. ఇందు రంగస్థలము మందరాద్రి. షష్ఠాశ్వాసము-షష్ఠాంకము. ఇందు స్వరోచి వనదేవతలకు స్వారోచిషుడు జన్మించుట, తరువాత భరతవాక్యముతో గ్రంథము ముగింపు. ఇందు రంగస్థలము వనప్రదేశము. విభావసీ కళావతుల వృత్తాంతమును సూచ్యముగా చెప్పవచ్చును. కథను దృశ్యములుగా విభజించి ఏర్పరుచబడిన ఆశ్వాసములు మనుచరిత్రలో కొంతవరకు నాటకాంకములవలె భాసిల్లు

చున్నవి. అంతేగాక నాటకాంకమున ఒకేరోజు ఒకేస్థలమున జరుగుసంఘటనలు ప్రసక్తింపబడవలయునను ప్రధాన నియమము ఇందు తృతీయాశ్వాసమువరకు సంపూర్ణముగాను, ఆ తరువాత కొంతవరకు పాటించబడినది దీనినేపాశ్చాత్య నాటకకారులు Unity ot time మరియుUnity of Place అని పేర్కొనిరి అట్టి Unity of time మరియు Unity of Place లక్షణములు వసుచరిత్రకావ్యములో ఆశ్వాసము లన్నిటిలోను మనుచరిత్రలో కన్నను ప్రస్ఫుటముగా గోచరించుచు కావ్యాశ్వాసములు సంపూర్ణముగ నాటకాంకములవలె నొప్పుచున్నవి. వసు చరిత్రలో ప్రథమాశ్వాసము–ప్రథమాంకము. ఇందు వసురాజు నర్మసచివునితో కూడి వనవిహారము చేయుట, కోలాహలపర్వత దర్శనము, వసురాజు నర్మసచివునితో కోలాహలమును చేరి యచట గిరికా గానమును విని దానిచేత ఆకర్షించబడి యచటికి పయనమగుట ఉండును, దీనిలో ద్వితీయాశ్వాసములోని కథయు కొంత చేరును ఇందు రంగస్థలము వసురాజుయొక్క ఉద్యానవనము ఇదంతయు నాగానందములో ప్రథమాంకము వలెనే యొప్పుచున్నది. ద్వితీయాశ్వాసము–ద్వితీయాంకము. నర్మసచివునితో వసురాజు సఖుల నడుమ కూర్చొని గానము చేయు గిరికను చూచుట, నర్మసచివుడు యతి వేషమున వారి దగ్గరకు పోవుట, వారితో సంభాషణ, గిరికా జన్మవృత్తాంత కథనము, విదూషకుని సంజ్ఞచే వసురాజు గిరికాదుల ముందుకు పోవుట, వారాతనిని సత్కరించుట, గిరికావసురాజుల పరస్పరాలోకనము, ప్రేమోదయము. గిరిక లజ్జచెందుట, హంసాంగన పిలుపుపై గిరిక అచటనుండి వెళ్ళిపోవుట, వెళ్ళిపోవుచు ఏదోమిషతో వెనుకకు తిరిగి వసురాజును చూచుట– ఇందుండును. తృతీయాశ్వాసాంతము లోని వృత్తాంతము కూడ కొంతవరకు దీనిలో చేరును. ఇందు రంగస్థలము కోలాహల పర్వతప్రాంతము. ఇది అభిజ్ఞానశాకుంతలములోని ప్రథమాంక మును పోలియున్నది. తృతీయాశ్వాసము–తృతీయాంకము. ఇందు వసురాజు గిరిక మీది ప్రేమను ప్రకటించి విరహమును చెందుట, నర్మసచివు డాతనిని యూరడించుట, వసురాజు నగరికి వెళ్ళిపోవుట ఉండును. ఇందు రంగస్థలము కోలాహల పర్వత ప్రాంతము. ఇది విక్రమోర్వశీయములో ద్వితీయాంకములోని పురూరవ విదూషకుల సంభాషణను పోలియుండును. చతుర్థాశ్వాసము–చతుర్థాంకము. ఇందు గిరికా విరహము, సఖులు ఆమెను ఊరడించ ప్రయత్నించుట, మంజువాణి దౌత్యకథనము లుండును. ఇందు రంగస్థలము

గిరికా కేళీవనము. పంచమాశ్వాసము–పంచమాంకము. ఇందు ఇంద్రాదులు కోలాహలుని కడకేగి వసురాజు కొరకై గిరిక నడుగుట యుండును. ఇట రంగస్థలము కోలాహలపర్వతప్రాంతము షష్ఠాశ్వాసము–షష్ఠాంకము. ఇందు గిరికా వసురాజుల వివాహముండును. భరతవాక్యముతో కథ ముగియును. ఈవిధముగ వసుచరిత్రలోని యితివృత్తము, సంఘటనలు నాటకాంకవిభజనకు చక్కగా పొసగుచున్నవి. నిజమునకు రామరాజభూషణుడు మహాభారతము నుండి నామమాత్రమునకు గ్రహించిన కథను నాటకప్రీతి కలవాడగుటచే సంస్కృతనాటక విధానములను దృష్టిలో నుంచుకొని మలచుకొనినాడనవలయును. కావున మనుచరిత్రలోకన్న వసుచరిత్రలోని కథాసంవిధానము నాటకాంక విభజనకు చక్కగా లొంగుచున్నది. మనుచరిత్రలోని కథ మూడాశ్వాసములవరకే నాటకములోని అంకవిభజనకు తగియున్నది. తరువాత కథ పురాణకథ వలె నుండి నాటకీకరణ కంతగా లొంగుటలేదు. వసుచరిత్రలో నట్లుగాక మొత్తము కావ్యకథ, నాటకకథ వలె నొప్పుచున్నది. దీనికి ముఖ్యకారణము– శుక్తిమతీ కోలాహలవృత్తాంతమును కావ్యారంభముననో, మరొకచోటనో కవి చెప్పక నాటకములో వలె పాత్రల ముఖమున చెప్పించుట, అట్లే మంజువాణీ దౌత్యఘట్టమును కవి మంజువాణి ముఖమున చెప్పించుట. ఈ రెండు ఘట్టములు కవియే వర్ణించియున్న యెడల వసుచరిత్ర ప్రబంధస్వరూపము వేరుగా నుండెడిది. ఈ దృష్టితో మనుచరిత్రకన్న వసుచరిత్రలోని కథాఘట్టములు నాటకములోని దృశ్యముల వలె, ఆశ్వాసములు అంకముల వలె, నొప్పుచున్నవి.

## మనుచరిత్రలో నాటకశిల్పము

ఇదియేగాక తెలుగు కావ్యములందు మరికొన్ని నాటకరీతులు అనుసరించబడి కనబడుచున్నవి. కావ్యములందలి విశిష్టరచనాశిల్పము కావ్యగత సంఘటనలను నాటకములో వలె పాఠకులు మనఃపటలముపై దర్శించుట కవకాశమును కల్పించుచున్నది. పాత్రలయొక్క సమగ్రస్వరూప వర్ణనలు, ఆహార్య, ఆంగిక, సాత్త్విక, వాచికాభినయముల వర్ణనలు, సంభాషణాశైలి, నేపథ్యమును కనులకు

కట్టునట్లు వర్ణించుట, రసానుకూలమైన ఛందస్సులను, శైలులను ప్రయోగించుట–వీటన్నిటిచే కవులు శ్రవ్యకావ్యములను దృశ్యకావ్యములవలె భాసిల్లునట్లు కావించి యుండిరి ఇట్టి రచనా వైదగ్ధ్యమును కొంతవరకు నన్నయ సభాపర్వమున, తిక్కన విరాటపర్వమున దర్శించవచ్చును. అందు ముఖ్యముగ తిక్కనకావ్యమున నాటకశిల్పము పరాకాష్ఠ నందుకొన్నది. మూల మహాభారతమున దీర్ఘములై, పునరుక్తి దోషయుక్తములైన విరాటపర్వఘట్టములను నాటకీయ కావ్య శైలి యను మూసలోనికి దించిన మంత్రవేత్త యాతడు. మూలమునలేని పాత్రల రూపభావాదుల వర్ణనలు, ఆంగిక సాత్త్వికాభినయముల వర్ణనల నాతడు ప్రవేశపెట్టెను. ఉదాహరణకు–

బృహన్నలను తీసుకొని వచ్చుటకై యుత్సాహపడి నాట్యశాలకుపోవు ఉత్తరను మూలాతిరిక్తముగా తిక్కన ఇట్లు వర్ణించినాడు–

అడుగుల నునుఁగాంతి నయ్యెడ పద్మ
రాగంబుల నెలకట్టు కరణినొప్పఁ
బాలిండ్లు దనువెడ వ్రాలింపఁ జెన్నొందు
నసదుఁ గౌఁదీగె యల్లాడుచుండఁ
దఱివేచి వెనువెంటఁ దగులు కామాంధ
కారము లీలఁ గ్రొవ్వెద గొమరు మిగుల,
గర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలన
మీక్షణ దీప్తుల నినుమడింప

నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబుఁదగ నభ్యసించు చందమునఁ దోన
చనగ నుత్తర నర్తనశాల కరిగె·

వి.ప. 4–28

ఇందు ఉత్తరయొక్క స్వరూప సౌందర్య విశేషము, భూషణములు అంగముల కదలికలలోని సౌందర్యము వర్ణించబడినవి. సత్త్వ సంబంధభావాదుల వర్ణన కుదాహరణ—— భీముడు రాత్రిపూట నర్తనశాలలో కీచకుని చంపెను. ద్రౌపది కిది మహదానందమును కలిగించినది. మనసులోగల హర్షము పైకి కనబడ

కుండ జాగ్రత్తపడుచు ద్రౌపది సుదేష్ణ దగ్గరకు పోవుటను తిక్కన ఇట్లు వర్ణించినాడు —

మదమున నెలమి సొంపొదవి నెమ్మొగంబునఁ
　　దోపంగవచ్చినఁ ద్రోచి త్రోచి
ఉలి నుల్లసిలుచు లలిత లోచన దీప్తు
　　లడరఁ నుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలిశములకు చెయ్యులు
　　దొడరఁ జూచినఁ జేయ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై మాట నాలుకకు రాఁ
　　గడఁగిన నాడక కడపి కడపి

ధీరయై యిట్లు సమ్మద పూరమునకు
గలువ తన మను బలితంపుఁ గట్టవెట్టి
వెలది యెఱుగని యదివోలె వికృతి లేక
యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.

వి.ప. 3–56

మూలమునలేని ఈ వర్ణనద్వారా తిక్కన ద్రౌపది చిత్తవృత్తిని పాఠకుల కక్షిగోచరము కావించినాడు. తిక్కన నాటకశిల్పమునకు అవి రెండు ఉదాహరణలు మాత్రమే. తిక్కన నాటకశిల్పమున మరొక ముఖ్యాంగము సంభాషణాశైలి. సంభాషణలద్వారా కథను నడుపుట, నాటకములలోని దృశ్యములవలె సంవాద ఘట్టములను కావ్యమున సృష్టించుట. దీనిని తరువాత కవులెందరో అనుకరించబూనుకొనిరి.

తిక్కన పాత్ర చిత్రణారీతులను తరువాత శ్రీనాథునిలో చూడవచ్చును శ్రీనాథునిది పాత్రల మూర్తిచిత్రణలో అందె వేసిన చేయి. పాత్రల వేషభూషలను, నడకలను, వివిధములగు కదలికలను కనులకు కట్టునట్లాతడు వర్ణించును. నైషధములో శ్రీహర్షుడు చేయని మూర్తిచిత్రణల నాతడు చేసియున్నాడు. శృంగారనైషధము షష్ఠాశ్వాసమునందలి సరస్వతీ మూర్తిచిత్రణ, అష్టమాశ్వాసమున శివపూజ, కేశవపూజ వేళలందు నలుని వేషధారణ వర్ణనలు మూలములోలేని శ్రీనాథుని మూర్తికల్పనలలో కొన్నిమాత్రమే. హారవిలాసము,

భీమ కాశీఖండములలో వివిధపాత్రల మూర్తిచిత్రణలు, వారి కదలికల వర్ణనలు శ్రీనాథుని రూప చిత్రణా నైపుణిని ప్రదర్శించునట్టివి. ఇట్టి వర్ణనలు పాఠకులకు పాత్రలు మనోగోచరము లగునట్లు తోడ్పడుచు, వానిని రంగస్థలముపై కనబడి నటించు పాత్రలవలె భాసింపజేసి కావ్యమందలి నాటకశిల్పమునకు మెరుగులు దిద్దుచున్నవి.

తిక్కన, శ్రీనాథుల నాటకశిల్పమును పెద్దన మనుచరిత్రలో చక్కగా ప్రదర్శించినాడు ప్రవరుడు, వరూథిని, సిద్ధుడు, స్వరోచి, మనోరమ, ఇందీవరాక్ష, పుంజికస్థల, దేవాపి, వనదేవతాది పాత్రలు రూపములను ధరించి వచ్చి పాఠకులముందు నిలుచునట్లు కవి వర్ణించినాడు. పాత్రల రూపురేఖలను, ఆహార్యమున ఆనగా పాత్రోచిత, నాట్యోచితాలంకార ధారణమును వర్ణించి పెద్దన ఆయా పాత్రలను పాఠకులకు సుపరిచితులను కావించెను.

"ముడిచిన యొంటికెంజడ మూయముఱ్ఱెన్నె
మెగము తోలుకిరీటముగ ధరించి..."

మ.చ. 1-59

అను పద్యమున సిద్ధుని స్వరూపము వర్ణించబడినది.

"వదనప్రభూత లావణ్యాంబు సంభూత
కమలంబు లనవీని కన్నులమరు...."

అను చోట ప్రవరుని రూపలావణ్యములు

"అర్ధచంద్రుని తేట నవఘళించు లలాట
పట్టిఁదీర్చిన గంగ మట్టితోడ..."

మ.చ. 3-71

అను పద్యమున ఆతని వేషభూషలు వర్ణించబడినవి.

"తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన...."

అను పద్యములో వరూథిని శరీరసౌష్ఠవము, సౌందర్య విభ్రమాదులు గోచరించును. అంతేగాక "భీతహరిణేక్షణ" యను ప్రవరుని సంబోధనమున వరూ

థిని బిత్తరచూపులు, "ఇంతలు కన్నులుండ" అను వరూథిని నర్మగర్భ వచనముద్వారా ప్రవరుని విశాల సుందరలోచనములు స్ఫురించుచున్నవి.

"విసుమానములు గా౦గ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాడు...."

మ.చ. 4-73

అను పద్యమున రాక్షసుని భయంకారాకారము దృష్టి గోచరమగును.

"ధగధదని దేహరుచి కుందనపుఁ
దగడుఁ దెగడడ జిగురు జిగి నెగుచుమోవిన్...."

మ.చ. 4-117

అనుచోట ఇందీవరాక్షుని మనోహర గంధర్వరూపము

"శిఖిపంచదళ పరిష్కృతములై సేమంతి
విరుల తీరగు శిరోవేష్టనములు..."

మ.చ. 6-44

అను చోట దేవాపి యను గంధర్వుని జుగుప్సాకర రూపము కడు స్పష్టముగ పాఠకులముందు నిలుచును.

"చెంగల్వ పూదండ సేర్చి పెందుఱుముపై
ఘనసారమున సూసకము ఘటించి..."

మ.చ. 6-5

అను పద్యమున ఘల్లు ఘల్లున నడిచివచ్చి కేళీగృహమును ప్రవేశించు మనోరమ అలంకృత రూపము పాఠకుల కనులముందు కన్పట్టునట్లు వర్ణింపబడినది. ఒక రూపమునుండి మరొక రూపమునకు క్రమముగా మారుటను పాఠకులకు హృదయగోచరమగునట్లు పెద్దన మనోహరముగ వర్ణించినాడు—

"అభ్రమండలి మోఁచు నందాఁక నూరక
పెరిగినట్లో మేను నరవరేణ్య..."

మ.చ. 5-24

అని ఇందీవరాక్షుడు రాక్షసరూపమును పొందుటను,

"వల్లీమ తల్లి లావణ్య సర్వస్వంబు
విమలాంగ రేఖ నావిర్భవింప...."

మ.చ. 6-96

అని వనదేవతస్త్రీగా మారుటను పెద్దన పాఠకులకు సులభముగా అక్షిగోచర మగునట్లు సరసముగా వర్ణించినాడు. ఇక పాత్రల వివిధ చేష్టలను వర్ణించుట లోను పెద్దన చాతుర్యమును ప్రదర్శించినాడు:

"గళిత శృంఖలమైన గంధనాగమువోలెఁ
బ్రజలపైఁ బేరెముల్ పాఱిపాఱి...."

మ.చ. 4-113

అను పద్యమున రాక్షసుని యుద్ధము కనులకు గట్టునట్లు వర్ణించబడినది.

"పసిడితోరము తోడి బాహు వల్లన నెత్తి
సారెకుఁ బోదలపైఁ జాఁచి చాచి...."

మ.చ. 3-88

అను పద్యమున మాయాప్రవరుని కదలికలు, రూపము చక్కఁగా వర్ణించబడినవి. ఈ పద్యము చివర కపటభూసురుడు "విరులు చిదుము"చున్నాడని యన్నప్పుడు నిజమున కాతడు పూలుకోయక కోయుచున్నట్లు నటించుచున్నాడని "చిదుము" పదప్రయోగముచే స్ఫురించగలదు. ఈ మాయాప్రవరుని వరూథిని–

"కాంచి కలక్వణత్కఁణక కాంచికయై యెదురేగి యప్పుడ
క్కాఁచన కేతకీ కుసుమగాత్రి వయస్యల డించి తన్నికుం
జాంచలవీథిఁ దాఁటుచు ఘనాంత చలచ్చపలాకృతిం గలం
గాంచిన వస్తువుం దెలిసి కాంచినయట్లనురక్తిఁ గాంచుచున్"

మ.చ. 3-89

స్వప్నమున గాంచిన వస్తువును మేల్కొఁనిన తరువాత కనుల ఎదుట కాంచు చున్నట్టుగ మాయాప్రవరుని వరూథిని చూచినదట! ఈ పద్యమున "తన్ని కుంజాంచల వీథిఁ దాఁటుచు" అనుటచే వరూథిని పొంచిపొంచి పోయి (తరువాత 91వ పద్యమున చెప్పబడినట్లుగ) గంధర్వుని యుత్తరీయమును పట్టుకొనుట నాటకదృశ్యము వలె ఒప్పుచున్నది. పాత్రల మనోగతభావములను దర్శించి

వర్ణించుటలో పెద్దన దిట్టయైనవాడు. అట్లే పాత్రల కరచరణాది అంగముల కదలికలను పెద్దన సంవాదఘట్టములందు విడువక వర్ణించును ఈ రెండును నాటకపరిభాషలో సాత్త్విక, ఆంగికాభినయములుగ గుర్తించబడును వానికి కొన్ని ఉదాహరణలు–

"తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ
పల్లవాధరగుండె జల్లుమనియె..."
"కొనసాగి కామినీ గోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁ జూపుల జెప్ప తుదలనాఁచి...."

మ.చ. 3–91, 2–97

అను పద్యములందు వరూథిని, మాయాప్రవరుల మనోభావములు చక్కగా చిత్రించబడినవి. మనుచరిత్ర ద్వితీయాశ్వాసమున 31, 32, 33 పద్యములలో ప్రవరుని గాంచినప్పుడు వరూథినికి కలిగిన రోమాంచ, స్వేదాదులు చెప్పబడినవి. తృతీయాశ్వాసమున తనను నిరాకరించిపోయినా డనుకొనిన ప్రవరుడు (నిజమునకు గంధర్వుడు) కనబడగా వరూథినికి కలిగిన హర్ష, కోప, దుఃఖాదులు 90వ పద్యమున వర్ణించబడినవి. సంభాషణల నడుమ, కథా కథనమున పాత్రల విలాసాదిచేష్టలనువర్ణించుట పెద్దన నాటకశిల్పమున ప్రదర్శించిన ప్రత్యేకతలలో నొకటి. "ఈషదంకురిత హసనప్రసిష్ణు గండయుగళుం డగుచు" ప్రవరుడు సిద్ధునితో పలికెనట, "తన కనుఁగవ మెఱుఁగులుబ్బఁ దాటంకములుం జనుఁగవయు నడుము వడఁకగ" "సెలవివాఱ నవ్వి" వరూథిని ప్రవరునితో మాట్లాడెను.

"పలుచని వాతెఱ మెఱుఁగునఁ
బలు మెఱుఁగులు సందడింపఁ బాపటపై నం
జలిఁ జేర్చి ఱెప్పఁ జూపులఁ
బలుకులఁ బులకుండ మొలుకఁ..."

మ.చ. 4–70

స్వరోచితో మనోరమ పలికెను.

"ప్రోపువడి నిలిచి ల
జ్జా పరవశ యగుచుఁ గొప్పు సవరించి యొదల్

దీపింప నతనిఁ జూచుఁజూచుఁ
గోపమునన్ జూచి క్రేఁటు కొనుచున్ బలికెన్"

మ.చ. 2-69

అని వరూథిని ప్రవరునిచేత త్రోపువడి పలికిన విధమును వర్ణించుట కొన్ని ఉదాహరణలు మాత్రమే.

వరూథినీ ప్రవర సంవాదమును రంగస్థలముపై చూపదలచిన, వరూథిని పాత్రధారిణి పెద్దన వర్ణించి చెప్పిన అభినయాదులను ప్రదర్శించిన చాలును. వేరు అభినయములను నేర్చుకొనవలసిన ఆవశ్యకత లేదు. ద్వితీయాశ్వాసమున 61వ వచనమున వర్ణించబడిన వరూథిని శృంగారవిలాస చేష్టలు కనులకు కట్టునట్లు కలవు. అట్లే "పాంచద్భూషణ బాహు మూలరుచితో పాలిండ్లుపొంగారఁ బైయంచుల్ మోవగఁ గౌగిలించి యధరం బాసింప" వరూథిని కౌగిలించుట "హా! శ్రీహరీ! యంచున్ బ్రాహ్మణు డోరమోవి డి తదీయాంసద్వయం బంటి పొమ్మంచున్ ద్రోచె" ననుట నాటకదృశ్యము వలె ప్రేక్షకులకు కనిపించును. "నీవు త్రోవ నిచ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ కనుంగొమంచుఁ జూపి యప్పాటల గంధివేదవ నెపంబిడి యేడ్చె...." అను పద్యమున "యిచ్చోట" అను పదప్రయోగముచే వరూథిని "నీ నఖాంకుర మిదిగో యిక్కడ సోకిన" దనిచూపుచున్నట్లు గోచరించక మానదు.

వాడినమోముఁ దమ్మి తెలివాలిక కన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరమునం దిడి తీర నిషణ్ణయై జలం
బాడఁగ బిల్చు వారినొక హస్తపు మొక్కున నాడుఁడంచుఁ దాఁ
జూడక చూచు చూడ్కి నల జోటిదెసల్ పరికింప నొక్కచోన్

మ.చ. 3-86

అను పద్యము చదువగానే వాడినముఖము, తెలవాలిక కనులతో చిన్నబోయి ఫాలభాగమును చేతితో కప్పుకొనిన వరూథిని దీనరూపము దృష్టిగోచరమగును. అట్లే జలంబాడగ పిల్చువారిని మీరు జలకాలాడండి నన్ను మాత్రము పిలువకండి అని ప్రార్థనగా మొక్కుచు, అన్యమనస్కతతోపోవు వరూథిని రూపము నాటకములోని పాత్రవలె గోచరించును. అదేవిధముగ "మట్టెల్ మ్రోయగ గబ్బిచన్నుఁగవ కంపంబంద వేణీభరం బట్టిట్టై కటిఁ జిమ్మ చీకటులుగా నస్రస్ర

జం బోడి కల్కట్టం జూపులు చిమ్మి రేఁగి దివి రోలంబాళిఁ గల్పింపగా...." అను పద్యమున మనోరమ రూపము స్పష్టముగా గోచరించును.

అనినం గన్నులు జేవురింప నధరం బల్లాడ వేల్లత్తునః
పునరుద్య ద్భ్రుకుటీ భుజంగ యుగళీపూత్కార ఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకం బందంద ఘర్మాంబువుల్
చినుకం గంతు దిదృక్షు రూక్షనయనక్ష్వేళా కరాళధ్వనిన్

మ.చ. 5-18

అను నెడ ఇందీవరాక్షునకు శాపమొసంగిన బ్రాహ్మణుని రూపము, సాక్షాత్కారమగును.

"అలకని జీబులోఁ గుసుమ మద్దిన పావడదోఁపఁ గొప్పు చెం
గలువలవల్పుఁ జన్నుఁగవ కస్తూరితావియుఁ బ్రస్తరింప నం
దెల రొదమీఱఁ బెన్నిధి గతిన్ బ్రతికిం బొడకట్టె వేల్పుఁదొ
య్యలి చిఱుసానఁ బట్టిన యనంగుని మోహన బాణమోయనన్.

అత్తెఱంగున నదిరి పాటూరజంపు
వన్నెఁ బొడకట్టి తాఁబాడు సన్నరవళి
పాట లళిఝంకృత, శ్రుతి, బాదుకొనఁగఁ
జూడకయచూచు చూపుతో సుడియుటయును"

మ.చ. 6-31,32

అనునెడ పుంజక స్థలయను అప్సరస పొడకట్టును.

అత్తఱి గంధర్వ విభుం
డత్తామరసాక్షి వదన మక్కునఁ గృపతో
నొత్తి మొగమెత్తి యశ్రులు
మెత్తనఁ గొనగోరఁ బాఱమీటుచుఁ బలికెన్.

మ చ. 3-137

అనునెడ వరూథినిని ప్రవర వేషధారియగు గంధర్వు డూరడించు విధము పాఠకుల హృదయములందు కదలాడును. నాటకమున రంగస్థలముపై ప్రదర్శించ బడి ప్రేక్షకులచే దర్శించబడునట్లుగా వీనిని పాఠకులు మనోవీథిలో దర్శింతురు.

పాత్రల ప్రవేశ నిర్గమములను చెప్పుట నాటకములందుండు నట్టి లక్షణము. దానిని పెద్దన తన ప్రబంధమున చక్కగా నిర్వహించెను. ప్రథమాశ్వాసమున సిద్ధుని యాగమనము, ప్రవరు డెదురేగి యాతనిని ఆహ్వానించుట, పాదలేపనమును ప్రవరునికాళ్ళకు పూసిన తరువాత సిద్ధుని నిర్గమనముగను చెప్పుటచే ఆ యాశ్వాసములోని సిద్ధప్రవర సంవాదఘట్టము నాటకాంకమువలె ఉప్పుచున్నది. ద్వితీయాశ్వాసమున ప్రవరుడు కోనలోనికి దిగుట గారుడోత్కీర్ణ భవనమును సమీపించుట, వీణ వాయించుచున్న వరూథిని ప్రవరుని చూచి లేచి, "ఝళం ఝళత్కటక సూచితవేగ పదారవిందయై" నడచివచ్చుట, సిగ్గుతో పోకసునుఁ బోదియను చేరుట, తిరిగి అంఘ్రి కటకంబులు మ్రోయగవచ్చి అడ్డంబు నిలుచుట మొదలగు పాత్రల కదలికలుమూలమున లేనట్టివి చతుర్థాశ్వాసమున కొండశిఖరముపై కూర్చొనియున్న స్వరోచి చెంతకు ఎఱుకజేదు వచ్చుట, స్వరోచి వేటకై బయలుదేరుట, ఆతడు మనోరమ మొఱవిని అరణ్యమున ప్రవేశించుట, మనోరమ భీతితో పరుగెత్తివచ్చుట, రాక్షసుని ప్రవేశము మొదలగునవి నాటకములోని పాత్రల ప్రవేశము వలెనే నిర్వహించబడి ప్రబంధమునకు నాటకీయత నాపాదించుచున్నవి

మార్కండేయపురాణమున కథారూపముననున్న కావ్యేతివృత్తమును పెద్దన కొన్ని సన్నివేశములుగ రూపొందించుటయేగాక ఆ సన్నివేశములు జరుగు రంగస్థలము నాతడే వర్ణించిచెప్పును. "కులిశధారా హతి పొలుపున బైనుండి, యడుగుమోవఁగ జేగుఱైన తటుల" అని లోయను "నికట మహీధరాగ్రతట నిర్గత నిర్ఝరధారఁ బాసి...." అని లోయలోనికి దిగుమార్గమును "తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్' అని భవన ప్రాంగణమును వర్ణించి చెప్పి ప్రవర వరూథినీ సంవాదఘట్టము జరిగిన రంగభూమిని పాఠకులకు దృష్టిగోచరమగునట్లు కావించును. "రవి రుచిరంధ్రసరేణు వ్రాతముల్ మించు..." అను పద్యమున వరూథిని మాయాప్రవరుని గాంచినచోటు,

నెత్తమ్ము లే కొండ నెత్తమ్ము లందాడు
విద్యాధరీకోటి విటులతోడ..."

మ.చ. 4–78

అను పద్యమున మనోరమ సఖులతో విహారమున కేగిన చోటును కవి వర్ణించి చెప్పెను.

పెద్దన ప్రదర్శించిన నాటకశిల్పమున ఇంకను ప్రధానమైనవి-సంభాషణా శైలి మరియు పాత్రోచితభాషను, శైలిని ప్రయోగించుట. దీనిని నాటకపరిభాషలో వాచికాభినయముగ పేర్కొనవచ్చును. పెద్దన సంభాషణలను నాటకకర్త వలెనే రచించును సిద్ధప్రవర, వరూథినీ సంవాద ఘట్టములు పెద్దన సంభాషణ రచనా నైపుణికి 'చక్కని నిదర్శనములు వీనిలో పాత్రల సంభాషణలు అతి దీర్ఘములుగాక నాటకములలోని సంభాషణలవలెనె నడచును. పాత్రోచితభాష నుపయోగించుట పూర్తిగా నాటకములలో పాటించబడు లక్షణము పెద్దన తరువాత పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నమున నిట్టి పాత్రోచితభాషను ప్రయోగించినట్లు కనబడుచున్నది. స్వరోచికడకు వచ్చిన ఎఱుకతేడు "సీరాముసేనవాలుమెకంబుల్" అని యనుట పాత్రోచితభాషకుదాహరణ. పెద్దన పాత్రోచితభాషనేగాక పాత్రోచిత పదబంధములనుకూడ ప్రయోగించినాడు మాయాప్రవరుని మాటలలో అనుప్రాసలు వరూథినిప్రీతికై యాతడు పలుకు మెత్తని మాయమాటలను పట్టించునట్లువిగ నున్నవి. అట్లే సిద్ధప్రవర సంవాద ఘట్టమున సిద్ధుడు ప్రయోగించు దీర్ఘసమాసము లాతని నానా విషయపరిచితిని, ప్రవరుడు ప్రయోగించు అలతిపదము లాతని వినయ సౌకుమార్య సౌశీల్యము లను ప్రకటించుచు ఔచితీవంతములై యున్నవి.

ఈవిధముగ పెద్దనచేసిన పాత్రల ఆహార్య, ఆంగిక, సాత్త్విక, వాచికాభినయ వర్ణనలు, పాత్రల స్వరూపవర్ణనలు, పాత్రల కదలికల వర్ణనలు, నేపథ్య వర్ణనలు, ప్రబంధపఠనము నొక రూపకదర్శనమువలె ఉద్భాసింప జేయుచున్నవి. వీటన్నిటిచే మనుచరిత్ర కావ్యపఠనమువలన సహృదయులకు రూపకదర్శనానందము కలుగుచున్నది.

## వసుచరిత్రలో నాటక పద్ధతులు

రామరాజభూషణునకు నాటకములనిన ప్రీతి మెండు. "హరిదంబోరుహలోచనల్గగగ రంగాభోగ రంగత్తమో..." (4 ఆశ్వా 17) అను చంద్రోదయ వర్ణనా పద్యమున అతడు గ్రహించిన ఉపమావస్తువునుబట్టి ఆతనికి గల నాటకప్రీతి వ్యక్తమైనది.

"నిఖిలభూములు జవనిక వాపదారున
నెదిరినట్లై తోచు నింతులార..."

వ.చ. 4-59

మంజువాణి ఆకాశమున కెగురుచుండగ భూములన్నియు, తెర తొలగించ గానే కనులముందు నిలిచినట్లుగా కనిపించినవట! నాటకములో యవనికను తొల గించు పద్ధతి ననుసరించి కవి యిట్లు యూహించుటకూడ నాటకప్రీతిచేతనే.

వర్ణనలలో నిట్లు నాటక పద్ధతుల (టెక్నిక్) ను పేర్కొనుటయేకాక వసుచరిత్రలో కొన్ని సన్నివేశములందు, పాత్రప్రవేశములందు రామరాజభూష ణుడు నాటకపద్ధతులను అనుసరించినాడు. దేశి నాటకములందు పాత్రలను ప్రవేశపెట్టు విధానము ననుసరించి రామరాజభూషణుడు వసుచరిత్రలో వసురాజు, మాయాయతి వాక్సహాయమును పురస్కరించుకొని గిరికాదుల ముందుకు ప్రవే శించుట నిట్లు వర్ణించినాడు,

"ఇది సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్రని
రదవార ప్రతిసీర వెల్వడిన తారా భర్తలీలన్ లతా
చ్ఛద సంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగ భ్రమ
న్మద భృంగీరుతి వందిమాగధ కథామాధుర్యముం దెల్పగాన్."

వ.చ. 3-45

దేశినాటకములలో ప్రధానపాత్ర ప్రవేశావసరమున గీతములుగానము చేయబడుట ననుసరించి, వసురాజు ప్రవేశించునపుడు ఆడు తుమ్మెదల ఝుంకార ధ్వనులు వందిమాగధుల కథామాధుర్యమువలె ఒప్పుచున్నవని కవి కల్పన కావించినాడు. ఈ పద్యమున "సారంగరాగ"ము పేర్కొనబడు టచే నాయకపాత్ర ప్రవేశావసరమున ఆ ప్రత్యేక రాగము పాడబడు చుండెనేమోయని యూహ కలుగుచున్నది. ఈ పద్యము తరువాత వసు రాజు వర్ణన మిట్లు చేయబడినది—

"తలిరుఁ బ్రాయము వాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువానిఁ

బసిడి చాయలవానిఁ బగడంబు జగడంబు
జగడంబు గల మోవి సొగసువానిఁ
దళుకుఁజెక్కులవానిఁ దులకింపు పలుకెంపు
పలుకెంపు లొలయు నవ్వులుకువానిఁ
జికిలి చూపులవాని సిరిమించు దొరయించు
దొరయించు కాంచనాంబరమువాని

నొఱపు గలవాని మకుటకేయూరహార
కటకకుండల చాకచక్యములవాని...

వ చ. 3—46

అను ఈ సీసపద్యము, నాయకపాత్ర ప్రవేశమున అతనిని వర్ణించుచు పాడు పదమువలె ఒప్పుచు సంపూర్ణ దేశినాటక పద్ధతిలో పాత్రప్రవేశ విధానమును సంపన్నము కావించుచున్నది వసురాజు శైలభంజనము కావించినపుడు ఇంద్రుని ప్రవేశమును గూర్చి--

"మందార వర్షవర్ధన
బృందారక బృంద దుందుభి ధ్వనిగర్జా
సందోహ మపుడు నృపజయ
నందిత శక్రోప సర్పణం బెఱిఁగించెన్ ''

వ.చ. 3—3

అని చెప్పుటయు దేశినాటకములో పాత్రప్రవేశమును సూచించుటకు చేయు హంగువలెనే గోచరించును.

ఇట్టి దేశినాటక పద్ధతుల ప్రభావమేగాక వసుచరిత్ర కథా సంవిధానమున సంస్కృత నాటకపద్ధతుల ప్రభావముకూడ కలదు. ముఖ్యంగా కాళిదాసుని అభిజ్ఞానశాకుంతల, హర్షుని నాగానంద నాటకములలోని నాటకవిధానముల ప్రభావము స్పష్టముగా గోచరించుచున్నది.

నాగానంద నాటకములోని నాయకునివలెనే వసురాజును సంగీతప్రియుడుగా గోచరించును. నాగానంద ప్రథమాంకములోవలెనే వసుచరిత్రలో నాయకుడు, నర్మసచివునితో కూడి నాయికయుండు పర్వతమును చేరుకొనును ఆ

నాటకములోవలెనే నాయికాగానముచే నాయకుడు ఆకర్షించబడును. ఈ దృశ్య మునంతటిని రామరాజభూషణుడు నాగానందనాటక చ్ఛాయలతో నాటకదృశ్యము వలెనే రచించినాడు. నర్మసచివుడు కోలాహలమును చూచి వర్ణించును. ఆ వర్ణన కవి ముఖముగాక పాత్రముఖమున చేయబడుట నాటకములోవలె నున్నది.

అభిజ్ఞానశాకుంతలమున కవి దుష్యంతుని వేటకు పంపి, అక్కడ నాయి కతో సమావేశమును కల్పించగా దీని ననుకరించుచు రామరాజభూషణుడు వసు రాజును ఉద్యానవన సందర్శనమునకు పంపి యక్కడ నాయికతో సమావేశము కలిగినట్లుగా చెప్పినాడు. అంతేగాక శాకుంతలములో ప్రథమాంకము ననుకరిం చుచు వసుచరిత్రకారుడు ద్వితీయ, తృతీయాశ్వాసములలోని కథాసంవిధాన కల్పనమును కావించుకొనినాడు వసురాజు తీగలచాటున దాగియుండి, గిరిక మరియు ఆమె సఖులతో యతివేషమున నున్న విదూషకుడు మాట్లాడు మాట లను వినుట, మంజువాణి గిరికాజన్మవృత్తాంతమును చెప్పుట, ఒక నెపమును పురస్కరించుకొని వసురాజు గిరికాదులముందుకు పోవుట, వారు సంభ్రమముతో నాతనిని సత్కరించుట, వసురాజు గిరికల అన్యోన్యానురాగము, హంసాంగన గిరికను తోడ్కొని పోవుట, గిరిక ఏదో మిషతో వెనుకకుతిరిగి వసురాజును చూచుట, విరహముతో వేగు వసురాజును విదూషకు డూరడించుట. విరహ ముతో వేగు గిరికను సఖులు ఉద్యానవనమునకు తెచ్చి యూరడించుట—ఈ ఘట్ట ములన్నియు అభిజ్ఞానశాకుంతల నాటకములోని దృశ్యములవలెనే చిత్రించబడి నవి. మంజువాణి దౌత్యమును కవి వర్ణించక, మంజువాణిముఖమున వినిపిం చుటయు నాటకధర్మమే. ఇది అభిజ్ఞాన శాకుంతలమున అనసూయాప్రియం వదల ముఖమున శకుంతలా జన్మవృత్తాంతమును చెప్పించుటను జ్ఞప్తికితెచ్చును. మంజువాణి ఆకాశమున కెగురు వృత్తాంతము అభిజ్ఞానశాకుంతలము షష్ఠాంకము లోని దుష్యంతుని రథము ఆకాశమునుండి దిగు ఘట్టము ననుకరించియున్నది. గిరికను అత్తవారింటికి పంపునపుడు కోలాహలుడు బుద్ధులుచెప్పు ఘట్టము అభిజ్ఞాన శాకుంతలము చతుర్థాంకములో శకుంతల నత్తవారింటికి పంపునపుడు కణ్వుడు ఆమెకు బుద్ధులు చెప్పు దృశ్యమును పోలియున్నది.

గిరికా వసురాజుల యొక్క సమావేశసందర్భము అభిజ్ఞానశాకుంత లము లోని ప్రథమాంకఘట్టమును పోలియున్నను, విదూషకుడు యతివేషమున గిరికాదుల కడకేగుట వసుచరిత్రకారుని స్వంత కల్పనయే. ఇది సంస్కృత నాటకములలో నెచటను కినిపించని సన్నివేశము. గిరికా జన్మవృత్తాంతము వసురాజు యొక్క పరాక్రమాతిశయముతో ముడివడియుండుట వలన రామరాజ భూషణుడు వసురాజును తీవెలమాటున ఉంచి విదూషకుని గిరికాదుల సమక్ష మునకు పంపించి మంజువాణి యా వృత్తాంతమును విదూషకునికి చెప్పుచుండగా వసురాజు వినెనని కల్పించుట ఔచితీమంతముగా నున్నది కథ కనుగుణమైన ఈ కల్పన హృదయరంజకమై నాటకీయతకు మరింత మెరుగులు దిద్దినది

ఇట్టి సంస్కృత, నాటకపద్ధతుల ననుసరించిన దృశ్యవిధానములేకాక వసుచరిత్రలో మరికొన్ని నాటకవిధానములు కనిపించుచున్నవి అందు ముఖ్య మైనది విదూషకపాత్ర కల్పనము. సంస్కృతనాటకము లన్నింటిలో విదూషక పాత్ర ఉండదు. శృంగారప్రధానమైన ప్రేమవృత్తాంతముగల సుఖాంత నాట కములందే యా పాత్ర గోచరించును సంస్కృత నాటకములలో నీతడు రాజు నకు నర్మసచివుడు లేక కామసచివుడై యుండును. అనగా ప్రేమసంబంధ విషయములలో సచివత్వమును నెరపువాడని యర్థము. ఇతడు నాయకునకు చెలికాడై యుండును. వసుచరిత్రలోని విదూషకపాత్ర సంస్కృత నాటకము లలో వంటిదే. గౌతముడని సంస్కృతనాటకములలో విదూషకున కీయబడు పేరు వంటిదే కావ్యమునం దాతని కీయబడినది. సంస్కృతనాటకములలో వలెనే గౌతముడు నాయికానాయకులకు సమావేశము కలిగించు విషయమున తోడ్పడినాడు. కాని వసుచరిత్రలోని విదూషకుడు సంస్కృతనాటకములలోని విదూషకులవలె వికృతాకారుడుగా, బుద్ధిహీనుడుగా, భోజనప్రియుడుగా, చేటులతో అనవసరముగా జగడములకు దిగువాడుగా కనిపించడు. సంస్కృతనాటకము లలో వలె కాక అతడు మంచి కార్యనిర్వాహకుడుగా కనిపించును. యతివేష మున గిరికాదుల కడకుపోయి వారి వృత్తాంతమును తెలుసుకొనుట గౌతముని ఆలోచనయే. గిరికాదులతో మాట్లాడినప్పు డాతడు ప్రౌఢ వాక్చాతుర్యమును ప్రదర్శించి యెచటను కార్యభంగము కానీయలేదు. సంస్కృత నాటకములలో విదూషకు డేదైన కార్యభారమునకు పూనుకొన్నను దానిని పూర్తిగా దిగ్విజయ

వంతముగా చేసినట్లు గోచరించదు తన వాచాలత్వము, చంచలత్వము, జగడాలమారి గుణముచేత కార్యము నేదైన సొంతముగా నేరవేర్చలేకపోవును. వసుచరిత్రలోని విదూషకు డట్టివాడు కాడు. వసురాజు విరహాగ్నిలో మునిగిపోగా గౌతము డాతని నూరడించు క్రమము విక్రమోర్వశీయములో పురూరవు నూరడించు విదూషకుని జ్ఞాపకమునకు తెచ్చును. సంస్కృతనాటకములలో ప్రేమవృత్తాంతము ముగిసిన తదుపరి అనగా విదూషకపాత్ర ప్రయోజనము ముగిసిన వెనుక ఆతడు కనబడనట్లుగానే వసుచరిత్రలోను విదూషకుడు గిరికావసురాజుల వివాహఘట్టమున అనగా చివర మూడాశ్వాసములలోను కనిపించడు. వసుచరిత్రలోని విదూషకుడు సంస్కృతనాటకములలోని విదూషకునికన్న ప్రౌఢునివలె కనిపించుచు భిన్నమై గోచరించినను పాత్రప్రయోజనము మాత్రము సంస్కృతనాటకములలో వంటిదే. ఈ విదూషకపాత్ర సృష్టియే వసుచరిత్రలో నాటకపద్ధతులను ప్రవేశపెట్టవలయునని రామరాజభూషణునకు ఎంతటి తీవ్రేచ్ఛ కలదో ప్రకటించుచున్నది. అంతకు పూర్వము సంస్కృతనాటకముల ననువదించుచు మంచన కేయూరబాహుచరిత్రలోను, పినవీరన శృంగారశాకుంతలములోను విదూషకపాత్రలను నాటకానుసారముగా ప్రవేశపెట్టియుండిరి ఆ మర్యాద ననుసరించుచు తన నాటకప్రీతిచేత రామరాజభూషణుడును వసుచరిత్రలో విదూషకపాత్రను సృష్టించినాడు.

వసురాజునకు సఖునిగా విదూషకపాత్ర సృష్టిని కావించుటయేగాక రామరాజభూషణుడు వసురాజునకు ఇందుని తోడి సఖ్యమునుకూడ కల్పించినాడు విక్రమోర్వశీయము, అభిజ్ఞానశాకుంతలాది నాటకములలో నాయకులు తమ శౌర్యప్రతాపములచే మించినవారై, ఇంద్రునికి మిత్రులై, దుష్టశిక్షణలో నాతనికి తోడ్పడుచున్నట్లుగా చెప్పబడినది. అట్టి నాటకక్రమము ననుసరించి రామరాజభూషణుడును మూలమహాభారతకథలోని వసురాజు, ఇంద్రులసఖ్యమును కల్పించినాడు. మూలమున వసురాజు ఇంద్రునిగూర్చి తపస్సుచేసినట్లు, ఆతని భక్తుడైనట్లు చెప్పబడినది. దానిని మార్చి రామరాజభూషణుడు నాటక మర్యాద ననుసరించి నాయకోత్కర్షకై ఇందుని వసురాజునకు మిత్రునిగా చేసినాడు. వసురాజు పరాక్రమమునకు మెచ్చి ఇంద్రుడే స్వయముగా విచ్చేసి ఆతని సఖ్యము నాశించినాడనుటచే సంస్కృతనాటకములో కన్న నాయకోత్కర్ష వసుచరిత్రలో సమకూరినది.

ఇంతేగాక రామరాజభూషణుడు నాటకములలోవలె కొన్ని సంభాషణలను, పాత్రప్రవేశ విధానము లనుకూడ వసుచరిత్ర కావ్యములో ప్రవేశపెట్టినాడు. ప్రథమాశ్వాసాంతమున ఒక కిన్నర దంపతి యాసన్నశుభమును తెల్పి యట నుండి వెంటనే సమీపమునగల కోలాహలపర్వతముపైకి వెళ్ళిపోవును. దానిచే వసురాజు, విదూషకుల దృష్టి కోలాహల పర్వతమువైపు కాకర్షించబడును. అపుడు విదూషకుడు నేనొక అద్భుతమును చూచితినని కోలాహల పర్వతముపై గల వృక్షములను మబ్బులలో కనిపించు దేవవృక్షములుగా భ్రాంతిచెంది వర్ణించును. వసురాజు దానికి నవ్వి అవి దేవవృక్షములు కావు మన క్రీడాచలమగు కోలాహల. గిరిపై గల వృక్షములు, పద పోయిదర్శింతమని యనును. అప్పుడా యిరువురు కలసి కోలాహలముపైకి పోవుదురు. ఈ దృశ్యమంతయు ఒక నాటకములోని దృశ్యమువలె కల్పించబడినది. ఇందు కిన్నరుల జంట ఆసన్న శుభమును తెలుపుట, అభిజ్ఞానశాకుంతలములో ఆశ్రమప్రవేశము కావించు దుష్యంతునకు కుడిభుజ మదిరి ఆసన్నశుభమును సూచించిన క్రమమును తలపించును. ఈ సందర్భమున వసురాజు విదూషకుల మాటలను రామరాజభూషణుడు నాటక సంభాషణవలె నడిపినాడు.

ద్వితీయాశ్వాసమున విదూషకుడు ముందుగా పోయి గిరికాదులను దర్శించి తిరిగివచ్చి వసురాజును తీసుకొనిపోవు పట్ల ఆతనికి మార్గము దర్శింపజేయుచు ఇట్లనును—

''ఈజాలఁ బోరాదు పేరాళము జవాది
యీతాల నడుచక్కి నేగవలయు
నాకాన నేకాల మడరుఁ దేవియవాన
లాకాన నేర్పున నరుగవలయు
నీవంక నేవంక నెనసిన తుహినాంబు
లీవంకఁ బూదెప్ప నీదవలయు
నామూల నునుమూల జామొత్తముల చట్టు
లామూలముగఁ దీవ లంటవలయు...

వ.చ. 2-53

ఈ మాటలు నాటకములలో రాజునకు మార్గమును చూపించుచు విదూషకుడో లేక కంచుకియో అను మాటలవలె న్నవి.

రామరాజభూషణుడు పాత్రలను హఠాత్తుగ రంగముమీదికి ప్రవేశపెట్టక నాటకములలోవలెనే ముందు సూచనతో ప్రవేశపెట్టును–విదూషకుడు యతివేష ధారియై గిరికాదుల ముందుకు పోదలచి సరియైన సమయమునకై వేచియుండును. గిరికా సఖులు సంగీతమునుగూర్చి ప్రసంగించుకొనుచు యిట్లందురు––

"గంధ గజయాన గీత ప్రబంధకల్పన
నలరి యతిలియ్యమై వచ్చు నరిది మగువ
లార! కనుఁగొంటిరే యను నాళి·వాక్య
మొకటి విననైన నిదెవేళ యొదవెననుచు..."

వ.చ. 2-81

సఖులు గిరికాగానమున వచ్చు "యతి" ప్రసంగమును కావించగా విదూషకుడు ఆ మాటలకు "యతీశ్వరుడీ పాటతో కలసి వచ్చు"నను అర్థమును గ్రహించి యతివేషమున గిరికాదుల సమ్ముఖమున ప్రవేశించును. ఈ పాత్ర ప్రవేశ విధానము ప్రస్తావనాంతమున పాత్రప్రవేశ పద్ధతులలో నొకటి యగు "కథోద్ఘాత ము"ను పోలియున్నది. కథోద్ఘాతమున సూత్రధారుడు ప్రయోగించిన శబ్దార్థము లను ఆత్మపరముగా నూహించుకొని పాత్ర రంగస్థలముపైకి ప్రవేశించును. రామరాజభూషణుడట్టి చమత్కారయుక్త పాత్ర ప్రవేశపద్ధతినే యిచట ప్రయో గించినాడు.

తృతీయాశ్వాసమున విదూషకుడు వసురాజును రప్పించుటకై 'మజ్జు' అని యరచును. దానిని విని వయస్యుని మనోగతాభిప్రాయము నెరిగిన వసు రాజు గిరికా సమక్షమునకు పోవుట కిదె యదనని గ్రహించును. అభిజ్ఞానశాకుంత లమున తుమ్మెద శకుంతలను బాధించగా "ఎవడురా ఆ దుష్టుడు" అను మాట లతో, స్త్రీలను దుర్మార్గుని బారినుండి రక్షించు నెపమున దుష్యంతుడు వారిముందుకు వచ్చును·నాగానందమున నాయిక మలయవతియొక్క చేటి''ఏషతే హృదయస్థితో వరః"అన్న మాటలలోని 'వరః' శబ్దము 'వరముల'ను అర్థమున ప్రయోగించ బడగా 'వరుడ'ను అర్థమును గ్రహించి, ఆనెపమున జీమూతవాహనుడు విదూషకునితో ఆ స్త్రీలముందు ప్రవేశించును. అట్టి నాటకములలోని క్రమము ననుసరించి, రామరాజభూషణుడు వసురాజు నాయికా సమ్ముఖమున ప్రవేశించు టకు చక్కని కారణమును కల్పించినాడు. ఆదేవిధముగ చతుర్థాశ్వాసమున

ప్రతిమగా మారి వసురాజును పరీక్షించిన మంజువాణి "నీకుఁ బ్రతిమాపదేశమిక నేలే పల్కవే సన్నిధిన్ వనితావల్లభ జీవితంబులు సఖీవాక్య స్థితంబుల్గదే" అను వసురాజుమాటలను మిషగా గ్రహించి నిజరూపముతో నాతనిముందు నిలుచును

తృతీయాశ్వాసమున గిరిక వసురాజునెదుట చూచి వ్రీడాభావ యుక్తయై, అతని యెదుటనుండి వెళ్ళిపోదలచి ఏదోయొక మిషకొరకు వెదకుకొనుచు "నా జనని వయస్య కలహంసి యెలరాదొకో"యని అనుకొనినంతనే కలహంసి పాత్ర ప్రవేశము జరుగును. ఈ పాత్రప్రవేశముకూడ నాటకవిధానము ననుసరించినది. కలహంసివచ్చి "కుమారీ! తాపసానీకము నీ కమూల్యా శుభనిర్వాహణంబు ఘటిల్లఁ గల్పకానోకహసూన రాజము లనూనసుసూక్తులతో నొసంగినంగైకొని తల్లి నిన్బిలువగాఁ బనిచెన్ విరులిచ్చు వేడుకన్"అనుట అభిజ్ఞానశాకుంతలములో కణ్వుడు శకుంతలా ప్రతికూలగ్రహ శాంతికై సోమతీర్థముపోయిన కారణమును తలపించుచున్నది. అనగా కణ్వునికి శకుంతలను తగినవరునకిచ్చు చింత ఎట్లు ఒక సామాన్య గృహస్థున కున్నట్లున్నదో, అట్లే గిరికకు కల్యాణసిద్ధి కలుగవలెనను చింత శుక్తిమతికున్నట్లు తెలియుచున్నది. కణ్వుడు శకుంతలకు ప్రతికూలముగానున్న దైవమునకు శాంతిచేయుటకు సోమతీర్థము పోగా, శక్తిమతియేమో తాపసులను దర్శించి వారి యాశీర్వచనములను పొందుటకు పోయినది. నాయికా నాయకుల ప్రథమ సమాగమమున అనురాగోదయమువరకు కథను తీసుకొని పోయి, ఏదోయొక మిషచే వారి కెడబాటును కలిగించుట నాటకములలో కన బడును. అభిజ్ఞానశాకుంతలమున వనగజ విజృంభణము నాయికానాయకుల ఎడబాటునకు కారణమైనది. గిరిక లజ్జచే వసురాజు ఎదుట ఉండలేక కలహంసిని స్మరించగానే, యాదృచ్ఛికముగ నది వచ్చి యామెను తీసుకొనిపోవుటవలన ఆమెకు వసురాజునకు ఎడబాటు సంభవించినట్లుగా రామరాజభూషణుడు కల్పించినాడు. ఈ కల్పనయు నాటకములలోవలెనే యున్నది

గిరిక సిగ్గుచే వసురాజును ధైర్యముగా కనులెత్తి చూడలేక పోయినది. కాని యామె కింకను వసురాజును దర్శించు ప్రీతి కలదు. కావుననే యామె "సిగ్గు రాగపుఁ దమియుం బెనంగఁ బ్రియుఁగాంచెఁ గుచాంచల హారధారలోన్" అట్లు వసురాజును దర్శించు గిరికను కనిపెట్టి సఖులామెను పరిహాసము చేయుదురు, అపుడామె సిగ్గుతో తెరమాటున దాగుకొనును దీని

నంతటిని నాటకములోని దృశ్యమువలె కవి మనోహరముగ కల్పన కావించి నాడు. ఆ తరువాత కథలో ఈ మణిహారమునే మంజువాణి వసురాజు దగ్గరకు గుర్తుగా తీసుకొనిపోయినది. మంజువాణి ప్రతిమలలో నొక ప్రతిమయై, వసురాజుకు గిరికమీద గల ప్రేమను పరీక్షించుటకై గిరికా చిత్రపటమును చూచుచు విరహబాధ నొందు యాతనపైకి యా హారమును విసరివేసినది. ఆ హారమును వసురాజు గుర్తించి చెలియొక్క క్షేమ సమాచారమును దాని నడుగును. చెలితో సమాగమమును కల్పించుమని దానిని వేడుకొనును ఆ హారదర్శనముచే అధిక విరహవేదనకు గురియగును. ప్రతిమలలో ప్రతిమయై దాగియున్న మంజువాణి దీనినంత చూచి గిరికపై యాతనికి గల ప్రేమాధిక్యతను తెలుసుకొనును. ఈ మణిహార వృత్తాంత మును కవి అభిజ్ఞానశాకుంతలములో గల అంగుళీయక వృత్తాంతమును మన సులో నుంచుకొని కల్పించినాడేమో యని యనిపించును. అంగుళీయకమును దర్శించినవెనుక శకుంతలా విరహవ్యథ దుష్యంతుని వేచును. విరహబాధతో నామె చిత్రపటమును గీయదలచును. మరియు ఆమెను తలచుకొని దుఃఖించును. ఈ దృశ్యమును అదృశ్యయైయుండి శకుంతల తల్లికి సఖియగు సానుమతి కాంచును. దుష్యంతునికి శకుంతలపై గల ప్రేమభరము నామె తెలుసుకొనును. అదేవిధముగా రామరాజభూషణుడు మణిహారసంఘటనను, వసురాజు విరహసంఘ టనను నాటకపద్ధతిలో కల్పన కావించినాడు. మరియు నాయికా చిత్రపటమును స్వయముగా గీసి నాయకుడు దానిని చూచుచు విరహవేదనను చెందుటయు సంస్కృత నాటకములలో తరచుగ కనిపించునట్టిదే !

చతుర్థాశ్వాసమున మంజువాణి శాంబరీమహిమచే అదృశ్యయై వసురాజు భవనమున ప్రవేశించినపుడీ మాటలను వినును.

> "ఏమే హేమలతా యటంచుఁ బని యేమే మాధవీయంచు నీ
> భామామన్మథు చందమెట్లనుచుఁ జెప్పంజాల భూపాలుఁడా
> రామక్షోణికిఁ జన్న నాఁటఁగోలె నిద్రాసౌఖ్యము ల్మాని నాఁ
> డేమో..."

ప.చ. 4-76

వసురాజు ఉద్యానవనమును దర్శించుటకు పోయిన దాఁగా నిద్రా సౌఖ్యము మానినాడను ఆతని విరహవేదనా ప్రసక్తితో కూడిన ఈపద్యములోని చెలుల పరస్పర సంభాషణ మొక నాటకములోని విష్కంభమువలె ఒప్పుచు న్నది.

పంచమాశ్వాసమున ఇంద్రాదులు కోలాహలుని చెంతకు వచ్చుట, వారి సంభాషణలు మొదలగునవి నాటకములోని దృశ్యమువలె నిర్వహించబడినవి. వసుచరిత్రలోని కొన్ని సంభాషణలు, మనుచరిత్రలోవలెనే సహజ సంభాషణలుగా నొప్పుచున్నవి. ఉదాహరణకు ప్రథమాశ్వాసాంతమున మరియు ద్వితీయాశ్వా సారంభమ్మున వసురాజు విదూషకుల సంభాషణ, విదూషక గిరికాసఖుల సంభా షణ, చతుర్థాశ్వాసమున మంజువాణీ వసురాజుల సంభాషణ సంస్కృత నాటక సంభాషణలను స్మరింపజేయునట్టివి.

వసుచరిత్రపై యక్షగానముల ప్రభావముకూడ ఉన్నటుల కనిపించును యక్షగానములు 16వ శతాబ్దినుండి ఆంధ్రదేశమున వెలసి దక్షిణాంధ్ర యుగ మున విరివిగ వ్యాప్తిలోనికి వచ్చి,తెనుగున నాటకములు లేవను కొరతను అపుడు తీర్చినవి. రామరాజభూషణుని నాటికి యక్షగానము లనబడు దేశిసంగీత రూపక ములు వ్యాప్తియందున్నవి. దక్షిణాంధ్రయుగమున "విలాసము" "కళ్యా ణము" "పరిణయ" మను నామములతో అనేక యక్షగానములు బయలుదేరి నవి. అందు నాయికానాయకుల పరస్పర దర్శనము, ప్రథమ సందర్శనము ననే యనురాగోదయ మగుట, తరువాత విరహము, దౌత్యము,చివర వివాహము ఉండును. ఇట్టి కథాసూత్రమున గ్రుచ్చిన యక్షగానముల కథాసరణిలోనే వసుచరిత్ర కథయు నడచినది. యక్షగానమునకు సులభముగా నొదుగునట్టి కథ కలది కావుననే వసుచరిత్రను క్రీ. శ. 1876లో లింగము వేంకటరాయ మంత్రి "వసు గిరికాపరిణయ"మను పేర యక్షగానముగా రచించియున్నాడు మరియు వసుచరిత్రలో రామరాజభూషణుడు చూపిన సంస్కృతదేశి నాటక క్రమపద్ధతులచేత ప్రేరేపించబడియే కాటోలు శ్రీధరవంశ్యుడైన పేరి సూరి యను కవి దీనిని "వసుమంగళ నాటక" మను పేర నాటకముగా రచించి నాడు.

మనుచరిత్రలో చతుర్విధాభినయ వర్ణనలతో, సంభాషణా శైలితో కూడిన నాటకశిల్పమును పెద్దన నిర్వహించి పోషించగా రామరాజభూష

ణుడు అడుగడుగున నాటకపద్ధతు (టెక్నిక్) లను ప్రవేశపెట్టి వసుచరిత్ర నొక నాటకమువలెనే భాసింపజేసినాడు. పెద్దన సంభాషణాశైలిని రామరాజభూష ణుడు కొంతవరకాదర్శముగా తీసికొనినను అతని ప్రబంధమున ముఖ్యముగా గోచరించి యాకర్షించునవి, మనుచరిత్రలోవంటి నాటకశిల్పముగాక, నాటకపద్ధతు (టెక్నిక్) లు. రామరాజభూషణుడు ఒక నాటకమును గ్రహించి, కావ్యముగా రచించినాడా యను అనుమానము కలుగునట్లుగా నాటక పద్ధతులు వసుచరి త్రలో కనిపించుచున్నవి. సంస్కృతమున ప్రదర్శనకు అయోగ్యములైన నాటకములు కలవు. ఉదాహరణకు అనర్ఘరాఘవము. అట్టి కావ్యప్రౌఢిమతో కూడిన నాటకమును రామరాజభూషణుడు రచించినాడా యను భ్రాంతి వసుచరిత్ర పఠనమున కలుగగలదు. పెద్దన మనుచరిత్ర ప్రబంధ కథను పాఠకులచే నాటకమువలె దర్శింపజేయగా, రామరాజభూషణుడు వసుచరిత్ర ప్రబంధకథను పాఠకులకు నాటకమువలె భాసిల్లునట్లుగా నడపినాడు. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములో నాటకీయత పరాకాష్ఠ నందినదని విమర్శకుల అభిప్రాయము. ప్రభావతీప్రద్యుమ్నములో ప్రధానపాత్ర పక్షిరూపమున ఉండుటచే నాటకరీతికి భంగకరముగా నున్నది. ప్రదర్శనకు యోగ్యమైన ఇతివృత్తమును గ్రహించి అనేక నాటకపద్ధతులను చూపుచు రామరాజభూషణుడు పింగళి సూరన నాటక శిల్పమును మించె ననవలయును

ధనంజయాదులు నాటకమునకు నిషేధించిన శాంతరసమంగిగా నుండు టయేగాక అంగరసముల విస్తరణచేత మనుచరిత్రలో రసపోషణ నాటకములో వలె జరుగలేదు. వసుచరిత్ర నాటకోచితమైన శృంగారమంగిగా కలిగి యంగ రసముల నాతిమాత్ర విస్తరణచే ఒప్పుచుండుటచే రసదృష్టితోడను ఒక నాటకమువలెనే యొప్పుచున్నది.

మనుచరిత్రలో తృతీయాశ్వాసమువరకు పెద్దన చూపిన అపూర్వనాటక శిల్పము సమకాలిక సహృదయుల మెప్పును పొందియుండును. మనుచరిత్ర తోని నాటకశిల్పముతో పోటిపడి రామరాజభూషణుడు వసుచరిత్రలో నాటకశిల్ప మునేగాక నాటకపద్ధతులనుకూడ చూపి మించుటకు యత్నించినాడేమో.

# పాండిత్యము

రాజశేఖరుడు కావ్యమీమాంసలో, "ప్రతిభావ్యుత్పత్తి మాంశ్చకవిః కవి రిత్యుచ్యతే" – కవులు ప్రతిభావ్యుత్పత్తి సంపన్నులయిననే కవులగుదు రని చెప్పుచు కవులను మూడు విధములుగా విభజించెను – శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి. వారిలో ఉత్తరోత్తరుడు శ్రేష్ఠుడను శ్యామదేవుని యభిప్రాయ ముతో రాజశేఖరుడు అంగీకరించలేదు (కా. మీ. పుట 43). ఏవిధముగా రాజహంస చంద్రికాపానమును చేయుటకు, చకోరము నీటిని, పాలను వేరుచేయు టకు సమర్థములు కాక తమతమ పనియందు నిష్ణాతములో యట్లే కవులలో నెవ రికి వారే శ్రేష్ఠులని యాతడంగీకరించినను, శాస్త్రకవి తన పాండితీ గరిమచే రస సంపదను విచ్ఛిన్నము కావించుననియు, కావ్యకవి తర్కకర్కశతను స్వోక్తివై చిత్రిచేత శిథిలము కావించుననియు, ఉభయకవి మాత్రము శాస్త్రవిద్య, కావ్య నిర్మాణమునను ఉభయత్ర ప్రవీణుడై శ్రేష్ఠుడగుననియు వచించెను. అట్టి యుభయకవియే విద్వత్కవి యనబడును విద్వాంసుడగు కవియే కవి. కేవల కవులు కవులనబడుదురని చెప్పబడుచున్నది (విద్వత్కవయః కవయః కేవల కవయస్తు కేవలంకపయః). కావున అపారకావ్య సంసారములో ప్రతిభతోపాటు వ్యుత్పత్తిగల కవికే సమ్మానము. కేవల ప్రతిభచేత ఎవరు కవి కాలేరు. ఎంత ప్రతిభావంతుడైనను పాండిత్యము లేనిచో కవి కావ్యనిర్మాణదక్షుడు కాజాలడు. ప్రతి కవియును వివిధ శాస్త్రజ్ఞానము నార్జించవలయును ఆతని శాస్త్రజ్ఞాన ముపై కావ్యనిర్మాణప్రౌఢి యాధారపడియుండును. పూర్వకవులందరును వివిధ శాస్త్రముల నభ్యసించి యభ్యాసవశముచేత కావ్యముల నల్లజాలియుండిరి.

కవి కావ్యనిర్మాణమును కావించవలయునన్న అలంకారశాస్త్రము, వ్యాకర ణము, ఛందస్సు, నాట్యశాస్త్రము, కామశాస్త్రము మొదలగు నియందు తప్పక నిష్ణాతుడై యుండవలయును. శాస్త్రపాండితితోపాటు కవికి సూక్ష్మపరిశీలనా శక్తి, లోకజ్ఞత కూడ ఉండవలయును. కావ్యనిర్మాణమున కివి కనీసపు టవస

శములు. ఇకపై కవి వివిధదర్శనములను, శాస్త్రములను, వేదవేదాంగాది విద్యలనెన్నింటినైన ప్రతిభానుసారముగ నభ్యసించవచ్చును కవి యెంతపండితుడైన అతని కవిత్వమంత యుక్తివైచిత్ర్యములతో నొప్పుట జరుగును.

పెద్దన రామరాజభూషణులు కేవలము కవులేకాదు. వారిరువురకును వివిధ విషయములందు ప్రవేశము కలదు. వారి పాండితీగరిమలకు వారి కావ్యములే ప్రత్యక్షనిదర్శనములు. కవులు సందర్భానుసారముగ తమ వివిధ విషయ జ్ఞానమున ప్రదర్శించుట జరుగును. ఒక్కొక్కమారు తమకేవిషయములందభిరుచి మెండో యా విషయములందు నాయికానాయకాది పాత్రలలో నెవరికైన ప్రవేశమున్నటుల చెప్పుదురు. మరియు కవి భావకల్పనలలో నుపమాద్యలంకార సామగ్రిలో నతనియొక్క శాస్త్రపాండితి, అభిరుచిపాత్రములగు విషయములు వాచ్యవ్యంగ్యరూపమున పాఠకులకు హృద్గోచరములగుచుండును. అట్టి దృష్టితో పెద్దన రామరాజభూషణుల కేయేవిషయపరిచితులు గలవో పరిశీలింతము—

## పెద్దన పాండిత్య పరిశీలనము

### 1. ఆయుర్వేద శాస్త్రము

పెద్దన కాయుర్వేదవిద్యాపరిజ్ఞానము కలదనుటకు మనుచరిత్రలో ప్రత్యక్షనిదర్శనములు కలవు. కథలో ఇందీవరాక్షుడు బ్రహ్మమిత్రుడను ఆచార్యునియొద్ద శాంబరీమహిమచే అదృశ్యుడై యుండి యాయుర్వేదవిద్య నభ్యసించును. ఆ వైద్యశాస్త్రమం దేయే యంగములుండునో పెద్దన ఇట్లెరిగించినాడు—

"కాయ బాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్య దంష్ట్రాజరావృషసంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకము తావు లారగల్గు
వైద్య మెనిమిదినెలల సర్వమును నేర్చి"

"ఇరుమూఁడు రుచుల దోషపు
విరసతమానన్ జగాది వృష్యాంతంబై
పరఁగు చికిత్సయుఁగని......."

మ.చ. 5–15, 16

పెద్దన మూలాతిరిక్తముగ చికిత్సాంగములను పేర్కొనినాడు. కాయ, బాల, గ్రహ, ఊర్ధ్వాంగక, శల్య, దంష్ట్రి, జరా, వృష అను అష్టవిధ చికిత్సా భేదములను ఇందీవరాక్షు డభ్యసించినాడట. పెద్దనకును వీనితో పరిచయ ముండియుండును.

పెద్దనకు రసవిద్యను గురించిన పరిచయముకూడ కలదు చంద్రుని, కాముకులకు మారోత్సాహము నిల్పుటకై పెట్టిన రసగుళికగా నిట్లు పేర్కొని నాఁడు –

"ఆరూఢస్థితి జంద్రికాధవళితా జాండంబులోఁ జంద్రుఁ డో
ప్పారెన్ గాలభిషగ్వరుం డవిరతంబై కాముక శ్రేణికిన్
మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి గుటికా సిద్ధౌషధం బోయనన్...."

మ చ. 3–25

స్త్రీ పురుషులకు విషయేచ్ఛ స్థిరముగా నిల్పుటకై రసౌషధమును ప్రయోగింతురు పాదరసమున మూలికల రసమును పోసి మర్దించి గుళికగా, రససిద్ధిగల సిద్ధులచే సిద్ధము చేయబడును. ఈ రసగుళికను పాలను పానముగా గ్రహింతురు. కావుననే పెద్దన చంద్రుని, కాముకశ్రేణికి మారోత్సాహము నిల్పుటకై పాదరసము మూలికలువేసి చేసిన రసగుళికగా చెప్పి, అది చంద్రికాధవళితాజాండమును పాలకుండతో వేసినట్లుగ నొప్పుచున్నదని రూపకారోపణ కావించినాడు మూలికాదుల రహస్యములను తెలిసినవాడు రససిద్ధుడు లేక ఔషధసిద్ధుఁ డనబడును. సంస్కృత మార్కండేయపురాణమున ప్రవరునింటికి వచ్చినవాడు పండితుడైన బ్రాహ్మణుడని చెప్పబడగా మారన ఆతనిని సిద్ధునిగా మార్చెను. ఔషధ పరిజ్ఞానముగల పెద్దన ఆతనిని ఔషధ

సిద్ధునిగామార్చెను పాదలేపన రహస్యము తెలిసినవాడగుటచే ఆతనిని ఔష ధసిద్ధునిగా పేర్కొనుట ఉచితముగా నున్నది.

శరీరమున గాయమేర్పడినపుడు పథ్యము చేయవలయును. ముఖ్యముగ స్త్రీసంభోగము శక్తిహీనుని చేయును. దానిచే గాయము సెలవేసి మరణము సంభ వించుట కవకాశ ముండును. అట్టి వ్రణచికిత్సా పరిచితి ని పెద్దన ఈ క్రింది పద్యమున చంద్రోపాలంభవ సందర్భమున చూపినాడు——

"త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు
బండికల్లుగ నీ మేను గండిచేసె
నదియు సెలవాఱి తెగటాఱవైతి చంద
యకట! రోహిణియెడ నపథ్యమునఁ జేసి..."

మ.చ. 3-40

విషమును హరించగల ఓషధులచే పాముకాటునకు వైద్యులు చికిత్స చేయుటయు, పాములను పట్టకొనువారు కొన్ని యోషధులయొక్క శక్తిచే విష భయములేక వానిని పట్టుకొనుటయు లోకమున కలదు. పెద్దనకు గల విష విద్యా పరిచయము క్రింది పద్యమువలన స్పష్టమగుచున్నది——

"తమ మనుకాలాహి ప్రపం
చమునెరగొని యోషధీశసద్యః కృతదం
దమున మగుడఁగఁ గ్రక్కెడు
క్రమమున నొయ్యొయ్య విచ్చి కదలకుఁ దొలఁగెన్..."

మ.చ. 5-36

చీకటి నల్లత్రాచు. నల్లత్రాచు కప్పలు మొదలగు వానిని కబళించునట్లు చీకటి భూలోకమును కబళించినది. చంద్రుడోషధులను స్వాధీనమొనర్చు కొనిన విషవైద్యుడు. ఓషధిశక్తిగల వైద్యునిచూచి పాము పట్టిన ఎరను విడిచి పరుగెత్తినట్లు చంద్రుడుదయించగనే చీకటి భూమండలమును విడిచి పరుగె త్తెను. మరియు—ప్రవరు డౌషధసిద్ధునితో మాట్లాడునపుడు ఇట్లనును— —

"మౌనినాథ! కుటుంబ జంబాలపటల
మగ్నమాదృశ గృహమేధి మండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండుగలదె..."

మ.చ. 1–64

సంసార మను బురదలో మునిగియున్న గృహస్థుల నుద్ధరించగల యౌషధ మేదైన గలదా యని ప్రవరునిచే పలికించి పెద్దన తనకు ఔషధములమీద గల అభిమానమును ప్రకటించినాడు.

## 2. సంగీత శాస్త్రము

కర్ణాటక సామ్రాజ్యకాలమున దక్షిణ హిందూదేశమున సంగీతము బాగుగా అభివృద్ధిచె దినది. ఈ కాలముననే దక్షిణ హిందూదేశ సంగీతము నకు కర్ణాటక సంగీత మను పేరు స్థిరపడినది. దేవదాసీలు నృత్యముతోపాటు సంగీతమును చేపట్టుటయేకాక, అంతఃపుర రాజకన్యలును సంగీతమునందు నిష్ణాతలగుచుండిరి. అంతేగాక సామాన్య ప్రజలకును సంగీతమందభిరుచి. కవిపండితులును సంగీతము నభిమానించిరి. పెద్దనకు సంగీతమునందు విశేషాభిమాన మున్నట్లాతని కావ్యమువలన తెలియుచున్నది అట్టి విశేషాభిమానము కలవాడు కావుననే మార్కండేయపురాణమున లేని వరూథిని వీణావాదనను మనోహరముగ వర్ణించియున్నాడు (2–27). వరూథిని వీణ వాయించుచు గీతమును పాడుచున్నటుల పెద్దన పేర్కొనుటచే ఆనాడు వీణమీద గీతముల నాలాపించుచుండిరని తెలియుచున్నది. ఏ వేళ ఏ రాగము నాలాపించవలయునో, ఏ ఋతువున ఏ రాగ మాలాపించబడునో యా జ్ఞానమంతయు పెద్దనకు గలదు.

"వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే లోలాక్షి! దేశాక్షికిన్..."

మ.చ. 3–57

అను పద్యమునుబట్టి ప్రభాతసమయమునకు నాటరాగము పనికిరాదనియు, దేశాక్షి యా వేళలో పాడదగినదనియు తెలియుచున్నది. అంతకుముందు రోజు వరూథిని ప్రవరుని చూచిన సమయమున వీణ వాయించుచుండినది. అది మధ్యాహ్నకాలము. ప్రవరుని చూడగానే క్రిందపెట్టిన వీణను మరల వరూథిని ముట్టుకొనలేదు. అనగా ప్రవరుడు ప్రవేశించునప్పుడామె నాటరాగము నాలాపించుచుండినదన్నమాట. నాటరాగము సంగీతశాస్త్ర ప్రకారము పగటిపూట మూడవజామునకు పరమందు పాడదగిన రాగము. కావున ప్రవరుడు ప్రవేశించిన మధ్యాహ్నవేళకు తగిన రాగము నామె ఆలాపించుచుండెను. ఆ రాగమునకు మేళవించిన వీణ అట్లే యుండిపోయినదని సఖులు వరూథిని మనస్సును వీణపైకి మరల్చి, ప్రవరునివలన కలిగిన విరహదుఃఖమును మరపింతమను ప్రయత్నమున నామెను ప్రభాతవేళకు తగిన దేశాక్షికి వీణను మేళవించుమని యడుగుచుండిరి.

"హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహి బృందార్తిగఁ...."

మ.చ. 6-28

అను పద్యమున హిందోళరాగము వసంతకాలప్రవేశమున పాడదగిన రాగమని చెప్పబడినది "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః" అని సంగీత శాస్త్రము.

సూర్యోదయమున పద్మములు వికసించినవి. రాత్రియంతయు పద్మములందు బందీలై యున్న తుమ్మెదలు ఝుంకారముచేయుచు బయల్వెడలినవి. ఆ తుమ్మెదల ఝుంకారము సంగీతప్రియుడైన పెద్దనకు వీణాగానమై వినిపించినది—

"కరికరిగూటఁ గట్టుఁబడఁగా మొఱవెట్టెడు లీల బాల భా
స్కర కరకాండకందళ ఘట్టన నించుకవాయివడ్డ తా
మర మొఱ వెట్టివెట్టి పలుమాఱును వాకిలిదాఁటి యాఁగుచున్
మొరయవిపంచి మీటుగతి మ్రోసియళుల్ వెడలెం గొలంకులన్..."

మ.చ. 3-60

మరియు —

"అరుణాగ్ర నిబిడవాద్యములలోఁ గనుపట్టు
సమయశాంఖికు చేతి శంఖమనగ...."

మ.చ. 3-54

యాత్రకై వెడలిన సూర్యుని ముందుగల భేరీఝాంకారాదులగు వాద్యముల నడుమ కాలమనెడి శాంఖికుని చేతిలోని శంఖమువలె వేగుజుక్క, సంగీతప్రియుడైన పెద్దనకు కనబడుటలో ఆశ్చర్యము లేదు.

## 3. జ్యోతిషశాస్త్రము

"తేజం బబ్జభవాండ గేహమునకున్ దీపాంకురచ్ఛాయ యై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁజేరంబోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె...."

మ చ. 4-5

అను పద్యమున గ్రహపంచక ముచ్చస్థానగతమైన శ్రేష్ఠమైన సమయము శుభఫలము నొసగునదిగ జోతిషశ్శాస్త్రమున చెప్పబడిన విషయము ననుసరించి యట్టి మహారాజయోగవేళ స్వరోచిజననము జరిగినట్లు పెద్దన చెప్పి తన జ్యోతిశ్శాస్త్ర పరిచితిని తెలిపియున్నాడు.

## 4. శకునశాస్త్రము

పూర్వము రాజులు వేటకుగాని, యుద్ధాదులకుగాని పోవునపుడు తమవెంట శాకునికులను తీసుకొనిపోవుట ఆచారముగా నుండెడిది. మధ్య నేదైన విపరీతము కలిగిన వాని శుభాశుభ ఫలము నెరుంగుటకై యట్లు కావించుచుండిరి. ఆ యాచారము నెరింగినవాడు కావుననే వేటకుపోయిన స్వరోచితోపాటుగా పెద్దన శాకునికుని నొకనిని పంపినాడు. శకునశాస్త్రమందు నమ్మకము, ప్రవేశముకలవాఁడు కావుననే మృగయావినోదమును విరమించి విశ్రాంతి గైకొనుచున్న స్వరోచికి కొన్ని శకునములు కనిపించినట్లుగా పెద్దన వర్ణించినాడు (4 ఆశ్వా. 61). దిక్కులు ఆవిరిచే కప్పబడుట, సూర్యునిచుట్టు పరివేష మేర్పడుట, మాలకాకు లరచుట, నక్క లూళలు పెట్టుట సుడిగాలులు రేగుటచే

ధూళి క్రమ్మి బ్రహ్మాండము బూడిదవర్ణముతో కూడియుండుట మొదలగు శకునములను గూర్చి పెదన ప్రసంగించెను. ఇవి యుద్ధమును సూచించునవి. ఆ యుద్ధమున స్వరోచికి విజయము సంభవించి శుభము కలుగునని అతనికి కలిగిన అవయవస్పందనములు సూచించుచున్నవి. వీని నన్నిటిని పెద్దన ఎరింగినవాడు కావున ప్రబంధమున ప్రవేశపెట్టెను. అదేవిధముగా తిక్కన ఉత్తరగోగ్రహణ సమయమున నిట్టి యుత్పాతములనుగూర్చి ప్రసంగించియున్నాడు (వి.ప.4ఆశ్వా. 86-88). అచటను ఉత్పాతములు యుద్ధము సంభవించునని సూచించునట్టివే.

## 5. అలంకారశాస్త్రము

మూలకథలో పోషించబడని శృంగార, కరుణ, అద్భుత, వీరాది రసములను పెద్దన విభావానుభావ సంచారిభావయుక్తములుగా వర్ణించిపోషించుటయే యాతని యలంకారశాస్త్రపరిచితికి నిదర్శనము. రస, అలంకారముల విషయముల స్వరూపమెరిగి వాని నౌచితీమంతముగ ప్రయోగించు అలంకారశాస్త్ర పరిచయలబ్ధమగు నేర్పును పెద్దన మనుచరిత్రలో ప్రదర్శించినాడు.

## 6. రాజనీతిశాస్త్రము

పెద్దన శ్రీకృష్ణదేవరాయల ఆప్తవర్గములోనివాడు. సన్నిహితుడై మెలిగినవాడు. కావున పెద్దనకు రాజనీతిశాస్త్రముతో పరిచయముండుట కెక్కువగా నవకాశము కలదు. మనుచరిత్రలో పెద్దనకు తెలిసిన రాజనీతినంతటిని ప్రదర్శించు అవకాశము లేకపోయినను ఒకపద్యమున శ్లేషరూపమున రాజుయొక్క చరిత్రను కూర్చినాడు (5ఆశ్వా 32).

## 7. గజశాస్త్రము

పెద్దన గజసంబంధవిషయపరిచితికి మనుచరిత్రలో నిదర్శనములు కలవు.

"మండిగాలిడి దంతశుండాగ్రహతిఁ జించి
జలధరాంభముఁ గరుల్ చల్లులాడ"

మ.చ. 5–44

అని యేనుగులు ఒక కాలును కొద్దిగా మడిచి మరొకకాలును పూర్తిగా ముడిచి నేలపై పుక్కిమొగ్గి తలను మీదికెత్తి నిలిచి స్వభావసహజముగా నీటిని చల్లులాడుకొనుట చెప్పబడినది.

"తొండముల్ సాఁచి యందుగుఁ జిగుళ్లకు నిక్క
కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ"

మ.చ. 2–7

ఏనుగులు చిమ్ములాడుటేకాక తొండములనెత్తి అందుగు చెట్లచిగుళ్ల నందుకొనుటను పెద్దన స్వయముగా చూచిన దృశ్యములు. ఇంతేగాక పెద్దన ఏనుగులకు మదమెక్కినపుడు వాటికిచేయు చికిత్సలును తెలిసినాడు—

"ద్రాగ్విదాహచ్ఛిదా వినిద్రాశుమదవ
దంజనాలాన మూలశయ్యా విధాన
వారణాధోరణా కల్పితోరు శోణ
మృత్తికారాశియోయన మెఱసె సంధ్య"

మ.చ 3–17

మదమెక్కిన ఏనుగునకు విదాహము పుట్టును, ఆ విదాహమును పోగొట్టుటకై యేనుగుయొక్క కట్టుకంబపు మూలభూమిపై యెఱ్ఱమట్టిని పరచుదురు ఆ యెఱ్ఱమట్టిపై ఏనుగు పడుకొనినట్లైన దాని తాపము శాంతించును. ఇది గజశాస్త్ర పరిచయమున్నవారికే తెలియును.

గజములు భద్ర, మంద, మృగ, సంకీర్ణములని నాల్గు జాతులుగా విభజించబడినవి. ఈ నాల్గింటికిని గంభీరవేదిత్వమను గుణముండవచ్చును. చర్మము తెగిపోయినను, నెత్తురు కారుచున్నను, కండలూడిపడుచున్నను తన్ను తాను ఎరుగకుండుట గంభీరవేదిత మనబడునని మనుచరిత్రవ్యాఖ్య (పుట. 683 అట్టి గంభీరవేదిగుణముగల అనగా బాగుగా మదించిన భద్రజాతి యేనుగు

లను మరియు వాని యలంకారములను పెద్దన ఈ క్రింది పద్యమున వర్ణించినాడు—

"పొగడపూవంటి కంపుల మదాంబువులును
 మధువర్ణ దంతశంబములు మెఱయ
శీకరస్వరచారు బృంహితంబులు ఘనాం
 గారక గ్రహకాంతి కన్నులమర
నిలఁ జుట్టువడు తొండములమించు పూర్వాంగ
 మెత్తరంబైన పిఱుం దత్తమిల్లఁ
గజములుత్కటము లైనిటలముల్ బటువులై
 సిబ్బెంపు మొగముల నుబ్బుమీఱ
స్వర్ణకక్ష్యాంకుశ ప్రాసశరధిశార్ఙ్గ
ఖేటకుథ ఘంటికాద్యలం కృతులఁజెలువ
మెసఁగు గంభీరవేది భద్రేభశతము
నల్లునకు నిచ్చె గంధర్వవల్లభుండు."

మ చ. 5-98

ఏనుగుయొక్క మదజలవాసనలు పొగడపూల వాసనలవలె ఉన్నవట తేనెరంగులో ప్రకాశించు దంతములు, అంగారక గ్రహమువలె ఎర్రనైన కన్నులు, భూమిమీద చుట్టు వడు పొడవైన తొండము, అతిశయించు ముందలి దేహముచేత తగ్గియున్న పూర్వకాయము, బలసి గుండ్రముగానున్న చెక్కిళ్లు, పొడలుఁగల ముఖము, నడుమునకు బంగారు పట్టా, అంకుశము, ఈటె, అమ్ములపొది, ధనస్సు, డాలు, వీపుమీద పరచు బొంత (కుథ,, ఘంటలు — అలంకారములుగా గలయట్టి యేనుగులు కృష్ణదేవరాయల చెంత ఎన్నియో యుండియుండును పెద్దన వాని లక్షణములను సూక్ష్మముగా నెరిగినవాడు కావున ఇంత సహజముగా వర్ణించినాడు.

## 8. అశ్వశాస్త్రము

కృష్ణదేవరాయల గజాశ్వ సైన్యము చాల గొప్పది. దానిని పెద్దన ఇట్లు వర్ణించియున్నాడు—

"ఘీంకార హేషా ఘోషోద్భటధాటికా గజఘటాశ్వక్షుణ్ణ
విశ్వంభరా మోఘీభూత భుజంగభోగభర..."

మ.చ 4-20

యుద్ధయాత్రయందు ఘీంకార హేషాధ్వను లొనర్చు ఏనుగుల గుంపు చేత, గుఱ్ఱముల గుంపుచేతను నలిగిపోయిన భూధూళి యెగిరిపోయి భూభారము తగ్గిపోవుటచే భూమిని మోయునట్టి ఆదిశేషుని పడగల బరువును వ్యర్థము చేయుచున్నావాడ! అని కృష్ణదేవరాయలను గూర్చిన సంబోధన. ఈయతిశయోక్త్యలంకారముద్వారా రాయల గజాశ్వసైన్య మెంతటి గొప్పదో తెలియగలదు. మరియు "జితకదనాగత మదనాగసంగమానూప గృహాభోగా" (5 ఆశ్వా. 106) యుద్ధమునందు గెలిచితెచ్చిన ఏనుగుల మదధారలచే రాయలవారి గృహ ప్రాంగణము ఊటనేలగా మారుచున్నదట. రాయల గజాశ్వసంపదను గూర్చిన వర్ణన ఆముక్తమాల్యదలోను కనిపించుచున్నది (3 ఆశ్వా. 42). పెద్దన యుద్ధసమయములందును రాయల వెంటనంటియుండువాడని కృష్ణరాయ విజయమున చెప్పబడియున్నది. కావున పెద్దన రాయలవారికి యశ్వముల యందుగల అభిరుచిని పంచుకొనియుండును.

"అహిమాంశు హయహేష లాలించి చెవివంచి
కెరలివాజులు బయల్ గొరిజత్రవ్వ."

మ.చ. 5-44

అని గుఱ్ఱము లేవిధముగ శత్రురాజుల అశ్వఘోషలను విని రేగి గొరిజలతో భూమిని త్రవ్వునో పెద్దన ప్రత్యక్షముగ పరిశీలించి యున్నవాడు గావున పై పద్యమున నట్టి వర్ణనను సహజముగ కావించినాడు.

పెద్దన కృష్ణరాయలను "ఆవల్గత్తురగ బహువిధారోహ కళారేవంతు" డని స్తుతించినాడు (1 ఆశ్వా. 43). అంతటను దుముకుచు, పరుగెత్తుచున్న గుఱ్ఱములయొక్క బహువిధారోహణ విద్యలందు రేవంతునితో సమానమైనవాడని యర్థము. ఈ రాయల యశ్వారోహణ నైపుణ్యమును ప్రత్యక్షముగా చూచుటయేగాక, పెద్దనకూడ స్వయముగా ఆ విద్యయందు కొంత నైపుణ్యమును సాధించియుండవలెను. లేకపోయిన 4 ఆశ్వా. 115వ వచనమున, స్వరోచి యశ్వారూఢుడై రాక్షసునితో చేసిన యుద్ధమునంత సహజముగా వర్ణించగలిగె

యుండువాడు కాదేమో. స్వరోచి గుఱ్ఱమును వెనుకకు ముందుకు పరుగెత్తిం చుట, అలసిపోయిన గుఱ్ఱమును లాలించుట, గుఱ్ఱమును రాక్షసునిదగ్గరకు -పరు గెత్తించి యాతని గాయపరచి, దూరముగా పరుగెత్తించుట మొదలగు అనేకాశ్వ గతులను పెద్దన సహజముగా కనులకు కట్టునట్లు వర్ణించియున్నాడు. ఈ సంద ర్భమున కవి యొక ఉపమను ప్రయోగించినాడు—. "పార్శ్వంబులం గట్టుకెం బట్టులాఁసరి సమకట్లు తెక్కలుగా యాతుధానుండను కొండచిలువ నొడియనేల పఱపుగా నాడు గరుడుండనం" (4 ఆశ్వా 115) అని కవి గుఱ్ఱము నెక్కిన స్వరోచిని గరుడునితోడను, రాక్షసుని కొండచిలువతోడను పోల్చి చెప్పెను. అదే చతుర్థాశ్వాసము చివర కృతిపతివర్ణనలో నిట్టి యుపమనే యొకదానిని పెద్దన కృష్ణదేవరాయలు, గజపతి విషయమున ప్రయోగించినాడు—

"గజపత్యహి హరణతార్క్ష్య .." మ.చ. 4-121

అనగా గజపతియనెడు సర్పమును పట్టుకొనుటయందు గరుడుడైనవాడా! అని యర్థము. గజపతి, కృష్ణరాయలకు జరిగిన యుద్ధమునే పెద్దనమనమును నిడు కొని స్వరోచి రాక్షసులయుద్ధమును వర్ణించెనేమో యని పై యుపమానముల సామ్యమునుబట్టి యనుమానించుటకు వీలగుచున్నది,

గుఱ్ఱముల నెట్లలంకరించుచుండిరో పెద్దన ఈ క్రింది పద్యమున వర్ణించి నాడు—

"పచ్చని హురుముంజి పనివాగెపక్కెర
పారసిపల్లంబు పట్టమయము
రాణనొప్పారు పైతాణంబు సింగిణి
తళుకు లకోరీల తరకసంబు
మిహిపసిండి పరుంజు మొహదా కెలంకున
తావుగుజ్జరిసేత కేవడంబు
డాకెలంకున సిరాజీ కరాచురకత్తి
కుఱుఁగటఁ గ్రొవ్వాడి గొంకలపొది

పీలికుంచె తలాటంబుఁ బేరొజంబు
మణుల మొగముట్టు వన్నె సాహిణి యొకండు
కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవంబైన యొక మహా సైంధవంబు." మ.చ. 4-28

హురుముంజి యనగా పారసీకదేశమందలి అర్మజ్ అను ప్రాంతమున తయారగు ప్రసిద్ధికెక్కిన రత్నాల తాపటపు పనిగల కళ్లెము మరియు " పక్కెర (జీనుక్రిందపరచు కవచము) వేయబడినవి పట్టుతో నిర్మించిన పారసీకదేశపు జీనును వేసిరి. గుఱ్ఱమునకు ఒకప్రక్కన పైఠాన్ ప్రదేశమందు చేసిన శృంగ ధనుస్సును, పదసుపెట్టగా మెరయు బాణములుగల అమ్ముల పొదిని, బంగారుపిడి గల అడ్డకత్తిని దాని ప్రక్కన గుజరాతుదేశపు పనితనముగల కత్తిని పెట్టిరి. మరొకవైపు అనగా ఎడమప్రక్క సిరాజీదేశపు ఖడ్గము[1], దాని ప్రక్కన అమ్ముల పొదిని తగిలించిరి. ఇక గుఱ్ఱము తలపై పికిలిపిట్టల ఎఱ్ఱని యీకలతో చేసిన తురాయిని పెట్టిరి. గరుడపచ్చలు తాపిన ముఖపట్టమును కట్టిరి దేశవిశేషములతో పాటుగా నాయాయలంకారములను, ఆయుధవిశేషములను పెద్దన క్రమముగా చెప్పుకొనిపోవుట అతని యశ్వసంబంధి పరిజ్ఞానమునకు తార్కాణము. ఈ వర్ణనను కృష్ణదేవరాయల అశ్వాలంకరణను దృష్టిలో నుంచుకొని పెద్దన కావించి యుండును.

ఉత్తమాశ్వముల రంగు, నడకల నెరిగిన పెద్దన వాని నిట్లు వర్ణించినాడు.

"ఉర్విజానికి మామయిచ్చె శిఖిపింఛోద్భాసి వర్ణంబుచే
సర్వాచీన ఘనాళి రోహిత సహస్రాకీర్ణగా మింటఁ బూ
షార్వస్తోమముఁ జిత్రయానముల నూటాడించు గాంధర్వ గం
ధర్వవ్యూహము దీప్తిచండ మణికాండ స్వర్ణసన్నాహమున్"

మ.చ. 5-99

నెమలిపింఛోద్భాసి యనగా ఆకుపచ్చ, నీలవర్ణముల మేలుకలయికగల వర్ణముకలవి. మరియు అవి యనేక ఇంద్రధనుస్సుతో కూడిన తొలకరి మబ్బువలె ప్రకాశించు చున్నవట. వాని నడకలు సూర్యాశ్వముల వింతనడకలనే తిరస్కరించుచున్న ట్టివి ఉత్తమాశ్వమునకు చెప్పబడు లక్షణములను పెద్దన వాటికి చెప్పినాడు.

---

1. ఇట "సిరాజీ" యనగా మనుచరిత్రవ్యాఖ్యానములో శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారిచినట్లుగ (పుట 423) సిరియాదేశముగాక ఇరాన్ దేశములోగల సిరాజ్ అను నగరమై యుండును ఈ నగరము సైతము కత్తు లకు ప్రసిద్ధిచెందినట్టిది. సిరాజీని షిరాజ్‌గానే ప్రతాపరెడ్డిగారు గుర్తించి యున్నారు. (ఆం. సాం చ పుట 239

ఇట్టి యుత్తమాశ్వలక్షణమునకు సంబంధించిన శాస్త్రపరిచయము మాత్రము కాక ప్రత్యక్ష పరిచయము కూడ పెద్దన కుండియుండును.

పెద్దన మనుచరిత్ర 4 ఆశ్వా. 116 వచమున గుఱ్ఱమునకు తుక్ఖార మనియు, తేజికాశ్వమనియు పర్యాయపదములను వాడియున్నాడు. తుక్ఖారశబ్ద మును పెద్దనకన్న పూర్వమును కవులు ప్రయోగించియుండిరి[1] ఇది యన్య దేశ్యపదముగా పేర్కొనబడుచున్నది. ఈ పదము సంస్కృత నిఘంటువు లందు లేదు. తుక్ఖారదేశము (దీనికి సంస్కృతమున తుషారదేశమని పేరు. ఈ ప్రాంత మిప్పుడు రష్యాలో కలదు.) నుండి యా కాలమున ఆంధదేశము నకు గుఱ్ఱములు దిగుమతి యగుచు-డినందున ఈ పేరు గుఱ్ఱమునకు తెలుగు భాషలో రూఢ్యర్థమున స్థిరపడియుండును. తేజికాశ్వమన ఉత్తమాశ్వ మను అర్థము చెప్పబడుచున్నది. తేజిక అనగా నట దేశ విశేషమైయుండును. అనగా తరుక్ అను దేశప్రాంతమై యుండును. ఇదియును నిప్పుడు రష్యాలో కలదు. "తేజి"పదము అశ్వమను అర్థమున తెలుగులో ప్రయోగించబడుట కలదు. తేజికాశ్వ మనునపుడు పునరుక్తిదోషము కలుగును. కావున తేజిక అనగా దేశవిశేషముగా గ్రహించి యా దేశమునుండికొని రాబడిన ఉత్తమాశ్వమను అర్థమును చెప్పుకొనవలయును. ఈరెండు ప్రాంతములును మధ్యఏషియాకు చెందిన రష్యాలో గల ప్రాంతములు. మధ్య ఏషియా గుఱ్ఱములకు ప్రసిద్ధిచెందినట్టిది. కావున తెలుగున ఆ దేశవిశేష ములనుబట్టి అశ్వమున కా నామము లేర్పడియుండును. తుక్ఖార, తరుక్ ప్రాంతములనుండి దిగుమతియగు గుఱ్ఱములు విశేషముగా నుత్తమజాతికి చెంది నవై యుండుటచే అది యెరిగిన పెద్దన తుక్ఖార, తేజికాశ్వాది పదములను ప్రయోగించియుండును

## 9. వ్యాయామ పరిచయము

మనుచరిత్ర కృతిపతి కృష్ణదేవరాయలు వ్యాయామప్రియుడు రాయ లనుగూర్చి పెద్దన "వ్యాయామ స్థిరసంధిబంధ" (6 ఆశ్వా. 124) అని స్తుతించి

1. "సైన్యనాసీర తుక్ఖా శఫపుటోత్థ-" దా ఖం.1-34

యున్నాడు. అనగా వ్యాయామముచేత గట్టిపడిన కీళ్లయొక్క కూర్పు కలవా డని యర్థము. ఈ విషయము చారిత్రక సత్యమైనది. ''ఫర్‌గాటెన్ ఎంపైర్" లో చెప్పబడినట్లుగ పేరరాజుగారు రాయల వ్యాయామమునుగూర్చి యిట్లు పేర్కొన్నారు—"కృష్ణదేవరాయ లనుదినము ప్రొద్దు పుట్టక మున్నె పడకనుండి లేచి రమారమి సోలెడు (Three-quarter pint) నూవులనూనె త్రావి, దానితో దేహమంతయు రాచుకొనును. అంత నాతడు మొలకొక చిన్నబట్ట గట్టుకొని బరువుగల లోడీలను త్రిప్పును. ఆమీద దా (త్రాగిన నూనెయంతయు స్వేద రూపమున వెలికివచ్చువరకు) గత్తిసాము చేయును. ఆవల నొక మల్లశ్రేష్ఠ నితో మల్లయుద్ధ మొనర్చును. పిమ్మట నాతడొక గుఱ్ఱము నెక్కి విశాలప్రదే శమునకేగి యొకవైపునుండి మఱియొకవైపునకు తెల్లవాఱుదనుక స్వారి చేయు" వాడట[1]. అంతేగాక పెద్దన స్వయముగా 'బలశాలియు, శూరుడును, ఖడ్గధా రణ నిపుణుడునై యుండెననుట కాతని కాలమునందలి కథలే నిదర్శనము' లని పేరరాజుగారు చెప్పినారు[2].

వ్యాయామపరిచితి కలవాడు కనుకనే పెద్దన స్వరోచి యభ్యసించిన విద్య లనుగూర్చి ప్రసంగించుచు——

"గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగులలయిపో గోతముల్ గ్రుద్దులీలన్
ఖడ్దిన్ జెండాడుమ్రాఁకుల్ కవుఁగిటి కొలందుల్ కత్తినొక్కొక్క
ఘాతం
బ్రోద్దామప్రౌఢి వాతాద్భుత గతిఁబఱచున్ భూమి జవ్వాడఁగా ని
ట్లద్దేవినందనుం డత్యనుపమబలుఁడై యౌవనారంభవేళన్"

మ చ. 4-8

పెద్దన పై పద్యమున వివిధ మల్లసాధనావిధానము లను పేర్కొని నాడు. రాయ లభ్యసించుచుండగా వీనిని పెద్దన ప్రత్యక్షముగా చూచి యుండును. మరియు పెద్దన తన మల్లసాధనపరిచితి నుపయోగించి చంద్రా స్తమయ, సూర్యోదయ వర్ణనను మనోహరముగా నిట్లు చేసియున్నాడు—

---

1. విజయనగర చరిత్రము. పుట. 144.
2. ,, ,, పుట. 160.

"ఉరుసంధ్యాతపశోణ మృత్కలితమై యొప్పారు బ్రహ్మాండ మ
స్గరడిన్ గాలపుహొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చు ని
బ్బరపున్ సంగడమోయనన్ శశిడిగెన్ బ్రాగ్భూ మిభృత్త్రైకతవే
తరబాహాగ్రపు సంగడంబనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్''

మ చ 3-59

గరడిసాలలో మల్లురకు దెబ్బ తగులకుండుటకై యెఱ్ఱమట్టిని పరతురు. ఎఱ్ఱమట్టియే యెందుకనగా నది ప్రతాపసూచకమట! సంగడమనునది సాధన విశేషము. తిరుగటి రాతివలె గుండ్రముగానుండి నడుమ రంధ్రము కలిగి దానిలో పట్టుకొనుట కనువుగా ఇనుపయూచ బిగించబడు రాయి సంగడమన బడును. గరడిసాలలో మల్లురు ఈ సంగడముల నొక భుజమునుండి మరొక భుజమునకు త్రిప్పుచు నిత్యము సాధన చేయుదురు. అట్టి మల్లసాధనా విశేష మున గల పరిచితిని పెద్దన ఇట అలంకారరూపమున ప్రదర్శించియున్నాడు. వరూథిని తనను ప్రవరునకు పరిచయము కావించుకొనుచు ఇట్లనును—

"పద్మసంభవ వైకుంఠభర్గసభలు
సాముగరడీలు మాకు గోత్రామరేంద్ర."

మ.చ. 2-43

ఇట బ్రహ్మవిష్ణు సభలను సాముగరడీలుగా పేర్కొనుటయు పెద్దనకు గల వ్యాయామ ప్రీతిచేతనే.

## 10. సామరిక జ్ఞానము

పెద్దన యుద్ధయాత్రలందును కృష్ణదేవరాయల ననుసరించి యుండినవా డగుటచే సామరికజ్ఞాన మతనికి ప్రత్యక్షదర్శనముచేత కలిగెనని చెప్పవల యును. యుద్ధము నీ కవి వర్ణించినంత సహజముగా తెలుగు సాహిత్యమున మరి యే కవియు వర్ణించలేదు

"శరసంధానముతోనే కొన్ని యడుగుల్ జౌజవ్వనన్ బాఱి య
ద్ధరణిం గాల్కొని ద్రోణముల్ దివియు దోర్దండంబులం జేదియే

సిరిబోయాల్ దినమంచు నార్చి పరఁగం జిట్టాసలన్ డాయుచున్
గౌరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ ఘోషింప రోషింపుచున్."
మ.చ. 4-111

ఇందు బోయలు శరసంధానము కావించుటను పెద్దన దృష్టిగోచర మగు నట్లు సహజముగ వర్ణించినాడు. 4 ఆశ్వా. 115వ వచనమున స్వరోచికి. రాక్షసునకు జరిగిన యుద్ధవర్ణన కడుసహజమై పెద్దన సామరికజ్ఞానమునకు నిదర్శనముగా నున్నది.

పెద్దన సామరికజ్ఞానము నుపయోగించి యుద్ధవర్ణనను కావించుటయేకాక ఆయా వర్ణనాసందర్భములందును తన సామరికపరిచితిని ప్రదర్శించినాడు. వేకువజామున పొడిచిన వేగుజుక్కను వర్ణించుచు దానిని పెద్దన "శత్రురాజుచేతిలో ఓడిపోయి ఒకానొక రాజు సకుటుంబముగా వలసబోవుచు, తన పరివారము వెనుక రక్షణకై యుంచు సేనాపతితో" పోల్చిచెప్పుట అతని ప్రత్యక్ష సామరికజ్ఞానమును ప్రకటించుచున్నది--

"సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు
తుహినాంశు దుమదారు దొరయనంగ...."
మ.చ 3-54

పై సీసపద్యము చివర వేగుజుక్కను మరియు కవి యిట్లు వర్ణించినాడు--

"ఉదయగిరిపేద గోపురం బుండినిగుడు
సహిత రవిరశ్మిచే బద్ధుఁడగుచుఁ దోడి
బలఁగమైనట్టి చుక్కల వలస త్రోవఁ
జూపనేతెంచెనన వేగుజుక్క పొడిచె."

పర్వత దుర్గమున ఒక ఉన్నతస్థానమున శత్రువుల రాకను గమనించుటకై చారుడు దాగియుండగా శత్రువులా రహస్యమును కనిపెట్టి వానిని బంధించగా ఆ చారుడు తనతోనుండు సేనలు శత్రునాశము కాకుండ వలసపోవుటకై దారిచూపుట కేతెంచినట్లుగ వేగుజుక్కను వర్ణించి పెద్దన తన సామరిక పరిచయము ను ప్రకటించినాడు. ఈ పద్యమున పెద్దన "ఉదయగిరి" అని పేర్కొనుటచే, రాయలవారు క్రీ శ. 1513 ప్రాంతమున ముట్టడించి రాయసము కొండ మరుసయ్య సహాయమున ఉదయగిరి దుర్గమును వశపరచుకొన్న వృత్తాంతమును

దృష్టిలో పెట్టుకొని పై భావకల్పనను చేసినాడేమో ననిపించుచున్నది. మనుచరిత్ర అవతారికలోను కృష్ణదేవరాయల పరాక్రమ విజయములను పెద్దన వర్ణించుచు మొట్టమొదట--

"ఉదయాచలేంద్రంబు మొదలనెన్నని కుమా
రతకుఁ గ్రౌంచాచల రాజమయ్యె...."

మ.చ 1-11

నని పెద్దగాచేసి రాయల మొదటి విజయమునుగూర్చి చెప్పియున్నాడు. గజపతుల అధీనమున ఉన్న ఈ యభేద్యదుర్గము కృష్ణదేవరాయలకు, పదునెనిమిది నెలలు యుద్ధము జరిగిన తరువాత స్వాధీనమైనదగుటచే ఆ విజయము సులభసాధ్యమనుటకు వీలులేనిది[1]. ఆ యుద్ధములోని సంఘటన నొకదానిని పెద్దన వేగుజుక్కవర్ణనలో వ్యంగ్య మొనర్చియుండును. మరొకచోట పెద్దన, శత్రువుల దాడికి నిలువలేక పారిపోయిన రాజుయొక్క అంతఃపురస్త్రీలను శత్రువులు చెర వట్టు విషయమును ఉత్ప్రేక్షాలంకారమున నిట్లు కూర్చెను--

"రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద
నలిగి దాడిగవెంటాడ నిలువ కతఁడు
బెగడువడి పాఱుచోఁ జెఱఁదగిలినట్టి
ఛాయయిది యన నీలలాంఛనము మెఱసె."

మ.చ. 3-26

కృష్ణదేవరాయలు కొండపల్లి దుర్గమును పట్టుకొని కటకేశ్వరుని భార్యాపుత్రులను చెఱవట్టినట్లు చరిత్రాంశము కలదు. పెద్దన దాని నాధారముగ నిట్టి యూహ కావించినాడేమో!

మరియొక పద్యమున పెద్దన తన ధనుర్విద్యాపరిచయము నిట్లు చూపెను.

"వేదండము తొండముసరి
కోదండముఁ దివియునెడమఁ గుడి నిబిడజ్యా

---

1. విజయనగర చరిత్రము. పుట. 180.

నాదము రోదసినిండఁగ
ఖేదించున్ గండశిలలఁ బృథుబాణములన్"

మ.చ. 4-9

ఏనుగుతొండమువంటి ధనుస్సును పట్టి రెండుచేతులతో నారిని లాగగలిగిన, భూమ్యాకాశములు నిండునట్లు నారి మ్రోగగా బాణములచే గండశిలలను చీల్చ గలిగిన ధనుర్విద్యా ప్రవీణులు పెద్దనకాలమున ఉండిరి కాబోలు!

## 11. మృగయా పరిచయము

మనుచరిత్రలో గల మృగయావర్ణనను చదివి ప్రశంసించని పాఠకుడు గాని, విమర్శకుడుగాని లేడనుట సత్యము ఫినవీరన శాకుంతలములోని వేటను పెద్దన అనుకరించినను మనుచరిత్ర వేటవర్ణనలో పెద్దనకుగల ప్రత్యక్షపరిచయము విస్పష్టముగ కనబడుట పాఠకులకు విదితము. పెద్దన వేటవర్ణనను చదివినప్పుడు అతడు కృష్ణదేవరాయలతో పోయిచూచిన వేటను వర్ణించుచున్నాడా యనిపించును కృష్ణదేవరాయలకు వేటయనిన ప్రీతియున్నటు తెలియుచున్నది. "ఒక తడవ కృష్ణరాయలు స్వయముగా ఒక అడవిదున్నను వేటాడి పట్టుకొనివచ్చెను దానిని దేవీనవరాత్రులలో దేవికి బలియివ్వ నేర్పాటుచేసె"నట[1] కృష్ణదేవరాయలను పెద్దన యుద్ధయాత్రలలోవలెనే వేటలోను అనుసరించి పోయియుండును. మనుచరిత్రలోని వ్యాయామప్రసక్తులు, సామరికజ్ఞానము, మృగయావర్ణనలను పరిశీలించిన పెద్దన "బలశాలి, శూరుడు, ఖడ్గధారణ నిపుణుడ"నట[2] సత్యముగానే గోచరించును.

4 ఆశ్వా. 37వ వచనమున వేటకు కొనిపోబడు కుక్కలు, డేగలు మొదలగు వాని వర్ణన కడు సహజముగా నున్నది ఇందలి విషయములు వేటతో పరిచయము లేనివారు చెప్పునట్టివిగా కన్పట్టవు. 4 ఆశా. 28 నండి 37 వరకు గల పద్యగద్యములలో స్వరోచి పరివారముతో, సామగ్రులతో

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 288
2. విజయనగర చరిత్రము. పుట. 160.

వేటకు తరలిపోవుట విస్తరముగ, సహజముగ వర్ణించబడినది. 4 ఆశ్వా. 38 నుండి 59 వరకుగల పద్యగద్యములలో వివిధ జంతువుల, విహంగముల వేటయు అతి సహజముగ నొప్పుచు వేటాడుపద్ధతులతో పెద్దనకుగల ప్రత్యక్షపరిచితిని ప్రకటించుచున్నవి. ఇక 4 ఆశ్వా 60వ వచనమున వేటగాండ్రు వేటాడిన జంతువుల మాంసమును వండుకొను విధము వర్ణించబడినది. ఇదంతయు పెద్దన సూక్ష్మేక్షికతో చూచినట్టిదే. 4 ఆశ్వా. 40 మొదలుకొని 43 వరకుగల పద్యములలో వేటకుక్కల సహాయమున వనవరాహములు వేటాడబడుట వర్ణించబడినది. 4 ఆశ్వా 44వ పద్యమున హరిణము కుక్కలను, బోయవాండ్రను లెక్కచేయక పరుగెత్తుచుండగ స్వరోచి దాని కడ్డముగా గుఱ్ఱమును పరుగెత్తించి తఱిచూచి దాని నాలుగు గొరిజలు ఒక్కమారు తెగునట్లు బాణమువేసి చంపెను. 4 ఆశ్వా. 45వ పద్యమున కడితిని, 46వ పద్యమున పెద్దపులిని, 47లో అడవిపందిని పరాక్రమముతో స్వరోచి చంపుటను పెద్దన వర్ణించినాడు. ఈనాలుగు పద్యములలో స్వరోచివేట, తరువాత 49వ పద్యమున, వివిధ జంతువులను వేటాడిన వేటగాండ్ర నైపుణ్య సాహసములకు మెచ్చి యతడు బహూకరించుట కృష్ణదేవరాయలు వేటాడినతీరులను అప్రయత్నముగ స్ఫురింపజేయుచున్నది. 4 ఆశ్వా. 48లో నొక వేటగాడు వీకతో కారుపోతును పట్టుట, వేటరులందరు పోయి దానిని చెండాడుట వర్ణించబడినది 4 ఆశ్వా. 50వ పద్యములో వేటకుక్కల సహాయమున బెబ్బులి, దున్నపోతు, ఎలుగు, అడవిపంది, తోడేలు మొదలగు జంతువులను వలల సహాయమున సజీవముగా పట్టి స్వరోచికి కానుకగా నిచ్చుట చెప్పబడినది. 4 ఆశ్వా 51, 52వ పద్యములలో వేటకుక్కలు ఉడుములు మొదలగు వానిని పట్టుటకై పుట్టలకడ వాని వాసన కనిపెట్టి తిరుగుట, ఉడుమనుకొని యొక వేటకుక్క పెంజెర అను విషసర్పమును పట్టి ముక్కలు చేయుట వర్ణించబడినది. 4 ఆశ్వా. 53వ పద్యములో జాగిలమొకటి నిజమైన ఉడుమును పట్టుట కలదు. 4 ఆశ్వా. 54వ పద్యములో వేటగాడొకడు ఏదుపంది పోయిన తోవను కనిపెట్టి పోయి దానిని చంపుట, 55లో డేగ వేటకాండ్ర ప్రసక్తి, 56లో చెవులపోతు పైని డేగను విడుచుట, 57లో డేగ సహాయములేకనే యొక బోయ చెమరుకాకిని వేయుట, 58 సీసపద్యమున వివిధ రకములైన డేగల సహాయమున వివిధ పక్షులు వేటాడబడుట, 59లో వేటగాడొకడు డేగసహాయమున కొంగలను పట్టుట వర్ణించబడినది. ఈ సందర్భమున

వేటలో ప్రయోగించబడు శ్యేనభేదములు—వాని వేటల వర్ణనలు పెద్దన మృగయా జ్ఞానమునకు నిదర్శనములు.

మరియు 4 ఆశ్వా. 27వ వచనమున దండెములకు మాంసపుముక్కలను కట్టి యాదండెములకే దారముసహాయముతో డేగలను కట్టివేయుట, ఆకలిగొనిన వేళను తెలిసికొని వేటగాండ్రు డేగలకు మేత పెట్టుట (ఆకలిగొనినను అవి అభిమానముతో తిండి మానునట), డేగల కనులకు గంతలు కట్టుట, ఆ గంతలచే ఏమి కనబడకపోగా ఆకలిగొని పంజరస్థిత శుకశారికాదుల రావములను విని వానిని చంప నుంకించి ఱెక్కలువిప్పి, దారములతో తొండమునకు కట్టబడి యుండుటచే గిరగిర తిరుగుట, వేటకు పోవునపుడు డేగలు మితిమీరి తిని మత్తెక్కి నిద్ర పోకుండుటకై మితముగా ఆహారమును పెట్టుట, మరియు అవి హుషారుగా నుండుటకై వాంతిచేయించుటను పెద్దన ఎంతో సూక్ష్మేక్షికతో పరిశీలించిన వర్ణనలు. అట్లే అదే వచనమున జాగిలముల వర్ణనలు, వేటగాండ్రు కుక్కలను లాలించుట, వానికి శరీరమున క్రిములులేకుండుటకై పసుపునీట స్నానము చేయించుట, వాని సాహసము 31వ పద్యము), వాని పేళ్లు (32 వ పద్యము) ను పెద్దన సహజముగా వర్ణించియున్నాడు. ఈవిధముగా ప్రతి విషయమును స్వయముగా సూక్ష్మేక్షికతో పరిశీలించి పెద్దన వేటను అపూర్వముగా, అప్రతిమానముగా వర్ణించియున్నాడు.

## 12. పురాణపరిచితి

పెద్దన "పురాణాగ మేతిహాస కథార్థ స్మృతియుతు"డని కృష్ణదేవరాయలచేత పొగడబడినాడు. పురాణాగమేతిహాస సంబంధి కథల నెన్నిటినో పెద్దన రాయలకు వినిపించి యుండును. అట్టి కథల నెరిగినవాడు కావుననే మార్కండేయపురాణమున నెచటనోగల కథను ఎన్నుకొనినాడు. మను చరిత్రలో ద్వితీయాశ్వాసమున హిమాలయవర్ణనాసందర్భమున, పంచమాశ్వాసమున మందరగిరి వర్ణనాసందర్భమున, ద్వితీయాశ్వాసమున వరూథిని పుట్టు పూర్వోత్తరములను పేర్కొనునపుడు, తృతీయాశ్వాసమున మన్మథాదుల ఉపాలంభన, దశావతారవర్ణన మొదలగు చోటులందు పెద్దన తన పురాణకథా పరిచితిని ప్రకటించియున్నాడు.

# రామరాజభూషణుని పాండిత్య పరిశీలనము

## 1. సంగీతశాస్త్రము

"నను శ్రీరామ పదారవింద భజనానందున్, జగత్ప్రాణ నం
దన కారుణ్యకటాక్ష లబ్ధ కవితాధారా సుధారాశి సం
జనితైకైకదిన ప్రబంధఘటనా సద్యశ్శ్రుత గ్రంథక
ల్పను సంగీతకళా రహస్యనిధిఁ బిల్వంబంచి పల్కెం గృపన్"

వ.చ. 1–16

అని వసుచరిత్రపీఠికలో రామరాజభూషణుడు తాను సంగీతకళారహస్యములకు నిధియైనవాడనని వాచ్యముగానే పేర్కొనెను. మరియు కావ్యావతారికలో సర్వ కళాకాంతుడు బ్రహ్మ సరస్వతియొక్క సంగీతసాహిత్యములు అను పాలిండ్లపై అలఘు ప్రస్తారములు చేయునని చెప్పుటచే (1–3) రామరాజభూషణుడు తన కావ్యమున సంగీతసాహిత్యవిద్యా యుగళమును వెలయించెదనని సూచించినాడన వచ్చును. వసుచరిత్ర పద్యములందు వెలయు సాహిత్యపు విలువలు పండితు లందరికి సువిదితములే మరియు సంగీతరాగములకు లొంగు పద్యములందలి సంగీతపు విలువలను కూడ పండితులు గుర్తించియున్నారు. సాహిత్యరూప మైన కావ్యమునకు వీణానులాపమును జతచేర్చి యమృతత్వము నాపాదించినాడు కవి. వసుచరిత్రలోని పద్యములు కొన్నిసంవత్సరముల క్రిందటివరకు వీణపై వాయించు సంప్రదాయముండెనట.[1] వసుచరిత్రలోని సీసములు, వృత్తములు కొన్ని, సంగీతముతోపాడుకొను గీతములవలె సాగిపోవుచుండును. ఉదాహరణకు కొన్ని——

"లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికా భంగదోః ప్రసంగ...."

"ఇమ్మెలె మరుహజారమ్మెలై పొదలుండఁ
బూఁజవికలు వేతె పూసెవలదు...."

---

1. రామరాజభూషణుని కృతులు వ్రాతప్రతి పుట 386.

తలిరుఁ బ్రాయమువాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువాని..."

"ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానామయీరవనినద..."

వ చ. 1-126, 141: 3-43; 2-7,

శిష్టకృష్ణమూర్తిగారు తమ వసుచరిత్రవ్యాఖ్యలో వసుచరిత్రలోని యే పద్యము నే రాగమున పాడవలెనో తెలిపిరట కాని యా వ్యాఖ్య అలభ్యము.

క్రీ శ. 13 వ శతాబ్దినాటినుండియే భారతదేశమున సంగీతము రెండు పాయలై యభివృద్ధి చెందినది పర్షియను సంగీతప్రభావముచేత ఉత్తర భారతదేశమున హిందుస్థానీ సంగీతమును పేర స్థిరపడినది. క్రీ. శ. 16వ శతాబ్దినాటికి ప్రత్యేకతను సంపాదించుకొని దక్షిణ హిందూదేశమున మరొక పాయ (కర్ణాటక సామ్రాజ్యము పేర) కర్ణాటక సంగీతముగా స్థిరపడినది. ఈ కర్ణాటకసంగీతము కృష్ణదేవరాయల, రామరాయల కాలమున విక్కలి అభివృద్ధి చెందినది. సంగీతశాస్త్ర గ్రంథములు రచించబడినవి. రామయామాత్యుడు "స్వరమేళ కళానిధి" ని రచించెను. ఇతడు రామరాజు నాశ్రయించినవాడు కావున రామరాజభూషణునికి యాతడు సుపరిచితుడై యుండును. కావ్యాలంకార సంగ్రహమున రామరాజభూషణుడు తన "సంగీత కళారహస్యనిధి" యను బిరుదమును పేర్కొనకపోవుటచే అప్పటి కాతడు సంగీత రహస్యములను గ్రహించలేదని యూహించవచ్చును. తా నాశ్రయించిన రామరాయలు సంగీతాభిమాని యగుటచే రామరాజభూషణుడు రామయామాత్యులవంటి సంగీతనిధుల స్నేహముచేత సంగీత కళారహస్యముల నెరిగి యుండుననుటకు సందేహము లేదు. ఈనాడు వ్యాప్తిలోనున్న వీణ రామరాజభూషణునిచేత నిర్మింపబడినదని వాడుక. ఇది యెంతవరకు నిజమో తెలియకున్నను దానిచేత రామరాజభూషణునకు గల సంగీతపాండిత్య యశస్సు స్పష్టమగుచున్నది.

ఇక వసుచరిత్రలో రామరాజభూషణుని సంగీతపాండిత్యమును తెలుపు పట్టులనేకములు కలవు. అట్టివానిని కొన్నిటి నిట పరిశీలింతము—

వసురాజు విదూషక సహాయుడై కోలాహలపర్వతమును చేరును. అచట వారు "మాధురీధుర్య"మైన గానముచేత ఆకర్షించబడినట్లు వర్ణించి, యాగాన సహాయముననే నాయికానాయక సమాగమమును కవి పొసగించెను.

"....జనవర! వల్లకీరవము సంగతిఁ బాడెదరెవ్వరో వినూ
తనగతి నిమ్మహాద్రిపయిఁ దన్మృదుపంచమ షడ్జశయ్య కొ
య్యన నెలుగిచ్చె వింటె ప్రమదాకుల కోకిల కేకిలోకముల్"

మ.చ. 2-17

రామరాజభూషణుడు వీణాగానముల నెన్నిటినో వినియుండును. వల్లకీరవము సంగతితో పాడు గిరికాగాన మొక వినూతనగతితో కూడినదని సంగీత కళానైపుణి గలవాడగుటచేతనే చెప్పగలిగినాడు.

సంగీతప్రియుడును, పండితుడునైన హర్షదేవుడు తన నాగానంద నాటకమున నాయిక వీణాగానమును వర్ణించిన శ్లోకము లీ ఘట్టమున జ్ఞప్తికి వచ్చును. రామరాజభూషణుడును సంగీతప్రియుడు, సంగీత కళారహస్యనిధి కావున అదేమార్గము నవలంబించి నాయికాపరిచయమును కావించెను. నాయికను వెతుకుచు విదూషకుడు మణిమందిరమును సమీపించి "వీణావాదనప్రౌఢిచేఁ జెలులన్ రంజిలఁజేయు" గిరికను కాంచెను. రామరాజభూషణుడును తన వీణావాదనప్రౌఢిచే సభ్యుల ననేకమార్లు రంజింపజేసియుండును. వీణ వాయించుచున్న గిరికావర్ణన రామరాజభూషణుని వీణాపరిచితికి ముకురమై యొప్పుచున్నది—

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తిఁదగు గుబ్బ
కాయల కపరంజి చాయలొసఁగ
లలితాంగుళీ దళంబులు సమేళములైన
సారెలపై రాగ సంపదలిడఁ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు
గల తాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్త సంవాది స
మస్వరంబులకు గ్రామంబులునుపఁ

ప్రచురతానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతన రీతిఁదనరఁ
జేతనంబుల చేతనభాతి నొనర
వీణవాయించు నొక యలివేణిఁ గంటి"

మ.చ. 2-30

రామరాజభూషణుడు పై పద్యమున వీణా సంబంధి శబ్దముల నెన్నిటినో ప్రయోగించినాడు - వీణ. ప్రసేవకము, గుబ్బకాయలు, సమేళములు, సారెలు రాగము, ప్రాణము, తాళము, అనుగ్రహము, ఆలాపము, ఆత్యక్త, సంవాది, సమస్వరములు, గ్రామములు, తానము, మూర్ఛనలు మొ॥ వి.

రామరాజభూషణుడు గిరికా బాల్యమును వర్ణించుచు, ఆమె తల్లి శుక్తిమతి గిరికకు సంగీతవిద్యను చెప్పించెనని యిట్లు పేర్కొనినాడు--

........వాణిఁదాల్చు సుకవిస్తోమంబు రప్పించి త
ద్ఘనవిద్యా మహిమల్కరామలక ముల్గావించె........

వ చ. 3-32

"......మహామణికూట సమర్పణంబుచేఁ
గిన్నర కోటులన్నిలిపి గేయవిశారదఁ జేసెఁ గూతునుం
గిన్నరమీట వీణఁ బలికింపఁగ గీతములుం ప్రబంధము
ల్వెన్నియఁ బాడఁజెప్ప ననివారిత చాతురి గల్గునట్లుగాన్"

వ.చ. 3-33

ఆ కాలమున ధనవంతులు, రాజులు తమ కుమార్తెలను సంగీత సాహిత్యములందు నిష్ణాతలనుగా చేయు ఆచారము ననుసరించియును, తనకుగల సంగీత సాహిత్య ప్రీతిచేతను కవి యిట్లు చెప్పెనని యూహించవచ్చును.

"వీణావాదన వేళలన్ ఘుమఘుమా విర్భూతి నింపన్" (3 ఆశ్వా. 34) కోలాహలుడు గిరికకు మాణిక్యాయతనంబు నిర్మించియిచ్చెనట. వీణాధ్వని ప్రతిధ్వనించగల ప్రత్యేక సభాభవనము లాకాలమున నిర్మించబడి యుండెనని దీని ద్వారా తెలియుచున్నది. రామరాజు అట్టి సభాభవనమును నిర్మించెనో, లేక రామరాజభూషణుని గృహమున అట్టి గది యుండెనో? తెలియదు.

"పగడపుఁజిట్టలన్ మనికి పట్టుగఁగట్టిన పట్టుజీనువుల్
జిగిబిగి మించుచంచువులఁ జించినచో రసపూరమారఁ జె
న్నగు రసదాడిగుంపులు పురాంతిక సీమల శాలిపాలికా
జగదభినంద్య గానరస సంగతిఁగన్నుల నీరు గన్నతిన్"

వ.చ. 1-114

పట్టుజీనువుల అను పక్షులు చంచువులతో చెఱకుచెట్లను చీల్చగా ఊరు చున్న రసము శాలిపాలికల పాటచేత స్రవించు ఆనంద బాష్పోదయమువలె ఉన్నదని కవి యుత్ప్రేక్ష. సంగీతహృదయుడైన రామరాజభూషణు డీవిధముగా నుత్ప్రేక్షించుట సహజమే!

"అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును నాతిమాత్ర తా
రక పరివర్తనంబు శుభరాగ మిళత్పద పల్లవాంక ము
ద్రికయును పెంపుమీఱ నిజదృష్టులఁ బోలిన సింధుకన్యకా
ప్రకట వివాహగీతికలు పాడిరి పుణ్యపురంధ్రికామణుల్"

వ.చ. 5-71

గిరికావసురాజుల వివాహవేళ పుణ్యపురంధ్రీమణులు సింధుకన్యకా వివాహగీతికలను పాడిరట. సంగీతజ్ఞానము గల కవి, యా గీతికలు నిర్వక్రమై రమ్యమైన నిషాదస్వరలయ యుక్తమైనవి, రాగవిశేషములతో పదము, పల్లవులతో కూడినవని పేర్కొనినాడు. వివాహవేళలందు ధవళము లను పాడుట ఆచారము. దానిని కవి 5 ఆశ్వా. 126వ పద్యమున చెప్పి యున్నాడు.

బృందగానములు, వాద్యబృందములు-వీనినిగూర్చి కూడకవి ప్రసంగించి నాడు——

"ఘనఘోషార్భటియున్ సమీరణముఖాఘాతాహితానాహత
స్వననానా సుషిరావళీ ఘుమఘుమ వ్యాపారముం గిన్నరీ
నినదంబుం గలకంఠికా రససుధా నిష్ఠ్యూతియున్ ఝర్ఝ రౌ
ఘనినాదంబునునందుఁ గ్రందుకొనుచుం గప్పెం గకుప్పాళికన్"

వ.చ. 5-47

మేఘగర్జన- తాళకాది కాంస్యవాద్య ఘోషమనియు,గాలి-వంశాది వాద్యములధ్వని అనియు, కిన్నరపక్షులరావము - కిన్నర యను వాద్యవిశేషనాదమనియు, కోకిలా రావములు - అవ్యక్తమాధుర్యముగల స్త్రీల కంఠనాదము అనియు, నదీప్రవాహ శబ్దము - డమరుల నినదమనియు - పర్వత సహజములగు పక్షిప్రవాహాదుల నినదములను కవి పట్టణమందలి వివిధ వాద్యాదుల ధ్వనులనుగా సమర్థించెను. రామరాజభూషణుడు సంగీత కళానిధియై యాయా వాద్య విశేషములయొక్క ధ్వనుల స్వరూపము నెరిగినవాడు కావున నిట్టి కల్పనను కావించగల్గెను. పై పద్యమున వివిధ వాద్యములతోకూడిన గాత్ర గానము ప్రసంగించబడినది ఇటువంటి వివిధ వాద్యసమ్మేళనము మరొక పద్యమున నిట్లు చెప్పబడినది——

"వైణిక వల్లకీశ్రేణి నిమ్మనమీటె
            గాయకగాంధర్వ గమకరేఖ
గాంధర్వ గమకరేఖఁ బరాహతము చేసె
            వాంశికవంశికా వైభవంబు
వాంశికవంశికా వైభవం బెగనూదెఁ
            దాళికాధర కరతాళగరిమ
కరతాళగరిమంబు కంచుమించుగనొత్తె
            నానద్ధచటుల తూర్యవ్రజంబు

చటులతూర్య వ్రజము నంటఁ జఱచెఁ బరిణ
యాగత దిగంత నృపతి నాగాశ్వరథ ప
దాతి కోలాహలంబు రోదసి నఖండ
మగుచు నాదాత్మక బ్రహ్మ మతిశయిల్ల''

వ.చ. 5-69

ఇందు వీణ, గీతము, వేణువు, తాళము, మృదంగాదుల ధ్వను లొకదానిని మరొకటి మించినదని ఉత్తరోత్తరాధిక్యమును కవి చెప్పెను. నాదాత్మక బ్రహ్మోపాసకుడగు రామరాజభూషణునకు సంగీతము సర్వవ్యాప్తమై గోచరించుటయందతిశయోక్తి లేదు. అట్లే కోలాహల పర్వతముపై కోకిల, మయూర, శుక

ముల మధురస్వరములు వనదేవతా గీతములు, అప్సరస్త్రీల వీణానాదములు, గోరువంకల భాషితములు, తుమ్మెదల కలగానములు— ఇవి అన్నియు కలిసి బృందసంగీతము రీతి యొప్పుచున్నదని (2 ఆశ్వా. 7) కవి యుత్ప్రేక్షించెను.

రామరాజభూషణుడు తన సంగీతజ్ఞానము నాధారముగ కొన్ని చమత్కారకల్పనలను కావించియున్నాడు –

"అరిగాఁబంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళ వై
ఖరిఁబూనన్ బికజాత మాత్మరవ భంగవ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవవ్రత విధుల్దాల్పన్ దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్"

వ.చ. 1-130

"శిశిరస్య వసంతస్యసంధౌ హిందోళరాగకః" అని సంగీతశాస్త్రము. శిశిరవసంతముల సంధికాలమున హిందోళరాగము పాడదగినది. హిందోళ రాగము ఋషభపంచమ స్వరములు లేక ఐదు స్వరములతో కూడిన 'ఔడవ' రాగము. స్త్రీలు వసంత కాలారంభమున 'అరిగాన్' అనగా ఋషభస్వరములేని హిందోళమును పాడుట కారంభించిరి. వసంత కాలారంభమున వచ్చు కోకిలలు తమ పంచమస్వరము భంగమైనదని విచారపడి చిగురుటాకులను మేసి వ్రతమొనర్చినవి. అపుడు స్త్రీలు కోకిలల పంచమస్వరమును గ్రహించి 'సరిగాన్' అనగా ఋషభస్వరముతో కూడిన సరియైన సప్తస్వర సహితమైన సంపూర్ణమగు వసంతరాగము నాలాపించిరి. ఇందు కవి 'అరిగాన్, సరిగాన్' అనుచోట శ్లేషచమత్కృతిని చూపి తన రాగపరిచితిని ప్రదర్శించెను. ఏ సమయములం దేరాగమును ప్రయోగించవలయునో కవి యిట్లు సూచించెను---

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యెగ్గెత్తి యా
రాజీవానన యెడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజకాం
భోజీమేళ విపంచికా రవసుధాపూరంబు తోరంబుగాన్"

వ.చ. 4-52

పెద్దన వరూథిని "యేడ్చెఁ గలస్వనంబుతో" నని మాత్రమే చెప్పి యున్నాడు. సంగీతజ్ఞుడగు రామరాజభూషణుడు గిరికను కాంభోజీరాగములో నేడిపించెను. కాంభోజీరాగము కరుణస్వరాన్వితము. కావున కరుణాత్మక వియోగ శృంగారమునిట వర్ణించుచు గిరిక యా స్వరమున నేడ్చెనని చెప్పుట సమంజసముగా నున్నది. అట్లే వసురాజు గిరికాదుల సమక్షమున ప్రవేశించు నపుడు కవి "నిల్చె నెదుటన్ సారంగరాగ భ్రమన్మద భృంగీరుతివంది మాగధ కథామాధుర్యముం దెల్పగన్" (3-45) అని చెప్పెను. యక్షగానములందు నాయక ప్రవేశసమయమున సారంగ రాగాలాపన గావించుట ఆచారముగా నుండెడిది కాబోలు!

రామరాజభూషణు డాయా సందర్భములందు కొన్ని రాగముల నామము అను పేర్కొనియున్నాడు — హిందోళ, వసంత (1 ఆశ్వా. 30) సారంగ (3 ఆశ్వా. 45) కలహంస, శ్రీరాగము (3 ఆశ్వా. 59) కాంభోజ (4 ఆశ్వా. 52) సింధుకన్యక అనగా సైంధవి 5 ఆశ్వా. 71) మొ॥వి.

"ఉద్ధతరిపు విద్ధతపన
పద్ధతి కరిభవనదవని పటదంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స
మిద్ధగణ రజోవ్రజోద్యదిభమదస్మృతికిన్" వ.చ. 1-89

అను పద్యమున——

"తద్ధితకిట తద్ధితఝణు
తద్ధిరుతుకు తకిటదికిట తకతోంకటతాం
కు త్తఝణ కకుంత ఝణకు
కూంతదిరు తతోంతకూంత తకు తధిగిణతోమ్."

అను మృదంగ 'తత్కార' వాద్యధ్వని 'ఆదితాళ' ప్రధానముగ వ్యక్తమగు చున్నదని సంగీతజ్ఞులగు విమర్శకుల అభిప్రాయము.[1] ఆ పద్యమందలి ద్విత్వధకారము మృదంగ ధ్వన్యాభాసముగా తోడ్పడినది. ఇట్టి వృత్త్యను ప్రాసాద్యలంకారములు పద్యములో మృదంగధ్వనివలె తాళమును సూచిం

1. వసుచరిత్ర – సంగీత సాహిత్యములు. పుట. 22.

చుచు వసుచరిత్రను సంగీతభరితము కావించినవి ఇవి వసుచరిత్రకారుని సంగీతాభిరుచికి తార్కాణములు.

సాహిత్య సమరాంగణ సార్వభౌముడైన కృష్ణదేవరాయలును, నానా కళా పారీణుడైన రామరాయలును వీణావాద్యనిపుణులేయని తెలియుచున్నది. ఈ మర్యాద ననుసరించి దక్షిణదేశమును పాలించిన రఘునాథాదిప్రభువులును సంగీత సాహిత్యములందు పాండిత్యమును సంపాదించి వానిని సమానముగా నాదరించియుండిరి. ఆనాటి కవులు, కవయిత్రులును సంగీత సాహిత్యములను సమానముగా నభ్యసించియుండిరి. కావుననే ఆ కాలమున సంగీతసాహిత్య ప్రధానములగు యక్షగానము లనేకములు రచించబడినవి. ఇట్టి సంగీత సాహిత్య యుగళమునందు పాండిత్యసిరులను ప్రకటించుట కాదియైనవాడు రామరాజభూషణుడే!

## 2. గజశాస్త్రము

పురవర్ణనా సందర్భమున రామరాజభూషణుడు గజముల నిట్లు వర్ణించి యున్నాడు—

"పరబల భంగచంగము లభంగురతుంగ మతంగజంబు ల
ప్పురిఁ బరికీర్ణ కర్ణపుటపూరిత భూరితరానిలాహతిన్
విరియఁగఁ దోల మేఘములు నింగిఁదొలంగి తదంఘ్రిమూలముల్
శరణము నందఁబోలు ననిశంబు పదంబు మదంబు పేరిటన్"

వ.చ 1-101

ఏనుగులకు కర్ణములు, కపోలములు, అక్షులు, కరము, స్తనము, హృదయము, చరణములు-ఈ యష్టస్థానము లందష్టమదములు పుట్టునని గజశాస్త్రము. పాదములందు పుట్టు మదమునకు మేఘమని పేరు. ఈ గజలక్షణపరిచితి నాధారముగ కవి యిట 'ఆకాశమున గల మేఘములు మదజలమను పేరిట గజ పాదముల నాశ్రయించిన'వని యుత్ప్రేక్షించినాడు. అనగా మేఘములను మించిన ఆకారము గలవి యీ పుర గజములని యర్థము.

గజశాస్త్ర పరిచితిగల రామరాజభూషణునికి భద్రగజ లక్షణములు కరతలామలకములు. కావుననే పర్వతగండశిలలకును, గజములకును శ్లేష నిట్లు సమకూర్చినాడు——

"ధాతుపరాగ రక్తిమయును దంతవిభక్తియుఁ జామర ప్రకా
శాతిశయంబు సంకుల మదాంకము నంగదళీ కదంబ సం
భూతియుఁ గర్బురాకృతియుఁ బుష్కరభూతియుబూని భద్రతా
ఖ్యాతి వహించి మించెఁ బృథుగండములచ్చట నద్భుతంబుగాన్"

వ.చ. 5–42

పృథుగండములు భద్రతాఖ్యాతిని వహించెననగా 'శిలలు గండదోషములు లేని శుభలక్షణములుగల గజములుగా మారె'నని చమత్కృతి.

## 3. అశ్వశాస్త్రము

"పరభూభృత్ప్రాప్తి నబ్ధింబడు రవిహరులంబ్రౌఢిఁ బాటింపవెందున్
సరిగాఁ దద్ధిక్కృతుల్ సైచక రవిహరియై చాయకున్ రా నడంచుం
జరణోద్ధద్ధూళిఁ దద్యాసత(దగు హరియున్ సప్తిగాఁ బాదధారా
స్ఫురణంబే వింతయంచుం బురిహరులునగుం బూర్ణధారా సమృద్ధిన్."

వ చ· 1–102

అస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము–అని యశ్వముయొక్క పంచవిధ గతిభేదములు. వీనిని ధారలనియు అందురు. సూర్యుని గుఱ్ఱములు శత్రురాజప్రాప్తివలన భయపడి సముద్రమున చొచ్చును కావున తమతో సమానమైనవానిగా వానిని యధిష్ఠానపురమందలి గుఱ్ఱములు లెక్కించవట విష్ణురూపుడైన సూర్యుడుతానే గుఱ్ఱమై వీనితో పోలికకురాగా పంచవిధ సంపూర్ణధారాసమృద్ధిచేత దానిని పరిహసించునని చెప్పబడినది·హయగ్రీవమూర్తియైనవిష్ణువుయొక్క పాదములందు గంగాజలధార యొక్కటియే కలదు. కాని యధిష్ఠాన పురాశ్వములు పంచధారాన్వితములగుటచే నివి దానిని మించెనని అర్థము పంచధారల నాధారముగా గ్రహించి కవి యిట్టి చమత్కృతిని నిర్వహించగలిగెను·

## 4. యోగశాస్త్రము

"అక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు
రణముచే నియమధారణముచేత..."

వ.చ. 1-8

బ్రహ్మచర్యాది నియమధారణచేత ఇంద్రియములను జయించిన హనుమంతుని భక్తుడు రామరాజభూషణుడు. రామరాజభూషణునకు యోగశాస్త్ర పరిచితి కలదనుటకు వసుచరిత్రలో కొన్ని నిదర్శనములు కలవు—

సాలము యంత్రపీఠము విశాలకవాటిక ఘట్టనంబు దృ
జ్మీలన మైందవామృత సమేత పతాకిక జిహ్వచంద్రికా
జాలము భూతిపూఁత నవచంద్ర శిలాంబువు లశ్రుధారగాఁ
బ్రోలు ప్రశాంతఘోషమయిపూర్ణసమాధిఁ జెలంగె నయ్యెడన్"

వ.చ. 4-64

వసురాజుయొక్క నగరము రాత్రిపూట ప్రశాంతమై సంపూర్ణ సమాధి గతమైనట్లుగా నొప్పుచున్నదని కవి యీ పద్యమున వర్ణించినాడు. నగర ప్రాకారము యంత్రపీఠము, విశాలమైన తలుపులమూత కనుమూత, హిమజలముతోకూడిన పతాకిక చంద్రమండలము వలన స్రవించు అమృతముతో కూడుకొనిన జిహ్వ, చంద్రికాసమూహము భస్మలేపనము, నూతన చంద్రశిలలనుండి స్రవించు జలము లానందబాష్పధారలు- ఈ విధముగా పురిని సమాధిగతుడైన పురుషునిగా నూహించుటనుబట్టి రామరాజభూషణుని యోగశాస్త్రప్రీతియు ప్రకటమగుచున్నది.

మరొక పద్యమున రామరాజభూషణుడు మన్మథుని రసవాదవిద్య తెలిసిన యోగిగా నిట్లు చిత్రించినాడు—

"ప్రసవశరాఖ్యయోగి బహుభంగుల భావనలిచ్చి మర్దనం
బెసగఁగఁ ధాతువేర్చి బలియించి రసంబు నిశాంతమంతయు
న్వసువుగఁజేయ మైజమచి నాతి దశన్మణి భూషలెన్న దా
ప్తసఖులుచేరి పల్కినను బల్కదు చూచియుఁ జూడదెంతయున్"

వ.చ. 3-106

రసయోగులు మూలికలను నూరుట, అభ్రకాదిగైరిక ధాతుయోగముతో పాదరసమును బద్ధముచేసి ప్రతి వస్తువును బంగారమగునట్లుగా చేయుటను కవి పై పద్యమున చెప్పినాడు.

"రేచకాభ్యాస సంసూచకాత్మీయ చా
తురిఁజేసి బాసవాల్దొరలు డిగిరి..."

వ.చ. 5-6

బాసవాల్దొరలనగా మాటలనేయాయుధములుగాగల మునీశ్వరులు. వారు రేచకమునందలి యభ్యాసమును సూచించు చాతుర్యముతో నాకాశమునుండి క్రిందకు దిగిరని చెప్పబడినది. రేచకమనగా--

"హృదయగత ప్రాణుఁడేతెంచు నాసికా
వివరంబువలనను వెలికిద్వాద
శాంగుళపర్యంత మదిరేచకంబగు"

వ.చ. వ్యాఖానము. పుట 506

అని "సీతారామాంజనేయ సంవాదము". ఇట్టి యోగశాస్త్ర లక్షణములు రామరాజభూషణునకు పరిచితములని తెలియుచున్నది.

"మహనీయ యోగసన్నహ సాధకుండనై
యనఘాపగాంబు గాహనము గనుట..."

వ.చ. 5-9

అని కోలాహలుని తపస్సును శ్లేషలో వర్ణించుచు అతడు అష్టాంగ యోగసాధకుడని పేర్కొనెను. పెండ్లికూతురుగా గిరిక నలంకరించు సందర్భమున వజ్రకాంచిక నామెకు ధరింపజేయుటను కవి యిట్లు వర్ణించియున్నాడు--

"అనఘజఘనానుషంగ మష్టాంగయోగ
కలనసివి గాంచెనన వజ్ర కాంచిక లిడి..."

వ.చ. 5-122

వజ్రకాంచిక యష్టాంగయోగముచేత, రమ్యమైన జఘనభాగము నలంకరించగలిగెనని యుత్ప్రేక్ష. వజ్రమున కష్టధార లుండునని రత్నశాస్త్రము. 'యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి' అనునవి యష్టాంగయోగములు. ఇట 'యష్టాంగయోగకలన' అను చోట వజ్రలక్ష

ణమునకు, యోగమార్గమునకును శ్లేష చమత్కృతి. ఈ యష్టాంగయోగము లను హనుమంతుని భక్తుడగు రామరాజభూషణు డభ్యసించియుండునని యూహించవచ్చును.

"మానమథనాయ మదనాయ మధుసఖాయ
మనసిజాయ నమోనమోయనుచు మ్రొక్కినారు"

మరియు—

"కామ! కమలాస్త్రకమలా
కాముకసుత! కామనీయకనిధీ"

అను పద్యములం దొకే యక్షరమును మాటిమాటికి నుచ్చరించు మంత్ర సంప్ర దాయ మెరిగిన కవి గావున 'మ' కార 'క' కారముల నావృత్తి కావించినాడు. "మ" లక్ష్మీబీజము. "క" విష్ణుబీజము. గిరికాకల్యాణసిద్ధికై కవి మకార కకార బీజములుగల మంత్రోచ్చారణను చేయించుట సమంజసము. ఇది యాతని మంత్రశాస్త్ర పరిచితిని ప్రకటించును[1].

## 5. జ్యోతిషశాస్త్రము

రామరాజభూషణునకు నక్షత్రశాస్త్ర పరిచయమున్నట్లు వసుచరిత్రవలన తెలియుచున్నది. నక్షత్రముల చలనములు, నవరత్నముల కధిదేవతలైన నవ గ్రహములు, సూర్యు డాయారాశులందు ప్రవేశించునపుడు కలుగు మార్పులు ఈ విద్య అంతయు రామరాజభూషణునకు సుపరిచితము.

"అలఘుతర గ్రహాంశు గుణితా గణితాబ్ధి సుతాగ్రరత్న కం
దళరుచిఁ బొల్చుపీఠి వరణంబు గతావరణం బొనర్ప ని
చ్చలు నలకోటకొమ్మ బలుసందుల పొందుల నేఁగఁగాఁ జూమీ
యలవతిచెం బతంగుఁ డసహాయ రథాంగముగా శతాంగమున్."

వ.చ. 1-95

---

1. వసుచరిత్ర కవితా విసంచి. పుటలు 24, 25.

అను పద్యమున కోటకొమ్మలపై పొదగబడిన నవరత్నముల యొక్క కాంతు లాయావర్ణసామ్యముగల నవగ్రహముల కాంతులచేత ద్విగుణీకృతములు కావించ బడుచున్నవని చెప్పినాడు. నవరత్నముల కాయా వర్ణసామ్యముగల నవగ్రహము లధిదేవతలని శాస్త్రము---

"మాణిక్యం తరణేస్సు జాతమమలం ముక్తాఫలం శీతగో
ర్మాహేయస్యతు విద్రుమో మరకతం సౌమ్యస్య గారుత్మతమ్
దేవేజ్యస్యతు పుష్పరాగ మసురామాత్యస్య వజ్రం శనే
ర్నీలం నిర్మలమన్య యోశ్చకథితే గోమేధ వైదూర్యకే"

వ.చ. వ్యాఖ్యానము. పుట. 91

ఈ శాస్త్రము నెరింగిన రామరాజభూషణుడా పరిచయము నిట ఉపయోగించుకొని చమత్కారయుక్తమైన భావకల్పనను చేసినాడు.

సూర్యకిరణములచేత చంద్రుడు వెలుగుచున్నాడు. ఇది యాధునిక శాస్త్రముకూడ చెప్పుచున్నది. ఆ విషయమును కవి యిట శ్లేషలో నిమిడ్చి వసురాజు పరముగను, సూర్యపరముగను ఇట్లు చెప్పినాడు---

"మీఱినరాజు బల్మినడంప లోనైన
నభినవ స్థితిఁబెంప నతడె నేర్చుఁ....

వ.చ. 1-118

తనకన్న పైనున్న చంద్రునియొక్క కాంతినణచుటకును, తనతోకూడిన తరువాత స్వకిరణప్రాప్తిచేత కాంతివంతునిగా చేయుటకును సూర్యుడు సమర్థుడని సూర్యపరమైన అర్థము.

సూర్యుడు కన్యారాశి యందు ప్రవేశించి హస్తానక్షత్రగతుడైన ముసురుపట్టి వానకురియుట ప్రసిద్ధము. ఆ పరిచయము నిట ఉపయోగించి కవి శ్లేషద్వారా వసురాజు కను లశ్రుసిక్తములగుటచే నిరంతరముగా గిరికను చూడవలయు నను కోరిక నెరవేరలేకపోయెనని చమత్కరించెను-

"ఆళి హస్తావలంబనం బడర నడుచు
కన్యఁ దదదీనవృత్తియై కాంచునట్టి

వసుపతి నిరంతరాలోక వైభవంబు
సొగసీదయ్యెఁ గన్నీటి జడి గడంగి"

వ.చ. 3-77

మరొక పద్యమున నీ విషయమునే కవి యిట్లు వర్ణించెను—

"సింహగతి మీఱు వసురాజు చెంత నొక్క-
తోయధరవేణి పాదఁ ల్దుడిచి మెట్లు
వెట్ట నొకకన్య హస్త మర్పింపవచ్చె
సలిల భవనంబునకుఁ బ్రజోత్సవము మెఱయ"

వ.చ. 5-77

సింహరాశి నుండి తొలగనున్న సూర్యకిరణ ప్రసారము నొక మేఘ మడ్డగించెను. కన్యారాశి హస్తానక్షత్రమందు సూర్యుడు ప్రవేశించగానే ప్రజల కామోదము కలుగునట్లుగా వర్షము కురిసెనని భావము.

"........కన్యకా రాజిత హస్తయోగమున రాజకరంబు నతిప్రకాశమై రాజిల........"(6ఆశ్వా 25) అను పద్యమున కన్యారాశి, హస్తానక్షత్రయోగముచే చంద్రకిరణము లతిప్రకాశవంతము లగునని కవి తన జ్యోతిషశాస్త్ర పరిచితిని ప్రకటించియున్నాడు.

బృహస్పతి గిరికావసురాజుల వివాహమునకై మిథునలగ్నము యుక్తమని నిర్ణయించినాడు. దానికి కారణమును కవి యీ విధముగా చెప్పి చమత్కరించినాడు—

అళిఘట మీనకేసరి శరాసన గోమకరంబులం గచం
బులఁ గుచనేత్ర మధ్యముల భ్రూకటి జంఘికలన్ జయించి ని
స్తులత నజాంగనాధిక యశోనిధియైన యవక్రవృత్తికిం
గలికికి నియ్యెడన్మిథున కల్పన యోగ్యమటంచుఁ బల్కెనన్

వ.చ. 5-53

మిథునలగ్నము స్త్రీపురుష యుగ్మమగుటచే వివాహమున కాలగ్నము యోగ్యమని బృహస్పతి నిర్ణయించినాడట. అంతేకాక గిరిక తన శరీరాంగములచే వృశ్చిక, కుంభ, మీన, సింహ, ధనుస్సు, వృషభ, మకర, తుల, మేష,

కర్కాట రాశులను జయించినట్టిది. అట్టి గిరికాదేవికి మిథునలగ్నమే యుక్త మగును. ఇట కవి గిరికా శరీరాంగములు ఆయా రాశులను మించెనని శ్లేష చమత్కృతితో వర్ణించినాడు. ఇందు కర్కాటరాశి వక్రవృత్తి కలదని చెప్పి తన విశిష్టజ్యోతిషశాస్త్ర పరిచితిని ప్రకటించెను.

## 6. రత్నశాస్త్రము

రామరాజభూషణునకు సంగీతము తరువాత రత్నశాస్త్ర మభిమాన విషయముగా గోచరించును. ఆతని రత్నశాస్త్రపరిచితి యపూర్వమైనది రత్న పరీక్ష యాతని కభిరుచిగల విద్య. ఆతడు కావ్యమున అనేకపర్యాయముల రత్నముల ప్రసక్తిని తీసుకొనివచ్చినాడు. రత్న లక్షణములను గ్రహించి భాష చమత్కృతిని సృష్టించినాడు. నాయిక గిరిక రత్నముల పుట్టుకకు స్థానము లగు నదీపర్వతములకు జన్మించిన దగుటయు గమనించదగినది.

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము" (1ఆశ్వా. 19)లను పద్యమున కావ్యములను రత్నములతోడనే పోల్చి కవి తన రత్నప్రీతిని ప్రకటించెను. అంతేగాక రామరాజభూషణుడు—

"వసుచరిత్రాది కావ్యప్రీత బహునృప
ప్రాపితానేక రత్నప్లవుండ..."

హ. నలో. 1-47

నని చెప్పుకొనినాడు. రామరాజభూషణుని రత్నశాస్త్ర పాండితిని, రత్నప్రీతిని తెలుసుకొనియే కాబోలు అనేక ప్రభువులు ఆతని కవిత్వమును ప్రశంసించి రత్నములను బహుమానములుగా నిచ్చినారు. ఇక వసుచరిత్రలో నాతడు ప్రదర్శించిన రత్నశాస్త్రపరిచితిని పరిశీలింతము—

గజయూతగాంగ్రడు సముద్రములందు మునిగి ముత్యములను పట్టితెచ్చుటను రామరాజభూషణుడు ప్రత్యక్షముగ చూచియుండును—

చరమగిరి యను మరకాడు జలధిసరణిఁ
దరణి డించిన నతఁడు తత్సలిలమగ్న

విమలము క్తాఫలంబులు వెలికిఁబొరిపె
ననఁగ నవతారకానికాయంబు లడరె."

వ.చ. 4-15

అస్త్రాద్రి యనెడు మరకాడు (ఓడసరంగు సముద్రమార్గమున, సూర్యు డను ఈతగానిని దింపగా నతడు సముద్రమందలి నిర్మలమౌక్తికములను వెలికి తెచ్చినాడా యనునట్లుగ నక్షత్రములు ఒప్పెను. పెద్దన తనకు పరిచితిగల గజశాస్త్ర సంబంధివిషయమును గ్రహించి భావకల్పన కావించి సూర్యాస్తమయ, నక్షత్రోదయములను వర్ణించగా నిట రామరాజభూషణుడు తన యభిమాన విషయ సంబంధి వృత్తాంతమును గ్రహించి వానిని వర్ణించినాడు.

విజయనగర రాజ్యము రత్నములకు ప్రసిద్ధిచెందినది. అమూల్యరత్నముల వర్తకము విరివిగా సాగుచుండెడిది. ఎగుమతివస్తువులలో వస్త్రములతో పాటు రత్నములు ముఖ్యమైనవి. ముక్కునకు వజ్రపు పుడకఅయినా లేని స్త్రీ లావాడు అరుదట. విజయనగరమున రత్నాల బజారని ప్రత్యేకముగా అంగడి యొకటి యుండెడిదనియు, అట వివిధ రత్నములను రాసులుగా పోసియమ్మెడి వారనియు పయస్ అను ఇటలీదేశయాత్రికుడు వ్రాసెను[1]. ఈ వైభవ మంతయు మనుచరిత్రలో గంధర్వపుర వర్ణనా సందర్భమున ప్రతిబింబించినది (5 ఆశ్వా. 30). ఇతర ప్రబంధములందును ఈ కాలమునాటి సువర్ణరత్న సమృద్ధి ప్రతిబింబించి కన్పట్టుచునే యున్నది. అనాడు జరుగుచుండిన బంగారము, ముత్యముల వ్యాపారమును రామరాజభూషణుడు వసుచరిత్రలో ప్రసంగించియున్నాడు——

"మరునకుఁ జైత్రమంత్రి వనమండలరాజ్య ఫలైకకాంచ నో
త్కరము కరంబొసంగుటయుఁ దావులబచ్చులుచేరి తచ్ఛదా
వరణముఁ బాయవిప్పి పరువంబుగ నెన్నిక కెక్కఁజేయుచున్
దొరయఁగ నీవుగంటె చెలి! ధూర్తవతంస మలీమసాళులన్"

వ.చ. 3-136

1. విజయనగర చరిత్రము. పుటలు. 196, 197.

మన్మథుడనెడి రాజునకు వసంతుడనెడి మంత్రి సంపెంగపూలు అను కాంచనోత్కరమును కానుకగా నొసంగెను. వాయువులనెడి బచ్చులు అనగా నాణెములుగట్టు సరాబులు మల్లెలువిప్పి కాంచనముయొక్క బాగోగులను పరిశీలించుచు తుమ్మెదలు అను దుష్టులను దరిచేరనిచ్చుటలేదు. సంపెంగలను తుమ్మెదలు చేరకపోవుట కవి సమయము. దానిని గ్రహించి కవి యిట ఈ విధముగా చమత్కారకల్పన కావించినాడు. రామరాజభూషణుడును పై బచ్చుల వలె రామరాయలకై రత్నములను పరిశీలించినాడేమో!

విజయనగరకాలమున వర్తకము ద్వీపాంతరములతో సమృద్ధిగా సాగుచుండెడిది. పటలాంశుకము లా కాలమున దిగుమతి యయ్యెడివట[1]. విరివిగా లభించు ముత్యములకు మారుగా నీ పటలములనిచ్చు వస్తుమార్పిడి వ్యాపార మానాడు జరిగెడిదేమో! రామరాజభూషణుడు దాని నీ పద్యమున ప్రతిబింబింప జేసినాడు——

''నునుఁగ్రపం పుటనంటివిప్పు వొరయన్జో కెక్కి మాధ్వీమహా
వనధిం బుప్పొడిదీవికిన్ మధుకరవ్యాపారు లేతేరఁ ద
ద్ఘన కర్పూరపటంబు లందుకొని వేడ్కం గోరకవ్యూహ మో
హన ముక్తావళిఁ దార్చెనీ తరగు గాడ్పుబ్జాక్షి వీక్షించితే.''

వ.చ. 3-142

తుమ్మెదలను బేరగాండ్రు దోనెలమీద మకరందరసమను సముద్రమును దాటి పుప్పొడి తిప్పయను ద్వీపమును చేరుకొని, తీసుకొనిపోయిన కర్పూరములనెడి వస్త్రములను ఇచ్చి మొగ్గలనెడి ముత్యములను పొందినారట. ఇక్కడ కవి సముద్ర వ్యాపారమును, వస్తువుల మార్పిడిని సూచించినాడు. ఇట్టి వస్తుమార్పిడిని రామరాజభూషణుడు స్వయముగా వీక్షించియుండును. కావుననే యిట్టి కల్పన కావించగల్గినాడు. ముత్యములు శంఖములందు, వెదురుగడియలందు పుట్టునని రత్నశాస్త్రము. ఈ విషయమును కవి 1 ఆశ్వా. 111 మరియు 2 ఆశ్వా. 5 పద్యములందు పేర్కొనినాడు

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 359.

విజయనగరకాలమున రత్నములు సమృద్ధిగానుండుటచే భవనములకేకాక రథములకును అలంకరించుచుండిరి కాబోలు! వసుచరిత్రకారుడు ఉద్యానవనమునకు పోయినపుడు వసురాజెక్కిన రథము నిట్లు వర్ణించినాడు—

"జతఁగూర్చి తారవజ్రాలఁ బిమ్మిన కమ్మి
 గ్రమ్మిన మణిరథాంగముల గములు
నీలాలదృష్టి పూనిన నక్రముఖములఁ
 దగుపచ్చపని నిగనిగని నొగలు
ముత్యాల బవిరెకెంపుల చట్టము తదంశ
 ధట్టంబుమాడ్కిఁ గెంబట్టు పఱపు
పగడాలకంబాల జిగిమించు పుష్యరా
 గపులోన వైడూర్య ఘంటికలును

దళతళని మానికంబుల కలశమును జ
యాంకకేతనమును గల్గు నరదమొకటి
మనసుతోనన మెలఁగు సాంగ్రామాణికాశ్వ
రత్నములఁ బన్నితెచ్చె సారథి యొకండు."

వ.చ. 1-144

మరకతములు మొసలిచర్మపు వర్ణమున ఉండునని రత్నశాస్త్రము. కావున కవి యిట మరకతములు పొదిగిన మకరవక్త్రమును చెప్పి దానిలో నీలమణులు కన్నులుగా నుంచబడినట్లు వర్ణించినాడు. ముత్యాలుగూర్చిన వలయమునకు కెంపులను తాపడము చేసినారు. కెంపులకాంతి ముత్యముల కాంతిని మించి యెర్ర పట్టుపరుపును పరచినట్లుగా కనిపించుచున్నది. వైదూర్యములు లోహకాంతి కలిగియుండునని రత్నశాస్త్రము. అందుచేత కవి వైదూర్యఘంటికలను రథమునకు కూర్చినాడు. స్వరోచి వేటకై పోవునపుడు ఆతడెక్కుటకు సిద్ధపరచి తెచ్చిన గుఱ్ఱమును పెద్దన వర్ణించియున్నాడు. అందు - పెద్దన గుఱ్ఱమును వివిధాయుధాలంకారములతో కూడినవానిగా సహజముగా వర్ణించియున్నాడు. ఇట రామరాజభూషణుడు రత్నప్రీతిగలవాడగుటచే నానావిధ రత్నమయమైన రథమును కల్పించినాడు.

మనుచరిత్రలో పెద్దన వరూథినీభవనమును "గారుడోత్కీర్ణ" మని మాత్రము పేర్కొనగా విదూషకుడు పోయిచూచిన గిరికా దివ్యమందిరమంతయు నవరత్నమయమని వసుచరిత్రకారు డిట్లు వర్ణించినాడు---

"పగడాల కొణిగల నిగనిగ ల్వజ్రంపు
జగతి[?]క్రేవల నెఱజాజు నింప
నీలజాలక జాలజాలోకము లఖండ
కాలాగరుజ ధూపకాంతిఁ బెనుప
ముత్యాల నవరంగములరంగు నవరంగ
వల్లీవిభూతి ముంగిళ్లనునుప
గారుత్మతద్వార చారుప్రభాపూర
తోరణంబుల హరిత్తులు పొసంగ

భర్మపాంచాలికా పాణి పద్మరాగ
రాజి నీరాజనోపచారముగ వఱలఁ
దరళవైదూర్య వలభికల్ తెరలునెరప
నిరుపమంబైన దివ్య మందిరముఁ గనియె."

వ.చ. 2-23

వజ్రపువేదికలపై పవడాల ముంజూరులు ప్రతిఫలించి జాజుపట్టె లమర్చి నట్లుగా నున్నది. వజ్రముల కాంతి జాజుపట్టెల రంగుగా కూడ నుండును. అది వజ్రప్రశస్తికి తార్కాణము. గవాక్షముల కమర్చిన ఇంద్రనీలమణులు నీల వర్ణము గలవగుటచే అగరుధూప భ్రాంతిని కలిగించుచున్నవి. పచ్చగానున్న గారుత్మతములు తోరణములయొక్క పచ్చనికాంతియని భ్రమింపజేయుచున్నవి. పద్మరాగములు దీపకళికల వలె మెఱయుచున్నవి. వైదూర్యములకు నూలు దిరుగునట్లు మీద తెరబారునట, కాన నవి తెరలపనిని నెరవేర్చుచున్నవని చెప్పి కవి తన రత్నపరిచితిని ప్రకటించెను.

ఇక నవరత్నములయొక్క గుణదోషపరిచితి నుపయోగించి కవి వసురాజు యొక్క నర్మభర్మహర్మ్యరాజము నిట్లు వర్ణించినాడు—

"అత్రాసవృత్తిఁ జెన్నలరి నూతనరాగ
మహిమఁగులెక్కెడు కల్కి మానికములు
నవ సమాగమమునఁ జవులు వక్కాణించి
మించఁజాలు వెలంది మిన్నగములు
మరుని తేజీలవై ఖరిఁ బొల్చి రతులని
రూఢిచూపు నితాంత రుచిరమణులు
ప్రౌఢ పుంభావ సంభావన ల్పచరించి
ప్రబలు వామాలోక రత్నతతులు
గలయ గీలించి చి త్రించి కన్నియలకుఁ
గామ నిగమ రహస్య ప్రకాశనం బొ
నర్పఁ బన్నిన యాత్మీయ నర్మభర్మ
హర్మ్యరాజంబునకు వేడ్క నరిగి యచట"

వ.చ. 6-72

భవనకుడ్యములపై చిత్రించబడి కన్నియలకు, కామశాస్త్రరహస్యములను బోధించు రమణులకును, రత్నములకును శ్లేషమూలకముగా అభేదము చెప్పబడినది. మన కిట రత్నసంబంధి విషయము ప్రస్తుతము కావున దానిని విచారింతము–మాణిక్య ములలో షడ్విధదోషము లుండునని రత్నశాస్త్రము పేర్కొనుచున్నది. ఆ దోష ములలో 'త్రాస' మనునదొకటి. దీనినే కవి మరొక పద్యమున నిట్లు పేర్కొని నాడు–

"నిర్మలామూల్య గుణ రత్ననిధికి నీకు
వనజముఖి త్రాసమిది యేల వదలరాదె"

వ.చ. 6–84

నీవు గుణరత్నములకు నిధివి. త్రాసనామక రత్నదోషమిది యెందు లకు? విడిచిపెట్టరాదా యని భావము. అట్టి త్రాసదోషములేని మానికములను, నూత్నకాంతులను ప్రకటించు ముత్యములను, మరుని తేజీలైన చిలుకలవంటి వర్ణముగల మరకతములను, పురుషరత్నము లనెడి వజ్రములను నర్మభవనమున తాపినారని కవి శ్లేషలో వర్ణించెను.

3 ఆశ్వా. 15వ పద్యమున, ఇంద్రుడు వసురాజున కొసగిన రథమును వర్ణించుచు నానారత్నమయమైన యా రథము, ఆయా రత్నగుణకాంతుల

ననుసరించి వివిధఋతువులందు యథాయోగ్యముగ సౌఖ్యజనక మగునని కవి చమత్కరించెను. అట్లే నవరత్నములకు వాని నిజవర్ణోచితక్రియలనుచెప్పుచు—

"పటు హీరములె చాలుఁ బాలసున్న మొనర్ప
శక్రాశ్మములె చాలు జాదుపూయ...."

వ.చ. 4-71

అని వసురాజు యొక్క హజారమును కవి వర్ణించినాడు. మరియు రత్నములు నిజ గుణోచితముగ గిరికకు నూనె యంటుట, నీళ్లుపోయుట మొదలగు కార్యము లొనర్చుచున్నవని కవి యిట్లు చమత్కరించినాడు—

"కంకణ గోమేధికచ్ఛాయ దొలుదొల్తఁ
దేట నూనియ నిగ్గు నీటు నెరపఁ
దరల వక్షోజ ముక్తాధార బడిబడి
జాళువా బిందెల జాలు పఱుపఁ"

వ.చ. 5-109

గోమేధికములు గోమూత్రచ్ఛాయ గలవని రత్నశాస్త్రము. కాన కవి నూనెతో పోలికను చెప్పినాడు. ముక్తాహారకాంతిని జలధారారూపముగాను, నీరు పోయు స్త్రీయొక్క వక్షోజములను బంగారుబిందెలుగాను కవి పోల్చిచెప్పినాడు.

చెలికత్తియ గిరికాదేవిని పెండ్లికూతురుగా నలంకరించుచు కొప్పులో మరకతమణుల వంటి పచ్చగడ్డి నమర్చినదట—

"నెలఁత తుఱుము మహామహానీల రాశిఁ
బకపక హసింప మరకతశకల కలిత
మృదుల దూర్వాంకురములతోఁ గదియఁజేసెఁ
జకిత సారంగశాబలోచన యొకర్తు"

వ.చ. 5-116

లేడికనులవంటి కనులుగల చెలికత్తె యొకతె గడ్డిపోచలనాకర్షించుగుణము గల మహానీలమణులను పరిహసించునట్లుగా గిరికాదేవియొక్క ఇంద్రనీలమణుల వంటి జుట్టులో మరకతమణులవంటి పచ్చని గడ్డిని తుఱిమినదట. మహానీల ములనగా సింహళదేశపు గనులలో లభించు నీలమణులు. ఈ మహానీలమునకు

గడ్డిపోచల నాకర్షించగల గుణము కలదు. కావున దానికి తృణగ్రాహి యనియు పేరు. నీలమణియొక్క తృణగ్రహణగుణమును గ్రహించి కవి 2ఆశ్వా. 10వ పద్యమునను చమత్కార కల్పన కావించియున్నాడు. మరియు మరకతములు దూర్వాంకురములవలె, రామచిలుక ఱెక్కల వన్నెలోను ఉండునని రత్న శాస్త్రము చెప్పుచున్నది. దూర్వాంకురములవలె పచ్చగా నుండుననుటను గ్రహించి కవి యిట్లు చమత్కరించెను---

"తనుఁగొండయని వచ్చు నునుఱింకఁ గుచము గా
రుడశిలాసర దూర్వలిడి మరల్చె..."

వ.చ. 6-16

అని వసురాజును చూడవచ్చిన స్త్రీ యొకతె, గరుడపచ్చల హారము లేతగఱికవలె నుండును కావున దానిని విసిరివేసి తన్నంటి వెంటవచ్చు బాలకురంగమును మరల్చెనట!

"అనమ్రగతిఁబూను మానంపు సవతు లె
్లైన నీ దివ్యరత్నాను జాత..."

వ.చ. 6-56

రత్నములు తుల్యమానములైన కట్టెల (తూనికపురాళ్ల) ను ఈవలావల నిడి తూచిన, సమానముగానే యుండునుగాని మ్రొగ్గు చూపవను భావమును గ్రహించి కవి గిరికకు బుద్ధులు చెప్పించినాడు.

ముత్యములు ఆణి, సుపాణి, సుతారములని మూడు గుణములు కలిగి యుండునని రత్నశాస్త్ర ప్రమాణము---

"అఱలేని చుక్కతెఱఁగున
మెఱయు సుతారంబు మేలిమిగ వర్తువ యై
మెఱుఁగొందు నాణిఘనమై
నెఱసిరివర్తువ సుపాణి నిర్మలకాంతిన్"

వ.చ. వ్యాఖ్యానము పుట. 480

నక్షత్రములవలె మెఱయుట సుతారంబు, సువర్తులాకారమై యుండుట ఆణి ; పెద్దవై, గుండ్రములై నిర్మలకాంతితో నుండుట సుపాణి. ముత్యముల

యొక్క ఈ గుణములను గ్రహించి కవి వసురాజుచే గిరిక ముక్తాహారము నిట్లు వర్ణింపజేసినాడు—

"వనజముఖీ కుచోపరి నివాస సుఖోన్నతి నున్కిమాని నా
మనికితమార్చ వచ్చితివి మౌక్తికహారమ నీ గుణంబు లే
మని వినుతింతు నట్టిదకదా యవదాత సువృత్తమూర్తు లెం
దును నిజసౌఖ్యభంగము గనుంగొన రార్తులఁ బ్రోచువేళలన్"

వ.చ. 4-102

పరిశుద్ధమైన మంచి వర్తనము గలవారు ఆర్తులను రక్షించుటలో నిజ సౌఖ్యము చెడిపోవుటనుగూడ విచారించరనుచు కవి ముత్యములు స్వచ్ఛమైన వనియు, మంచి వర్తులాకారము గలవనియు శ్లేషద్వారా సూచించినాడు కట్టాణి సుపాణి యను మౌక్తికభేదములను, వాని కాంతి, ఆకారముల ననుసరించి కవి గురుశుక్ర నక్షత్రములతో పోల్చి చెప్పెను—

''క్షోణిబలారికిన్ బలనిషూదన దత్తములైన గొప్ప క
ట్టాణి సుపాణి యొంటు లలరారె నగాత్మజ లక్షణంబు శ
ర్వాణికి శక్రురాణికిని వాణికిఁగాన మంటచు నా ఘన
శ్రోణివిధంబు దెల్ప గురుశుక్రులు వీనులు సేరిరోయనన్ ''

వ.చ. 5-87

మేఘములందు వైదూర్యములు పుట్టునని ప్రసిద్ధి. దాని నాధారముగ కవి యిట్లు చెప్పెను--

"సుత్రాను ప్రియమిత్ర పాణియుగళిన్ శోభిల్లెఁ జిత్ర ప్రభా
పాత్రస్ఫార విదూరజా భరణముల్పర్జన్య రాడ్దత్తముల్
క్షేత్ర శ్రీకరసూత్ర సన్నహన లక్ష్మిందృన్నృపాగామి స
త్క్షేత్ర శ్రీకర సూత్రసన్నహన లక్ష్మివైఖరు ల్దెల్పుచున్ "

వ.చ. 5-92

పర్జన్య రాజైన వరుణుడు వసురాజునకు వైదూర్యఖచితములైన హస్త కంకణముల నిచ్చినాడు. వైదూర్యములు పిల్లికన్నులవలె ప్రకాశించు

చుండును. వానియందు నూలు తిరుగుచున్నటుల కనపించును. హస్తకంక ణములందలి వైదూర్యములలో సూత్రములు తిరుగుట వసురాజు చేయబోవు మంగళసూత్రబంధనమును సూచించుచున్నదని రామరాజభూషణుడా రత్నలక్షణ ములనుబట్టి యుత్ప్రేక్షించియున్నాడు.

## 7. పురాణపరిచితి

రామరాజభూషణుని నానా పురాణ కథాపరిచితిని తెలుపు సందర్భములు వసుచరిత్రలో ననేకములు కలవు. 4 ఆశ్వా. 7, 12, 13, 48, 126 పద్య ములు, మరియు చంద్రాదుల నుపాలంభించు సందర్భములు కవి పురాణపరిచితికి నిదర్శనములై యున్నవి. 5ఆశ్వా. 34వ పద్యము, 6 ఆశ్వా. 69వ పద్యమును కూడ కవి పురాణగాథాపరిచితి కుదాహరణగా చెప్పవచ్చును "పురాణాగమేతి హాస కథార్థస్మృతి యుతుఁడ"ని కృష్ణదేవరాయలచే పొగడ్తలనందిన పెద్దన కావిషయమున రామరాజభూషణు డేమాత్రము తీసిపోడు. మహాభారతమున నేమూ లనో యున్న అప్రసిద్ధమైన కథ నెన్నుకొనుటయే రామరాజభూషణుని పురాణేతి హాస కథాపరిచితికి మంచి నిదర్శనము. 4 ఆశ్వా. 12వ పద్యమున వృత్రా సుర వృత్తాంతమును స్మరించి తన వేదగాథా పరిచితిని ప్రకటించినాడు. మరియు వసురాజు శైలభంజన వృత్తాంతమును రామరాజభూషణుడు - ఇంద్రుని వృత్రాసురవధవలె భాసింపజేసి వసుచరిత్రకు మెరుగులు పెట్టినాడు.

## 8. రామాయణ గాథాప్రీతి

రామరాజభూషణుడు పవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకషుడననియు, జగత్ప్రాణనందనకారుణ్య కటాక్షలబ్ధ కవిత గలవాడననియు శ్రీరామపదారవింద భజనానందుడననియు తననుగూర్చి చెప్పుకొనెను. కవి తన చివరి రచనయైన హరిశ్చంద్రనలోపాఖ్యానమును హను మంతుని యాదేశానుసారము శ్రీరామచంద్రున కంకితముగా నిచ్చి కృతిభర్త వర్ణన చోట రామాయణకథను తారావళిలో (27 పద్యములతో) చెప్పిన రామ భక్తుడు.

రామరాజభూషణుడు ఆలయమును నిర్మించి శ్రీరాముని ప్రతిష్ఠించిన వాడు. తన కుమారులకు, తాను నిర్మించిన యగ్రహారమునకు, తటాకమునకును శ్రీరామనామమునుంచి ధన్యత నందినట్టివాడు. (హ. నలో. 1-14) చివరకు రామనామాంకితుడైన రామరాజును కొలిచి భూషించబడి ధన్యుడైన వాడు. ఆతడు వసురాజును శ్రీరామునిగాను, గిరికను సీతగాను భావించి, వారి వివాహకథను వర్ణించిన భక్తిప్రపూర్ణహృదయుడు.

వసుచరిత్రలో కవి యటనట రామాయణ సంబంధ్యుపమాదులను చెప్పి తన రామాయణప్రీతిని ప్రకటించియున్నాడు.

4 ఆశ్వా. 135వ పద్యమున దశరథుని పుత్రకామేష్టియజ్ఞము స్ఫురింప జేయబడినది. 3 ఆశ్వా. 139వ పద్యమున పిల్లగాలికిని హనుమంతునకును శ్లేష చెప్పబడినది. రామరాజభూషణునకు వాల్మీకిరామాయణముతోడనే కాక అధ్యాత్మ రామాయణముతోడను పరిచయము కలదనుట కుదాహరణము——

"సమయ మృగహృత రవిరఘూత్త మునిసతిఁ బ్ర
భామయఁ దమోనిశాటుండు పఱవకుండ
ననలదామంబులోఁ డాఁచి యమరులిడిన
వంచనాగౌరగాత్రి నావరలె సంధ్య"

వ.చ. 4-7

సాయంకాలమనెడు మాయామృగముచేత తీసుకొనిపోబడిన సూర్యుడనెడు శ్రీరాముని యొక్క ప్రభ (కాంతి) యను సీతను చీకటియను రాక్షసు డెత్తుకొని పోకుండునట్లుగా, అగ్నితేజమునందు దాచిపెట్టి దేవతలు నిలిపిన పసుపుచాయ శరీరముగల మాయాసీతయో యనునట్లుగా సంధ్యారాగ మొప్పెనట. పెద్దన "మృత్తికారాశియో యన మెఱసె సంధ్య"యని సంధ్యను తన గజశాస్త్రపరిచితితో వర్ణించగా "వంచనా గౌరగాత్రి నావరలె సంధ్య" అని రామరాజభూషణుడు తన రామాయణగాథా పరిచితి నుపయోగించి వర్ణించినాడు.

## 9. నాట్యశాస్త్రము

రామరాజభూషణుడు నాటకలక్షణములతో మంచి పరిచయము కలవాడుగా కనిపించును. వసుచరిత్రలో నాతడనేక నాటకరీతులను మెఱపించెను.

అలంకారశాస్త్రరచయిత కావున రామరాజభూషణుడు నాట్యశాస్త్రమును క్షుణ్ణముగా నభ్యసించియే యుండును.

## 10. అలంకారశాస్త్రము

స్వయముగా అలంకారశాస్త్రమును రచించిన రామరాజభూషణుడు అలంకారశాస్త్ర నిపుణుడని వేరుగా చెప్పనవసరములేదు వసుచరిత్రలో కవి ఆయా వర్ణనాసందర్భములందు నాయికానాయక భేదములను,రసస్వరూపమును,సాత్త్విక సంచారీభావములను, దశవిధ మన్మథావస్థలను వాచ్యవ్యంగ్యరూపమున వర్ణించి యున్నాడు. ప్రబంధమున కొన్ని పద్యములు అలంకారశాస్త్ర లక్షణములకు లక్ష్యములుగా రచించిన పద్యములవలెనే యొప్పుచుండును. శ్రీవఝ్ఝలవారు కావ్యాలంకార 'సంగ్రహములోని లక్ష్యపద్యములతో భావసామ్యముగల వసుచరిత్రలోని పద్యముల నెత్తిచూపిరి.[1]

రామరాజభూషణు డనవరతము నవ్యసాహిత్యచింతను కలిగినట్టివాడేమో! అనగా నెల్లప్పుడు నూతనసాహిత్యమార్గమను సృష్టించవలయునను విచారము గలవాడై యుండును. కావుననే మన్మథుడు నవరసభావవైభవమును చూపి నవ్యసాహిత్యచింతను వసురాజులో పుట్టించినాడని వర్ణించినాడు-

"నవ్యసాహిత్యచింత వహింపఁ జేయఁడో
నవరసభావ వైభవముఁజూపి"

వ.చ. 3-97

నవరసమనగా నూతనానురాగ మనెడి స్థాయిభావము యొక్కయు, భావ అనగా నిర్వేదగ్లాని శంకాది వ్యభిచారిభావముల యొక్కయు వైభవమునుచూపి నవ్యసాహిత్య చింత అనగా నూతన సంభోగచింతను వసురాజులో మన్మథుడు కలుగజేసెనట. ఇటను కవి యొక ఆలంకారికుని వలెనే వ్యభిచారాద్యుల వివేచనతో రసచర్చను కావించినాడు.

---

1. వసుచరిత్ర విమర్శనము. పుటలు 68, 99.

సాత్త్వికగుణసార సామాగ్రి సవరింపఁ
డోసుమనోధర్మ మొనరఁదాల్చి
సంకల్పసిద్ధి యొసంగఁడో తగువేళ
నమితప్రతాప సాహాయ్యమొంది"

వ.చ. 3-97

కోదండమును సవరించి మన్మథుఁడు వసురాజుహృదయమున సాత్త్విక గుణసామగ్రిని పొందుపరచినాడు. మరియు వసంతుని సాహాయ్యమున వసురాజు హృదయములో సంకల్పమను మన్మథావస్థను సృష్టించినాడట ఈవిధముగా రామరాజభూషణుడు తన రససంబంధి పదజాలముతో సాత్త్విక వ్యభిచార్యాది భావములను వర్ణించుచు తన ఆలంకారశాస్త్రిపాండితిని ప్రదర్శించును.

నాయికానాయకభేదములను రామరాజభూషణుడు ఆయా సందర్భము లందు వసుచరిత్ర ప్రబంధమున పేర్కొనియున్నాడు. 1 ఆశ్వా. 127వ పద్యమున వసంతర్తు వర్ణనా సందర్భమున 'దక్షిణ సమీరణ వర్ణనలో దక్షిణ నాయకుని స్ఫురింపజేసినాడు. 4 ఆశ్వా. 6వ పద్యమున ధృష్టనాయక లక్షణ ములను వ్యంగ్యరూపమున ప్రకటించెను. అదే పద్యమున ముగ్ధా, ప్రౌఢా, మధ్యానాయికల లక్షణములను వ్యంగ్య మొనర్చినాడు. మరియు ఇందు పద్మ లతను ఖండితయను నాయికా విభేదముగా చిత్రించి చూపినాడు. 4 అశ్వా. 7వ పద్యమున అభిసారిక, వాసకసజ్జిక, ప్రోషితభర్తృక యను నాయికా లక్షణ ములను పేర్కొనెను. 4 ఆశ్వా. 8వ పద్యమున విరహోత్కంఠిత యను నాయికనుగూర్చి చెప్పెను. ''సరసీ మధ్యంబునంతన నీడఁజూచి కంటిఁగంటి నంటు కానిననుచు నంటంబోవ నదియునుందవుల కవలజన నాసన్నుండయ్యె నొల్లండు వల్లభుండేలయని యుసురుసురనుచు నసురుసురై సొక్కు జక్కపరాలి" అనియు, మరియు సంకేతస్థలమునకు వచ్చి "అవ్వేళ నెవ్వరింగానక యరణ్య రోదనంబు నిజంబయ్యెనని నిశ్శబ్దంబుగా నేడ్చుచుం జేయునదిలేక చేష్టలు దక్కి యున్న" (4 ఆశ్వా. 23) అను వచనమున కవి విప్రలబ్ధయను నాయికను వర్ణించెను. కావ్యారంభపద్యమున రామరాజభూషణుడు సీతను స్వాధీనపతిక గాను, శ్రీరాముని అనుకూల నాయకునిగాను చిత్రించియున్నాడు. 1 అశ్వా. 5వ పద్యమున పార్వతిని కలహాంతరిత నాయికగాను, శివుని దక్షిణనాయకుని

గాను చిత్రించెను ఈవిధముగా రామరాజభూషణుడు నాయికానాయకులను వారి లక్షణములను తన ప్రబంధమున వాచ్యవ్యంగ్యమున వర్ణించియున్నాడు.

## 11. కృషిపరిచయము

విజయనగరము రత్నములకేకాక ఉద్యానవనములకు, సస్యసమృద్ధికి ప్రసిద్ధిచెందినట్టిది. విజయనగరముచుట్టు ఏడు ప్రాకారములుండెను. మొదటి ప్రాకారము దాటగాదే వరి మొదలగు ధాన్యములు పండునట్టి పొలములు విస్తరించి యుండెడివి. దాదాపు ప్రతియింటి యావరణలోను తోట ఉండెడిదట. నగరమున బాటలవెంటను ఎత్తైన వృక్షము లుండెడివట. తోటలలో మామిడి, పోక, పనస, జామ, నిమ్మ, నారింజ, తెల్లద్రాక్షలు విరివిగా నుండెడివి. వీనికి నీరు తుంగభద్రనుండి కాలువలు తీసి పారించెడివారట[1]. ఈ యుద్యానవనములు కొంతవరకు మనకు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద వర్ణనలలో ప్రతిబింబించి కనిపించుచున్నవి.

రామరాజభూషణుడు "రామసరోనామ రమణీయముగ దటాకము వినిర్మించి"నట్టివాడు. అగ్రహారమును నిర్మించి రామచంద్ర పురాంకమొనర్చినట్టివాడు. (హ నలో. 1-14). ఒకవేళ ఆ యగ్రహారమున ఆ తటాకముక్రింద రామరాజభూషణునకు సేద్యపుభూములు కూడ ఉండెడివేమో! మొత్తముమీద రామరాజభూషణునకు తోటలపెంపకమందును, వ్యవసాయమునందును అధికమైన ప్రీతి యున్నట్లాతని కొన్ని వర్ణనలనుబట్టి తెలియుచున్నది అట్టి వర్ణనలను కొన్నింటిని పరిశీలింతము——

నాయకుడగు వసురాజును ఉద్యానవన సందర్శనమునకై పంపించుటయే యతనికి తోటలపై గల ప్రీతిని చాటుచున్నది. వేటయనిన ప్రీతిగల పెద్దన స్వారోచిని వేటకు పంపి విస్తరముగ వేటను వర్ణించియున్నాడు. అట్లే యుద్యానవనముల పెంపకములందు ప్రీతిగల రామరాజభూషణుడు తన నాయకుని యుద్యానవన దర్శనమునకై పంపి ఫలపుష్ప వృక్షలతాదులను వర్ణించియున్నాడు. ఇట ఆతడు కావించిన యుద్యానవర్ణన రమ్యము.

---

1. విజయనగర చరిత్రము పుటలు. 197, 198.

కావ్యనాయిక గిరికను వర్ణించుపట్ల కవి యుద్యానవనములను ఉపమానముగా గ్రహించియు తన ఉద్యానవనప్రీతిని ప్రకటించుకొనినాడు గిరిక యౌవనము మన్మథోద్యానమువలె ఉన్నదని రూపకాలంకారమున నిట్లు వర్ణించి యున్నాడు——

"అలికులవేణియారు నవయౌవనమన్ వలరాచతోటలోఁ
బొలుచు నితంబవేదికడఁ బొక్కిలిడిగ్గియచెంత నీలసం
కలితనవాంబు యంత్రమగుఁ గానియెడన్ రసగుంభనంబు సం
ధిలఁ బుటమబ్బునే నడుమనిల్చి ఘన స్తన సూనగుచ్ఛముల్"

వ.చ. 2-40

గిరిక నితంబము ఉద్యానవనములోని వేదికవలె, నాభి బావివలె, నూగారు నీలమణులు చెక్కిన జలయంత్రము (fountain) వలె, కుచములు పూలగుత్తులవలె ఉన్నవట తోటలోనుండు సౌందర్యసామగ్రిని కవి గిరికలో దర్శించినాడు. లతావృక్షములకు ఏతాములద్వారా నీటిని పారించుట ఈ క్రింది పద్యమున చెప్పబడినది——

"శ్రుతికూపామృతము న్వతంసకళి కార్ణోయంత్ర సంక్రాంత దీ
ధితి దండోజ్జ్వల వర్తులాభరణ పాత్రిన్నించి తాటంక క
ల్పిత కుల్యాముఖ హీరసార కిరణోద్భేదంబు పేర న్వెలా
ర్చి తటిద్దేహకు నవ్యపత్ర లతికా శ్రీనించి రాళీజనుల్"

వ.చ. 5-120

గిరిక కర్ణావతంసమైన పూమొగ్గ ఏతపుసిడి, రత్నపు వర్తులాభరణము ఏతపుబాన, ఆ యాభరణముయొక్క కిరణము ఏతపుగడ,చెవులకు పెట్టిన వజ్ర కుండలము కుల్యాముఖము (మోటతొట్టి), సఖులు వజ్రములయొక్క కిరణప్రసారమనెడి మిషచేత శ్రుతికూపమునుండి నీటిని పారించి మెరుపుతీగవంటి గిరిక శరీరమున మకరికా పత్రములనెడు లతాసమృద్ధిని కలుగజేసిరి. సాంగోపాంగముగా రామరాజభూషణుడు ఏతాము, కాలువలు, నీరుపారుట, లతలు పెరుగుటను చక్కగా రూపకాలంకారమున కూర్చినాడు.

లతాదులకు నీరు పారించుటనేకాక చెఱుకుతోటలకు నీరు పారించుటను కూడ కవి యిటు వర్ణించినాడు--

"ఘనశృంగార రసోత్తరంగ రుచిరంగ ద్వేణికిం బాసికం
బున దండంబులు గట్టగట్టి విలసన్ముక్తాక లాపచ్ఛలం
బున దూమేర్పడఁ బెట్టిబోటి గిరిజా భ్రూపుండ్ర సౌభాగ్యము
ద్ధనరం గస్తురిరేఖ దీర్చె నవకుల్యా వైఖరిన్మించఁగన్"
వ.చ. 5-117

శృంగారరసమను జలముచేత కూడిన జడయను నదీప్రవాహమునకు గిరికాసఖులు బాసికమను కట్టను కట్టి ముత్యాలబొట్టు అనెడి తూమేర్పరచి కనుబొమలనెడి చెఱుకునకు కస్తురిరేఖయను కాలువను నిర్మించిరట. ఇట 'పుండ్ర' అనగా ఎరుపుకలసిన నల్లచెఱకు. అట్టిచెఱకునకు మంచినీళ్ళుపారిన తీపి యధికమగునట. ఆ విషయమును రామరాజభూషణు డెరుగును. కావుననే 'రుచిరంగద్వేణి'-యనగా కాంతియనెడు మాధుర్యరుచిచేత కూడిన వేణియని చెప్పినాడు. ఈ విధముగా గిరికా సౌందర్య,అలంకరణ వర్ణనాసందర్భములందు కవి తనకుగల కృషి జ్ఞానమును తదభిరుచిని ప్రకటించియున్నాడు

అధిష్ఠానపుర సమీపమున ప్రవహించు శుక్తిమతీనది నుండి కాలువలుతీసి నీరును ప్రవహింపజేయగా, ఆ నీటితో ముక్కారువరి పండుచుండెననియు, ఆ ధాన్య సమృద్ధిచే పౌరులు యజ్ఞములు చేయగా దేవతలు హవిర్భాగములకై వచ్చుచుండిరని కవి యిట్లు వర్ణించినాడు-

"అమరుం దత్పురిచెంతఁ గాంత కనకాబ్జాలంబ రోలంబ శు
క్తిమతీ వాహిని సారసారణులు తత్కేదారకోదార స
స్యము ముక్కారును బండఁజేయ దివివారల్ వీటి సత్రాన్న భా
గము లాసింపఁగఁ దత్పురాలయ నదీఖ్యాతిన్ విడంబించుచున్"
వ.చ. -110

కవి విజయనగరము చెంత ప్రవహించు తుంగభద్రానదిని, ఆ నదినుండి తీయబడిన కాలువలను, ఆ కాలువలలో ప్రవహించు నీటి బలముచే ముక్కారు వరి

పండుటను, పౌరుల ధాన్యసమృద్ధిని మనసునందుంచుకొనియే యీ పద్యమును రచించియుండును.

తోటలను గురించియే కాక వరిధాన్యమును తూర్పారపట్టి పొల్లును, ధాన్యమును వేరుచేయుటను రామరాజభూషణుడు చంద్రాస్తమయ వర్ణనాసందర్భమున ఇటు వర్ణించినాడు-

"తారాసస్యము పండినన్ గగనకేదారంబునం జంద్రికా
నీరం బారఁగఁ గోసి తద్రుచి ఫలానీకంబు ప్రాతర్మహా
సీరి గ్రామణి తూరుపెత్తెననఁ దోచెం దూర్పునం దెల్పు త
ద్దూర న్యస్తపలాలరాశి క్రియ నిందుండేగె నిస్సారుఁడై"

వ.చ. 4-130

వరి పండిన తరువాత నీటిని ఆరగనిచ్చి ధాన్యమును కోసి తూర్పార పట్టుదురు. ఈ విషయపరిచితి రామరాజభూషణునకు బాగుగా కలదు. కావుననే యిట్లు దానిని రూపకోత్ప్రేక్షలో కూర్చినాడు. ఆకాశమను వరిమడి యందు వెన్నెల యను నీరింకిపోయెను. నక్షత్రకాంతిపుంజమను ధాన్యరాశిని ప్రాతః కాలమను పెద్దకాపు తూర్పుదిక్కునందు తూర్పారబట్టగా నొకచోట చేరిన పొల్లు రాశియో యనునట్లు చంద్రుడు నిస్సారుడై పడమటి కేగెను. 1ఆశ్వా.118వ పద్యమున కవి పునుగు వాసనలు గల వరిధాన్యమును గూర్చియు ప్రసంగించెను.

తరువాత ఫలపుష్ప వృక్షలతాదులకు కావించు వివిధ దోహదక్రియలను కవి అనేక పర్యాయములు వసుచరిత్రలో పేర్కొనినాడు. 1 ఆశ్వా. 157వ పద్యమున దాడిమకు చేయు దోహదక్రియలను, 1 ఆశ్వా. 158, 160, 3 ఆశ్వా. 146, 147 పద్యములం దాయావృక్షములకు చేయు వివిధ దోహద క్రియలను చెప్పెను.

## 12. దేవోత్సవములు

రామరాజభూషణుడు శ్రీరామహనుమంతుల భక్తుడు. ఆతడు స్వయముగా శ్రీరామునికి దేవాలయమును నిర్మించెను. ఆ దేవాలయమునం దాతడు

రథోత్సవములు, తెప్పోత్సవములు నిర్వహించువాడేమో! అవి యీ క్రింది పద్య ములందు ప్రతిబింబించి కన్పట్టుచున్నవి - 1 ఆశ్వా. 153వ పద్యములో పూజా సామాగ్రిని, 1 ఆశ్వా. 132, 3 ఆశ్వా. 185 పద్యములలో రథోత్సవమును 3 ఆశ్వా. 156వ పద్యములో తెప్పోత్సవమును, 3 ఆశ్వా. 170వ పద్యములో ఆవాహనము, అర్ఘ్యపాద్యములు, అభిషేకము, పుష్పోపహారము, చందనచర్చ, ధూపదీప నైవేద్యములు అను షోడశోపచారములతోకూడిన పూజావిధిని కవి స్మరించుటచే వానితో నాతనికి గల పరిచితి నూహించవచ్చును.

## 13. సామరిక జ్ఞానము

రామరాజభూషణునకు పెద్దనకు తెలిసినంత యుద్ధపురీతులు తెలిసినటుల కనిపించదు. కాని యాత డాశ్రయించిన రామరాజు అనేక యుద్ధములను చేసి నాడు. అదియునుగాక తాళికోట యుద్ధపరిచితి రామరాజభూషణునకు కలదు. అట్టి యుద్ధపరిచితితో రామరాజభూషణుడు ఒండు రెండు చోటుల వసుచరిత్రలో కోటలను పట్టుకొను వృత్తాంతమును వర్ణించినాడు.

"కరఘాతంబుల కోర్వలేక హిమసంఘాతంబు శీతక్షమా
ధరదుర్గంబు భజింపఁగా నల జగత్క్రంప ప్రదాస్తోక భీ
కర దోషాయతిశాలిఁ జుట్టుకొని లగ్గల్పట్టి ధట్టింతు నం
చర విందాప్తుఁడు దీచికేఁగెఁ బ్రబలుండై మాని దాక్షిణ్యమున్"

వ చ. 1-131

సూర్యుని తేజస్సు కోర్వలేక హిమసంఘాతము హిమాలయము అను దుర్గము నాశ్రయించి, ప్రజలను బాధించదొడగెను. అట్టి దుర్మార్గుడైన వానిని శిక్షించుటకై సూర్యుడు దాక్షిణ్యమును (దక్షిణదిశను) విడిచి యుత్తరదిశకు హిమాలయదుర్గమువైపు పోయెను. ఆట దుర్మార్గుడై రాజు ప్రజలను బాధించుట, వానిని శిక్షించుటకై పొరుగురాజు ఎత్తివచ్చుట అను విషయము ద్యోతకమగు చున్నది, పరరాజు దండెత్తిరాగా కోటలోనివారు గంజియే యాధారముగా కల వారై నిరాయుధులుగ నుండిరి. అపుడు కోటలో మిత్రద్రోహులెవరో చేతన

సంచలనరూపమున శత్రురాజునకు దుర్గము పైకెత్తివచ్చుట కిదే మంచియదనని సంజ్ఞచేయగా, ఆ రాజు వచ్చి దుర్గమును పట్టుకొనెను. పరరాజుయొక్క విజృంభణమును పరిజనము ఘంటికల మ్రోగించుచు చాటుచున్నారని కవి యీ క్రింది పద్యమున ఇట్లు చమత్కరించెను—

"తరళాధారమతి ప్రవాళశయ గుప్తంబంచు నభ్యంతర
స్మరుఁ డుత్తంభిత కంపలోలపట సంజ్ఞం బిల్వ బాలాపయో
ధర దుర్గంబు గ్రహించె రాజకర మేతజ్జాత సంత్రాస వై
ఖరిఁదెల్పెన్ జఘన స్థలీవరణ జాగ్రద్ఘంటికా ఘోషముల్"

వ.చ, 6–87

ఇందు కవి శ్లేషద్వారా పరరాజు దండెత్తివచ్చి దుర్గమును వశపరచుకొను వృత్తాంతమును గిరికను వసురాజు వశపరచుకొనుటతో నభేద మొనర్చి చెప్పి తన సామరికజ్ఞానమును ప్రకటించెను.

దుర్గవిజయము సాధించబడిన తరువాత తండ్రికా వార్తను విజయియైన కుమారుడు పంపెను. ఆరాజు విజయవార్తను తెచ్చినవానికి స్వర్ణాభిషేకము, వాద్యములతో గూడిన గజోత్సవ మొనరించెను. ఈ విషయమును కవి సమాసోక్త్యలంకారమున నిట్లు చిత్రించినాడు—

"అంచల్లీల హరించెఁ గొంచక యయుక్తౌమక్షమా భోగముల్
పంచాస్త్రుం డని యాకులెత్తఁగని పైపైఁ గాంచన స్నాన మా
డించెన్ మాధవుఁడీ సదాగతిని గంటే కన్నెపున్నాగ మె
క్కించెం గోకిల కాహళుల్మ్రొయ నేగించెన్ వనీవీథులన్"

వ చ. 3–140

రాజు తన కుమారుడు సాధించిన విజయవార్తను కొనివచ్చినవాని నీవిధముగ గౌరవించుటను రామరాజభూషణుడు కనులార చూచియే యిట్లు వర్ణించియుండును.

ఈవిధముగా రామరాజభూషణుడు దుర్గములను సాధించుతీరులను వర్ణించియున్నాడు, కాని ప్రత్యక్షముగా కావ్యమున అతడు యుద్ధవర్ణనను చేయలేదు. పెద్దనకు యుద్ధముతో ప్రత్యక్షపరిచయ మున్నట్లుగా రామరాజభూషణునకు లేదనియే చెప్పవలయును.

## 14. మృగయాపరిచితి

యుద్ధమునకువలెనే వేటతోను రామరాజభూషణునకు పెద్దనకున్నంత పరిచయముగాని, దానిలో నభిరుచిగాని యున్నట్లు కనిపించదు. కాని రామరాజభూషణుడు గిరికాదేవి విరహావర్ణనా సందర్భమున, చంద్రోదయవర్ణనా సందర్భమున తన మృగయాపరిచితిని కొంత ప్రదర్శించియున్నాడు--

3 ఆశ్వా. 111వ పద్యములో మన్మథుడు గిరికాదేవి యౌవనవనమున వేటసామగ్రితో కూడినవాడై వేటాడినట్లు శబ్దశక్తిమూలధ్వనిద్వారా కవి వ్యంగ్య మొనర్చినాడు

4ఆశ్వా. 19వ పద్యములో నేనుగులను ఏవిధముగా వేటగాండ్రు బంధింతురో వసుచరిత్రకారుడు చక్కగా నిట్లు వర్ణించినాడు--

"పటుతారా పటఖండమండిత నిజప్రాంగశుధారా పరి
స్ఫుట సూత్రంబులఁ బ్రోఁగువారి వెస నంభోవాహమార్గాఖ్యమౌ
నటవిం బ్రాక్తన భిల్లమౌళిమణి వేఁటాడన్ మదానేకప
చ్ఛటలోదంబులఁ బడ్డయట్లు తమములు జారెన్ బిలశ్రేణికిన్"

వ.చ. 4-19

ఏనుగులను పట్టుటకై ఓదములను త్రవ్వి పగ్గములను పన్నుదురు. ఓదములనగా గుంటలు త్రవ్వి వానిని కొమ్మలతో, ఆకులతో కప్పివేయుదురు. ఏనుగుల గుంపులను వేటగాండ్రు తరిమి యా యోదములలో పడునట్లుగాచేసి పన్నియుంచిన పగ్గములలో నవి పట్టుపడగా బంధింతురు. పర్వతబిలములు అను ఓదములను త్రవ్వి, యుదయించు చంద్రకిరణములు అను పగ్గములను పన్ని, యాకాశము అను అడవిలో శివుడు అను వేటగాడు చీకటియను ఏనుగుల గుంపును వేటాడగా నేనుగులు ఓదములందు పడునట్లుగా చీకట్లు బిలములందు ప్రవేశించినవట.

రామరాజభూషణునకు పై విషయములందేకాక కామశాస్త్రమునందును (4 ఆశ్వా. 23), సాముద్రికశాస్త్రమునందును (2 ఆశ్వా. 35, 44) ప్రవేశము కలదు. 4 ఆశ్వా. 27వ పద్యములో రాజధర్మములను బోధించెను.

ఈవిధముగ రామరాజభూషణుడు వివిధ శాస్త్రపాండిత్యముతో కావ్యమున ప్రౌఢ భావకల్పనలను కావించుటలో సంస్కృతభాషా కవులను తలపించుచుండును.

## సారాంశము

పెద్దన సూక్ష్మపరిశీలనాశక్తి, లోకజ్ఞత కలవాడు. సూర్యాస్తమయ, సూర్యోదయ వనవర్ణనాద్యనేక సందర్భములందు తన లోకజ్ఞానమును జతపరచి మౌలికమైన మనోహర కల్పనలను కావించినాడు. 5 ఆశ్వా. 38వ పద్యములో వెన్నెలను సన్నసున్నముతో పోల్చుట, 5 ఆశ్వా. 45 వ పద్యములో చతురంగబలము ఆకాశమార్గమున పోవు దృశ్యమును అలంకారీయద్దకముగల వస్త్రమును వితానముగా కట్టినట్లున్నదని యుత్ప్రేక్షించుట, 3 ఆశ్వా. 20వ పద్యములో చంద్రోదయావసరమున తూర్పుదిక్కున గోచరించు ధవళిమను దంతపుదువ్వెనతో పోల్చుట, 3 ఆశ్వా 60వ పద్యములోగూటిని కఱ్ఱతో పొడిచిన పక్షులు మొరపెట్టువిధముగ సూర్యకిరణములచే విచ్చుకొనిన పద్మములనుండి తుమ్మెదలు మోతపెట్టుచు బయటపడెననుట, 6ఆశ్వా. 108వ పద్యములో గోడలు బీటవారిన సన్నసున్నపు గచ్చువేయుట, 6 ఆశ్వా. 109వ పద్యములో బ్రహ్మాండమును గాజుకుప్పెతో పోల్చుట మొదలగు అనేక సందర్భములు పెద్దన లోకజ్ఞతను, సూక్ష్మపరిశీలనను చాటునట్టి నాతిక్లిష్టభావ కల్పనలతో కూడిన మనోహరమైన వర్ణనలు.

పెద్దన పాత్రల వేషభూషాదులను వర్ణించునపుడు తాను ప్రత్యక్షముగా చూచినవానినే వర్ణించుచున్నాడాయని యనిపించును. స్త్రీల యంగదట్టములను, అపురూపముగా ఆనాడు ధరించబడు ధవళాంశుకములను, చెంగావి వస్త్రములను (2 ఆశ్వా. 27, 6 ఆశ్వా. 8) పెద్దన పేర్కొనినాడు. స్త్రీలు గోరంటాకును పెట్టుకొనుట (6 ఆశ్వా. 8) వారి వివిధాభరణములు, (6 ఆశ్వా. 5), చీనాంబరములు, కౌశేయ చీనాంశుకదట్టములు (5 ఆశ్వా. 71, 101), పసిడితీగల జిల్గుపాగలు (5 ఆశ్వా. 58), జిలుగుకంచుకములు (5 ఆశ్వా. 71). కెంబట్టు జముకాణ (5 ఆశ్వా. 40), వస్త్రములపై పూవులనద్దుట (5 ఆశ్వా. 70), సంపన్నబ్రాహ్మణుని వేషము (3 ఆశ్వా. 71), ఆనాటి విటపురుషుల వేషము (6 ఆశ్వా. 44)–మొదలగు వానిని పెద్దన సూక్ష్మేక్షికతో పరిశీలించి వర్ణించిన వేషభూషాదులు.

పెద్దనకు యుద్ధము, సాముగరిడీలు, వేట ఈవిషయములందు అభిరుచి పరిచయము కలదు. వైద్య విజ్ఞానములోను ఆతనికి ప్రవేశముకలదు. రామ రాజభూషణునకు సంగీతము, రత్నశాస్త్రము, అలంకారశాస్త్రము, యోగము వీని యందు పాండిత్య మధికము. కృషిపరిచయముకూడ అతని కధికముగా నున్నట్లు కన్పట్టును. రామరాజభూషణునికి గజ, అశ్వశాస్త్రముల పరిచయము కలదు. కాని వీని పరిచితి పెద్దనకు అధికమని చెప్పవచ్చును. మరియు పెద్దన తన ప్రత్యక్షజ్ఞానముచే వేట, యుద్ధములను సహజముగా వర్ణించినాడు. సూర్యాస్తమయ, చంద్రోదయ, వనవర్ణనా సందర్భములందు తాను నిజజీవితమున సూక్ష్మేక్షికతో పరిశీలించిన విషయములను ఆధారముగ భావకల్పనలను చేసి యుపమాద్యలంకార సామగ్రిని గ్రహించినాడు. రామరాజభూషణునకు వ్యుత్పత్తి జ్ఞాన మెక్కువ. సంగీత, రత్నశాస్త్రాదులలోని విషయములను ఆధారముగ విచిత్రకల్పనలను చేసినాడు. తన అలంకారశాస్త్రపాండితిని, కృషిపరిచయమును ప్రదర్శించుచు వాని నాధారముగ శ్లేషాద్యలంకారముల సహాయమున భావకల్పన లను కావించినాడు ఆయా శాస్త్రసంబంధి వస్తువులను ఉపమాద్యలంకార సామగ్రిగా గ్రహించినాడు.

పెద్దన పాత్రల వేషభూషలను, రూపభావ చేష్టాదులను తన లోకపరిజ్ఞాన ముతో వర్ణించగా, రామరాజభూషణుడు తన అలంకారాది శాస్త్రపాండితిని ప్రద ర్శించుచు పాత్రల రూపభావ చేష్టాదులను వర్ణించుటకు పూనుకొనును. ఉదా హరణకు గిరికావసురాజుల ప్రథమసందర్శనము, వివాహ సంభోగశృంగారాది వర్ణనాసందర్భములందలి వర్ణన లిట్టివే. సంభాషణలను రచించుటలో పెద్దన తన లోకజ్ఞతను ఉపయోగించి సహజముగా రచించగా, రామరాజభూషణుడు నాట కములలోని సంభాషణలవలె సంభాషణలను నడపును.

పెద్దనకు సంగీతమున రామరాజభూషణున కున్నంత పరిచయమున్నట్లు కనిపించదు. అట్లే యలంకారశాస్త్రమున పెద్దనకన్న రామరాజభూషణునకే పాండిత్యము అధికము. ఆయా శాస్త్రములందు పెద్దనకు ప్రవేశమున్నను భావ ములను నాతిక్లిష్టముగా, సహజోక్తితో చెప్పుటకే యాతడు ఇష్టపడును. రామ రాజభూషణుడు తన వివిధశాస్త్ర పాండిత్యముచే భావములందు చమత్కృతిని తెచ్చుటకు ప్రయత్నించును. పెద్దన తన శాస్త్రపాండితిని ప్రదర్శించినను అది

క్లిష్టముకాక మాధుర్య ప్రసాదోత్సిక్తమైన శైలితో పొందుపరచును. రామరాజభూషణుడు శ్లేషభరిత ప్రౌఢశైలిని ప్రయోగించి భావములను ప్రౌఢమొనర్చి పాఠకుల బుద్ధికి పదను పెట్టును. ఈ విధముగా పెద్దన కాళిదాసువలె సహజకవిగా గోచరించగా రామరాజభూషణుడు వివిధ శాస్త్రపాండితిచే కూడిన ప్రౌఢభావముల, అలంకారములయొక్క ప్రయోగముచే బాణ,మాఘ, శ్రీహర్షులవలె పండితకవిగా గోచరించును.



# జీవితము - వ్యక్తిత్వము

## పెద్దన జీవితము

ఆంధ్ర కవితాపితామహుడు పెద్దన కృష్ణదేవరాయల భువనవిజయమను సభనలంకరించిన కవిశ్రేష్ఠుడు. కృష్ణదేవరాయలు స్వయముగా కవి, పండితుడు మరియు సహృదయుడు. కవి, పండితులను పోషించినాడు బహూకరించినాడు, గౌరవమొసంగి సత్కరించినాడు. కృష్ణదేవరాయలయొక్క ఛత్రచ్ఛాయల క్రింద ఆంధ్రదేశము, ఆంధ్రసాహిత్యము మూడుపూవులు ఆరు కాయలుగా వర్ధిల్లినవి. అట్టి మహాపురుషుని యాస్థానమును అలంకరించినవాడు అల్లసాని పెద్దన.

పెద్దన కుటుంబము, జననమరణములనుగూర్చి యేమి తెలియదు. పెద్దన జన్మస్థలమును గూర్చియు మతభేదములు కలవు. బళ్ళారిమండలమున గల దూపాడు పరగణాలోని దోరాల పెద్దన జన్మస్థలమని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము. కడప మండలములోని కోకట గ్రామసమీపమునగల పెద్దనపాడు అతని గ్రామమని జనమంచి శేషాద్రిశర్మ, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మున్నగువారి యభిప్రాయము. పెద్దన రాయలనుండి కోకటమును దానముగా పొందెను. "కోకట గ్రామాద్యనేకాగ్రహారములడిగిన సీమలయందు నిచ్చె"నని పెద్దన చాటువు. ఆతడు తన జన్మగ్రామమునో లేక తత్సమీపస్థ గ్రామమునో కోరుకొని దానముగ పొందియుండవచ్చును. పెద్దన "చిగురు కొమ్మైన చేవ"అని రాయలసీమలో పెరుగు చిగురుచెట్టును స్మరించినాడు రాయలసీమలోని కడపమండలములోనే యా చెట్టునకు చిగురుచెట్టు అని పేరట. అంతేగాక పెద్దన కృష్ణరాయలకు బాల్యగురువను వదంతి యొకటి కలదు. రాయల బాల్యము చంద్రగిరి సమీపమున గడిచెనని చెప్పబడుచున్నది. కావున పెద్దన చంద్రగిరిసమీపమున గల కడపమండలివాసియై యుండును. కావున పెద్దన కడపమండలవాసియే యని చెప్పుటకు వీలగుచున్నది. కడపమండల

మున గల కోకట గ్రామముగాని లేక తత్సమీపస్థమగు పెద్దనపాడుగాని ఆతని స్వగ్రామమై యుండవచ్చును. ఆనాడు పెద్దనపాడునకు నామాంతరముండి పెద్దన జన్మగ్రామ మగుటచేత దానికి తరువాత పెద్దనపాడని పేరు కలిగియుండ వచ్చును. ఈ కారణముచే ఈనాటి పెద్దనపాడునే పెద్దన జన్మగ్రామముగా గ్రహించవచ్చును. పెద్దన గ్రంథావతారికలో తన వంశమునుగూర్చి యేమియు తెల్పలేదు. కొందరు కవులు తమ వంశావళిని వర్ణించుకొనుట, లేక ప్రసిద్ధులైన తమ తండ్రినో లేక తాతనో ప్రశంసించుట కలదు. పెద్దన గ్రంథావతారికలో తన తలిదండ్రులు, వంశావళినిగూర్చి యేమియు తెల్పలేదు. ఆశ్వాసాంత గద్యమున పెద్దన తన తండ్రిపేరు చొక్కయామాత్యుడని మాత్రము చెప్పుకొనెను. కాని కొందరుకవులు పేర్కొనినట్లుగా తన తల్లిపేరు ఆతడు ఆశ్వాసాంతగద్యమున పేర్కొనలేదు. పెద్దనకు విదుషీమణియైన భార్య యుండెడిదనియు ఆతని పుత్రుడుమాత్రము "పండితపుత్రుడను"టను సార్థకము చేయుచు విద్యాభ్యాసము లేక తిరుగుచుండు వాడనియు ఐతిహ్యములు కలవు. ఇట్టి ఐతిహ్యములను ఆధారములేక నమ్ముటకు వీలులేదు.

పెద్దనకు రాయలకు గురుశిష్య సంబంధమున్నట్లుగా పుస్తకాధారమేమియు లేదు. మనుచరిత్రపీఠికలో రాయలు పెద్దనను "హితుడవు" (మ.చ. 1-15) అని పేర్కొనుటచేత వారిరువురకు ఏదో సన్నిహితత్వమున్నట్లు ఊహించుటకు వీలగుచున్నది. మరియు రాయలు పెద్దనను "ఆంధ్ర కవితాపితామహ! అల్లసాని పెద్దన కవీంద్ర!'' అని నోరార పిలిచెడివాడట. ఆయనకా కవిపై యంతటి యభిమానము. ఆ యభిమానమునకు పూర్వ స్నేహసంబంధ మేదియైన ఉండియుండవలయును, లేక పెద్దన కవిత్వ, పాండిత్య, చతురవచో నిధిత్వముచేత రాయలు ఆకర్షించబడి ఆనందించిన తరువాత పెరిగిన సన్నిహితత్వమును కావచ్చును.

పెద్దన నందవరీకబ్రాహ్మణుడు. అతడు చౌడీశ్వరీదేవి భక్తుడనియు, శాక్తసంప్రదాయమునకు చెందినవాడనియు కలదు శాక్తులకు మార్కండేయ పురాణము పాఠ్యగ్రంథము కావున ఆ పురాణమునుండియే పెద్దన మనుచరిత్ర కథాంశమును గ్రహించినాడని యభిప్రాయము కలదు[1]. కాని మనుచరిత్రను బట్టి పెద్దన వైదిక ధర్మకరాభిరతుడని చెప్పుటకు వీలగుచున్నది. తరువాత

1 వసుచరిత్ర కవితా విపంచి పుట 48.

పెద్దన గురుప్రభావమువననో, లేక తన్నాదరించు రాజు కృష్ణదేవరాయలు వైష్ణవ ప్రీతి గలవాడగుటచేతనో, వైష్ణవమతమును స్వీకరించియుండును. మనుచరిత్ర రచనా కాలమునాటికి పెద్దన వైష్ణవుడనుటకు ఆంతరంగికసాక్ష్యములు కావ్యమున కలవు కావ్యారంభ పద్యముకూడ ఆతడు వైష్ణవుడనుటకు కావలసినంత సాక్ష్యము నిచ్చుచున్నది. కాని రాయలవలె పెద్దనకు వైష్ణవమన్న పిచ్చి యభిమానమున్నట్లులేదు. రాయల ప్రీతికొరకు పెద్దన వైష్ణవమును స్వీకరించెనని కొందరి యభిప్రాయము. తిమ్మరుసు, ధూర్జటివంటి శైవుల నాదరించిననాడు రాయలు. అటువంటి మత దురభిమానములేని ప్రభువును మెప్పించుటకు పెద్దన వైష్ణవమును స్వీకరించినాడనుట సమంజసము కాదు. ఆనాటి కాలప్రభావము ననుసరించియో, లేక గురువు శఠకోపయతి ప్రేరణమువననో పెద్దన వైష్ణవ మును స్వీకరించియుండును. అయినను ఆతడు వైదికధర్మానురతి కలవాడను టకు, శివవిద్వేషి కాడనుటకు మనుచరిత్రలో అనేక సాక్ష్యములు కలవు.

పెద్దన గురువు అహోబిల మఠాధీశుడు శఠకోపయతి. ఆతడు వాసంతికా పరిణయము అను రూపకమును రచించెనని ఆరుద్రగారు తెలిపిరి[1]. "విద్యానిలయు"డైన (మ.చ. 1-6) గురువుయొద్దనే పురాణాగమేతిహాసములను పెద్దన అధ్యయనము చేసియుండును. పెద్దన మనుచరిత్ర రచనకు పూర్వము హరికథాసారమును రచించి తన గురువున కంకితమిచ్చెను. దీనిలో పెద్దన హరికి సంబంధించిన కథలను కావ్యరూపమున రచించియుండునని, కస్తూరిరంగ కవి ఆనందరంగ రాట్ఛందస్సులో నుదాహరించిన పద్యములనుబట్టి తెలియు చున్నది. ఈ గ్రంథము రచించునాటికి పెద్దన కృష్ణదేవరాయల ఆస్థానమున ప్రవేశించినట్లు కనబడదు. క్రీ.శ. 1509 సంవత్సరము పట్టాభిషిక్తుడైన తరువాత రాయలు తన బాల్యగురువైన పెద్దనను రప్పించి సభలో చేర్చుకొని యుండును. పట్టాభిషేక సమయమున రాయలవయస్సు ఇరువదిరెండు సంవత్సరములు. పెద్దన అప్పటికి రాయలకన్న వయస్సున పెద్దవాడై ప్రౌఢ నిర్భరవయః పరిపాకమున ఉండియుండును. పెద్దనార్యుడు క్రీ.శ. 1470 ప్రాంతమున జన్మించి క్రీ.శ. 1485 ప్రాంతమున శఠకోపయతి శిష్యుడై నలు

---

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం. 7 సంపుటం. పుట 178.

ఐది యేండ్ల వయస్సున రాయల ఆస్థానమున ప్రవేశించియుండునని శ్రీ చాగంటి శేషయ్యగారూహించిరి[1]

పెద్దన కృష్ణదేవరాయల ఆస్థానమున ప్రవేశించిన తరువాత ఆశుకవితలు చెప్పి రాయలను మెప్పించెననుటకు దృష్టాంతములు కలవు. "పూత మెఱుంగులుం బసరు పూపబెడంగులుఁ జూపట్టినవా..." అను ఉత్పలమాలికనాశువుగా చెప్పి పెద్దన గండపెండేరమును రాయలచేత తొడిగించుకొనుట ప్రసిద్ధము. మరియు రాయలు తురుష్కులపై యుద్ధమునకు పోయినపుడు పెద్దనచెప్పిన రెండు ఆశుపద్యములు కనిపించుచున్నవి. దండయాత్రలో సైతము పెద్దనాది కవులు రాయలను అనుసరించి యుండువారని, తీరికవేళల వారి కవితామాధుర్యములను ఆతడు చూరగొనువాడని చెప్పుటకు రాయవాచకాదులు ఆధారములు. స్వారోచి వేటవర్ణనద్వారా పెద్దన, వేటలో సైతము రాయల ననుసరించి యుండెడివాడనియు, వేటతో ఆతనికి ప్రత్యక్షజ్ఞానము కలదనియు చెప్పవచ్చును. పెద్దన రాయలను అన్నివేళల వెన్నంటియుండి, యాతని రసిక హృదయమును రంజింపజేయుచుండువాడేమో! అట్టి కవిచేత కావ్యకన్యకను పడయవలయునని రాయలకు కోరిక జనించినది. ఒకనాడు నిండుకొలువై యుండి పెద్దనను రాయలు కావ్యరచనకై అభ్యర్థించినాడు (మ చ. 1:13-16). ఆతడు పెద్దన కవితాప్రావీణ్యము నెరిగినవాడు కావున కావ్యరచనకై యాతనిని ప్రోత్సహించినాడని చెప్పవచ్చును. తత్ఫలితముగా రచించబడిన కావ్యమే మనుచరిత్రగా నావిర్భవించినది. మనుచరిత్ర కృష్ణరాయలకు కీర్తి స్తంభమై, పెద్దన కవితా నైపుణికి అనశ్వరమైన జయపతాకమై, ఆంధ్రసాహిత్యలోకమున ఆనాటినుండి నేటివరకు వెలసినది.

కృష్ణదేవరాయలు యుద్ధపుటొత్తిడిలోలేని సమయముననే మనుచరిత్ర ఆతని కంకితముగా నీయబడియుండును. పెద్దన మనుచరిత్రలో కృష్ణదేవరాయల కటకపురివిజయమును, గజపతినోడించుటను పెక్కుమారులు పేర్కొనుటచేత, కళింగదేశ విజయమును సాధించినవెంటనే యా ప్రబంధమును అంకితముగా నిచ్చెనని యూహించుటకు వీలగుచున్నది. ఆనాటికా విజయము

---

1. ఆంధ్ర కవితరంగిణి, 7 సంపుటము, పుట 178-179.

లభించి కొలదికాలమే యగుటచేత పెద్దన దానినెంతయో గర్వముతో స్మరించి యుండును కృష్ణదేవరాయలు క్రీ. శ 1512-1515 సంవత్సరముల నడుమ పూర్వ దిగ్విజయయాత్ర కావించెను. క్రీ శ. 1515న కొండవీటను, కొండ పల్లి, కటకములను జయించెను క్రి.శ. 1516లో రాయలు సింహాచలస్వామికి దానముచేసినట్లు శాసనము కలదు. అనగా ఈ దానమునకు పూర్వమే గజ పతిని జయించుటచేతనే యా రాజ్యములోని కొన్ని గ్రామములను సింహాచల స్వామికి అతడు దానము చేయగలిగెనని చెప్పవచ్చును. ఈ దానశాసనకాలము పెద్దనచే పేర్కొనబడిన పొట్టునూరి జయస్తంభస్థాపనకు పూర్వము. కావున రాయలు క్రీ.శ. 1516 నాటికి పూర్వ దిగ్విజయయాత్రలు ముగించినాడనియు క్రీ.శ. 1516-20 వరకు అనగా ఆదిల్‌షాపైకి దండెత్తువరకును శాంతియుత జీవనమును గడిపినాడనియు తెలియుచున్నది. ఈ నాలుగు సంవత్సరముల కాలముననే రాయలు తిరుపతి, కంచి మొదలగు క్షేత్రములను దర్శించినట్లు తెలియుచున్నది. ఈ సమయముననే రాయలు భువనవిజయ భవనమును నిర్మింప జేసి దానిలో పండితగోష్ఠులను, కవి సమ్మేళనములను జరిపియుండును. ఈ సమయముననే పెద్దన మనుచరిత్రను రాయల కంకితముగా నొసంగియుండును కాని మనుచరిత్ర రచనమాత్రము అంతకు పూర్వమునుండియే సాగుచు. ఉండియుండును. పెద్దనకు "ఆంధ్రకవితా పితామహ" అను బిరుదము రాయ లాతని ఆశుకవితలకును, మనుచరిత్ర రచనాకాలమున ఆ కృతినుండి అప్పుడప్పు డాతడు వినిపించు కవితామాధురులకును మెచ్చి యిచ్చినదై యుండును. మనుచరిత్ర అంకితకాలమునాటికే యా బిరుదము స్థిరపడినదని చెప్పవలయును.

మనుచరిత్ర రచనానంతరము పెద్దన రామస్తవరాజము, అద్వైత సిద్ధాంతము అను రెండు కావ్యములు రచించెనని కావలి వెంకటస్వామిగారు వ్రాసి నట్లుగా చాగంటి శేషయ్యగారు తెలిపినారు[1]. కాని అట్టి కావ్యములేవియు లభించలేదు. ఇతర కవులెవరును వానినిగూర్చి ప్రసంగించలేదు. కావున ఆ రచనా విషయ మెంతవరకు సత్యమో చెప్పలేము. రాయల మరణానంత రము పెద్దన జీవించియున్నట్లు

1. ఆంధ్ర కవితరంగిణి, 7 సంపుటము, పుట 195.

"రాయరాహుతు గండరాచ యేనుగువచ్చి
యారట్లకోటఁ గోరాడునాడు..."

"ఎదురైనచో దన మద కరీంద్రము డిగ్గి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె..."

అను చాటువులవలన తెలియుచున్నది. క్రీ.శ. 1530లో రాయల నిర్యాణము జరిగినది.

"ఆంధ్రకవితాపితామహ! అల్లసాని
పెద్దన కవీంద్ర! యని తను పిల్చునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు—"

అను చాటువువలన రాయల అనంతరము పెద్దన గతమును స్మరించుకొనుచు నిరుత్సాహజీవితమును కొంతకాలము గడిపి క్రీ.శ. 1533 ప్రాంతమున తన 65-70వ యేట మరణించియుండునని యూహించవచ్చును.

## పెద్దన వ్యక్తిత్వము

కావ్యము కవికర్మ. అది యాతని సృష్టి. సృష్టికర్తగుణములు సృజింపబడిన వస్తువునందు నిక్షిప్తమగును. సృజించినవాడు తన స్వభావ విరుద్ధమగు వస్తువును సృజించలేడు. ఒకానొక దృశ్యమునుగాంచి యాతడు తన స్వభావానుకులముగా భావోద్రేకమునకు లోనై, దానిని రంగులమేళనముతో పటముపై చిత్రించును. రంగుల మేళనాపద్ధతిలో చిత్రకారుని మనః ప్రవృత్తి ప్రతిబింబితమగును. నిశితదృష్టిగల చూపరులకు ఆ చిత్రకారు డెట్టివాడో తెలియకపోదు. అట్లే కావ్యములోని పదజాలము, శైలి, వర్ణనలు, భావములు, అలంకారములు, రసపాత్ర పోషణలు కవి వ్యక్తిత్వమును, మనస్తత్వమును పట్టియిచ్చును.

పూర్వకవులు పురాణాంతర్గతములగు కథలను కావ్యేతివృత్తములుగా గ్రహించిరి. అట్టివానియందు కవి వ్యక్తిగతాభిప్రాయములకు తావుండదు, కవి

యుట అస్వతంత్రుడు, కవి హృదయానుభూతి పూర్వకావ్యములందు కనబడదు, ఇదియే ప్రాచీన కవితకు, ఆధునిక కవితకు గల ప్రధాన భేదమని కొందరి యభిప్రాయమై యున్నది పురాణాదులనుండి గ్రహించిన వస్తువును కొందరు పూర్వకవులు తమ హృదయానుభూతిచేతను, వ్యక్తిత్వముచేతను మెరుగులుపెట్టి నూతన కావ్యములుగా రూపొందించిరి. దృశ్యము పాతదైనను, చిత్రకారుడా దృశ్యమును పటముపై గీయుటలోను, రంగులమేళనములోను సర్వస్వతంత్రుడు. వానిలోనే యాతని ప్రత్యేక వ్యక్తిత్వము గోచరించుచుండును. పూర్వకవి కావ్యములును అట్టివే. ఉదాహరణకు రామాయణకథ కలదు. ఆ కథ నెందరో కవులు చేపట్టి కావ్యములుగా వివిధ భాషలలో రచించిరి, రచించు చున్నారు, రచించగలరు. ఆ కావ్యములను, మనము కథ తెలిసియున్నను ఆసక్తితో చదువుచున్నాము. దీనికి గల కారణమేమి? టనగా - రామాయణకథను రచించిన ప్రతి కవియు ప్రత్యేక వ్యక్తిత్వము కలవాడు· ఆతడు స్వానుభూతులను, స్వప్రతిభను జోడించి తన దేశకాలముద్రను వేయును. అన్యకవి విరచితరామాయణ కావ్యమునకు భిన్నమైనదిగా నుండునట్లు నూతనసృష్టి కావించును. కావుననే కథ ఒక్కటేయైనను భిన్నరామాయణ కావ్యములు భిన్నములుగా సహృదయులను రంజింపజేయ సమర్థములగుచున్నవి. ప్రతి కావ్యమునను ఆ కవియొక్క అంతరమూర్తి లీలగా స్ఫురించుచుండును కవి వ్యక్తిత్వము కావ్యరసమున అంతఃప్రవాహమై గోచరించుచుండును.

**"An author's style is a faithful copy of his mind"** - "కవి శైలి యాతని మస్తిష్కముయొక్క ప్రామాణికమైన ప్రతిలిపి" అని 'గొయిటె' అను జర్మన్‌కవి యభిప్రాయపడెను. మరియు ఈ.పి వ్హిప్లే అను విమర్శకుడు **"Style is the intimate and unseperable fact of the personality of the writer"** - శైలిని, లేఖకుని అంతరంగ వ్యక్తిత్వముయొక్క అభిన్నమైన అంగముగా పరిగణించినాడు· ప్రాచీన గ్రీకు, రోమన్ విద్వాంసులు సైత మిట్టి యభిప్రాయములనే వెలిబుచ్చియుండిరి. శైలి మరియు రచయిత వ్యక్తిత్వములు అభిన్నరూపములుగ నుండును. మరియు కవియొక్క వ్యక్తిత్వము శైలియందేగాక కావ్యమునం దాతడు ప్రయోగించు ఉపమానములందును, అర్థాంతర న్యాసాద్యలంకారములందును, పాత్రచిత్రణ రసపోషణములందును, వివిధ వర్ణనలందును స్పష్టమై పాఠకులకు హృద్గోచరమగుచుండును. ఈ

సూత్రము ననుసరించి మనుచరిత్ర నాధారముగా పెద్దన రామరాజభూషణుల వ్యక్తిత్వములను పరిశీలింతము.

పెద్దన వైష్ణవమతమును స్వీకరించినను శివద్వేషి కాలేదు మనుచరిత్ర కావ్యారంభమును విష్ణువందనముతో చేసినను వెంటనే రెండవ పద్యమున శివుడు "శాంబరీభిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభప్రతిపాది గావుతన్." అని తన ప్రభువైన కృష్ణదేవరాయల కాశీర్వచన మొసంగెను. విఘ్నేశ్వరునకూడ ఆతడు స్మరించెను. పెద్దన వైష్ణవమును స్వీకరించినను శివకేశవ భేదములేని అద్వైతియే.

పెద్దన గురుభక్తి కలవాడు. హరియొక్క కథలను హరికథాసార ముగా రచించి గురువున కంకిత మొసంగెను. ఆతని గురుభక్తి యట్టిది. ఆతడొసంగిన గురుదక్షిణ అది. పెద్దనకు కృష్ణదేవరాయలన్నను మిక్కిలి గౌరవాభిమానములు కలవు. మనుచరిత్ర అవతారికలోను, ఆశ్వాసాద్యంత పద్యములందును పెద్దన వర్ణించిన రాయలవారి విజయములు చారిత్రక సత్యము లైనవి. మనుచరిత్ర అవతారికలోని షష్ఠ్యంత, ఆశ్వాసాద్యంత పద్యములలో స్వరోచివృత్తాంతములోను పెద్దన కృష్ణదేవరాయల రూపపరాక్రమ ప్రభుత్వ వైభవములను వాచ్యవ్యంగ్యముగా ప్రకటించినాడు. ఇంకను అనేక పద్యముల ద్వారా కృష్ణదేవరాయలపై పెద్దనకుగల గౌరవాభిమానములు వాచ్యవ్యంగ్య రూపమున గోచరించుచున్నవి. కృష్ణదేవరాయలకును పెద్దన అనిన మిక్కిలి గౌరవము. సామంతరాజులు,వ్యాకరణ, వేదాంతాది శాస్త్రపండితులు, యోధులు తనను పరివేష్టించియుండ, రాయలు కొలువైయుండి పెద్దనతో "మనువులలో స్వారోచిషమను సంభవకథ రససమంచితకథలతోకూడి విననింపైనది నీయొక్క చతురరచన కది యనుకూలమైన"దని "సదయతన్" పలికినాడట. పెద్దన "సదయతన్" రాయలు పలికినాడని చెప్పుటచేత రాయల కాతనిపై గల ఆదరాభి మానము లెట్టివో ప్రకటమగుచున్నవి అభినవభోజు డనిపించుకొనిన రాజునకు హితుడై యుండి పెద్దన తాను కోరిన సీమలందు అగ్రహారములను పొందెను. పొందిన అగ్రహారములను తాను యితరులకు దానమొసంగెను తానెక్కిన పల్లకీని ప్రభువులచేత మోయించుకొనెను. గండపెండేరమును రాయలవారి స్వహస్తములతో తొడిగించుకొనెను. చేయూత నొసగగా మదకరీంద్రమునెక్కి చక్రవర్తిసరసన కూర్చుండెను.

విజయనగర ప్రజలు సంపన్నులై భోగములలో మునిగితేలుచుండిరి. ఆనాటి ప్రజల భోగవైభవము లానాటి సాహిత్యములోనేగాక, విదేశీయుల వ్రాతలలోను దర్శించవచ్చును. అట్టి యానాటి సంఘమున ప్రజలు పారమార్థికముపై ఎక్కువ దృష్టిని నిలుపక భోగములందు తవిలి యుండియుందురు. కొద్దిమంది పారమార్థికైకదృష్టి కలవారై యుండి సంఘమున విజృంభించిన భోగదృష్టిని నిరసించియుందురు. సమకాలమునాటి సమస్య, భోగవైరాగ్యములకు కలిగిన సంఘర్షణ యే పెద్దన మనుచరిత్ర కావ్యరచన కుద్బోధము కలిగించి యుండును ప్రవరుని నైష్ఠికుడైన బ్రాహ్మణునిగా వర్ణించి దేవవేశ్యాకులములో జన్మించిన భోగైకదృష్టిగల అప్సరసయగు వరూథినికి యాతనికిని జరిగిన సంవాదమును పెద్దన సమకాలిక సంఘర్షణకు ప్రతిబింబముగా రచించెను.

పెద్దన ప్రవరునివలె నిశ్చింతగా గృహస్థాశ్రమజీవితమును గడిపి యుండును, ప్రవరునివలె ఆతడును అనారతాధ్యాపనా తత్పరుడై యుండును. వైష్ణవ మంగీకరించినవాడు కావున వామనస్తుతిపరత్వమున నిద్రనుండిలేచి సచ్ఛాత్రులు వెంటనంటిరాగా తుంగభద్రానదికి పోయి స్నాన మాచరించువాడై యుండును. పార్వతీపరమేశ్వరులవంటి తలిదండ్రులు గృహకార్యములను పర్యవేక్షించుచుండగా, కూకటులుగొల్పి వివాహము చేసిన అనుకూలవతియగు భార్య సౌఖ్యావహయై సేవించుచుండగా, ఇంటిలో తరుగని పాడిపంటలతో పెద్దన కాపుర మెప్పుచుండెనని మన మూహించవచ్చును. పెద్దన గృహస్థాశ్రమమును ప్రవరునివలె నిష్ఠతో నడపుచు, రాయలవారి ప్రాపున భోగభాగ్యములతో జీవితమును గడిపెనని చెప్పవచ్చును పెద్దన ప్రవరునివలెనే యూరిలో తన్ను కాంక్షించు వేశ్యలకు మధుకరాంగనలకు సంపెంగ పూవువలె భోగబాహ్యమై యుండును. కాని పెద్దన, ప్రవరునివంటి విరాగి కాదనియు, ఆతడు వరూథినిపై చూపు సానుభూతియే దానికి నిదర్శనమనియు, కొందరు విమర్శకులు అందురు. వరూథిని శృంగారవిలాసముల సహజవర్ణన ఆతని వేశ్యాపరిచితిని ప్రకటించుననియు, "నిరుపహతి స్థలంబు రమణిప్రియదూతిక తెచ్చియిచ్చు", అను పెద్దనచెప్పిన చాటుపద్యమున ఆతని భోగలాలసత స్పష్టమగుచున్నదనియు వారి యభిప్రాయము. విజయనగరసామ్రాజ్యకాలప్రభావము ననుసరించి పెద్దన భోగియై సర్వసుఖంబుల ననుభవించి యుండును. చెవులకు మణికుండలములు, జరిచుంచులుగల అరుణాంశుకోత్తరీయము, రాకట్టు జాలువా

మొలకట్టు, కావిధోవతి, ధవళధవళములగు జందెములు కాశికాముద్రగల ఉంగరము(3 ఆశ్వా 71)లతో కూడిన పెద్దన వర్ణించిన ప్రవరునివేషమా నైష్ఠికుడైన బ్రాహ్మణుడుధరించు వేషధారణవలె లేదు. విజయనగర కాలమునాటి యొక భోగపురుషు డట గోచరించును. శ్రీనాథునినాటికే బ్రాహ్మణు లట్టి వేషధారణను కావించుచు, సమస్తసుఖములతో భోగజీవితము ననుభవించిరనుటను ఆతని కావ్యములు ప్రకటించుచున్నవి. పెద్దనయు సమకాలీన జీవితమును ప్రతిబింబింపజేయుచు ప్రవరుని ఒక భోగిగానే చిత్రించినాడు. కాని నైష్ఠికుడైన, సుఖాలకు నోచుకోని బీదబ్రాహ్మణునిగా కాదు. ఆతడు మోక్షకాంక్షియైనా ఇహలోకమును సుఖసంపదలను రోసినవాడు కాదు. సంపూర్ణ గృహస్థధర్మములను అనుష్ఠించుచు ఆనందముగా కాలము గడుపువాడు. పెద్దనయు ప్రవరునివంటి సంపన్న భోగజీవితమును సాగించినవాడని చెప్పవచ్చును. "భోగి"యనగా వేశ్యాగమనముచేయుచు విచ్చలవిడిగా జీవించువాడని యర్థము కాదు. వరూథిని శృంగారవిలాసముల నాతడు సహజముగా వర్ణించినాడనిన, ఆతడు కవి. రవిగాననిచో కవి గాంచును. మరియు రాయలవారి దర్బారులో ఆతడు విలాసవతుల నెందరినో చూచియుండును. సూక్ష్మదృష్టిగల కవి వానిని సహజముగా వర్ణించినయెడల అపార్థము చేసుకొనవలసిన అగత్యములేదు. ఇక ప్రవరుని "మహీసురాధముడనుట"చే వరూథినిపై సానుభూతి ప్రకటించుటచే ఆతడు వేశ్యాప్రియుడన వీలులేదు. అది పాత్రపోషణాశిల్పమునకై చేసినది. మనుజన్మకు కారకురాలగు వరూథిని కాముకురాలు కాదనియు, ఎందరో తనను కాంక్షించు వారిని నిరాకరించివచ్చి ప్రవరుని రూపలావణ్యసంపదచే ఆకర్షించబడి యాతనినిమాత్రమే ప్రేమించెననియు, అట్టి యామెను ప్రవరుడు నిరాకరించుటను ఒక దోషముగా నెంచి, పెద్దన వరూథినిపాత్రకు ఉత్తమత్వము నాపాదించినాడేగాని తద్ద్వారా ఆతనిని భోగలాలసునిగా చిత్రించుట సరికాదు. పెద్దన మనుచరిత్రలో శృంగారమును అధికముగా వర్ణించుట అంగియగు శాంతరసపుష్టికేగాని యాతడు శృంగారప్రియుడగుటచే కాదు. సమకాలిక కాలధర్మమునకు విరుద్ధముగా మోక్షకాంక్షస్థాయిగా గల శాంతమును అంగిగాగల కావ్యమును రచించబూనుకొనిన పెద్దన అంతరంగమున ముముక్షువుగా గోచరించును. తన చిత్తవృత్తి కనువైన కథను పెద్దన ఎన్నుకొనినాడన వలయును. ద్వితీయాశ్వాసమున ప్రవరుని ముఖమున వెలిబుచ్చినట్లుగా ఫలాపేక్షరహితమగు, శాస్త్రవిహిత

మగు కర్మానుష్ఠానముద్వారా మోక్షసాధన మగునని నమ్మినట్టివాడు పెద్దన. కావ్యాంతమున స్వారోచిషుడు తపముద్వారా మోక్షమును సాధించియు విష్ణువు ఆజ్ఞచే "శాస్త్రవినిశ్చయ యుక్తిదండపాలనముల" భూమినేలెను. అట్లే పెద్దనయు మోక్షకామియై ఇహలోకజీవితమును, తామరాకుపై నీటిబొట్టువలె గడిపి యుండును.

పెద్దనకు రాయల సాహచర్యముననేమో మృగయా, యుద్ధము, మల్లయుద్ధము మొదలగు క్షత్రియోచితధర్మములందు అభిరుచి యేర్పడినది. కావుననే స్వరోచి వేటను విస్తరముగా, సహజముగా వర్ణించగలిగినాడు. స్వరోచి రాక్షసుల యుద్ధవర్ణన. పెద్దన యుద్ధవిద్యాపరిచితికి నిదర్శనముగా కనిపించుచున్నది. పెద్దన స్వయముగా కత్తిపట్టి యుద్ధము చేయకున్నను, నిరంతరము కృష్ణదేవరాయల ననుసరించియుండుటచే ఆతనికా విద్యలయందు పరిచితి, అభిమానములు కలిగియుండును. పెద్దనకు గజాశ్వశాస్త్రములందును మంచి ప్రవేశము కలదు. ఆయుర్వేదమును ఆతని అభిమానవిద్యగా కనిపించును. సంగీతశాస్త్ర పరిచయమును ఆతనికి కలదు. పెద్దన రచించిన ప్రకృత్యాది వర్ణనలవలన ఆతని సూక్ష్మేక్షిక అవగతమగును.

పెద్దన, కాళిదాసు రసకవిత్వము, భారవి అర్థగాంభీర్యములనిన ప్రీతి కలవాడు. చిత్రకవిత్వము శబ్దచమత్కారములనిన అభిరుచి లేనివాడు స్వభావోక్త్యలంకారప్రియుడు. ప్రసాదమాధుర్యములు చిప్పిలు మనుచరిత్రలోని వెదర్భీశైలిలో నాతని సాత్త్వికప్రకృతి ప్రతిబింబించి కనబడుచున్నది. మృదుగంభీరస్వభావము గల రసికహృదయుడు తెలుగున నన్నయాదికవుల కవితామృతమును కాచి వడబోసి నూతన కావ్య సృష్టికర్తయై ఆంధ్ర కవితాపితామహుడను బిరుదమును ధరించిన మహాకవి.

## రామరాజభూషణుని జీవితము

రామరాజభూషణుడు భట్టుకులమునకు చెందినవాడు. తండ్రి సూరన. ఆయన గొప్ప పండితుడు. ఆతడు విజయనగరమును బహుస్వల్పకాలమేలిన

వేంకటరాయలచేత భూషించబడి వేంకటరాయభూషణుడను బిరుదనామమును ధరించెను. ఆతని యింటిపేరు ప్రబంధాకసు.వారు.

రామరాజభూషణుని పేరు బట్టుమూర్తియని తెలియుచున్నది. అతడు తన కావ్యాలంకార సంగ్రహమున తనపేరు బట్టుమూర్తిగాను, తండ్రిపేరు వేంకట భూషణునిగాను చెప్పుకొనెను. వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములలో తనపేరు రామరాజభూషణుడని చెప్పుకొనెను. వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములందు బట్టుమూర్తి యను పెరుమ పేర్కొనలేదు. హరిశ్చంద్రనలోపాఖ్యానమున తండ్రిపేరు సూరన యని చెప్పబడినది, వసుచరిత్రలో లేదు హరిశ్చంద్రనలోపాఖ్యానమున వసుచరిత్ర ప్రసక్తికలదు. కావ్యాలంకార సంగ్రహప్రసక్తి వసుచరిత్రలోగాని హరిచంద్రనలోపాఖ్యానములో గాని కనిపించదు. వీనినిబట్టి బట్టమూర్తి, రామరాజభూషణులువేరువేరువ్యక్తులనియు, తాతల పేర్లు ఒక్కటిగా చెప్పబడి తండ్రులపేర్లు వేరుగానుండుటచే వీరు అన్నదమ్ముల కుమారులనియు విమర్శకులు భావించిరి కానిబట్టుమూర్తి, రామరాజభూషణు లిరువురు నొకరేయని వజ్ఝలవారు నిర్ణయించియున్నారు[1]. కావ్యాలంకార సంగ్రహ రచనాకాలమునాటికి బట్టుమూర్తి రామరాజభూషణుడన్న పేరు కలిగియుండక పోవచ్చును. అందుచేత ఆ కావ్యమునం దాతడా పేరును పేర్కొనలేదు కావ్యాలంకార సంగ్రహరచనానంతరము అళియ రామరాయల ప్రాపునచేరి యాతనిచేత భూషించబడి బట్టుకవి రామరాజభూషణు డయ్యెను. కావున ఆ పేరు తరువాతి రచనలో మాత్రమే పేర్కొనగల్గెను. హరిశ్చంద్రనలోపాఖ్యానమున కావ్యాలంకార ప్రసక్తిలేదనిన, అది యాతడు చిన్నవయస్సున రచించిన గ్రంథము కావున దాని నాతడు పెద్దకృతిగా తలంచక, చిన్నచూపుతో స్మరించకపోవచ్చును ఇక తండ్రులపేర్లు భిన్నములై యున్నవనిన బట్టుమూర్తి తండ్రి అసలు పేరు సూరన అనియు, వేంకట రాయలచేత భూషించబడుటచే వెంకటరాయభూషణు డయ్యెనని శ్రీ వజ్ఝలవారు నిరూపించిరి[2]. కావ్యాలంకారసంగ్రహ రచనా కాలమునాటికి తండ్రియొక్క బిరుదనామము ఇంకను నూతనమై యుండుటచే దానినే పేర్కొని యుండును. హరిశ్చంద్రనలోపాఖ్యాన రచన నాటికాపేరు అంత క్రొత్తదిగాక

---

1 వసుచరిత్ర విమర్శనము పుట 51-76.

2. వసుచరిత్ర విమర్శనము, పుట 78.

మరుగున పడిపోవుటచేత తండ్రి యొక్క అసలుపేరునే కవి పేర్కొనియుండును. అంతేగాక మూడు కావ్యములందలి భావ, శైలి సామ్యములనుబట్టి అవి యేకకవి కృతములని చెప్ప వీలగుచుండగా బట్టుమూర్తి రామరాజభూషణులు వేరువేరనుట అనుచితము. వసుచరిత్ర గ్రంథావతారికలో రామరాజభూషణుడు పెద్దనవలెనే తన వంశమునుగూర్చి యేమియు చెప్పుకొనలేదు. పెద్దనవలెనే యాశ్వాసాంత గద్యమున రామరాజభూషణుడు తన తండ్రిపేరును పేర్కొనలేదు.

రామరాజభూషణుని జన్మస్థలము రాయలసీమలోని కడపమండలమునకు చెందిన పులివెందల సమీపమునగల కసనూరు అని ఒక ప్రతీతి. రామరాజభూషణుని జన్మభూమి బట్టుపల్లె అనియు, ఆ గ్రామమును కవిత్వమునందు ప్రవీణులై ప్రబంధాంకమువారని బిరుదమునందిన, ఆతని పూర్వీకులకు కృష్ణదేవరాయలు దాననముగా నిచ్చెనని మరొక ప్రతీతియు కలదు. ఈ గ్రామమును బళ్ళారిమండలములోని పాలమండలము తాలూకాలోనిదని కొందరు తలంచుచున్నారు[1]. రామరాజభూషణుడు పెద్దన శిష్యుడని ప్రతీతి వారికి గురుశిష్యసంబంధ మేర్పడుటకు వారొక్క ప్రాంతమువారగుట పెద్ద కారణము కావచ్చును. కావున రామరాజభూషణుడును కడపమండలవాసి యని యనుటయే యొప్పును. కడపమండలములోని పులివెందల సమీపమునందలి బట్టుపల్లెయో లేక కసనూరుయో యాతని జన్మస్థానమై యుండును.

రామరాజభూషణుడు పెద్దన శిష్యుడనుట లోకములో, ప్రచారమున కలదు. మండ లక్ష్మీనరసింహాచార్యులు ఆంధ్రకౌముదిలో ఒకచోట "అల్లసాని పెద్దనార్య శిష్యేణ బట్టుమూర్తి కవినావిరచితే వసుచరిత్రే" అని పేర్కొనినాడట. ఆచార్యులు రామరాజభూషణునకు నూరేళ్ళ తరువాతివాడు. ఆయన తాతగారిముత్తాత బట్టుమూర్తికి సమకాలికుడగును[2]. కావున ఆయన వ్రాసినదానిలోను, లోకములో ప్రచారములోనున్న దానిలోను లవలేశమైన సత్యముండక పోదు. రామరాజభూషణుడు ఓనమాల దగ్గరనుండి పెద్దనకడ అభ్యసించినాడనుటకంటె కవిత్వపు మెళకువలను అతనినుండి నేర్చుకొనినాడనిన సమంజసముగా నుండును.

---

1. కవి జీవితములు పుట 378.

2. సమగ్ర ఆంధ్రసాహిత్యం సంపుటం8. పుట 231.

రామరాజభూషణుడు పండితవంశములో పుట్టినవాడు. పుట్టుకతోడనే ప్రతిభావంతుడు. తండ్రిదగ్గర కొంత జ్ఞానార్జన కావించియుండును. తరుణ వయస్సులో విజయనగరముపోయి ప్రసిద్ధుడు, నిజమండల వాసియగు పెద్ద నార్యుని అండన కవిత్వశిక్ష నారంభించి యాతని శిష్యుడై యుండును. భువన విజయసభలో ప్రవేశించి తన కవితానైపుణ్యమును ప్రదర్శించవలయునని యుఱ్ఱూతలూగుచున్న నూతన యువకుడైన రామరాజభూషణుని పెద్దన కొంత ఓపికపట్టుమని, వెంటనే సభాప్రవేశము కల్పించక ఆపియుండెనట. దానితో రామరాజభూషణుడు అలిగి కసనూరుకు పోయి వీథిబడి చెప్పుకొనుచుండెననియు రాయల సర్వసేనాని రామలింగనాయకులు జమాబందికై వచ్చినపుడు ఆ గ్రామాధికారులు బట్టుమూర్తికి రాయల సభలో ప్రవేశము కల్పించుదాక హాజరు కామనుటచే భూమిశిస్తు వసూళ్ళు నిలిచిపోయెననియు, సర్వసేనాని యిక గత్యంతరములేక మహామంత్రి తిమ్మరుసుకీ వార్త పంపెననియు, వారి ఆమోదముతో బట్టుమూర్తికి భువనవిజయసభలో స్థానము లభించెననియు ఐతిహ్యము. రామరాజభూషణుడు గ్రామాధికారుల సమ్మెవలన భువనవిజయప్రవేశము పొందె ననుటకంటె యాతని వైదుష్య మహిమచే ఆస్థానమున స్థానమును పొందినాడనిన సమంజసముగా నుండును.

రామరాజభూషణుడు మొదట అష్టదిగ్గజములలో నొకడై యుండి రాయల మరణానంతరము ఓబయ నరసరాజు నాశ్రయించి యాతని ప్రాపున కావ్యాలంకార సంగ్రహరచన కావించి యాతని కంకిత మొసంగియుండును. ఓబయ నరసరాజు అళియరామరాయలకు మేనల్లుడు. కావ్యాలంకార సంగ్రహమున బట్టుకవి రామరాయలను, ఆతని సోదరులను విశేషముగా స్తుతించియున్నాడు. నరసరాజు ప్రాపునగల ప్రజ్ఞాశాలి మూర్తికవి రామరాయల దృష్టిలోపడి యాతని ఆదరాభిమానములను చూఱగొనియుండును. తరవాత రామరాయల, మరియు ఆతని సోదరుల ప్రాపుననే యా కవి జీవించెను. రామరాజభూషణుడు "రామ నృపభూషణాఖ్యసుకవి" ననియు "సకల కర్ణాట రక్షాధురంధర రామవిభుదత్త శుభచిహ్న విభవయుతుడ" ననియు సగర్వముగా చెప్పుకొనెను (హ.నలో 1-53). తమ ప్రభువగు రామరాజు నాతడు తన యిష్టదైవమగు శ్రీరామునితో పోల్చి వర్ణించినాడనిన ఆతని ప్రభుభక్తి యెంతటిదో ప్రకటమగుచున్నది (వ.చ. 1-44, 47; కావ్యా. సం. 1-83). రామరాజున కీకవి కావ్యమును ఏదియు అంకిత

ముగా నొసంగినట్లు కనిపించదు. కాని వసుచరిత్రలోని యీ క్రింది పద్యము వలన ఆతడు రామరాజును అనేక కృతులచేత మెప్పించెనని తెలియుచున్నది.

> శ్రీరామ క్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానా కళా
> పారీణున్ బహు సంస్కృతాంధ్ర కృతులన్ బల్మాఱుమెప్పించి త
> త్కారుణ్యంబున రత్నహార హయవేదండాగ్రహారాది స
> త్కారంబందితి రామభూషణకవీ! ధన్యుండ వీవన్నిటన్.
>
> వ.చ. 1-17

ఇటి కృతులనగా మహాకావ్యములు అనుటకు వీలులేదు. ఒకవేళ రామరాజభూషణుడు రామరాజునకు కావ్యమును అంకితముగ నొసఁగిన చివరకు దాని నామమైన మనకు మిగిలియుండెడిది. సంస్కృతాంధ్రము (వ చ 1-43, 44,47: కావ్యా. సం 1-83) లందు ఆశు, చిత్రకవితలను చెప్పగలిగిన ఆతడు రామరాజును ముక్తకాదులలో ప్రశంసించియుండును. ప్రభువునుండి అనేక "రత్నహార హయ వేదండాగ్రహారాది" సత్కారములను పడసియుండును. నానా కళా పారీణుడైన రామరాజును బట్టుమూర్తికవి తన సంస్కృతాంధ్ర కవితలచేత మెప్పించి భూషించబడి రామరాజభూషణుడయ్యెను. సంగీతకళాప్రియుడైన రామరాజునకు సంగీతకళారహస్యనిధియైన రామరాజభూషణునకు కృష్ణరాయలకు, పెద్దనకు గల సన్నిహిత స్నేహము వంటి స్నేహము ఏర్పడియుండును.

రామరాజభూషణుడు -"శతలేఖనీ పద్యసంధాన ధౌరేయుడు, ఘటికాశత గ్రంథకరణధుర్యుడు, ఆశుప్రబంధ బంధాభిజ్ఞుడు, ఓష్ఠ్య నిరోష్ఠ్యజ్ఞుడు,అచల జిహ్వోక్తి నిపుణుడు, తత్క్రమభాషావితానజ్ఞుడు, బహుపద్యసాధిత వ్యస్తాక్షరీ ధురీణుడు, ఏకసంథోదితశోకభాషాకృత్య చతురుడు, ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞుడు, అమిత యమకాఖనిధి"(కావ్యా.సం. 1-13). వీని నన్నిటిని ఆలంకారికులు చిత్ర కవిత్వము క్రింద పేర్కొనిరి. ఇట్టి చిత్రకవిత్వమునం దాతడు దిట్ట. కావ్యాలంకారసంగ్రహములో పేర్కొనిన ఈ ప్రజ్ఞాపాటవములను గూర్చి కవి వసుచరిత్రలో చెప్పకొనలేదు. సంగీతకళారహస్యనిధి ననియు, జగత్ప్రాణనందన కారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశిసంజనితైకదినప్రబంధఘటనాసద్యశ్శ్రుత గ్రంథకల్పనుడనని యు, చతుర్విధకవితానిర్వాహకుడననియు, సాహిత్యరస పోషణుడననియు తన్నుగూర్చి రామరాజభూషణుడు చెప్పకొనెను. కావ్యా

లంకార సంగ్రహములో పేర్కొనిన చిత్రకవిత్వ భేదముల నన్నిటినిగూర్చి యిటు కవి చతుర్విధ కవితా నిర్వాహకుడ ననుటతో ముగించెను చిత్ర కవిత్వప్రీతి కొంత వసుచరిత్ర రచనాకాలమునాటికి సమసిపోయి కవి సాహిత్యరసపోషణు డైనాడు. మరియు సంగీత రహస్యములను సంపాదించి సంగీత కళాప్రావీణ్యుడును అయినాడు. కావ్యాలంకారసంగ్రహ, వసుచరిత్ర రచనలలో చెప్పుకొనిన తన పాండిత్య,కవిత్వ పాటవములనుగూర్చి కవి హరిశ్చంద్రనలోపాఖ్యానములో ప్రసంగించలేదు. ఆనాటి కతడు వృద్ధుడై, రామనామ ధ్యానముతోడనే జీవితమును గడుపుచు మిక్కిలి వినీతుడైనట్లు కనిపించును పెద్దనవలె రామరాజభూషణుడు తన గురువునుగూర్చి యేమియు చెప్పుకొనలేదు. రామరాజభూషణుడు మొదట హనుమంతుని భక్తుడు. అతడు హనుమత్ప్రసాదలబ్ధ కవితా సారుడనని చెప్పుకొనెను. తరవాత హనుమంతుని దైవమగు శ్రీరాముని సైతము రామరాజభూషణుడు సేవించెను. హనుమంతుడు స్వప్నములో కవికి గోచరించి హరిశ్చంద్రనలోపాఖ్యాన కావ్యమును శ్రీరాముని కంకిత మిచ్చుటకై ప్రోత్సాహించెను. ఆ కారణమున అతడా కావ్యమును రాముని కంకితముగా నిచ్చెను. వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యాన కావ్యములలో తన ఇష్టదైవమైన హనుమంతునకు ప్రభువగు శ్రీరామునే కావ్యారంభమున ప్రశంసించి యున్నాడు. కావ్యాలంకారసంగ్రహములో ''హనుమత్రసాదలబ్ధ కవితాసారు''డనిన మాత్రమే చెప్పుకొని వసుచరిత్రలో ''శ్రీరామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకషుడ'' నని పేర్కొనుటచేత ఆనాటికి కవికి హనుమంతునితోపాటు అతని దైవమగు శ్రీరామునిపైనను భక్తి యేర్పడెనని చెప్పవచ్చును

శ్రీకృష్ణదేవరాయలు శ్రీకృష్ణునితో పోల్చబడుచుండు వారట! రామరాజభూషణుడు తన ప్రభువు రామరాజును శ్రీరామునితో పోల్చి, తనకు అతనిపై గల గౌరవాభిమానములను ప్రకటించుకొనినాడు.

రాజరాజభూషణుడు శ్రీకృష్ణదేవరాయల మరణమువరకును అనగా క్రీ.శ 1530 వరకును భువనవిజయసభ నలంకరించియుండి క్రీ.శ. 1530 తరువాత ఓబయ నరసరాజునాశ్రయించి యుండును. శ్రీకృష్ణదేవరాయల అనంతరము రాజ్యాధికార విషయమున కలహములు బయలుదేరెను. కృష్ణదేవరాయల మరణానన

మునుబట్టి అచ్యుతదేవరాయలు పట్టాభిషిక్తుడైనను రామరాయలకును పట్ట గట్టు ప్రయత్నము లోకవైపు జరుగుచుండెను. అచ్యుతరాయల తరువాత రామరాయలు సలకముతిమ్మయను చంపి అచ్యుతదేవరాయల సోదరకుమారుని సదాశివరాయలను సింహాసన మెక్కించి. తాను రాజ్యపాలనము చేయసాగెను. ఇది క్రీ శ. 1542 ప్రాంతమున జరిగినది. దీనిని రామరాజభూషణుడు కావ్యాలంకారసంగ్రహమున "ఖలునతిద్రోహి సల్కయ తిమ్మని హరించి సకల కర్ణాట దేశంబు నిలిపె....(1-82)" నని స్మరించియున్నాడు కావున క్రీ శ. 1530-1542 వరకును రామరాజభూషణుడు ఓబయ సరసరాజాదుల కడనుండి క్రీ. శ. 1542 ప్రాంతమున రామరాజు నాశ్రయించెనని చెప్పవచ్చును.

క్రీ.శ. 1565 సంవత్సరమున రామరాజు తాళికోటయుద్ధమున మరణించెను. అంతవరకును రామరాజభూషణుడు రామరాజు నాశ్రయించి యుండెనని చెప్పవచ్చును. తాళికోట యుద్ధానంతరము రామరాయల సోదరుడు తిరుమల దేవరాయలు విజయనగరమునుండి రాజధానిని పెనుగొండకు మార్చెను. ఈ తిరుమలరాయలకే వసుచరిత్ర అంకితముగా నీయబడినది. పెనుగొండలో తిరుమలదేవరాయలు క్రీ శ. 1569 ప్రాంతమున పట్టాభిషేకోత్సవమును జరుపుకొనెను. రామరాజభూషణుడు "కర్ణాటకాంధ్ర ధరణీపునరుద్ధారి"గా తిరుమల రాయలను ప్రశంసించినాడు (వ.చ. 1-90 . తిరుమలరాయలు రాజ్యమును మూడు భాగములుగా చేసి తన ముగ్గురు కుమారులను ఆ భాగములకు ప్రతినిధులుగా నియమించెనని వసుచరిత్రలో కలదు (వ.చ. 1-71; 77, 81). ఇది యాతడు పట్టాభిషిక్తుడైన (క్రీ.శ 1569) తరువాత అనతికాలముననే జరిగి యుండును. అనగా క్రీ.శ. 1570 ప్రాంతమని చెప్పవచ్చును. తిరుమల దేవరాయలు క్రీ.శ. 1572న తొంబదిరెండవయేట మరణించినట్లు తెలియుచున్నది[1]. కావున వసుచరిత్ర ప్రబంధము తిరుమలదేవరాయలకు క్రీ శ 570-72 మధ్యకాలమున అంకితముగా నీయబడెనని స్పష్టముగా చెప్పవచ్చును. అప్పటికి రామరాజభూషణుడును వార్ధక్యమున నుండెను. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున నున్నపుడు అనగా క్రీ. శ. 1530 నాటి కాతనికి ఇరువదియైదు సంవత్సరముల వయస్సు అని నిర్ణయించినను క్రీ శ. 1572 నాటి కాతడు అరు

1. విజయనగర చరిత్రము, పుట. 252.

పదియదు సంవత్సరముల వాడగును. ఆ వయస్సున ఆతడు వసుచరిత్రవంటి ప్రౌఢకావ్యమును ఆరంభించి, రచించి, ఆ తరువాత హరిశ్చంద్రనలోపాఖ్యానమువంటి ద్వ్యర్థికావ్యమును రచించెననుట అంత సమంజసముగా కనిపించదు. క్రీ.శ. 1565 నాటి తాళికోటయుద్ధమునకు పూర్వమే రామరాజభూషణుడు వసుచరిత్రకావ్యమును రచించి తన ప్రభువగు రామరాజునకు అంకితముగా నీయ దలంచి యుండును. కాని రాజకీయ అల్లకల్లోలములచే, ప్రశాంతి యేర్పడలేకుండుటచే ఆతనికి రామరాజున కంకితమొసగుటకై వీలు చిక్కకపోవచ్చును. ఆతరవాత జీర్ణకర్ణాటోద్ధరణ గావించిన తిరుమల దేవరాయలకే కవి దాని నంకిత మొసంగి యుండును. అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానములో వసుచరిత్ర పద్యముల కెన్నింటికో అనుకరణలు కలవు. గంగాధరకవి మల్కిభరాముడని కవులచే కీర్తించబడిన ఇబ్రాహీమ్ కులీ కుతుబ్‌షా ఆస్థానమున ఉండి తన కావ్యము నాతని కంకితముగా నొసంగెను. కులీ కుతుబ్‌షా క్రీ శ. 1550న సింహాసన మధిష్ఠించెను. గంగాధరుడు షష్ఠ్యంతములలో నాతనిని "హిందూ రాయ విభాళు"డని "రాయపక్షి సాళువ"యని సంబోధించుటచేత ఆనాటికి తాళిక్కోటయుద్ధమున రామరాయలు మరణించినట్లు చెప్పవచ్చును. అనగా క్రీ శ. 1565 తరువాత అది రచించబడినదని నిర్ణయించవచ్చును. తపతీసంవరణములో వసుచరిత్ర అనుకరణలు కలవు. కావున వసుచరిత్ర క్రీ.శ. 1565 నాటికి రచించబడి యుండవలయును. ఇబ్రాహీం కులీ కుతుబ్‌షా ఏడు సంవత్సరములకాలము అళియరామరాయల శరణుజొచ్చి విజయనగరమున గడపెను. అనగా ఆతని పట్టాభిషేకసమయమగు క్రీ.శ.1550 నకు పూర్వమేయది జరిగినది.ఆ సమయమున రామరాజు ప్రాపున రామరాజభూషణుడు విజయనగరమున వసుచరిత్రరచన నారంభించియుండును, ఆ సమయమున అచ్చట నివసించుచు కులీ కుతుబ్‌షా ఆంధ్ర భాషాపరిచయమును సంపాదించి వసుచరిత్రలోని పద్యములలోని చమత్కారములను విని యానందించియుండును. వసుచరిత్ర కవితాచమత్కారము నభినందించు ప్రభుప్రీతికై గంగాధరకవి వసుచరిత్రలోని చమత్కారములను తన కావ్యమున అనుకరించి చూపియుండును. వసుచరిత్ర రచనాకాలము క్రీ. శ. 1565 నాటికి పూర్వమని చెప్పుటకు మరొక ఆధారము కలదు. "పాండురంగ మాహాత్మ్యమున" తెనాలి రామకృష్ణుడు వసుచరిత్రను దృష్టిలో నిడుకొని యీక్రింది పద్యమును రచించినాడనుట ప్రసిద్ధము—

గిరికానుషక్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక్కపన్నగ మొక నా
డురవడి నెచ్చట నుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.

పాం. మా. 4-242

ఈ పద్యమందలి ఉపమ వసుచరితతో పరిచితి లేనివాడు వ్రాసినది మాత్రము కాదు. రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యమును క్రీ.శ. 1565 ప్రాంతమున రచించినట్లు నిర్ణయించబడినది[1]. దీనినిబట్టి వసుచరిత్రరచన క్రీ.శ. 1565 నకు పూర్వము క్రీ.శ 1542 తరువాత కవి రామరాయల నాశ్రయించిన వెనుక జరిగినదని చెప్ప వీలగుచున్నది. పరిస్థితులు సుస్థిరమై లేక పోవుటచేత క్రీ శ 1569-70 వరకును వసుచరిత్రను అంకితముగా నిచ్చు అవకాశము కవికి లభించియుండలేదు. వసుచరిత్రరచన నాటికి రామరాజభూషణుడు నలుబది, నలుబదైదు సంవత్సరములవాడై యుండును. సుదీర్ఘకాలము వసుచరిత్రను దాచిపెట్టి యెవరికి అంకితముగా నీయలేదనుట కొంత అసహజముగా కనిపించును, కాని రామరాయలు మహమ్మదీయరాజులతో నిరంతరము పోరాటములలో మునిగియుండుటచేత, ఆతడు తాళికోటయుద్ధమున మరణించుటచేతను. ఆ తరువాత తిరుమలరాయలును క్రీ.శ. 1569 వరకును సుస్థిరుడు కాకపోవుటచేతను కీ శ. 1570-72 వరకు వసుచరిత్రను అంకితముగా నిచ్చు అవకాశము రామరాజభూషణునకు లభించలేదనుట సత్యదూరము కాకూడదు.

వసుచరిత్రాది కృతులను మెచ్చి అనేక నృపులు రత్నాదులను తనకు బహుమానములుగా నిచ్చినట్లు రామరాజభూషణుడు స్వయముగా చెప్పుకొనెను (హ.నలో. 1-63).రామరాయలచేత, తరువాత తిరుమలరాయలచేత బహుసత్కారములను పడయుటయేగాక రామరాజభూషణుడు అనేక రాజులచేత గౌరవించబడి బహుమానముల నందుకొనినట్లు దీనినిబట్టి ఊహించవచ్చును. ఆంధ్ర సాహిత్యలోకమున సమకాలమునాడే వసుచరిత్ర పఠించబడి సహృదయుల మెప్పులను పొందినది. సమకాలికులైన లక్షణకారులు తమ లక్షణగ్రంథము

1. పాండురంగమాహాత్మ్యము పీఠిక. పుట 11.

లందు వసుచరిత్రనుండి పద్యములను గ్రహించి యుదాహరించి యున్నారు. దీనినిబట్టి వసుచరిత్ర మొదట సహృదయరంజనమును కావించినదైనను తరు వాత కొంతకాలము ఏకారణముచేతనో పాఠకుల నిరాదరణను పొందినదని తిరిగి ఆధునిక కాలమున నిజోచిత ప్రశంసల నందుకొనుచున్నదని చెప్పవచ్చును.

వసుచరిత్ర రచనానంతరము రామరాజభూషణుడు హరిశ్చంద్రనలో పాఖ్యానమును రచించి శ్రీరాముని కంకితమిచ్చెను. ఆ తరువాత ఎంతకాలము వరకాతడు జీవించియుండెనో చెప్పుట కాధారము లేవియు లేవు. కాని వసు చరిత్ర నంకితముగా నొసంగిన తరువాత రాజరామభూషణుడు తాను బహుమాన ముగా పొందిన, తాను రామాలయమును నిర్మించిన, తనకు వ్యవసాయ క్షేత్ర ములు గల గ్రామమేదో యచటనే నివసించుచు ప్రశాంతజీవనమును గడిపి యుండును. అటనే యాతడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించి శ్రీరా మున కంకిత మిచ్చియుండును. క్రీ శ 1530 నాటి కాతడు ఇరువదియైదు సంవత్సరముల వాడనుటచే ఆతడు క్రీ॰శ 1505 ప్రాంతమున జన్మించి యుండును. క్రీ.శ, 1572 తరువాతకూడ జీవించియుండి వసుచరిత్ర అంకితా నంతరము హరిశ్చంద్రనలోపాఖ్యాన రచన కావించుటచే ఆతడు క్రీ శ. 1580-85 ప్రాంతమువరకును జీవించియుండునని యూహించవచ్చును. అప్పటి కాతని వయస్సు 75-80 సంవత్సరము లుండియుండును రామరాజభూష ణుడు కృష్ణదేవరాయల కాలమున విజయనగరసామ్రాజ్య వైభవోన్నతులను చూచినాడు. విజయనగరసామ్రాజ్య వైభవము క్షీణించుటను తరువాత జీర్ణ కర్ణాటక రాజ్యోద్ధరణను కూడ చూచినాడు.

## రామరాజభూషణుని వ్యక్తిత్వము

రామరాజభూషణుడు హనుమద్భక్తుడు. హనుమంతుని యారాధ్యదైవ మగు శ్రీరామునికూడ అతడు సేవించెను. రామరాజభూషణుడు తన కుమారు లను రామనామాంకితులను చేసెను అగ్రహారములను నిర్మింపజేసి రామ చంద్రుని పేరు పెట్టెను. శ్రీరామునకు ఆలయమును నిర్మించి పుణ్యయశస్సును సంపాదించెను. తటాకమును త్రవ్వించి రామసరోవరమని పేరిడెను (హ॰నలో. 1-14). శాశ్వత వెంకటేశ్వ రానుగ్రహ నిరుపాధికైశ్వర్య నిత్య

యశుడ"నని చెప్పుకొనుటచేత వెంకటేశునికూడ అతడు సేవించినాడని తెలియు చున్నది, రామరాజభూషణుడు కవిమాత్రుడేగాక భక్తియుతుడై యనేక పుత్ర సంతానముతో ఇహపరములను సాధించుచు గృహస్థాశ్రమముకు గడిపెనని చెప్ప వచ్చును.

రామరాజభూషణుడు తన కృతుఃద్వారా అపార సంపదలను పొంది నాడు. ఓబయ నరసరాజు "జాంబునదాఁబరాభరణ ఛత్రచామరాందోళికా చతురఁత యానాగ్రహారాదు"లను రామరాజభూషణున కొసంగెను. తిరుమల రాయలును వసుచరిత్ర నందుకొను వేళ "జాంబునదాంబరాగ్రహారా"దుల నిచ్చి యాదరించెను. ఇక రామరాయ లాతనికి "రత్నహారహయ వేదండాగ్రహా రాదు"లను బహుమతి ప్రదానము చేసెను. వసుచరిత్రాది కావ్యములచేత అనేక నృపులు ప్రీతులై రత్నాదుల నాతనికి బహుమానములుగా నిచ్చిరి. తన కవిత్వ పాండిత్య గరిమలచేత పొందిన ధనవైభవముతో రామరాజభూషణుడు సుఖజీవనమును గడిపియుండును.

రామరాజభూషణుడు తాను పొందిన అగ్రహారములనేగాక నూతనముగా అగ్రహారముల నేర్పరచి, ఇతరులకు దానముగా నిచ్చి పెద్దనవలెనే యశస్సును పొందియుండును. కాని రామరాజభూషణుడు పెద్దనవలె భోగిగా కాక నిరాడంబర జీవిగా కవితలో ప్రతిబింబించి కనిపించును. అతడు రామభక్తి ప్రపూర్ణ హృదయుడు. యోగతత్త్వమను ఎరిగినవాడు. భక్తియోగములను మేళ వించుకొనిన మూర్తి. పెద్దన వైష్ణవముతో పొత్తుకుదిరినా వైదికకర్మలమీద వలపును విడిచిపెట్టినట్లు లేదు. అందుకే ప్రవరుని వైదికకర్మ దీక్షాపరతంత్రు నిగా ఆహితాగ్నిగా చిత్రించినాడు. మరొకవైపు స్వారోచిషుని చేత తపస్సు చేయించి ప్రత్యక్షమైన విష్ణువుతో "భవార్తున్ జడున్ శరణార్థిన్" అని యని పించి, భక్తియందు విశ్వాసమును ప్రకటించినవాడు. బ్రాహ్మణుడు ఇంద్రియ వశుడై మన్మథబాణములకు గురియైన బ్రహ్మానందాధి రాజ్య పదవీచ్యుతుడగునని నమ్మినవాడు. కావున పెద్దన స్త్రీలోలుడు కాడు. అయినా సమకాలిక సౌఖ్య పరంపరలను విడనాడిన విరాగిమాత్రము కాడు. రామరాజభూషణుడు భక్తి యోగమును విశ్వసించినవాడుగా కనిపించును. సీతయను జీవాత్మ అజ్ఞానమున చిక్కుకొని పరమాత్మవియోగమును పొంది హనుమంతుని సహాయమున

శ్రీరామ పరమాత్మను చేరుకొనెనని రామాయణ కథాపరమార్థము. దానినే గిరికావసురాజుల వివాహకథలో ధ్వనింపజేసిన ఆధ్యాత్మిక చింతనాపరుడు రామరాజభూషణుడు. మరియు గిరికావసురాజుల యోగమును ప్రకృతి పురుష యోగముగా భావించి వసుచరిత్రతత్త్వమును కవి ప్రౌఢముగా నావిష్కరించెనని పండితుల అభిప్రాయము[1] ఆతడు ఆత్మతత్త్వమును తెలుసుకొన్న జ్ఞాని. యోగరహస్యముల నెరిగినవాడు. ఆతడు అంతఃశుద్ధిగల నిరాడంబరజీవి కాగా పెద్దన భక్తి కర్మయోగములను నమ్మిన సుఖజీవిగా కనిపించుచు

ఆతడు సంస్కృతకవులగు బాణ, సుబంధు, శ్రీహర్షుల కవితా వైభవములను జీర్ణించుకొన్నట్టివాడు. తెనుగున శ్రీనాథుని కవిత్వ ధారాశుద్ధియనిన ఆతనికి ప్రీతి ఇక తన గురువగు పెద్దన ననుకరించి మించవలయునను యాతని తపననిరర్థకము కాలేదు. రామరాజభూషణుడు పండితుడు, మేధావి. గంభీర స్వభావుడు, సంగీత కళారహస్యనిధి పూర్వము వీణయొక్క సారెలను ప్రతి రాగమునకును అమర్చుకొనవలసి యుండెడిదనియు, ఒక రాగమునకు కుదిర్చినసారె లట్లేయుండిన వేరొక రాగమును వాయించుటకు వీలుగాకుండెడి, దనియు అందురు. అట్టి వీణను మార్చి సారెలకు నియమితస్థానమేర్పరచి రామరాజభూషణుడు అధునికవీణను నిర్మించినాడట! ఆతడు సంగీతకళా రహస్యనిధియే గాక వీణానిర్మాణము చేయగలిగిన ప్రజ్ఞాశాలి కామశాస్త్ర, రత్నశాస్త్ర, యోగశాస్త్ర, అలంకారశాస్త్రములందు దిట్ట ఉద్యానవనములను పెంచుట, వ్యవసాయము ఆతనికి ప్రీతికరములైన విషయములు. దీని కాతని వర్ణనలు ఆధారములు. పెక్కు చందాల పందు భూములుకలవాడై యుండును.. నాటకకళయందభిరుచి కలవాడు కావుననే వసుచరిత్ర నొక దృశ్య ప్రబంధముగా తీర్చిదిద్దెను పెద్దనవలెనే యాతడును సూక్ష్మపరిశీలనా దృష్టి గలవాడని యాతని వర్ణనలే చెప్పక చెప్పుచున్నవి క్షత్రియవిద్యలందు కవికి ప్రవేశముగాని, అభిమానముగాని యున్నట్లు కానరాదు. యుద్ధవర్ణనాదులందు కవికి యభిరుచి లేదు. శృంగారరస మభిమానరసము. పచ్చిశృంగారము జోలికి పోలేదు. ప్రకృతి పురుషరూపులైన గిరికావసురాజుల సంభోగాంత సౌఖ్యమును బ్రహ్మానందానుభవముతో సమానముగా చెప్పి కవి ఉదాత్తము కావించినాడు తన చతురాస్యతకు వచనప్రౌఢికి తగిన కథ నెన్నుకొనిన మహాకవి.

1. భూషణకిరణావళి పుట 77.

# ఉపయుక్త గ్రంథ సూచిక

## తెలుగు గ్రంథములు


1. అల్లసానివాని అల్లిక జిగిబిగి —శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. వి ఎస్.ఎన్ అండ్ సన్స్, విజయవాడ, 1967.

2. అష్టదిగ్గజములు —అష్టదిగ్గజవర్ధంత్యుత్సవ సమితి.

3. ఆముక్తమాల్యద —శ్రీకృష్ణదేవరాయలు

4. ఆంధ్ర కవితరంగిణి (7వ సంపుటము) —శ్రీ చాగంటి శేషయ్య.

5. ఆంధ్ర ధ్వన్యాలోకము —శ్రీ వేదాల తిరువెంగళాచార్యులు, హైద్రాబాద్ ఆంధ్రసాహిత్య పరిషత్తు. 1950.

6. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము —శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు 1961

7. ఆంధ్రవాఙ్మయ చరిత్రము —శ్రీ వంగూరి సుబ్బారావు. కమలకుటీర్. నరసాపురము. 1957.

8. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక —సంపుటము 45, సంచిక 1-2

9. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక — ,, 48 ,, 5-6

10. ఆంధ్రుల సాంఘిక చరిత్ర —శ్రీ సురవరం ప్రతాపరెడ్డి. ఆంధ్రసాహిత్య పరిషత్తు, హైద్రాబాదు. 1950

11. కవిజీవితములు —శ్రీ గురజాడ శ్రీరామమూర్తి.

12. కవిత్వతత్త్వ విచారము —శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు. వాల్తేరు 1947.

13. కళాపూర్ణోదయము —పింగళి సూరన

14. కావ్యపరిమళము —శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైద్రాబాదు 1970.

15. కాశీఖండము —శ్రీనాథుడు

16. కావ్యాలంకార చూడామణి -విన్నకోట పెద్దన. వేదం వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్ మద్రాసు. ప్రథమ ముద్రణము
17. కావ్యాలంకార సంగ్రహము -బట్టుమూర్తి. శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి వివరణతో. యం. శేషాచలం అండ్ కంపెని 1959.
18. కుమారసంభవము -నన్నెచోడుడు.
19. కేయూరబాహుచరిత్ర -మంచన.
20. తపతీసంవరణోపాఖ్యానము -అద్దంకి గంగాధరకవి.
21. దశకుమారచరిత్ర -కేతన.
22. నిర్వచనోత్తరరామాయణము -తిక్కన.
23. నృసింహపురాణము-ఎఱ్ఱన.
24. ప్రథమాంధ్ర మహాపురాణము -శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యము,శ్రీవాణీ ప్రచురణ. 1978.
25. ప్రబంధవాఙ్మయ వికాసము -శ్రీ పల్లా దుర్గయ్య (వ్రాతప్రతి)
26. ప్రబంధవాఙ్మయ వికాసము (మొదటి సంపుటము) -శ్రీ పల్లా దుర్గయ్య (అచ్చుప్రతి)
27. పాండురంగమాహాత్మ్యము -తెనాలి రామకృష్ణుడు. పీఠిక-శ్రీ బులుసు వేంకటరమణయ్య
28 ప్రాచీన గాథాలహరి -శ్రీ వేమూరి శ్రీనివాసరావు వెంకటరామ అండ్ కో. 1972
29. పారిజాతాపహరణము -ముక్కుతిమ్మన
30. భీమఖండము -శ్రీనాథుడు
31. భూషణ కిరణావళి -శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్తు ప్రచురణ భీమవరము 197?
32. మనుచరిత్ర -పెద్దన. శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారి వ్యాఖ్యానముతో వెంకట్రామ అండ్ కో 1968
33. మనుచరిత్ర -పెద్దన. యం. శేషాచలం అండ్ కో 1970

34. మనుచరిత్ర —పెద్దన. శ్రీ తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య పీఠికతో. వేనూరి వెంకటకృష్ణమసెట్టి అండ్‌సన్స్ 1909

35. మను, వసు చరిత్రల రచనావిమర్శనము —శ్రీ తెన్నేటి రామచంద్రరావు 1899.

36 మహాభారతము —ఆదిపర్వము— —నన్నయ

37. మహాభారతము—విరాటపర్వము —తిక్కన

38. మార్కండేయపురాణము —మారన

39, రామరాజభూషణుని కృతులు —శ్రీ సుప్రసన్నాచార్య (వ్రాతప్రతి)

40. వరాహపురాణము —నందిమల్లయ, ఘంటసింగయ

41. వసుచరిత్ర —రామరాజభూషణుడు, సోమకవి విద్వజ్జనరంజనీవ్యాఖ్యానము, శేషాద్రిరమణకవులచే పరిశోధితము, వావిళ్ళవారి ప్రచురణ. చతుర్థప్రచురణము,

42 వసుచరిత్ర —రామరాజభూషణుడు, యం. శేషాచలం అండ్ కో ప్రచురణ. 1970.

43 వసుచరిత్ర కవితావిపంచి —శ్రీ రాజన్నకవి, యువకవితాప్రచురణ ప్రొద్దుటూరు. 1974.

44, వసుచరిత్ర విమర్శనము —శ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రి, వావిళ్ళవారి ప్రచురణ. 1965.

45. వసుచరిత్ర—సంగీతసాహిత్యములు —శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ, హైద్రాబాదు. 1974

47. వసుచరిత్ర సాహితీ సౌరభము —శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు శ్రీ రామరాజభూషణుని సాహిత్య పరిషత్తు, భీమవరము 1970

47. విక్రమార్కచరిత్ర —జక్కన

48. విజయనగరాంధ్రకవులు —శ్రీ శిష్టా లక్ష్మీకాంతము. నిర్మలా పబ్లిషర్సు విజయవాడ

49. విజయనగర చరిత్రము —శ్రీ పేరరాజు. బాలసరస్వతీ బుక్‌డిపో కర్నూలు 1958

50. విజయవిలాసము –చేమకూర వేంకటకవి
51. వ్యాసరత్నావళి –శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి. అద్దెపల్లి అండ్ కో. 1963
52. శకుంతలాపరిణయము –పెద్దాడ నాగరాజామాత్యుడు.
53. శృంగారనైషధము –శ్రీనాథుడు
54. శృంగారశాకుంతలము –పిల్లలమర్రి పినవీరన
55. సమగ్ర ఆంధ్రసాహిత్యం –శ్రీ ఆరుద్ర 7, 8 సంపుటము. యం. శేషాచలం అండ్ కో 1965
56. సారస్వత వ్యాసములు (మొదటి సంపుటము) –ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1969
57. సింహావలోకనము –శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి మణిమంజరి ముద్రణాలయము 1955
58. సింహాసన ద్వాత్రింశిక –కొరవి గోపరాజు
59. హరిశ్చంద్రనలోపాఖ్యానము –రామరాజభూషణుడు

## సంస్కృత గ్రంథములు

60. అభిజ్ఞానశాకుంతలమ్ –కాళిదాసః
61. ఋగ్వేదః –సంస్కృతసంస్థాన ప్రచురణ, 1969
62. కవికంఠాభరణమ్ – క్షేమేంద్రః. సంస్కృత అకాడమీ, హైదరాబాదు. 1961
63. కాదంబరీ –బాణః
64. కావ్యాదర్శః –దండీ, చౌఖంబా ప్రచురణ 1972
65. కావ్యప్రకాశమ్ –మమ్మటః. చౌఖంబా ప్రచురణ 2973
66. కావ్యమీమాంసా –రాజశేఖరః, చౌఖంబా ప్రచురణ 1964.
67. కావ్యాలంకారః –భామహః. బీహార్‌రాష్ట్రభాషా. పట్నా 1962
69. కావ్యాలంకారః –రుద్రటః. వాసుదేవప్రకాశన్. దిల్లీ. 1965

69. కావ్యాలంకార సూత్రవృత్తిః -వామనః. చౌఖంబాప్రచురణ, 1971
70. కిరాతార్జునీయమ్ -భారవిః.
71. కుమారసంభవమ్ -కాళిదాసః.
72. చంపూభారతమ్ -అనంతభట్టః
73. దశరూపకమ్ -ధనంజయః, చౌఖంబాప్రచురణ 1967
74. ధ్వన్యాలోకః -ఆనందవర్ధనః, చౌఖంబాప్రచురణ. 1965
75. నలచంపూః -త్రివిక్రమభట్టః.
76. నాగానందమ్ -శ్రీహర్షదేవః
77. నైషధీయచరితమ్ -శ్రీహర్షః
78. మహాభారతమ్ -వ్యాసః. ఆదిపర్వమ్, అరణ్యపర్వమ్, గీతాప్రెస్ 1969
79. మార్కండేయపురాణమ్ -సంస్కృతసంస్థాన ప్రచురణ, 1975.
80. మాళవికాగ్నిమిత్రమ్ -కాళిదాసః
81. రఘువంశమ్ -కాళిదాసః
82. విక్రమోర్వశీయమ్ -కాళిదాసః
83. శిశుపాలవధమ్ -మాఘః
84. సాహిత్యదర్పణమ్ -విశ్వనాథః. మోతీలాల్ బనారసీదాస్ ప్రచురణ 1956
85. హర్షచరితమ్ -బాణః

## ఆంగ్ల గ్రంథములు

86. A history of Sanskrit literature. Vol. I -S. K. Dey, edited by S.N. Dasgupta. Uni. of calcutta 1947
87. An Introduction to English criticism -Birjadish Presad. macmilan co of India Ltd. 1979.
88. Some concepts of Alankara shastra -Shri V. Raghavan, 1942: The Adyar library Series-33

# ఉదాహృతగ్రంథ సంకేత సూచిక

ఆ.ప —ఆదిపర్వము (ఆంధ్రమహాభారతము)
ఆం ప్ర.య —ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము
ఆం.సా.చ —ఆంధ్రుల సాంఘిక చరిత్ర
ఉ.హ —ఉత్తరహరివంశము
క.కం —కవి కంఠాభరణమ్
కా ఖం —కాశీఖండము
కా.మీ —కావ్య మీమాంసా
కా.సం —కావ్యాలంకార సంగ్రహము (భట్టుమూర్తి)
కా.కు.సం —కాళిదాసుని కుమారసంభవమ్
కా సూ.వృ —కావ్యాలంకార సూత్రవృత్తిః
కావ్యా —కావ్యాలంకారః
కావ్యాద —కావ్యాదర్శః
కావ్యా సం —కావ్యాలంకార సంగ్రహము(భట్టుమూర్తి)
కిరా —కిరాతార్జునీయమ్
కు.సం —కుమారసంభవము (నన్నెచోడునిది)
దశరూ —దశరూపకమ్
ధ్వన్యా —ధ్వన్యాలోకః
న.చం. —నలచంపూః
ని.రా —నిర్వచనోత్తర రామాయణము
నృ.పు —నృసింహపురాణము
నై.చ —నైషధీయచరితమ్
పా.హ —పారిజాతాపహరణము
బ.పు. —బసవపురాణము

ఉదాహృతగ్రంథ సంకేత సూచిక

భా చం –భారతచంపూః

భీ.ఖం –భీమఖండము

మ.చ –మనుచరిత్ర

మా.పు –మార్కండేయపురాణమ్

రఘు –రఘువంశమ్

రా.పా –రాఘవపాండవీయము

వ.చ –వసుచరిత్ర

వ.జీ –వక్రోక్తి జీవితమ్

వ పు –వరాహపురాణము

వి.చ –విక్రమార్కచరిత్ర

వి.ప –విరాటపర్వము(ఆంధ్రమహాభారతము)

వి.వి –విజయవిలాసము

శిశు –శిశుపాలవధమ్

శృం.నై –శృంగారనైషధము

శృం.శా –శృంగారశాకుంతలము

స.కంఠా –సరస్వతీ కంఠాభరణమ్

సం.ఆ.ప –సంస్కృత (మహాభారతములోని) ఆదిపర్వము

సా.ద –సాహిత్యదర్పణమ్

హ.చ –హర్షచరితమ్

హ.నలో –హరిశ్చంద్రనలోపాఖ్యానము






# సవరణాల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 26 | ఇరు | నాలుగు |
| 12 | 15 | షుగ్గురికి | ముగ్గురి |
| 28 | 27 | ఆదిప్రో | ఆదీప్రో |
| 46 | 18 | దేవసంబంధేతివృత్తముగా | దేవసంబంధేతివృత్తమనగా |
| 48 | 2 | వశాయాతాకం | వశాయాతాం |
| 51 | 8 | మిశ్రేనతివృత్తమై | మిశ్రేతివృత్తమై |
| 62 | 18 | పురయేగ | పురమేగ |
| 72 | 21 | పావ్కేల | పాఠకుల |
| 79 | 26 | ఇరువదియారు పద్యములలో (వ చ 2:27, 31-53) | ఇరువదియైదు పద్యములలో (వ చ 2:27, 30-53) |
| 90 | 5 | మాఘునిచే | మాఘుని |
| 90 | 14 | ఫక్కికలో | ఫక్కిలో |
| 1)2 | 17 | 23 గద్యపద్యములలో | 21 గద్యపద్యములలో |
| 117 | 16 | సం. అ ప | సం. ఆ. ప |
| 117 | 17 | అ. ప | ఆ. ప |
| 120 | 25 | సం.ఆ.ప (పాదసూచికలో) | సం. ఆ. ప |
| 120 | 27 | అ. ప పాదసూచికలో) | ఆ. ప |
| 123 | 19 | ఏడు పద్యములలో | ఎనిమిది పద్యములలో |
| 138 | 5 | మను· | మ. చ |
| 142 | 29 | ఇది పద్యములలో | ఇది పది పద్యములలో |
| 144 | 12 | రసావేశులై | రసావిష్టులై |
| 145 | 24 | యొక్క పోషితహంసలను | యొక్క పోషితహంసలను మాత్రమే |
| 218 | 7 | అపౌరుషమ్ | అపౌరుషేయమ్ |
| 218 | 12 | అపౌరుష్య | అపౌరుషేయ |

| | | | |
|---|---|---|---|
| 230 | 28 | కావ్యాలంకారము | కావ్యాలంకార సంగ్రహము |
| 234 | 11 | యత | యాత్ర |
| 242 | 30 | కవితత్త్వవిచారము (పాదసూచికలో) | కవిత్వతత్త్వ విచారము |
| 249 | 8 | ముఖా | ముఖ్యా |
| 295 | 10 | అటవీరరసముకాని | అటవీరరసము |
| 298 | 21 | డక్కనుకొందువని | డక్కనుకొందునని |
| 338 | 8 | వీరలలిత | ధీరలలిత |
| 339 | 24 | ఇరువదియాఱు | ఇరువదియైదు |
| 347 | 17 | మను, వసుచరిత్రల విమర్శనము (పాదసూచికలో) | మను, వసుచరిత్రల రచనా విమర్శనము |
| 436 | 9 | అలంకారీ యద్దకము | కలంకారి యద్దకము |

